# వ్యాస భారతి

## జానమద్ది హనుమచ్ఛాస్త్రి

# వ్యాస భారతి

[సాహిత్యం, కళలు, విజ్ఞానం... వ్యాసాలు]

## జానమద్ది హనుమచ్ఛాస్త్రి




విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్

హైదరాబాద్-500 001.

Vyasa Bharatı - Janamaddı Hanumath Sastrı

ప్రచురణ నెం 2094

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : మే, 1998



పొట్టి శ్రీరాములు
తెలుగు విశ్వవిద్యాలయం వారి
ఆర్థిక సహాయంతో
ప్రచురింపబడింది.

ముఖ చిత్రం. ఉమ

వెల: రూ.50-00

ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
అబిడ్స్, హైదరాబాద్ - 500 001

విశాలాంధ్ర బుక్ హౌస్,
అబిడ్స్/సుల్తాన్ బజార్, హైదరాబాదు,
విజయవాడ, విశాఖపట్టణం, కాకినాడ,
గుంటూరు, అనంతపురం, హన్మకొండ, తిరుపతి.

ముద్రణ: శ్రీ కళాంజలి గ్రాఫిక్స్, హైదరాబాద్-29 ఫోన్: 597831

ఒకనాటి భోజుడు, ఒకనాటి రాయలు
నేటి శ్రీ కె.వి. రమణ గారికి



రమణీయ మణిహారం
ఈ వ్యాస భారతి

# కృతజ్ఞతలు

కొన్నేళ్ళుగ నేను వ్రాసిన వ్యాసాల్లో కొన్నింటిని, ఈ సంపుటిగా ప్రకటిస్తున్నాను. ఈ వ్యాసాలు ఇదివరకే, కృష్ణాపత్రిక, నాట్యకళ, ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి, విశాలాంధ్ర, వార్త, మిసిమి పత్రికల్లో వెలువడినాయి. ఆ పత్రికా సంపాదకులకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

ఈ వ్యాసాల రచనకు నాకెంతగానో ఉపకరించిన, 'తరంగ' కన్నడ వారపత్రిక సంపాదకులు శ్రీ సంతోష్‌కుమార్ గుల్వాడి గారికి నా వందనాలు.

ఈ పుస్తక ప్రచురణకు ఆర్థిక సహాయం అందజేసిన పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయ వైస్ ఛాన్సెలర్ ఆచార్య శ్రీమతి నాయని కృష్ణకుమారి గారికి నా నమస్సులు.

ఈ వ్యాస సంపుటిని అందంగా, ఆప్యాయంగా ముద్రించిన విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ వారికి నా ధన్యవాదాలు.

ముద్రణ దోషాలను సవరించి, సహకరించిన మిత్రుడు శ్రీ కట్టా నరసింహులు గారికి నా శుభాకాంక్షలు.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య, సాంస్కృతిక క్రీడారంగాల అభివృద్ధికి అవిశ్రాంతంగా కృషి చేస్తూ, తెలుగు వారందరి హృదయాలను చూరగొన్న, నిత్య చైతన్యస్ఫూర్తి రాష్ట్ర యువజన క్రీడారంగాల సంచాలకులు, సి.పి. బ్రౌన్ గ్రంథాలయానికి, హార్దికంగా ఆర్థికంగా, పుష్టిని, తుష్టిని సమకూర్చిన మనస్వి, వచస్వి

శ్రీ కె.వి. రమణ, IAS గారికి నా హృదయపూర్వక నమస్సులు.

– జానమద్ది హనుమచ్ఛాస్త్రి

# విషయసూచిక

## సాహిత్య భారతి



## కళా భారతి

## విజ్ఞాన భారతి



## సమైక్య భారతి



★ ★ ★

సెప్టెంబర్ 28 - సర్ విలియమ్ జోన్స్ ద్విశత జయంతి

## భాషా విజ్ఞాన విధాత

# సర్ విలియం జోన్స్

వ్యాపారులుగా భారతదేశానికి వచ్చిన ఆంగ్లేయులు క్రమంగా భారతదేశాన్ని ఆక్రమించుకున్నారు ధనార్జనే వారి లక్ష్యంగా పరిణమించింది భారతదేశంలో బానిస వ్యాపారం బాగా పెరిగింది ఒక్కొక్క బానిస ఈస్టిండియా కంపెనీకి నాలుగు రూపాయల నాలుగణాలు పన్ను చెల్లించేవాడు (చూ ద గుడ్ ఓల్డ్ డేస్ ఆఫ్ ఆనరబుల్ జాన్ కంపెని - రచన: డబ్ల్యు.ఎచ్.కారే-1822, పుట: 121). కాని 'పురుషులందు పుణ్యపురుషులు వేరయా' అన్నట్లు పాశ్చాత్యోద్యోగులు కొందరు బానిస వ్యాపారాన్ని ఖండించారు వారు కొందరు మాత్రమే కావచ్చు ఆ కొందరే భారతదేశంలో భావవిప్లవానికి కారకులయ్యారు సహోద్యోగులు సుఖలోలుపులై, ధనార్జనపరులై స్వైరవిహారం జరుపుతున్న కాలంలో, కొందరు మాత్రం భారతీయ సంస్కృతిని, భాషలను అవగాహన చేసుకునేందుకు కృషిచేశారు. కారుచీకట్లలో కాంతిరేఖల్లా వెలిగారు అలా వెలిగిన వారిలో అగ్రగణ్యుడు సర్ విలియం జోన్స్. భారతీయ సాంస్కృతిక భవన ద్వారాలను పాశ్చాత్యుల కోసం తెరచిన మహావిద్వాంసుడు సర్ విలియమ్ జోన్స్

విలియం, మేరీ నిక్స్ దంపతుల మూడవ సంతానంగా ఆయన 1746 సెప్టెంబర్ 28న లండన్‌లో జన్మించాడు. మధ్యతరగతి కుటుంబమది తండ్రి నౌకాదళంలో అధికారి. గణితశాస్త్రంలో పేరుగాంచినవారు బ్రిటిష్ రాజకుటుంబంతో సన్నిహిత సంబంధాలు కలవాడు రాయల్ సొసైటీలో 'ఫెలో' కూడా జోన్స్ మూడవ ఏటనే తండ్రి విలియం కన్ను మూసాడు తండ్రి గుణములు, అతని రచనలు, సంపద అన్నీ జోన్స్‌కు సంక్రమించాయి తండ్రికి మిత్రులైన ఐజాక్ న్యూటన్, సామ్యుయల్ జాన్సన్ ఎడ్మండ్ హ్యాలీలత్ జోన్స్‌కు సన్నిహిత సంబంధాలుండేవి.

జోన్స్ నాలుగేళ్ళవాడుగా వున్నప్పుడు జరిగిన అగ్నిప్రమాదంలో కుడి కన్ను బాగా దెబ్బ తినింది. కన్ను కోల్పోయినా అతనికి చదువుపట్ల ఆసక్తి ఏమాత్రం తరగలేదు. తొమ్మిదో ఏట జరిగిన ప్రమాదంలో తొడ ఎముక విరిగింది కాని హ్యారో స్కూల్‌లో చదువు కొనసాగించాడు.

జోన్స్ జ్ఞాపకశక్తి అద్భుతమైంది. బాల మేధావిగా ప్రశంస లందుకొన్న జోన్స్‌కు షేక్స్‌పియర్ నాటకాలలోని స్వగతాలన్నీ కంఠస్థం. జోన్స్ చదువుతున్న కళాశాల

జానమద్ది హనుమచ్ఛాస్త్రి

వార్షికోత్సవాల్లో షేక్స్‌పియర్ రచించిన 'టెంపెస్ట్' నాటకం ప్రదర్శించాలనుకున్నారు నాటకం ప్రతి కానరాలేదు విలియం జోన్స్ నాటకం మొదటి నుంచి చివరిదాకా కేవలం తన జ్ఞాపకశక్తితో రాసి ఇచ్చాడు. అద్భుతమైన ఈ జ్ఞాపక శక్తి వల్లనే జోన్స్ గొప్ప విద్వాంసుడయ్యాడు మెట్రిక్యులేషన్ (1764) పరీక్ష ఇచ్చేనాటికే గ్రీక్ తత్త్వవేత్తల, నాటకకర్తల రచనలన్నిటినీ అధ్యయనం చేశాడు. 1773లో ఎం.ఏ., పట్టభద్రుడై (ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయం) ఓరియంటలిస్ట్ (ప్రాచ్య పండితుడు)గ ప్రశస్తి నార్జించాడు విద్యార్థిగ 'బెనెట్ స్కాలర్'గా, 'బెనెట్ ఫెలో'గా విశిష్టమైన విద్యార్థి వేతనాలును సంపాదించుకున్నాడు

ఇరువది ఎనిమిది భాషలలో పాండిత్యం గడించాడు. ప్రాచ్య పాశ్చాత్య న్యాయ శాస్త్రాలు, కావ్య, నాటకాలు క్షుణ్ణంగా అధ్యయనం చేశాడు. బ్రిటిష్ దమనకాండను ఖండిస్తూ మానవహక్కుల పరిరక్షణ కోసం పోరాటానికి ఉద్యమించాడు 38 ఏళ్ళ ప్రాయంలోనే కలకత్తా సుప్రీంకోర్టు జడ్జిగా భారతదేశం చేరే నాటికి, ఎన్నో మహోన్నత ఆశయాలు కలిగివుండేవాడు 1785లో భారతదేశంలో, ముఖ్యంగా కలకత్తా నగరంలో సాగుతూ వుండిన బానిస వ్యాపారాన్ని చిత్రిస్తూ, సర్ విలియం జోన్స్ "I am assured from evidence which though not all judicially taken has the strongest hold on my belief, that the condition of slaves within our jurisdiction is beyond imagination, deplorable; and that cruelties are daily practised on them, chiefly on those of the tenderest age and the weaker sex, which if it would not give me pain to repeat and you to hear, yet for the honour of human nature, I should forbear to particularise. Hardly a man or a woman exists in a corner of the populous town, who hath not at least one slave child either purchased at a trifling price, or saved perhaps from a death that might have been fortunate, for a life that seldom fails of being miserable Many of you, I presume, have seen large boats filled with children, coming down the river for open sales at Calcutta. Nor can you be ignorant that most of them were stolen from their parents, or bought, perhaps for a measure of rice in a time of scarcity" (The good old days of Honourable John company by W H Carey, Simla-1822, page 73)

సంస్కృతభాషను అధ్యయనం చేసి మనుధర్మశాస్త్రాన్ని ఇంగ్లీష్‌లోకి అనువదించటం, భారతీయ న్యాయశాస్త్ర సంగ్రహం, ప్రాచ్య పాశ్చాత్య సంబంధాలను నిరూపించటం జోన్స్ లక్ష్యాలుగా ఉండేవి.

సంస్కృత భాష యొక్క విశిష్టతను చాటుతూ "The Sanskrit languge, whatever, be its antiquity, is of a wonderful structure more perfect than Greek, more copious than Latin and more exquisitely refined than either, yet bearing to both of them a stronger affinity, both in the roots of verbs and in the forms of grammar, than could possibly have been produced by accident; So strong indeed that no philologer could examine them all

three, without believing them to have sprung from some common source" (2 2 1976న సర్ విలియమ్ జోన్స్ ఉపన్యాసం నుంచి) భాషాధ్యయనంలో చదువుకంటె వ్రాత ముఖ్యమని భావించిన జోన్స్, ఆ యా భాషీయులు మాట్లాడే తీరును శ్రద్ధగా ఆకళించుకున్నాడు పర్షియన్ భాషలో తలస్పర్శి పాండిత్యం సంపాదించాడు. భాషాశాస్త్ర వేత్తగ, ప్రాచ్యవిజ్ఞాన వేత్తగ, న్యాయశాస్త్ర నిష్ణాతుడుగా అతని కృషి అసామాన్యమైనది

న్యాయవాదిగా జోన్స్ గొప్ప పేరు సంపాదించనప్పటికి న్యాయశాస్త్రాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేశాడు. 1770-1783 మధ్య ప్రాచ్య ఇతిహాస, భాషా, న్యాయశాస్త్రాలకు, సాహిత్యానికి సంబంధించిన తొమ్మిది గ్రంథాలను రచించి, "జోన్స్ రచనలు చదివితే సాహిత్య ప్రపంచ మంతా కరతలామలకమే" అన్నంత పేరు సంపాదించాడు 1778లోనే జోన్స్‌ను కలకత్తాలోని సుప్రీం కోర్టు న్యాయమూర్తిగ ఆహ్వానించినా, 1783లో అతడు ఆ పదవిని చేపట్టాడు

## న్యాయమూర్తిగా:

భారతదేశంలో ఈస్టిండియా కంపెనీ పరిస్థితులు అస్తవ్యస్తంగా ఉండేవి కంపెనీ ఉద్యోగులు అవినీతిపరులుగా అక్రమార్జనకు అర్రులు చాచేవారు ప్రజలను పీడించేవారు. అక్రమాలను భరించలేక ప్రజలు అధికారులను ధిక్కరించసాగారు రెగ్యులేటింగ్ ఆక్ట్ మేరకు కలకత్తాలో సుప్రీంకోర్టు ఏర్పాటు చేయబడింది గవర్నర్ జనరల్‌గా ఉండిన వారన్ హేస్టింగ్స్, భారతప్రజల భావాలను గ్రహించి, న్యాయమూర్తిగ సర్ విలియం జోన్స్‌ను నియమింపచేశాడు.

భారతీయ విజ్ఞానమంతా సంస్కృతంలో నిక్షిప్తమైనదని విశ్వసించిన విలియం జోన్స్ బెంగాల్‌లోని ప్రముఖ సంస్కృత విద్వాంసుల వద్ద అధ్యయనం సాగించాడు. హిందూ పురాణేతిహాసాలను గురించి ఇంగ్లీష్‌లో రచనలు చేశాడు హిందూ, గ్రీక్ దేవతల తులనాత్మక అధ్యయనం చేశాడు భారతీయ సంస్కృతి ప్రచారం కోసం "ఏషియాటిక్ సొసైటీ ఆఫ్ బెంగాల్" అను సంస్థను 1784 జనవరి 14న ప్రారంభించాడు (ప్రస్తుతం రాయల్ ఏషియాటిక్ సొసైటీ). సంస్కృత సాహిత్య భాండారాన్ని మథించాడు. సంస్కృతంలో అనర్గళంగా ఉపన్యసించేవాడు జోన్స్ 1789లో జయదేవుని 'గీతగోవిందమ్'ను ఆంగ్లమునకు అనువదించాడు. కాళిదాస కవికృత అభిజ్ఞానశాకుంతలమును మొదట గ్రీక్ భాషలోను, ఆ తర్వాత 1789 అక్టోబరులో "శాకుంతల ఆర్ ద ఫేటల్ రింగ్" అనే పేర ఇంగ్లీషులోనికి అనువదించాడు

భారతీయ ఇతిహాసాలు, తత్త్వశాస్త్రం పట్ల అతని కెంతో అభిరుచి. శంకరుల అద్వైత సిద్ధాంతం విలియమ్ జోన్స్‌ను అమితంగా ఆకర్షించింది. భారతీయులలో మూఢాచారాలున్నప్పటికీ వారిని తత్త్వవేత్తలని విశ్వసించాడు. తర్క, గణిత, రేఖాగణిత శాస్త్రాలలో భారతీయుల ప్రతిభను విదేశీయులకు వెల్లడించాడు బహుముఖ వ్యాసంగాలలో

తలమునుకలవుతున్న కారణంగా భారతీయ ధర్మశాస్త్ర సంకలన గ్రంధం (డైజెస్ట్ ఆఫ్ ఇండియన్ లాస్) పూర్తి చేయలేక పోయాడు

## భాషా విజ్ఞాన విధాత:

భారతదేశంలో వ్యాకరణశాస్త్రం వేదమువలె ప్రాచీనమైనప్పటికీ, భాషా విజ్ఞానం మాత్రం పాశ్చాత్య ప్రభావంతో మొగ్గవేయ తొడగింది. విభిన్న భాషల్లో పండితుడైన విలియమ్ జోన్స్ సంస్కృత భాషాధ్యయనంతో కొత్తపుంతలు వేశాదు

"It was largely due to the rediscovery of Sanskrit by Sir William Jones and others towards the close of the century (18th) that this Latin domination was shaken, that the ancient Indo-European languages were reconstructed and that the modern science of linguistics was initiated" (Language in the Modern world by Simon potter - A. Pelicon Book - 1960 - pages 12, 13)

సంస్కృత ధ్వనిశాస్త్ర, వ్యాకరణ, శబ్దరూప, వాక్యరచనాదులను గ్రీక్, ల్యాటిన్ భాషలతో పోల్చి చూచినప్పుడు, వాటి అపూర్వ సామ్యములను గమనించి, వీటికన్నిటికీ ఒకే మూలం ఉండాలని భావించాడు జోన్స్ ఈ భావమే అధునిక భాషా విజ్ఞానానికి, తులనాత్మక భాషా విజ్ఞానానికి బీజావాహనమైంది ఇతర జాతులతో భారతీయ జాతుల అధ్యయనానికి ప్రేరకమైంది తన పరిశోధనాంశాలను ఏష్యాటిక్ సొసైటీ మూడవ ఉపన్యాసంలో (2 2 1786) వెల్లడించాడు. సంస్కృత భాష, గ్రీక్, ల్యాటిన్‌ల కంటె అత్యంత పరిపుష్టమైనది, ధాతురూప, శబ్దరూప, వాక్యరచనా విధానాల నేపధ్యాన్ని బట్టి ఇవన్నీ ఒకే మూల భాషాజన్యములని ప్రతిపాదించాదు సర్ విలియమ్ జోన్స్ రాయల్ ఏష్యాటిక్ సొసైటీ అధ్యక్షుడుగా ఉన్నంతకాలం ప్రతి ఏటా వినూత్నమైన, విస్మయకరమైన సిద్ధాంతాలను ప్రకటిస్తూ భారతీయ విజ్ఞానమును (ఇండాలజీ), సంస్కృత సాహిత్యమందలి జ్ఞాన భాండారాన్ని పంచిపెట్టాడు తన పది ఉపన్యాసాలలో అపూర్వమైన విషయాలను వెల్లడించాడు. సంస్కృత భాషను అరబిక్ భాష నుండి విడదీసి, హీబ్రూ భాషకు అనుసంధానం చేశాదు. సంస్కృత భాషాభాండారం నుండి పదివేల పదాలను ఇంగ్లీషులోనికి అనువదించాదు. 'హ్యాలిఫి' పర్షియన్ భాషలో రచించిన 'లైలామజ్ను'పై ఇంగ్లీష్‌లో వ్యాఖ్య రచించాదు.

విలియమ్ జోన్స్ భార్య అన్నా మరియాకు భారతదేశ వాతావరణం పడలేదు. ఆమెను శీతల దేశమైన ఇంగ్లండుకు పంపమని వైద్యులు ఆయనకు సలహా ఇచ్చారు. భార్యతోపాటు తానుకూడా ఇంగ్లండు వెళ్ళాలనుకున్నాదు కాని తాను తలపెట్టిన 'డైజెస్ట్' అసంపూర్తిగ వున్నదని, ఆ పని పూర్తిచేయమని భార్య ప్రోత్సహించింది. అనుకున్న వ్యవధి కంటె ఏడాది ముందుగానే ఆమె ఇంగ్లండు వెళ్ళింది 1794 తొలిదశలో విలియం జోన్స్ తన "ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హిందూ లా" రచనను తృప్తికరంగా సాగించాదు. ప్రధానభాగం ముద్రణకివ్వబడింది. లివర్ వ్యాధి పీడితుడయ్యాదు. ఏప్రిల్ నెల వేడిమికి తోదు, నిరంతర కృషి అతని వ్యాధిని

ఇనుమడింప చేసింది. వైద్యుల శ్రమ నిష్ఫలమై, సర్ విలియం జోన్స్ ఏప్రిల్ 27, 1794న కన్నుమూశాడు అతని మహత్త్వ పూర్ణమైన రచన 'డైజెస్ట్ ఆఫ్ ఇండియన్ లాస్' అసంపూర్తిగానే మిగిలింది తెల్లదొరల ప్రతినిధిగా వచ్చిన విలియం జోన్స్ భారతీయులకే మార్గదర్శకుడైనాడు భారతీయ భాషావైభవాన్ని ఆవిష్కరించిన భారతీయ భాషా విజ్ఞాన విధాత సర్ విలియమ్ జోన్స్!

**ఉపయుక్త రచనలు:**


1. సి.పి.బ్రౌన్ - డా కొత్తపల్లి వీరభద్రరావు - 1988
2. భాషావిజ్ఞాన విధాత - విలియమ్ జోన్స్ - 'తరంగ' కన్నడ వారపత్రిక 7.8.94 రచన డా. ఉప్పంగళ రామభట్ట
3. Bhavan's Journal - Feb 16-28-1986


● (*మిసిమి - సెప్టెంబరు 1994*) ●

* * *

**జానమది హనుమచ్ఛాస్త్రి**

విస్మృత భారతమిత్రుడు

# సర్‌మోనియర్ - మోనియర్ విలియమ్స్
# (1819 - 1899)

ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో సంస్కృత శాఖ బోడెన్ ప్రొఫెసర్‌గా పనిచేస్తూ వుండిన ప్రముఖ సంస్కృత విద్వాంసుడు హోరేస్ హేమన్ విల్సన్ 1860 మే నెల 8వ తేదీన కన్నుమూశాడు. ప్రతిష్ఠాత్మకమైన ఆ స్థానానికి తగిన విద్వద్వ రేణ్యుని ఎన్నుకోవటానికి విశ్వవిద్యాలయ పట్టభద్రుల సమావేశం ఏర్పాటు చేయాల్సి వచ్చింది ఆ ఎన్నికలో 3786 మంది విద్వాంసులు పాల్గొన్నారు ఆ పదవిలో నున్న ఆచార్యుని వార్షిక వేతనం 900 పౌండ్ల మొదలు 1000 పౌండ్ల వరకు వుండేది అతి విశిష్టమైన ఆ పదవికి తగిన విద్యాయోగ్యతలు గలవారు కొందరు మాత్రమే వున్నా, వాస్తవంగా పోటి ఇద్దరి మధ్యనే సాగింది.

ఇద్దరిలో ఒకరు ప్రొఫెసర్ మేక్స్ ముల్లర్ అతని వయసు 36 ఏళ్ళు పుట్టకతో జర్మన్ దేశీయుడైన మేక్స్‌ముల్లర్, లిప్‌జిగ్ యూనివర్సిటి నుండి డాక్టరేట్ పట్టా అందుకొన్న ప్రముఖ ప్రాచ్యభాషావేత్త, ఋగ్వేదసంహిత అనువాదకుడుగ, (సెక్రెడ్‌వర్క్స్ ఆఫ్‌ది ఈస్ట్ గ్రంధసంపుటాలు) ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో ఐరోప్య భాషల ఆచార్యుడుగ ప్రసిద్ధుడు.

మరొక అభ్యర్థి మోనియర్ విలియమ్స్, ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ విద్యార్థి, వయసు 41 ఏళ్ళు. ఇటీవల మూతబడిన హెయిల్ బరి కాలేజ్ (సి.పి.బ్రౌన్ చదువుకొన్న కాలేజీ)లో సంస్కృతం, హిందుస్తాని, పర్షియన్ భాషాచార్యుడు వారిద్దరి మధ్య జరిగిన పోటి ఇంగ్లండు పార్లమెంటుకు జరిగిన ఎన్నికలకు దీటుగా సాగింది. ఎన్నిక 1860 డిసెంబర్ 7న జరుగనున్నట్లు, మే నెల 16న ప్రకటింపబడింది. ఎన్నిక తేదీకి ఆరునెలల వ్యవధి వుండేది. ఈ వ్యవధిలో ఒకరి పైనొకరు దుమ్మెత్తి పోసుకోసాగారు

అప్పటికే మేక్స్‌ముల్లర్ యూరోప్‌లోను, ఇతర దేశాల్లోను, భాషా, సాహిత్య రంగా లలో నిష్ణాతుడుగ సువిఖ్యాతుడు. భారతీయతత్వశాస్త్ర వైశిష్ట్యమును, తత్వశాస్త్రముల తులనాత్మక అధ్యయనము భారతీయవాఙ్మయచరిత్ర మున్నగు విషయములలోను, భాషాశాస్త్ర విద్వాంసుడుగ, సంస్కృత భాషాచార్యుడుగ తన కృషిని గురించి ప్రచారం చేశాడు.

వ్యాస భారతి

మోనియర్ విలియమ్స్ సంస్కృత అధ్యయన పీఠం నెలకొల్పిన లెఫ్టినెంట్ కల్నల్ బాడెన్ ఆశయాలను బహిర్గతం చేశాడు ఈస్టిండియా కంపెనీకి చెందిన బాడెన్ సంస్కృత అధ్యయన పీఠము నెలకొల్పుటకు పాతికవేల పౌండ్లను ఇస్తూ, తన ఆశయాలను స్పష్టపరచాడు భారతదేశంలో సంస్కృతభాషా ప్రచారం ద్వారా క్రైస్తవమత వ్యాప్తి జరగాలని భావించాడు. భారతదేశ చరిత్ర మరియు ఐరోప్య భాషల తులనాత్మక అధ్యయనం జరగాలన్నాడు కేవలం భాషాచార్యపదవే ప్రధానం కారాదు అన్నాడు క్రైస్తవ మత ప్రచారానికి ఈ నిధి తోడ్పడాలన్న జోసఫ్ బాడెన్ ఆశయం సంకుచితమైనదే

ఈ అంశాన్ని విలియమ్స్ వర్గీయులు తమ అభ్యర్థి ఎన్నికలో బాగా ప్రచారం చేశారు. అంతేకాక మేక్స్ ముల్లర్ జన్మతః జర్మన్ దేశీయుడని, అతని ఆంగ్లభాషా వ్యామోహం విచిత్రమైనదని ప్రచారం చేశారు మేక్స్ ముల్లర్ వర్గీయులు కూడా ఇట్టి వ్యక్తిగత దూషణలకు అతీతులుకారు మోనియర్ విలియమ్స్ సంస్కృత వ్రాతప్రతిని చదువలేడని, సంస్కృత గ్రంధకర్తల గ్రంధాలను వ్యాఖ్యానించలేడని దుమ్మెత్తారు

ప్రచారం పతాకస్థాయికి చేరింది. సంస్కృతభాషలో మహాపండితుడుగ, భాషాశాస్త్ర వేత్తగ, అధ్యాపకుడుగ పేరుగాంచిన వ్యక్తిని ఎన్నుకోవాలో లేదా సంస్కృత వ్రాతప్రతులను చదువలేని వ్యక్తిని ఎన్నుకోవాలో ఆలోచించండి అంటూ ఒక కరపత్రం వెలువరించారు.

ఇలా ఆరోపణలు, ప్రత్యారోపణలతో ఎన్నిక ఎంతో ఉత్కంఠ కల్గించింది. ఎన్నికల ఫలితం యూరప్‌లోనే కాక, ఇతర దేశాల్లోని విద్వాంసులకు కూడ సంభ్రమాశ్చర్యాలు కల్గించింది మోనియర్ విలియమ్స్‌కు 833 ఓట్లు మేక్స్ ముల్లర్‌కు 610 ఓట్లు పడ్డాయి.

ఈ విజయం ప్రాచ్యభాషాభిమానులను అసంతృప్తికి గురిచేసింది. సంకుచితత్వంతో, జరిగిన ఎన్నికగా ఈనాటికీ విజ్ఞుల మనసును వేధిస్తూ వుందీ ఎంపిక. మేక్స్ ముల్లర్ బహుముఖీన ప్రతిభ విస్మరింపబడుట శోచనీయం అన్నారు.

ఇంతటి ప్రతిష్ఠాత్మకమైన ఆచార్యపీఠమును అధిరోహించుటకు మోనియర్ విలియమ్స్ విద్యాయోగ్యతలను పరిగణించుట అవసరం. ఈ గౌరవానికి మోనియర్ విలియమ్స్ తగిన వాడేనని, మేక్స్‌ముల్లర్ అతని కంటే గొప్పవాడని చెప్పక తప్పదు.

మోనియర్ విలియమ్స్ 1819లో బొంబాయిలో జన్మించాడు. అతని తండ్రి బొంబాయి ప్రాంత సర్వేయర్ జనరల్‌గా వుండేవాడు విలియమ్స్ లండన్‌లోని కింగ్స్ కాలేజీ స్కూల్‌లోను హెయిల్ బరీ కాలేజీలోను చదివాడు. ఆక్స్‌ఫర్డ్‌యూనివర్సిటీ కాలేజిలో ప్రొఫెసర్ విల్సన్ వద్ద సంస్కృత అధ్యయనం చేశాడు. పట్టభద్రుడైన విలియమ్స్ హెయిల్‌బరి కాలేజిలో సంస్కృత, హిందుస్తానీ పర్షియన్ భాషాధ్యాపకుడుగ పదిహేనేళ్ళు పనిచేసి, ఆ కాలేజీ 1858లో మూతపడేదాక అక్కడే పనిచేశాడు

మోనియర్ విలియమ్స్ తదేక దీక్షతో సంస్కృత సాహిత్యాధ్యయనం కావించాడు. మేక్స్ ముల్లర్ ప్రాచీన సాహిత్యాభిమాని. మోనియర్ విలియమ్స్ సంస్కృతసాహిత్యా

భిమాని. విలియమ్స్ కాళిదాసు రచించిన విక్రమోర్వశీయము (1846) శాకుంతలమ్ (1853) నలోపాఖ్యానము (1879) కృతులను విపులమైన పీఠికతో సంపాదకత్వం నెరపి ప్రచురించాడు ఈ రచనలు పలు ముద్రణలందుకొన్నాయి విద్యార్థులకోసం, 'శాకుంతల' నాటకాన్ని సరళ వచనంలో వ్రాశాడు.

భావవ్యక్తీకరణలోను, ఛందోవిశ్లేషణలోను కావ్యములకు సంబంధించిన వివరణము లలోను, మోనియర్ విలియమ్స్ వాటిని విశిష్టంగా వెలువరించి ప్రశంసలందుకొన్నాడు. సంస్కృతం చదువు ఇంగ్లీష్ విద్యార్థులకు, సంస్కృతనాటకాల విశుద్ధ ప్రతులను అందించాలన్న లక్ష్యంతో, సమకాలీన సంస్కృత విద్వాంసులైన కాటవేమ, శంకర, చంద్రశేఖరుల, సంస్కృత నాటక వ్యాఖ్యలను అధ్యయనం చేశాడు. సంస్కృత నాటకరీతులను అవలోకనం చేశాడు

విలియమ్స్ మహాభారతమందలి నలోపాఖ్యానమును రచించుటకోసం మహాభారత ప్రతులు నెన్నిటినో పరామర్శించాడు. నల చరిత్ర అనువాదం అత్యంత ప్రశంసనీయంగా సాగించాడు.

విలియమ్స్ ప్రచురించిన సంస్కృత నాటకానువాదాలు విశ్వసనీయమై, పాఠ కులనెంతగానో ఆకట్టుకొన్నాయి పీఠికారూపంలో రచించిన సంగ్రహకథారూపాలు ఆసక్తికరంగా వున్నాయి

సంస్కృత కావ్య, నాటకాదులు ప్రధానంగా రామాయణ, మహాభారతాంతర్గతములని ఆయా రచనల విషయవైవిధ్యము రచనా రీతులు తనను ఎంతగానో మురిపించా యన్నాడు.

సంస్కృత వాఙ్మయంలో వున్నంత విషయ వైవిధ్యము, రచనా రామణీయకము, ఆంగ్లసాహిత్యంలో మృగ్యమని ప్రస్తుతించాడు. "ఇండియన్ విజ్‌డమ్" (1875) అను గ్రంథంలో సంస్కృత సాహిత్యంలోని ఆణిముత్యాలను సంకలనం కావించి, సామాన్య పాఠకులకేకాక, సంస్కృత విద్యార్థులకు మహోపకారం చేశాడు. దానిని 1893లో సవరించి ప్రచురించాడు.

బాడెన్ ప్రొఫెసర్ పదవిని చేపట్టి, కొన్ని హిందుస్తాని మాన్యుయల్స్, హిందుస్తాని భాషాప్రవేశిక (1858) హిందుస్తానిగ్రామర్ (1862) గ్రంథాలను రచించాడు.

భారతదేశంలో మిషనరీల సేవలను ప్రోత్సహించిన మోనియర్ విలియమ్స్ భారతీయ విజ్ఞానాన్ని, మతతత్వాన్ని ప్రచారం చేయుట కోసం గ్రంథరచన చేశాడు. హిందూయిజమ్ (1877) మోడర్న్ ఇండియా అండ్ ఇండియన్స్ (1878) రెలిజియస్ లైఫ్ అండ్ థాట్ ఇన్ ఇండియా (1883) బుద్ధిజం (1889) బ్రాహ్మనిజం (1891) పేర్కొన దగినవి.

సంస్కృత భాషావ్యాకరణముల అధ్యాయంలో ఆయన నిమగ్నుడై వుండేవాడు. 1846లోనే (అతని ఇరవైయో ఏట) సంస్కృత వ్యాకరణ గ్రంథం రచించాడు

మోనియర్ విలియమ్స్ రచనలలో కెల్లా మకుటాయమానంగా నిలచింది అతని 'ఇంగ్లీష్ - సంస్కృత నిఘంటువు ఆంగ్లమాధ్యమంలో సంస్కృతం అభ్యసించే

వారందరికీ అత్యంత ఉపయుక్తమైనదీ నిఘంటువు. కొన్నేళ్ళు కృషిచేసి 1851లో ఇంగ్లీష్ - సంస్కృత నిఘంటువును పూర్తిచేశాడు. మరింత విస్తృత మొనర్చిన ఈ నిఘంటువును 1899లో ద్వితీయ ముద్రణగా వెలువరించాడు. ఈ నిఘంటువులోని పదములకు ధాతు వ్యుత్పత్తులను, లక్షణయుక్తంగా ఇండో యూరోపియన్ పదాల అర్థాలతో కూర్చడం విశేషం.'

ఈ నిఘంటువు సంతరించుటలో మోనియర్ విలియమ్స్ సంస్కృత - జర్మన్ నానార్థ నిఘంటు సంపుటాలు ఏడింటిని బాగా పరిశీలించాడు. ఈ బృహత్ సంపుటాలను కూర్చిన జర్మనీలోని సంస్కృత విద్వాంసులు బోట్లింగ్ మరియు రుడాల్ఫ్ రాథ్‌గార్లు వీటిని పరామర్శించినప్పటికీ, విలియమ్ తన స్వీయ ప్రణాళికను సిద్ధపరచుకొన్నాడు. భారతీయ విద్వాంసులు, మిషనరీల కొరకు సిద్ధపరచిన నిఘంటువుగా భావించినప్పటికీ, కాలక్రమంలో మోనియర్ విలియమ్స్ కూర్చిన నిఘంటువు అత్యంత ఉపయుక్తమని, ఈ నాటికీ ప్రామాణికమైనదని ధ్రువీకరించారు. విలియమ్స్ అందజేసిన సేవలలో మరో ప్రధాన ఘట్టం 1883లో ఆక్స్‌ఫర్డ్‌లో ఇండియన్ ఇన్‌స్టిట్యూట్‌ను నెలకొల్పటం. భారతీయ సాహిత్యం, సంస్కృతిని గురించిన విశేషాలను సాధికారంగా అధ్యయనం చేయుటకు ఈ సంస్థ కేంద్రంగా వుంటుందని ఇంగ్లాండు - ఇండియాల మధ్య సద్భావ సౌజన్యాలను పెంపొందించగలదని భావించాడు. ఈ సత్కార్య సాధనలో భాగంగా మోనియర్ విలియం 1875, 1876, 1883 సంవత్సరాల్లో మూడు పర్యాయాలు మన దేశాన్ని సందర్శించాడు సంస్థానాధిపతులను కలుసుకొని వారి సహాయంతో 34000 పౌండ్లు పైకం సంపాదించాడు తాను నెలకొల్పిన ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ సంస్థకు తాను సేకరించిన ప్రాచ్య భాషా సాహిత్య గ్రంథాలను, వ్రాతప్రతులను, మూడు వేలకు పైగా దానం చేశాడు.

'ఇండియన్ ఇన్‌స్టిట్యూట్' ద్వారా ప్రాచ్యభాషా పండితులకు ఫెలోషిప్‌లు ప్రయాణ ఫెలోషిప్‌లు ఆక్స్‌ఫర్డ్‌లో చదువు విద్యార్థులకు విద్యార్థి వేతనాలు, ఉపన్యాసాలు, భారతీయ విషయాలపై వ్యాసరచనా పోటీలకు, ఇండో - బ్రిటీష్ సంబంధాల పటిష్టతకు గట్టి పునాదులు వేశాడు. ఆ సంస్థ శంకుస్థాపనా ఫలకం పై సంస్కృతంలో కింది వాక్యాలను ఉద్ధరించుట విశేషం

*"ఈశానుకంపాయ నిత్యమ్ ఆర్య విద్యామహీయతామ్*

*ఆర్యావర్త – ఆంగ్ల భూయోర్శ్చిమతో మైత్రి వివర్ధతామ్"*

(భగవంతుని కృపవల్ల ఇక్కడ భారతీయ అధ్యయనం ప్రవర్ధమానముగుగాక. తత్ఫలితంగా భారత - ఇంగ్లండుల మధ్య పరస్పర మైత్రీ భావం పెంపొందుగాక)

ఏడు దశాబ్దాల తర్వాత 'ఇండియన్ ఇన్‌స్టిట్యూట్'ను ఆక్స్‌ఫర్డ్ విద్యాలయ పాలనా కార్యాలయంగా మార్చారు. భారతీయ విభాగాన్ని మరోచోటికి తరలించి, అక్కడ ప్రాచ్యభాషాధ్యయన విభాగం నెలకొల్పాలని నిర్ణయించారు. ప్రస్తుతం ఈ సంస్థ అధ్యయన శాఖ ఏరూపు దాల్చిందో తెలియకున్నది

జానమద్ది హనుమచ్ఛాస్త్రి

ఈ మార్పుకు ఇదివరలో బాడెన్ ప్రొఫెసర్‌గా పనిచేసిన ప్రముఖ సాహిత్యాచార్యుని ప్రతిఘటన నిష్ప్రయోజకమైంది. ప్రొఫెసర్ బరో ఈ సంస్థ (ఇండియన్ ఇన్‌స్టిట్యూట్)కు పట్టిన దుర్గతికి చింతిస్తూ విషాదగీతిక రచించాడు. ఆ గీతిక చివరి రెండు పంక్తులు.

'విద్యావిహీనా శాలైష పరైర్నీతా పరాభవమ్
అయోధ్యా ప్రేషతే రామే నష్ట శ్రీ రివ శోచతి'

ఈ దుష్పరిణామానికి మోనియర్ విలియం ఆత్మ ఎంతగా పరితపించిందో!

మోనియర్ విలియమ్‌ను పలు విశ్వవిద్యాలయాలు, సంస్థలు ఘనంగా సత్కరించాయి ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయం డి.సి.ఎల్. గౌరవపట్టమును, కలకత్తా విశ్వవిద్యాలయం ఎల్.ఎల్.డి. పట్టమును, గొట్టింజెన్ యూనివర్సిటి గౌరవ సభ్యత్వమును ఇచ్చి సత్కరించాయి. ఇంగ్లాండు విలియమ్స్‌ను 'సర్' గౌరవ బిరుదంతో భూషించింది. విలియం వైదుష్యానికి విశిష్ట సూచనగా అతనిని 'సర్ మోనియర్ - మోనియర్ విలియమ్స్' అని ప్రస్తుతించారు. మోనియర్ విలియమ్స్ 80 సంవత్సరాలు నిర్విరామ భాషాజీవిగ భారత - ఇంగ్లండుల స్నేహ వారధిగ శ్రమించి 1899లో కన్నుమూశాడు.

మేక్స్ ముల్లర్ భారతదేశం పట్ల, ప్రపంచం పట్ల అత్యంత గౌరవ భావం కలిగి వుండగా, మోనియర్ విలియమ్స్ ఇంగ్లండు ఇండియాల మధ్య సద్భావ సాధనకు అవిరళమైన కృషిచేశాడు

మేక్స్‌ముల్లర్ వసుధైక కుటుంబమును ఆకాంక్షించగా, మోనియర్ విలియమ్స్ అచ్చమైన ఆంగ్లేయుడుగ వర్తించాడు.

ఇరువురూ భారత మిత్రులలో అగ్రగణ్యులు. భారతదేశాన్ని మనసారా ప్రేమించిన ఉదారహృదయులు, చిరస్మరణీయులు. సర్ మోనియర్ విలియమ్స్ కూర్చిన సంస్కృత - ఆంగ్లనిఘంటువు పీఠికలోని కింది వాక్యాలు అతని సహృదయ సద్భావాలకు సాక్ష్యంగా వున్నాయి.

"...I met to my surprise with learned and thoughtful natives - not only in the cities and towns, but even in remote villages - able and willing to converse with me in sanskrit, as well as in their own vernaculars and to explain difficult points in their languages, literatures, religions and philosophies."

అంటూ భారతీయుల ప్రతిభను కొనియాడాడు.

(ఈ వ్యాసరచనకు 'దిహెరిటేజ్' - జనవరి 1986 సంచికలోని, ప్రముఖ రచయిత డా॥ డి. ఆంజనేయులు గారి వ్యాసం ఆధారం. సర్. మోనియర్ విలియమ్స్ చిత్రం కూడా ఆ సంచిక లోనిదే.)

● (మిసిమి - ఫిబ్రవరి *1997*) ●

★ ★ ★

# తెలుగు సూర్యుడు - సి.పి.బ్రౌన్
# (1798 - 1884)

తెలుగుభాషా సాహిత్యాలు ఆలనా పాలనా లేక నిరాదరణకు, నిర్లక్ష్యానికి గురైన కాలంలో కారణ జన్ముడుగ అవతరించి, మినుకు మినుకుమంటున్న ఆంధ్రసాహిత్య దీపాన్ని స్నేహసిక్తం చేసి, ప్రజ్వలింపచేసిన సాహిత్య సముద్ధారకుడు సి.పి.బ్రౌన్.

1817 నుండి మూడేళ్ళ పాటు మద్రాసులో ఉద్యోగ శిక్షణ పొందిన బ్రౌన్ 1820 ఆగష్టు 19,20 తేదీల ప్రాంతంలో కడప కలెక్టర్ హన్‌బరికి, రెండవ సహాయకుడుగ కడపలో కాలుమోపాడు. కడపలో ఉద్యోగిగా చేరినప్పటికి పరిస్థితిని బ్రౌన్ మాటల్లోనే.

"I was then sent to the cuddapah (Kadapa) district, where I presided in a police office for two years, all the work being carried on in Telugu, but like wise in Kannada, Marata or Hindustani Hunbury under whom I served talked Telugu flunetly, and impelled by zeal as well as necessity, in two years I equalled him. I soon acquired the colloquial Telugu; not to speak it well, but better than my neighbours, for at that day no Englishman had ever studied Telugu throughly. Some few had a name as good scholars, but their skill was far from great" (Literary Autobiography of C P.Brown Page.31)

1820 ఆగష్టు నుండి రెండేళ్ళు కడపలో కలెక్టరుకు సహాయకుడుగ పనిచేసిన తర్వాత 1822లో మచిలీపట్నంలో జిల్లా కోర్టు రిజిస్ట్రార్‌గా; రాజమండ్రిలో Head Assisatant to the Collector and Magistrateగా పనిచేశాడు. 1826 జనవరి 10వ తేదీన జిల్లా కోర్టు రిజిస్ట్రార్‌గా చేరి 1829 ఫిబ్రవరి దాక, అసిస్టెంట్ జడ్జి; జాయింట్ క్రిమినల్ జడ్జిగా పనిచేశాడు.

అప్పుడే కడపలో బంగళా మరియు తోట కొన్నాడు పదేళ్ళకు పైగా వాటిని తన స్వాధీనంలో వుంచుకొన్నాడు. అయోధ్యాపురం కృష్ణారెడ్డి యిచ్చిన లెక్కల మేరకు బ్రౌన్, బంగళా మరియు 15 ఎకరాల తోటను రూ.3500లకు కొన్నాడు. బంగళాలో కొంత భాగాన్ని అద్దెకు ఇచ్చి, తక్కిన భాగాన్ని పండిత మండలికి నివాసం కొరకు ఇచ్చాడు. వివిధ ప్రాంతాల నుండి తెప్పించిన తాళపత్రకావ్యాలను పరిష్కరించి శుద్ధ ప్రతుల తయారీకి వారిని నియమించుకొన్నాడు వారి జీతబత్తెములన్నిటిని తన సొంత పైకంతోనే భరించేవాడు. కడపలో రెండు బడులను స్వంతపైకంతో పెట్టాడు.

తెలుగు సాహిత్య సముద్ధరణ మహాయజ్ఞం జరిగిన, ఆ బంగళాను గురించి, బ్రౌన్ తన ఆత్మకథలో ఇలా వ్రాసుకొన్నాడు

"....and I saved no money. Indeed there were always from ten to twenty Brahmans and Sudras in my pay employed in transcribing native authors in preparing correct editions in framing indexes and commentaries Thus there were three Separate sets of Brahmins engaged under my roof which people called "Brown College"

తాటాకుల్లో శిథిలమైపోతూ, కొన ఊపిరితో కొట్టుకలాడుతుండిన తెలుగు కావ్యాలను కాలగర్భంలో కలిసిపోకుండా పునరుద్ధరించిన మహానీయుడు బ్రౌన్ ఈ తెలుగు సాహిత్య పునరుత్థాన కార్యంలో బ్రౌన్ దొరకు సన్నిహితంగా కృషి చేసిన వారిలో అయోధ్యాపురం కృష్ణారెడ్డి, ధర్మవరం సుబ్బన్న, రావిపాటి గురుమూర్తి శాస్త్రి, వర్యం అద్వైత పరబ్రహ్మశాస్త్రి గరిమెళ్ళ వెంకయ్య, జూలూరి అప్పయ్య, ములుపాక బుచ్చయ్యశాస్త్రి మున్నగు వారు సాహిత్యమహాధ్వరంలో పండితులు ఏరీతిగ బ్రౌనుకు సహకరించారో ఆ విధంగా బ్రౌన్‌కు అత్యంత ప్రీతి పాత్రుడుగ సేవ్య సేవక సంబంధాలకు అతీతమైన ఉదాత్త చిత్తంతో బ్రౌన్‌ను కొలిచిన నిజాయితీపరుడు, అయోధ్యాపురం కృష్ణారెడ్డి. కడపలో బ్రౌన్ బంగళాలో నెలకొల్పబడిన గ్రంథాలయానికి ఆదర్శ గ్రంథపాలకుడుగా వ్యవహరించిన కృష్ణారెడ్డిని బ్రౌన్ "In these plans the Zealous writer of this letter was a most noble and excellent assistant" అని కొనియాడాడు.

1824లో మొదటిసారిగ బ్రౌన్ వేమన పేరు విన్నాడు వెంటనే వివిధ ప్రాంతాల నుండి 15 విభిన్న వ్రాత ప్రతులను తెప్పించుకొన్నాడు. దాదాపు 3 వేల పద్యాలను సేకరించి వాటిలో 693 పద్యాలను నాలుగు భాగాలుగా విభజించి ఇంగ్లీషులో అనువదించి 1829లో స్వయంగా ముద్రింపచేశాడు నాలుగవ సంపుటంలోనివి అశ్లీలంగా వున్నందున వాటిని ప్రచురింపలేదని డా॥. ఆరుద్రగారు వ్రాశారు. ఈ విధంగా తెలుగు సాహిత్య కీర్తిని వేమన కీర్తితోపాటు విదేశాలకు విస్తరింపచేసిన మహాపురుషుడు సి.పి.బ్రౌన్.

తెలుగు తాళపత్ర గ్రంథాలను సేకరించి కాగితాలపైకెక్కించి, శుద్ధప్రతులను తయారు చేయించి, వ్యాఖ్యానాలు, పీఠికలు వ్రాయించి అచ్చుకు సిద్ధపరచటం కడపలోని బ్రౌన్ కాలేజిలో జరిగిన నిత్య వ్యవహారం.

తెలుగు ప్రబంధ మండలిలో ప్రత్యేక స్థానం ఆక్రమించిన వసుచరిత్రను పునరుద్ధరించి 1829, 30లో ములుపాక బుచ్చయ్యశాస్త్రి (కడప జిల్లా నందలూరు వాడు) చేత ప్రతిపదార్థ వ్యాఖ్య సామాన్య పాఠకుడికి కూడా సులువుగా అర్థమయ్యే రీతిగా వ్రాయించాడు. వసుచరిత్ర వ్యాఖ్యానానికి పీఠికా ప్రాయంగా బ్రౌన్‌ను ప్రశంసిస్తూ పదిహేను పద్యాలు వ్రాశాడు.

ఆనాడు రాజరాజనరేంద్రుడు, నన్నయ్యను పిలిచి తెలుగు భారతం వ్రాయమని కోరినట్లుగ, "సకల లక్షణ శాస్త్ర చక్రవర్తి శబ్దశాసన సూత్ర సహిత వృత్తి లక్ష్యలక్షణ గురులఘు వర్ణగణ వార్తికా వృత్తి విద్వన్మతానువర్తి" అయిన బ్రౌన్ తనను వసుచరిత్ర

విషయం చూడమన్నాడని చెప్పుకొన్నాడు. బుచ్చయ్య వ్రాసిన అంకిత పద్యాలలో అత్యంత ప్రచారం పొందిన పద్యమిది.

*క॥ నూర్లార్లు, లెక్క సేయక*
*పేర్లందిన విబుధ జనుల బిలిపించుచువే*
*మార్లర్థ మిచ్చు వితరణి*
*చార్లిసు పిలిప్పు బ్రౌను/సాహెబు కరుణన్*

అంకిత పద్యాల్లోని కవిత్వ కైవారాలకు బ్రౌన్ ఉబ్బిపోలేదు. సామాన్యులకు సైతం అర్థమయ్యే విధంగా జూలూరు - అప్పయ్య శాస్త్రి చేత మరో వ్యాఖ్యానాన్ని (1832 - 34) వ్రాయించి దానినే ముద్రింపచేశాడు.

బ్రౌన్ గుణపక్షపాతి. వ్యావహారిక, భాషా వాదులలో అగ్రగణ్యుడు. 1825లో తెలుగు భారతాన్ని చదువనారంభించానని, బ్రౌన్ తన స్వీయచరిత్రలో వ్రాసుకొన్నాడు. గ్రంథపాఠాలను, పూరించుకొంటూ పాఠాంతరాలను గుర్తిస్తూ, ఆశ్వాస విభజన గావించుకుంటూ, పద్య సంఖ్య, మధ్యమధ్యలో కథకు అనుగుణంగా ఉపశీర్షికలు ఇచ్చుకొంటూ, శుద్ధ ప్రతిని రూపొందిస్తూ వచ్చాడు ఇట్లు ఒక్కొక్క దశను దాటుకొంటూ ఆంధ్ర మహాభారతం 18 పర్వాలకు శబ్దప్రతుల తయారీకి 2714 రూపాయలు ఖర్చు పెట్టాడు. అప్పట్లో బ్రౌన్ నెలజీతం 500 రూపాయలు మాత్రమే.

కడపలో వున్నప్పుడే (1824 - 25) ధరణి దేవుల రామన్న వ్రాసిన దశావతార చరిత్రలోని అహల్య కథా భాగాన్ని మాత్రం విడిగా వ్రాయించి, అహల్యాసంక్రందనం అను పేరు పెట్టుకొన్నాడు. దానిలోని పద్యాలను ఇంగ్లీషులోనికి అనువదించాడు. శృంగార రసప్రియుడైన బ్రౌన్ మడికి సింగన వ్రాసిన పద్మ పురాణంలోని అహల్యాగాథను, సముఖం వెంకట కృష్ణప్ప నాయుడు రచించిన అహల్యా సంక్రందనాన్ని కూడా సేకరించాడు.

"జీవద్భాషను బోధించేవి పుస్తకాలు కావు నిత్యమూ, ప్రజావ్యవహారంలో నుండే భాషే దానిని బోధిస్తుంది.

న్యాయస్థానాలలో నేడు పండితుడు మొదలు పామరుని వరకు సమస్తమైన వారితో మాట్లాడవలసి వచ్చేది. ముద్దాయి, సాక్షి, ఖైది, స్వదేశీయ న్యాయాధికారి. చదువురాని నౌకరు వీరందరూ, నాకు ఒక విధంగా ఉపాధ్యాయులే" (బ్రౌన్ స్వీయ చరిత్ర - తెలుగు సేత నిడదవోలు వెంకటరావు 'భారతి', మే 1963, పుట 80)

ప్రజల నాలుకపై నడయాడే పలుకు బళ్ళను సామెతలను, చాటువులను, కొల్లగా సేకరించాడు. 8 కథాకావ్యాలను, 41 ద్విపద కావ్యాలను సముద్ధరించాడు 84 శతకములను సేకరించాడు. వీటిలో పది శతకాలను ముద్రించాడు.

సాంఘిక చరిత్ర నిర్మాణానికి, సాహిత్య చరిత్ర రచనకు, దేశ చరిత్ర నిరూపణకు, భాషా పరిణామ పరిశీలనకు బ్రౌన్ లేఖలు మూలాధారములు సత్యమును గుర్తించి వానిని సంపుటములుగ కూర్చి భద్రపరిచిన ఆద్యుడు బ్రౌన్ (బ్రౌన్ - తెనుగు కావ్య సముద్ధరణము - డా॥ ఆర్. పద్మావతి)

ఇంగ్లీషులో తెలుగు వ్యాకరణం వ్రాసిన వారిలో బ్రౌన్ చాలా ముఖ్యమైనవాడు. ఆంధ్ర సంస్కృతజన్య జనక సిద్ధాంతాన్ని బ్రౌన్ అంగీకరించలేదు.

బ్రౌన్‌కు నిఘంటు నిర్మాతగ అజరామరమైన పేరు వచ్చింది ఒకటి కాదు, రెండుకాదు 5 నిఘంటువులను కూర్చాడు పండిత పామర రంజకములైన బ్రౌన్ నిఘంటువులు ఈనాటికీ విశిష్టములుగా వున్నాయి ఇంచుమించుగా సమస్త భారతీయ భాషలతో పరిచయమున్నవాడు బ్రౌన్. ఆయన ఎన్నో లఘు రచనలు చేశాడు మంత్రశాస్త్రం. తంత్రశాస్త్రం, శిల్పశాస్త్రం, ఖగోళ శాస్త్రం, జ్యోతిష శాస్త్రం మున్నగు వాటిని గురించి ఎన్నో వ్యాసాలు రచించాడు. ఛందోలంకార గ్రంధాలు రాసాడు.

సంస్కృతంలో సౌందర్యలహరికి వ్యాఖ్యానం వ్రాశాడు. ఆయన రచించిన తెలుగు వాచకాలు అప్పట్లో విశేషప్రచారంలో వుండేవి.

భాషాశాస్త్రంలో కూడా బ్రౌన్ చేసిన కృషిని తక్కువగా అంచనా వేయరానిదని అతని కడపజాబులు తెలుపుతున్నాయి.

గచ్చుగుంతలు, పలుగురాళ్ళు, కరదు, గాబము (కడప మాండలికములో గాదము) మున్నగు పదాల గురించి ఎంతగానో ఆలోచించాడు. కడప జిల్లా బద్వేలు తాలూకాలోని పలుగురాళ్ళ పల్లె గ్రామాన్ని స్వయంగా చూచి గ్రామనామం అర్థ నిర్ధారణ చేసుకొన్నాడు.

కడపలోని బ్రౌన్ కాలేజీని గురించి బంగోరె "ఈ బంగళాలో ఒక మూల గదిలో చిన్న కర్మాగారంలా, ఒకరు పనిచేస్తూ, పండితులు తాళపత్ర ప్రతులు ముందరేసుకొని శుద్ధప్రతులు తయారు చేస్తూ వ్యాఖ్యానాలు కూరుస్తుండేవారు నిలువ నీడ లేకుండా పోయిన తెలుగు కావ్య సరస్వతిని ఆహ్వానించి తన బంగళాలో ఒక సాహిత్య పర్ణశాల" ఏర్పరచి ఆ వాగ్దేవి నిండు ముత్తయిదువులాగా నడయాడేలా చేయగలిగాడు బ్రౌన్ బహుమంది విద్యార్థులు "తమరు సుకృతంగా పాఠశాల బెట్టి అనేక మందికి ఆంధ్ర గీర్వాణ కావ్య నాటకాలంకారాది గ్రంధములు అభ్యసింప జేస్తున్నారు. సరస్వతికి ప్రస్తుతమందు తమరు వొకరే నివాస స్థానముగా కనపడుతున్నారు గనుక ఎక్కడెక్కడ ఏ ఏ విద్యలు దాచబడి వున్నవో అవి అన్నీ తమంతట తామే తమ సన్నిధికి వస్తున్నాయి;" అన్నాడు ములుపాక బుచ్చయ్యశాస్త్రి".

బ్రౌన్ వ్రాతలను బట్టి చూస్తే అతని వద్ద పెద్ద గ్రంధాలయం వుండేదని తెలుస్తుంది. కడపలో గజ్జెల రెడ్డి వద్ద పెద్ద గ్రంధాలయం వుండినట్లు బ్రౌన్ వ్రాతల వల్ల తెలుస్తుంది. కడప ప్రాంతంలోని కొన్ని గ్రంథాలయాలను గురించి వ్రాస్తూ:

Chincholi Appanachari of pata cadapa has a noble sanscrit Library, Rungareddee of Nosum has noble Library (సంస్థానం) In Pallapaud of Duoor, the son of Raghavachari has a library.. is a good fellow. In Duoor, Gudipad in the Curnam Lakshmipathi's house is a Telugu Library. కడప ప్రాంతాల్లోని గ్రంథాలయాలన్నీ ఆయనకు తెలిసినవే.

కడపకు సంబంధించిన కొన్ని వ్యాసాలు వ్రాశాడు. కడపజిల్లా ప్రొద్దుటూరు

సమీపంలోని రామేశ్వరం గ్రామ కరణీకపు మిరాశి వివాదాల నేపథ్యానికి సంబంధించి రెండు సంపుటాలు తెలుగు ఇంగ్లీష్ గ్రంథాలు వ్రాశాడు.

గ్రామ నామాల చరిత్రపట్ల బ్రౌన్‌కు ఎంతో ఆసక్తి వుండేదనుటకు, కడపను గురించి ఆయన వ్రాసిన Note స్పష్టం చేస్తుంది.

The town "Cadapa denotes a door way and the people there, fancy the town was so named because it is on the route of the holy city Tirupati (తిరుపతి) (Tripetty of the maps) Thus the City of Genoa in Italy was formally called Janua, as being the gate by which the Gauls entered. గడప. A threshold is the root in A of గడుచుట to pass. So in Hebrew. .ober and in Arabic. In some Geographical dictionaries which copy the assertions made by Sir Charles wilkins we are assured that the name was Cripa, the Sanskrit word for grace; favour. But this is a mistake and arose thus:- The mussalmans were unable to pronounce the hard Din Kadapa and Changed it into the hard "R" calling it Kurpa or Kripa. There upon Wilkins guesses it to be Kripa or kurpa a notion unknown to all natives. But the people on the sport deny that its name was either Kripa or Kirpa. It was thus affirm merely Kadapa a thereshold also pronounced Gadapa Some natives fancy it was so called as being one way to Shrine at Tirupati are etymon as absurd as that imagined for Genoa from Janua

బ్రౌన్ కడప పేరును ఆంగ్లంలో Cuddapah అని వ్రాయడానికి ఇష్టపడక Caddapah, Kadapa అని వ్రాసేవాడు ఇప్పటికైనా కడపకు సంబంధించి కృత్రిమమైన స్పెల్లింగు గల Cuddapah ను Kadapa లేదా Cadapaగా మార్చుటకు కడప పెద్దలు ఆలోచించాలి 'Ca'ను వ గాను 'Ka'ను క గాను (భారత ప్రభుత్వం వారి లిప్యంత రీకరణం విధానం) మార్చాలి. Kadapa అనటం సముచితం అని ప్రముఖ గ్రంథాలయ శాస్త్రవేత్త డా.వెలగా వెంకటప్పయ్యగారు పేర్కొన్నారు ("ద్విభాషా నిఘంటువులు బ్రౌన్ కృషి" సి పి బ్రౌన్ - వేమన సంచికలోని వ్యాసం)

తెలుగు ప్రజల మధ్య దాదాపు నాలుగు దశాబ్దాలు గడిపిన బ్రౌన్ ఏనాడూ మత ప్రచారానికి పూనుకోలేదు. ఆనాటి పాశ్చాత్యులలో అరుదుగా కనిపించే సహన దృష్టి అతనిలో నిండుగా వుండేది. మానవతను ఆరాధించిన మనిషి ఆయన కడపలో సంపన్న కుటుంబానికి చెందిన ఒక బ్రాహ్మణుడు చనిపోగా అతని భార్య సహగమనం చేసుకొనుటకు సిద్ధపడుతున్నట్లు విన్న వెంటనే కడప మేజిస్ట్రేటుకు తెలిపి పోలీసుల్ని పంపించే ఏర్పాటు చేయటమే కాక స్వయంగా శ్మశాన వాటికకు వెళ్ళి భార్యను, భర్త శవం వున్న పాడెపై నుండి వేరు చేయించి శవ దహనం జరిగే వరకు అక్కడే వుండినట్లు ఆత్మకథలో బ్రౌన్ వ్రాసుకొన్నాడు.

బ్రౌన్ ఎక్కడ వుండినా కడప విశేషాలను గురించి వివరాలు తెలుసుకొనేవాడు. కాబట్టే కడప సబ్ కలెక్టర్ మెక్డొనాల్డ్ హత్య (15 6.1832) గురించి కడప కరువులో జరిగిన దొంగతనాలు, లూటీలు గురించి ఉయ్యాలవాడ నరసింహారెడ్డి బ్రిటీష్

వాళ్ళను ముప్పతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్ళు తాపించిన తీరుతెన్నుల గురించి, ఈ విధంగా ఎన్నో విషయాలను జాబుల ద్వారా తెలుసుకొనేవాడు పండితులు, అయోధ్యాపురం కృష్ణారెడ్డి బ్రౌన్‌కు వ్రాసిన జాబుల ద్వారా కడప చరిత్రలో దాగిన నిజాలెన్నో వెల్లడైనాయి. చరిత్రకు సంబంధించిన మెకంజీ కైఫీయత్తులను సేకరించి శుద్ధ ప్రతులు వ్రాయించి చరిత్ర కుపయుక్తమైన వాస్తవాల నెన్నిటినో అందజేశాడు

C.P. Brown was one of the few Scholars who waded through Meckenzie manuscripts and drawing inspiration from and utilising the contents of the historical materials brought out a number of publications by way of translations and explanations such as "wars of Rajas, Memoir of Hyder Ali and Tippoo, Cyclic Tables Carnatic Chronology· When Meckenzie manuscripts at Madras were perishing, Brown got them transcribed at his own in the G O.M L Madras as amark of respect for Meckenzie, Brown kept his Portrait (Engraved from the saturdays magazine june 1834,) in the library of manuscripts for which he was for some time curator Brown translated " An Account of the tribes of the Maharatta Brahmins (Literary Autobiography of C P.Brown-Page 147)

He translated "Memories of Hyder Ali and Tippoo Sultan from Marathi with annotations, found among the **Mackenzie** Collections Written by one Punganuri Rama Chandra Rao, an Officer under the Princess (Literary **autobiography** of C P Brown, Bibliography Page No 155)"

బ్రౌన్, డేవిడ్ బ్రౌన్, కాలే దంపతులకు రెండవ సంతానంగా 1798 నవంబర్ 10వ తేదీన కలకత్తాలో జన్మించాడు. తండ్రి డేవిడ్ బ్రౌన్ కలకత్తాలోని ఫోర్ట్ విలియమ్‌లో క్రైస్తవ మత ప్రచారకుడుగా వుండేవాడు. అతడు బహుభాషా కోవిదుడు. తండ్రి చనిపోయేనాటికి బ్రౌన్ 14 ఏళ్ళవాడు తల్లి పిల్లలతో లండన్ వెళ్ళగా బ్రౌన్ లండన్‌లోని హెయిల్ బరీ కళాశాలలో చదువుకొన్నాడు. వివిధ పదవులలో రాణించిన సి.పి.బ్రౌన్ చివరి దశలో లండన్ యూనివర్శిటీలో తెలుగు భాషా చార్యుడుగా పనిచేసి 1884 డిసెంబరు 12న తన ఎనభైయేడవ ఏట దివంగతుడయ్యాడు.

బ్రౌన్ ఆంగ్లేయుడు. అవివాహితుడు జీవితాన్ని తెలుగు **సాహిత్యోద్ధరణకు** పండిత పోషణకు, గ్రంథ ప్రచురణకు వినియోగించాడు నిజానికి తెలుగుసాహిత్య రంగంలో తొలిపరిశోధకుడుగ, గ్రంథసంపాదకుడుగ, కీర్తింపదగిన వాడు బ్రౌన్ తెలుగునాట రవాణా సౌకర్యాలు, ముద్రణాలయాలు, అక్షరాస్యత అంతంతమాత్రంగా వున్న కాలంలో తెలుగు వెలుగును దేశాంతర వ్యాప్తి కావించిన సాహిత్య యోగి ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్.

## వ్యక్తి, వ్యక్తిత్వం

బ్రౌన్ సదా సర్వదా సాహిత్య చింతనామత్తచిత్తుడు. దాదాపు 24 భాషలలో పాండిత్యం గడించినవాడు హిందూ సమాజాన్ని సంప్రదాయాలను విమర్శించని

క్రైస్తవుడు. నిరుద్యోగులెందరికో పనులు కల్పించి సహాయపడినవాడు. కుంటి, గుడ్డి, అనాథలకు ప్రతినెలా 500 దాకా దానధర్మాలు చేసినవాడు.

బ్రౌన్ ప్రజాపక్షపాతి. భయంకరమైన డొక్కల కరువు (1832) వచ్చినపుడు సీమప్రాంతంలో క్షామం తీవ్రంగా వుందని ప్రభుత్వానికి నివేదిక పంపాడు. క్షామం Famine అను పదానికి మారుగ కొరత Scarcity అని వ్రాసి నివేదిక పంపమన్నది ప్రభుత్వం. తాను వ్రాసినదే సరైనదని ప్రభుత్వానికి తిప్పి పంపిన దయామయుడు బ్రౌన్.

కడపలోని బ్రౌన్ బంగళా తోటలో రకరకాల పండ్ల వృక్షాలుండేవి. సుమారు ఏడు ఎకరాల విస్తీర్ణంగల ఆ తోటలో ద్రాక్ష పంట బాగా పండేది. సాహిత్యకార్యక్రమాల కోసం, నియమింపబడిన పండితుల కోసం ఆ తోటలోనే మరో బంగళా కట్టించాడు. మొత్తం ఈ ఆవరణలో మూడు కొదడీ బంగళాలు దొరగారికి వున్నట్లున్నాయి. నడిమి బంగళాలో బ్రాహ్మణులు పనిచేసేవారు. ఈ తోటను ఇరవై సంవత్సరాలుగా కనిపెట్టుకొని వున్న మాలీలు దొరగారి కొలువులో అదే తోటపని చేయసాగారు. తోట గొప్పది. రోజూ కపిల తోలేవారు, కాలువలు తీసేవారు, బంగళాలో కుశినీ, గుర్రపులాయం వగైరా వుండేవి. (సమగ్ర ఆంధ్రసాహిత్యం - IX డా. ఆరుద్ర వుట 159)

బ్రౌన్ తన ఆర్థిక స్థితి గతులను గురించి తన ఆత్మకథలో ఇలా వ్రాసుకొన్నాడు. "Four or Five years I had lived in a very humble style giving every fartting to pay first my Brahumans (Pandits) and Secondly my debts. Even when in the greatest difficulties I gave him from two or three hundred rupees a month to my book schemes"

చాలాకాలం బ్రౌన్ అప్పులతో బ్రతికాడు. ఒక ఆంగ్లవ్యాపారి వద్ద అప్పులు తీసుకొని ప్రతినెలా కంతులు చెల్లించేవాడు. తెలుగు సముద్ధరణ కోసం 60 వేల దాకా అప్పులు చేసి చివరికి అన్ని అప్పులను తీర్చినట్లు తన స్వీయ చరిత్రలో వెల్లడించాడు. బ్రౌన్ ఎన్నో త్యాగరాజ కృతులను, సారంగపాణి పదాలను సేకరించాడు ఇంత చేసిన బ్రౌన్‌కు మనమేం చేసాం?

బ్రౌన్ చేసిన సేవలను తెలుగువారు మరువలేరు. ఆ భాషా జీవి నివసించి సాహిత్య యజ్ఞం జరిపిన స్థలంలో, ఆయన స్మృతి చిహ్నంగా కడపలో గ్రంథాలయ భవనం నిర్మింపబడింది. 1976లో డా.జి. ఎన్.రెడ్డి, బంగోరెలు, నాటి కలెక్టర్ డా.పి.యల్.సంజీవరెడ్డి గారికి, ఈ విషయంగా విన్నవించారు. కడపజిల్లా రచయితల సంఘ కార్యదర్శిగా వుండిన జానమద్ది హనుమచ్ఛాస్త్రి గారిని ఈ భవన నిర్మాణానికి పురమాయించారు. భవన శిథిలాలున్న స్థల యజమాని కీ.శే. సి.ఆర్. కృష్ణస్వామి గారి నుండి బ్రౌన్ బంగళా శిథిలాలున్న స్థలం (20 సెంట్లను) దానంగా అందుకున్నారు. శ్రీకృష్ణస్వామి కుమారుడు శ్రీ సి.కె. సంపత్ కుమార్ అధ్యక్షుడుగా శ్రీజానమద్ది హనుమచ్ఛాస్త్రి కార్యదర్శిగా 1986లో సి.పి.బ్రౌన్ మెమోరియల్ ట్రస్టు ఏర్పడింది. జిల్లా కలెక్టరు ప్రధాన పోషకులుగా వుంటున్నారు.

కడప జిల్లా కలెక్టర్ శ్రీ జంధ్యాల హరినారాయణ గారు గ్రంథాలయ భవనానికి 22-1-1987న శంకుస్థాపన చేయగా డా.పుట్టపర్తి నాటి సభకు అధ్యక్షత వహించారు. హరినారాయణగారు భవన నిర్మాణానికి తొలి విడతగా రూ. $3\frac{1}{2}$ లక్షలు ఇచ్చారు. తర్వాత కలెక్టర్లు శ్రీమతి చందనాఖన్, శ్రీ ఏ.కె. పరిడ, డా. పి. సుబ్రమణ్యం ఆర్థిక సహాయమందించారు. జిల్లాలోని వదాన్యులు దాదాపు 2 లక్షలు దాకా విరాళాలిచ్చారు. కడప ప్రొద్దుటూరు పట్టణాలలోని ఉన్నత పాఠశాలల విద్యాసంచాలకులు రామస్వామి రెడ్డిగారు. జిల్లా విద్యాశాఖాధికారి, డా. ఆర్. సత్యనారాయణగారు ప్రాంతీయ పాఠశాల విద్యాసంయుక్త సంచాలకులు, యం. రామస్వామిరెడ్డిగార్లు స్మరణీయులు. శ్రీపసుపులేటి బ్రహ్మయ్య పరికరాలు, పుస్తకాల కోసం 35 వేల రూపాయలు విరాళంగా ఇచ్చారు.

కలకత్తాలోని రాజారామ మోహన్‌రాయ్ లైబ్రరి ఫౌండేషన్ నుండి 30 వేల ఆర్థిక సహాయం లభించింది.

గ్రంథ సేకరణ:

కడప సమీపంలోని వల్లూరు గ్రామంలో శ్రీ పోలేపల్లి వెంగన్న శ్రేష్ఠిగారు 1923లో స్థాపించి నిర్వహించు చుండిన శ్రీ సీతారామ చంద్ర గ్రంథ భాండారంలోని అమూల్యమైన 3500 గ్రంథాలను, బ్రౌన్ గ్రంథాలయానికి విరాళంగా ఇచ్చారు. తిరుమల తిరుపతి దేవస్థానం, తెలుగు అకాడమి, తెలుగు విశ్వవిద్యాలయం. మనస్వినీ ట్రస్టు (మద్రాసు) శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం వంటి సంస్థలు, శ్రీ ఆమంచర్ల నరసింహారావు, డా. చల్లా రాధాకృష్ణ శర్మ, డా. సర్దేశాయి తిరుమలరావు, డా. బెజవాడ గోపాలరెడ్డి, డా. పుట్టపర్తి నారాయణాచార్యులు, డా. కొంగర జగ్గయ్య, మున్నగువారు అమూల్య గ్రంథాలను విరాళంగా పంపారు.

ఆంధ్రప్రదేశ్‌లో విద్యాశాఖ కార్యదర్శిగ పనిచేసి 1968లో పదవీ విరమణ చేసిన శ్రీ జె.పి.యల్.గ్విన్ లండన్ నుండి తాము ప్రచురించిన తెలుగు ఇంగ్లీష్ నిఘంటువు (1994, ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటి ప్రెస్) 1852 నాటి బ్రౌన్ నిఘంటువులను విరాళంగా పంపారు.

ప్రస్తుతం బ్రౌన్ గ్రంథాలయంలో 16,500 పైగా తెలుగు, ఇంగ్లీష్, హిందీ సంస్కృత, కన్నడ ఉర్దూ గ్రంథాలు అమూల్యమైన ఆంధ్రపత్రిక ఉగాది సంచికలు వున్నాయి. ఆంధ్రసాహిత్య పరిషత్ పాత సంచికలున్నాయి.

మద్రాసులోని ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తక భాండారంలోని సి.పి.బ్రౌన్ సేకరించిన గ్రంథాలు, మెకంజీ కైఫియత్తులు, లేఖలు వగైరా సంపుటాలు 60 ప్రతి రూపాలను ఒక్కొక్కటి 2 ప్రతులుగా పంపిన సాహిత్యాభిమానులు శ్రీ జె.టి. ఆచార్యులు, ఐ.ఎ.ఎస్. (తమిళనాడు పంచాయితీ రాజ్‌శాఖ ప్రిన్సిపల్ సెక్రటరి) గారు ఈపనికై దాదాపు 25 వేలు విరాళ రూపంగా అందించారు. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం తెలుగు విభాగంలోని బ్రౌన్ రచనల 20 సంపుటాల ప్రతిరూపాలు సేకరించి వుంచబడినవి.

1993లో గ్రంథాలయ నిర్వహణకు ఆర్థిక వనరుల లోటు ఏర్పడగా కలెక్టర్ శ్రీ కె.వి. రమణాచారిగారు తమ ఆధీనంలోని అక్షర రశ్మి నిధుల వడ్డీపైకం నుండి ప్రతినెలా రూ.4250లు విరాళంగా లభింప చేశారు సిబ్బంది వేతనాలు ఈ పైకంతో చెల్లింపబడుతున్నాయి. శ్రీ రమణాచారి గారి పూనిక వల్ల ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నుండి భవన విస్తృతి నిర్వహణలకు రూ 5 లక్షల ప్రత్యేక ఆర్థిక సహాయం లభించింది

రాష్ట్రంలోని ఏ గ్రంధాలయానికి లేని భవన ముఖద్వార నిర్మాణం కావించారు శ్రీ ఎస్. నరసింహారెడ్డిగారు. గ్రంథాలయ భవనం (3600 చ అ) లో సమావేశ మందిరం. ఆరుగదులు, పరిశోధకులు తాత్కాలికంగా వుండేందుకు గది. ఇతర వసతులున్నాయి ప్రస్తుత భవనం పై మరో అంతస్తు నిర్మాణానికి జాయింట్ కలెక్టర్ శ్రీ ఎ. గిరిధర్ రూ. 2.50 లక్షలు అందించారు

గ్రంధాలయంలో ప్రతి గురువారం గణపతి సచ్చిదానంద సభవారి సత్సంగ సమావేశాలు, ప్రతినెల వివేచన స్టడీసర్కిల్ వారి సాహిత్య గోష్ఠులు జరుగుతుంటాయి. ఈ గ్రంధాలయ భవనాన్ని, ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీనారాచంద్రబాబునాయుడు గారు 29-11-1995న తెలుగు ప్రజలకు అంకితం చేశారు.

బ్రౌన్ గ్రంథాలయాన్ని సాహిత్య పరిశోధనా కేంద్రంగా రూపొందించాలని బ్రౌన్ ట్రస్ట్ ఆశయం.

బ్రౌన్ గ్రంథాలయాన్ని సాహిత్య పరిశోధనా కేంద్రంగా రూపొందించాలని బ్రౌన్ ట్రస్ట్ ఆశయం. తెలుగు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు ఆచార్య నాయని కృష్ణకుమారి గారు 28.7.1996న గ్రంథాలయాన్ని దర్శించారు. బ్రౌన్ గ్రంథాలయాన్ని, తెలుగు విశ్వవిద్యాలయ అనుబంధ సంస్థగా గుర్తిస్తూ, ఉత్తర్వులు పంపారు తెలుగు వారందరూ తప్పక చూడవలసిన గ్రంథాలయమిది.

## ఉపయుక్త గ్రంథాలు:

1. సి.పి.బ్రౌన్ చరిత్ర - డా. కొత్తపల్లి వీరభద్రరావు.
2. Literary Autobiography of C P Brown (Sri Venkateswara University Publication)
3. బ్రౌన్ తెలుగు కావ్య సముద్ధరణము· డా. ఆర్. పద్మావతి.
4. సమగ్ర ఆంధ్ర సాహిత్యము కుంఫిణీయుగము డా. ఆరుద్ర.
5. బ్రౌన్ జాబుల్లో స్థానిక చరిత్ర శకలాలు కడప జాబుల సంకలనం - పర్యవేక్షణ జి యన్.రెడ్డి పరిశోధన: బంగోరె.
6. వ్యాసనవమి: డా.ఎన్. గోపి
7. సి.పి. బ్రౌన్ చరిత్ర: తెలుగు అకాడమి ప్రచురణ.
రచన: జానమద్ది హనుమచ్ఛాస్త్రి.
8. కడపజిల్లా రచయితల 8వ మహాసభల సంచిక.

● *(మిసిమి, మార్చి 1997)* ●

★ ★ ★

ఆంధ్రుల చరిత్రను సముద్ధరించిన మహనీయుడు

# కల్నల్ కాలిన్ మెకంజీ

# (1754 - 1821)

'మెకంజి కైఫియత్తులు'గా పిలువబడు అమూల్యమూ, అపారమూ అయిన ఆంధ్రదేశ చారిత్రక సామగ్రిని సమకూర్చిన తెల్లదొర కల్నల్ కాలిన్స్ మెకంజీ. ఆయన వలె స్వయంకృషితో చారిత్రక పత్రాలను, పరికరాలను సేకరించిన మరొక వ్యక్తి ప్రపంచ చరిత్రలోనే కానరాడని పరిశోధకుల అభిప్రాయం

కల్నల్ కాలిన్ మెకంజీ స్కాట్లాండుకు పడమరగా ఉన్న స్టార్నోవే అనే గ్రామంలో 1754లో జన్మించాడు మర్డాక్ మెకంజీ, బార్బరా మెకంజీలు అతని తండ్రి, తల్లి. మర్డాక్ మెకంజీ చేపల పరిశ్రమ ద్వారా జీవిక గడిపేవారు ఆ గ్రామ పోస్ట్ మాస్టర్‌గా కూడా పనిచేశాడు మెకంజీ బాల్యం నుంచి గణిత శాస్త్రం పట్ల అభిరుచి కలవాడు మెర్టిస్టన్ వాసియైన లార్డ్ నేపియర్, తన పూర్వికుడైన జాన్ నేపియర్ జీవిత చరిత్ర వ్రాయుటకు, సహాయకుడుగా మెకంజీని ఎన్నుకొన్నాడు. జాన్ నేపియర్ గొప్ప గణిత శాస్త్రవేత్త సంవర్గ మానాలను కనిపెట్టిన వాడాయన. హిందూగణిత శాస్త్ర విషయాలను, సంవర్గమానముల (లాగరిథమ్స్) గురించిన కొన్ని విశేషాలను సేకరించి జాన్‌నేపియర్‌కు అందజేసినవాడు మెకంజీ ఈస్టిండియా కంపెనీ ఉద్యోగిగా ఇంజనీరింగ్ శాఖలో నియమితుడైన మెకంజీ 1782లో మదరాసుకు వచ్చాడు. నేపియర్ అల్లుడు శామ్యుయల్ జాన్‌స్టన్ అప్పట్లో మధురలో ఉద్యోగం చేస్తుండేవాడు. అతని ఆహ్వానం పై మధురకు వెళ్ళాడు. అక్కడి పండితులను కలుసుకున్నాడు. భారతీయ వాఙ్మయం, ప్రాచీన చరిత్రకు సంబంధించిన విశేషాలను వారి ద్వారా తెలుసుకున్నాడు. ఇంజనీరింగ్ శాఖలో ఉద్యోగిగా ఉండిన మెకంజీ సైన్యంలో పనిచేసేవాడు. 1784-90 మధ్య మదరాసుకు ఉత్తరంగా ఉన్న కృష్ణానదీ ప్రాంతంలో జరిగిన యుద్ధంలో పాల్గొన్నాడు. అప్పుడే నెల్లూరు నుంచి తూర్పు కనుమల ద్వారా, రాయలసీమ, ఒంగోలు ప్రాంతాల కుంపిణీ సైన్యం గుంటూరు, సర్కారు ప్రాంతాలను వశపరచుకుంది. ఆ సైన్యంలో మెకంజీ ఉండేవాడు. సైనికుడుగా మెకంజీ సేవలకు ప్రతిఫలంగా అతనిని సర్వేయర్‌గా నియమించి, గుంటూరు సీమ సర్వే చేయమన్నారు కానీ ఆ ఉద్యోగం చేపట్టక ముందే ఆంగ్లేయులు టిప్పుసుల్తాన్ పై సాగించిన యుద్ధంలో సైన్యపు ఇంజనీర్‌గా మెకంజీ పాల్గొన్నాడు. కారన్‌వాలీసు ప్రభువు ఆదేశంపై మెకంజీ రాయలసీమ (ఆనాడు దత్త మండలం) గుంటూరు, సర్కారు ప్రాంతాల సర్వేయర్‌గా గణనీయమైన కృషి చేశాడు. ఆ ప్రాంతాల నైసర్గిక పటాలను తయారు చేశాడు. సర్వేయర్‌గా, గ్రామాల్లో పర్యటిస్తూ అక్కడి చారిత్రక

ప్రదేశాలను, దేవాలయాలను, శాసనాలను, శిల్పకళా ఖండాలను గురించిన విశేషాలను, అధ్యయనం చేశాడు. ఏలూరు వాస్తవ్యుడైన కావలి వెంకట బొర్రయ్య అను బ్రాహ్మణ పండితునితో మెకంజీకి పరిచయం ఏర్పడింది. బొర్రయ్య తెలుగు, కన్నడ భాషల్లో పండితుడు. చారిత్రక పరిశోధకుడు. తాళపత్ర గ్రంథ సేకరణ, ప్రాచీన నాణెముల సేకరణ శాసన పరిశోధన వంటి పనుల్లో బొర్రయ్యను తనకు సహాయకుడిగా నియమించుకున్నాడు. చారిత్రక సామగ్రి సేకరణలో అపారంగా కృషి చేస్తున్న బొర్రయ్య చిన్న వయసులోనే మరణించాడు బొర్రయ్య తమ్ముడు కావలి వెంకట లక్ష్మయ్య అన్నగారి అడుగుజాడల్లో మెకంజీకి సహాయకుడుగా పనిచేయసాగాడు. మెకంజీ 1810లో మదరాసు ప్రాంత సర్వేయర్ జనరల్‌గా నియమితుడై ఆ తర్వాత అయిదేళ్ళకు భారతదేశపు మొట్టమొదటి సర్వేయర్ జనరల్‌గా ఉన్నప్పుడు కావలి వెంకట లక్ష్మయ్య మెకంజీ వద్ద ప్రధాన అనువాదకుడుగా పనిచేశాడు. మెకంజీ 1793 నుంచి 1816 వరకు దక్షిణ భారతదేశంలో పనిచేశాడు. ఆ కాలములోనే చరిత్రకుపయుక్తములైన సంస్కృత, తమిళ, తెలుగు, కన్నడ, మలయాళ, ఒరియా, మరాఠి, హిందీ, అరబిక్, పార్సీ, జపానీస్, బర్మా భాషల్లో వ్రాసిన 1568 గ్రంథాలను సేకరించాడు. అంతేకాదు, 2070 స్థానిక చరిత్రలు, వృత్తాంతాలు, 8076 శాసన పాఠాలు, 79 దేశపటాలు, 2630 బొమ్మలు (డ్రాయింగ్స్), 6218 నాణెములు, 106 శిల్ప చిత్రాలు, 40 పురాతన వస్తువులు సేకరించాడు గవర్నర్ జనరల్‌గా పనిచేసిన మార్క్విస్ ఆఫ్ హేస్టింగ్స్ వాటిని పదివేల పౌనులకు కొని, వీటిలో సంస్కృత, అరబిక్, పారసీక, జపాన్, బర్మా భాషలలోని తాళపత్ర గ్రంథాలను, శిల్పాలను, నాణెములను ఇంగ్లండుకు పంపాడు. దక్షిణ భారత భాషలలోని తాళపత్ర గ్రంథాలు, స్థానిక చరిత్రలు, శాసన పాఠాలు మొత్తం 5,31,255 చారిత్రక విశేషాలు 8 వేలకు పైగా శాసన పాఠాలు మదరాసుకు పంపాడు. వీటిలో అత్యధిక భాగం మద్రాసులోని ప్రాచ్య లిఖిత గ్రంథ భాండారంలో భద్రపరచబడినాయి. కానీ అందరిలో ముఖ్యులు కావలి సోదరులు. మెకంజీకి కుడిభుజం అనిపించుకొన్న వెంకట బొర్రయ్య, శాసనాలను చదివి, చారిత్రకాంశాలను గ్రంథస్థం చేశాడు జైనుల వృత్తాంతం, మొఘులుల కాలంలో కర్నాటకములోని రాజకీయ పరిణామాలు అను గ్రంథాలను బొర్రయ్య ఇంగ్లీషులో రచించాడు. బొర్రయ్య చిన్న తమ్ముడు రామస్వామయ్య, దక్షిణదేశ తెలుగు కవుల చరిత్ర వ్రాశాడు. తెలుగు కవుల చరిత్రను గ్రంథస్థంకావించిన వారిలో రామస్వామి మొదటివాడు.

కావలి సోదరులు చేసిన సేవలను ప్రశంసిస్తూ కంపెనీ అధికారులు లక్ష్మయ్యకు నెలకు 3 వందల రూపాయల పింఛన్ మంజూరు చేశారు. మెకంజీ తన ఆస్తిలో పదో వంతును కావలి సోదరులకు చెందునట్లు వీలునామాలో పేర్కొన్నారు. మెకంజీ కృషివల్లనే అమరావతిలో బౌద్ధ స్తూప విశేషాలు వెల్లడైనాయి. 1792 లో అమరావతిని దర్శించిన మెకంజీ దొర వెంకటాద్రి నాయుడుని అర్థించి అమరావతి స్తూప విశేషాలను, ఏషియాటిక్ సొసైటీ వారి 9 సంపుటాలలో ప్రకటించారు. హైందవ విజ్ఞాన మందిరమునకు కావలి బొర్రయ్య అను మహాద్వారము నాకు

లభించిందని ప్రస్తుతించాడు మెకంజీ (శ్రీ వీరేశలింగ యుగం కల్లూరు వేంకట నారాయణరావు పుట - 56)

మెకంజీ నిర్విరామ కృషివల్ల లభించిన సామగ్రి న్యూఢిల్లీలోని నేషనల్ ఆర్కైవ్స్‌కు తరలింపబడినాయి. అసూర్యం పశ్యగా, లండన్‌లో, మద్రాసులో మూలుగుతున్న మెకంజీ కైఫియత్తులను వెలికితీసి సొంత ఖర్చులతో శుద్ధప్రతులు తయారు చేయించిన తెల్ల దొర సి.పి. బ్రౌన్. లండన్‌లోని ఇండియా హౌస్ లైబ్రరీలోని చారిత్రక పత్రాలను మద్రాసుకు తరలింపచేసిన మహనీయుడు బ్రౌన్ దొరే. మెకంజీ సేకరించిన కైఫియత్తులను (స్థానిక చరిత్రలను) సి.పి.బ్రౌన్‌లోకల్ రికార్డులు అను పేర శుద్ధ ప్రతులు వ్రాయించాడు. ఈ కైఫియత్తులలో మన పూర్వ పాలకులు వేయించిన శిలా శాసనాలు, తామ్రశాసనాలు, సన్నదులు ఉన్నాయి. అప్పటి పాలకులు [illegible] దాన ధర్మాలు, గుళ్ళు, గోపురాల నిర్మాణాలు, జన జీవన విధానాలు, పంటలు, తోటలు, చెరువులు, ఆనకట్టలు, బావులు మున్నగు విశేషాలున్నాయి. ఆయా సంఘటనలు జరిగిన కాలమును, చాంద్రమాన సంవత్సరాలు, శాలివాహన శకము, క్రీస్తుశకము హిజరీలతోపాటు సూచింపబడినాయి. కొన్ని అంశాలు సంస్కృత, కన్నడ భాషల్లో, ఉర్దూ భాషలో ఉన్నాయి వాటి తెలుగు అనువాదాలు కూడా ఉన్నాయి. తెలుగువారి చరిత్రకు మూలాధారాలుగా అత్యంత ఉపయుక్తంగా ఉన్నాయి. తెలుగు ప్రజలపట్ల, భాష, ఆచారాలు, సంస్కృతి మున్నగు వాటిపట్ల, నాటి కొందరు తెల్లదొరలు సాగించిన కృషి మన చరిత్రకు ఆధారంగా ఉంది. మెకంజీ కైఫియత్తుల పరిశోధన నేటికీ కొనసాగుతూ ఉంది 1952, 58లలో మద్రాసు ఓరియంటల్ మేన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీలో క్యూరేటర్‌గా పనిచేసిన టి. చంద్రశేఖరన్ మెకంజీ రికార్డులలో తెలుగు విభాగానికి సంబంధించిన సూచికలు సిద్ధపరిచారు. ఈ కైఫియత్తుల కొన్ని ప్రతులు మైక్రోఫిల్మ్ రూపంలో హైదరాబాద్‌లో భద్రపరచబడినాయి.

ఇటీవల కడపలో స్థాపింపబడిన సి.పి.బ్రౌన్ గ్రంథాలయంలో మెకంజీ కైఫియత్తుల 60 సంపుటాలు తమిళనాడు ప్రభుత్వపంచాయితీరాజ్ శాఖ ప్రిన్సిపల్ కార్యదర్శి శ్రీ జె.టి. ఆచార్యుల వారి సహాయంతో సేకరింపబడినాయి. కల్నల్ కాలిన్ మెకంజీ శ్రీశైల క్షేత్రాన్ని దర్శించిన తొలి ఆంగ్లేయుడు. తెలుగుదేశ చరిత్రకు సంబంధించిన అమూల్యమైన సామగ్రిని అందజేసిన కల్నల్ మెకంజీ 1821లో కలకత్తాలో కన్నుమూశాడు. తెలుగువారు మరువరాని తెల్లదొరలు సర్ థామస్ మన్రో (1761 - 1827), ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్ (1798 - 1884), సర్ ఆర్థర్ కాటన్ (1803 - 1890). వీరు చిరస్మరణీయులు.

● *(వార్త 3-2-1996)* ●

* * *

కన్నడిగుల ఆస్తి

# మాస్తి వెంకటేశ అయ్యంగార్

"నేను కన్నడంలో రచనకుపక్రమించే నాటికి, మన వారిలో ఆంగ్లభాషా వ్యామోహం బలంగా వుండేది ప్రజలు నా మాటలను ఖాతరు చేయలేదని, నేను నిరాశ చెందలేదు. మహమ్మదీయులలో 'మోజన్' అను వ్యక్తి ఉంటాడు. "వేకువ ప్రార్థనకు సిద్ధంకండి." అంటూ ప్రజలను మేల్కొల్పటానికి గట్టిగా కేకలు వేస్తాడు. నేను కేకలు వేసినపుడు ఎక్కువమంది వినలేదు అని అతడు చెప్పటానికి వీలులేదు. ఇతరులు పడుకున్నపుడు కేకలు వేసి లేపటం అతని పని కన్నడదేశంలో నేను చేసింది ఆ మోజన్ పనిలాంటిది."

"జీవన" పత్రికను సాహిత్యాభిమానులు పెంచి ప్రోత్సహించాలి. ఈనాటికీ ఆ పత్రిక తన కాళ్ళపై ధైర్యంగా నిల్చునే శక్తిని సంపాదించలేదు మీరు నన్ను ప్రశ్నించవచ్చు మీకెలాగూ అయిదు వందల రూపాయల పింఛన్ (ఆ కాలంలో అదొక పెద్దమొత్తం) వస్తున్నదికదా? ఆ భారాన్ని మీరే మోస్తే సరిపోతుంది కదా? అనవచ్చు రథోత్సవం జరిగేటప్పుడు రథాన్ని ఒక ట్రాక్టర్‌కు కట్టి లాగిస్తే అది రథోత్సవం కాజాలదు. వేలాది చేతులు ఆ రథాన్ని లాగినపుడే రథోత్సవం.

పై అభిప్రాయాలు వెలిబుచ్చినవారు శ్రీ మాస్తి వెంకటేశ అయ్యంగార్. వారి కలంపేరు 'శ్రీనివాస.'

జ్ఞానం, అనుభవం, సాధన, మానవ సమాజ సముద్ధరణను గురించిన చింతన, వయస్సు - ఈ రీతిగా ఎలా చూచినా మహోన్నత వ్యక్తిత్వం మాస్తిగారిది.

మాస్తి వెంకటేశ అయ్యంగార్ కోలారు జిల్లా మాలూరు తాలూకాలోని, మాస్తి అనే గ్రామంలో 6-6-1891న జన్మించారు. ఒకప్పుడు బాగా బతికిన కుటుంబం. కాని ఆయన పుట్టినపుడు బీదరికం తాండవించిందా కుటుంబంలో అప్పటి పరిస్థితులను చెబుతూ 'నేను పుట్టిన కొంతకాలానికి, నా తండ్రి ఉద్యోగం కోల్పోయారు అన్నగారొకరు మరణించారు. మా కుటుంబం దిక్కుతోచని స్థితిలో పడింది'

"గొప్ప కుటుంబానికి చెంది, ఎందరికో అన్నం పెట్టి పోషించిన మా కుటుంబం చితికిపోయి, వారాలు చేసుకునే కాలం దాపురించినందుకు బాధపడ్డాను. కాని నేను కృంగిపోలేదు"

యలదూర్, శివారుపట్న గ్రామాల్లో పాఠశాల చదువు ముగించి మైసూరులో ఉన్నత పాఠశాల విద్యపూర్తి చేశారు. విద్యార్థి వేతనంతో బెంగుళూరులోని సెంట్రల్ కాలేజీలో చేరి పట్టభద్రులయ్యారు. ఆ కళాశాలలోనే కొంతకాలం ట్యూటర్‌గా

పనిచేసి - కొంత పైకం పోగుచేసుకుని మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో ఆంగ్ల సాహిత్యంలో ఎం.ఎ; పట్టం పుచ్చుకున్నారు డిస్టింక్షన్‌తో కృతార్థులై బంగారు పతకాన్ని అందుకున్నారు. అప్పటికే సంస్కృత, కన్నడ భాషలలో పాండిత్యం సంపాదించారు

మైసూరు సివిల్ సర్వీస్‌లో ప్రథమశ్రేణిలో కృతార్థులైన మాస్తి, ప్రొబేషనరీ అసిస్టెంట్ కమిషనర్‌గా ఉద్యోగంలో చేరారు త్వరలోనే ఎక్సైజ్ కమీషనరుగా పదవి నందుకుని ఉత్తమ పాలనాధికారిగా ప్రశంసలందుకున్నారు. మహారాజాగారి నుండి 'రాజసేవాప్రసక్త' బిరుదం అందుకున్నారు కాని ఉద్యోగ నిర్వహణలో పైవారు అనవసరంగా కల్పించుకొన్నందుకు మైసూరు సంస్థానంలో రావలసిన మంత్రి పదవి రానందుకు నిరసనగా, పదవీ విరమణ కాలానికి మూడేళ్ళు ముందుగానే 1944లో స్వచ్ఛందంగా పదవి నుంచి విరమించుకున్నారు

విద్యార్థిగా ఆయన అన్ని పరీక్షలలోను ప్రప్రథములు సాహిత్యరంగంలో కూడా వారి స్థానం అటు వంటిదే 1909 లో వారి మొదటి కథ 'రంగనమదువె' (రంగని పెళ్ళి) మొదలుగా వారు చనిపోయిన తర్వాత ప్రచురింపబడిన 'మాయణ్ణన కన్నడి' (మాయన్న అద్దం) వరకు వంద చిన్నకథలు, నవలలు, నాటకాలు, విమర్శనగ్రంధాలు, అనువాదాలు, తాత్విక రచనలు, సంపాదకీయాలు మున్నగునవి 123 రచనలు చేశారు

కన్నడములో చిన్నకథలకు అంకురార్పణ కావించినవారు మాస్తి ఆంగ్లంలోని 'కాంటర్‌బరి టేల్స్' వలె 'నవరాత్రి' అను 19 పద్యకథలు రచించారు

ఆయన తమ కథల్లో జీవితాన్ని చిత్రించారు కథలోని పాత్రలు మన మధ్యలో నున్నవారే కాలం, దేశం పాత్రలు, జనజీవితం విభిన్నంగా వుండవచ్చుకాని కథల లక్ష్యం మాత్రం మానవజీవితం యొక్క ప్రతినిధిత్వం అంటారాయన మానవ జీవితాన్ని సార్థకం చేయాలన్న అన్వేషణతో, మానవతను చిత్రించిన గొప్ప కథారచయిత మాస్తి వెంకటేశ అయ్యంగార్.

మాస్తిగారి కథలను గురించి డా॥ యు.ఆర్ అనంత మూర్తి (ప్రస్తుతం కేంద్ర సాహిత్య అకాడమీ అధ్యక్షులు) ఇలా అన్నారు 'యౌవన దశలో చేరనున్న యువతకు సిఫార్సు చేయదగిన రచయిత మాస్తిగారు. జీవితంలోని చీకటి వెలుగులు - గెలుపు - ఓటమి - మున్నగు వాటిని ఎటువంటి భావోద్రేకానికి లోబడక ఎదిరించటం ఆయన నేర్పుతారు. మన భావనా ప్రపంచం పరిపక్వం చేయగల శిక్షణ వారి కథలో లభిస్తుంది.'

కథలు రాయటంలో తమ ఉద్దేశాన్ని వెల్లడిస్తూ "జీవితం నాకు ప్రసాదించిన దర్శనమును వివరించే చిత్రాలను అందజేయటం. నేటి, నాటి మన దేశం, మన రాష్ట్రం, మరికొన్ని రాష్ట్రాల వైవిధ్యమయ చిత్రాలు నా కథలో కానవస్తాయి ఇవి వాస్తవానికి దర్పణాలుగా వున్నాయి. స్పష్టంగా వున్నాయి. కాస్త రసానుభూతిని ఇస్తున్నాయి. అన్న సత్యాలను పాఠకులు గ్రహించినపుడు నా ఉద్దేశం సఫలమైనదని నా నమ్మకం."

'శ్రీనివాస' (మాస్తి) గారి సాహిత్యం, జీవితంలోని వెలుగు నీడలకు, కష్టనిష్ఠూరాలకు అద్దం పట్టాయి. కాని ఆ చిత్రాలు మనలో అలజడిని సృష్టించవు. దిగ్భ్రాంతిని కల్గించవు 'అయ్యో' అనిపించినా, ఆ బాధ తీవ్రమైంది కాదు వారి సాహిత్య ప్రపంచాన్ని అవలోకించినపుడు, వర్డ్స్వర్త్ కవి కింది పంక్తులు స్ఫురణకు వస్తాయి.

"Calm pleasures there abide majestic pains"

మాస్తిగారు మానవుని అంతర్జీవితాన్ని చిత్రించారే కాని బహిరంగ జీవితాన్ని నిరూపించలేదు. వారి దృష్టిలో జీవితం 'యుద్ధరంగం' కాదు. వికాసరంగం ఒక ఆంగ్ల కవి అన్నట్లు 'The valley of soul making'. సమస్యలపట్ల వారికంతగా ఆసక్తి కానరాదు. సామాజిక పరివర్తనం పట్ల వారికి ఆసక్తి "కృష్ణమూర్తియహెండతి" (కృష్ణమూర్తి భార్య) బాల వితంతువు "బీదియల్లి హోగువనారి" (వీధిలో వెళ్తున్న స్త్రీ) వేశ్య; 'తిరుపాణి'లో హరిజన కుటుంబంలో జన్మించిన భక్తుడు; వెంకట శామయ తాను ప్రేమించిన అమ్మాయిని పెళ్ళాడేందుకు 'కులం' అడ్డు పడినందుకు ఆత్మహత్య చేసుకున్న యువకుడు - మున్నగువారిని చిత్రించే కథలు సమాజానికి అద్దం పట్టాయి.

వారి నవలల్లో ప్రధానంగా పేర్కొనదగినవి 'చెన్నబసవ నాయక'(1950) చిక్కవీర రాజేంద్ర (1960) ఈ రెండూ చారిత్రక నవలలు మానవ యత్నానికి అతీతంగా మరోశక్తి వుందని వీటిలో ధ్వనిస్తుంది 'చెన్నబసవ నాయక' గాథ బిదనూరు సంస్థానానికి చెందినది. అదొక చిన్న సంస్థానం. ఉత్తరాధికారిగా చెన్న బసవ నాయకుడు రాజ్యాధికారం స్వీకరించటానికి అవరోధాలు కల్పిస్తూ వీరమ్మాజి - నంబయ్యగార్లు పన్నిన కుట్రలను తెలుపుతుంది

'చెన్న బసవ నాయక' నవలకు కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం లభించింది. 'చిక్కవీరరాజేంద్ర' నవలకు జ్ఞానపీఠ అవార్డు లభించింది

'శేషమ్మ'మరో నవల. నౌకరుగా పనిచేస్తున్న ఒక వ్యక్తి చనిపోతాడు అతడు చేస్తున్న ఉద్యోగంలో తనను నియమించుకుని, తన కుటుంబాన్ని ఆదుకోమని పై అధికారికి వినతిపత్రం సమర్పిస్తుంది ఆ అధికారి తెల్లదొర మాంట్‌గోమెరి 'నీవు ఆడదానవు. ఆ ఉద్యోగం ఎలా చేయగలవు?' అని ప్రశ్నిస్తాడు 'ఏ పనైనా చేయగలను' అంటుంది. అయితే తన గుర్రంతోపాటు పరుగెత్తమంటాడు. ఆమె ఆ పోటీలో గెలిచి ఉద్యోగంలో చేరుతుంది నిజాయితీగా జీవించటానికి ఎటువంటి పోరాటమైనా సాగించే వ్యక్తులపట్ల ఎంతో అభిమానం కలవారు మాస్తి

తాళికోటె, శివఛత్రపతి, కాకనకోటె ఉషా, సావిత్రి, యశోధర మున్నగు నాటకాలు రాశారు. ఈ నాటకాలు గద్య, గేయ రూపంలో రచింప బడినాయి

వైష్ణవభక్తుల కీర్తనలు, లక్ష్మీశన కావ్య (జైమిని భారత) తమిళ వైష్ణవ ప్రబంధాలు-గీతాంజలి మేఘసందేశం - కావ్యానువాదాలు - రచించారు ప్రాచ్య పాశ్చాత్య సాహిత్యాలను బాగా మథించారు. షేక్స్‌పియర్ రచించిన హ్యామ్లెట్ టెంపెస్ట్, కింగ్ లియర్, ట్వెల్త్‌నైట్ నాటకాలను కన్నడం చేశారు

'యశోధర' నాటకంలో స్త్రీ స్థానము స్పష్టంగా నిరూపించారు స్త్రీలకు దీక్ష ఇవ్వనని బుద్ధుడు ప్రకటించినపుడు 'ప్రపంచంలో సగాన్ని వదలి, తక్కిన సగానికి మాత్రం అన్వయించడం న్యాయమా?' అని ప్రశ్నిస్తుంది యశోధర కఠినమైన నియమాలను, ఆచారాలను నిర్వహించే శక్తి స్త్రీకి సహజంగా వుంది కాని అవకాశాలు లభించలేదు అంటుంది యశోధర చివరికి బుద్ధుడు ఆమెకు కూడా బౌద్ధదీక్ష ఇస్తాడు స్త్రీ పురుషులలో సమానదృష్టిని నిరూపించారు మాస్తి.

ఆధునిక కన్నడ కథాపితామహుడుగా మాస్తిగారిని అభిమానిస్తారు కన్నడిగులు. కథారచయిత, నిర్దిష్టమైన లక్ష్యంతో కథ రాస్తాడు అతడు వాడుకునే సామగ్రి కథలో బాగం కావాలి. అనుభవం పండిన చేయి వంట చేసేటప్పుడు అతడు వాడుకునే ప్రతి పదార్థమూ వండిన ఆహారంలో భాగమై రుచిని పంచి పెడుతుంది అలాగే కథా రచయిత తన నైపుణ్యాన్ని రచనలో నిరూపించాలి అంటారాయన.

సంగీత సాధన కోసం తల్లిదండ్రులను వదలి, మైసూరునుండి కలకత్తా వెళ్ళి భార్యాబిడ్డలను కోల్పోయిన సంగీత కళారాధకుడు 'సుబ్బణ్ణ. తన ఆరాధ్యదైవమైన సిద్ధార్థునిచే జగత్కల్యాణ సాధనకోసం తన సుఖాలన్నిటిని త్యాగం చేస్తుంది యశోధర ఇలా శ్రీనివాస గారి కథలలో చాలామంది జీవితంలోని చేదును చవిచూసిన పాత్రలు కనిపిస్తాయి.

అధికారంలో ఉన్నవారు స్వార్థచింతనతో అవినీతికి పాల్పడుతుంటారు వారిని గురించి మీరేమనుకుంటారు అన్న ప్రశ్నకు సమాధానంగా ఇలా అన్నారు.

ఎంతమంది వుంటారు అధికారపీఠాల్లో నూటికి ఇద్దరో ముగ్గురో వుంటారు. వారు మాత్రమే ఏమి చేయగలరు. ప్రజలు మేల్కొన్నపుడు రాజకీయ నాయకులు ఏమీ చేయలేరు. కొంతకాలంవారి ఆటలు సాగుతాయి దొంగ పెళ్ళాం ఏనాటికైనా ముండమోపే అన్నట్లు, రష్యా చక్రవర్తి జార్‌కే గతి పట్టింది జార్ చేసిన పాపం అతని పిల్లలను సైతం పొట్టనపెట్టుకుంది. ఒకసారి ప్రజలు తమ బాధలను చెప్పుకునేందుకు ప్రజలు జార్ చక్రవర్తి రాజమందిరానికి వెళ్తారు ఆ మూర్ఖుడు సైనికులను రప్పించి ప్రజలపై కాల్పులు జరిపించాడు. 1905సం॥లో జరిగిన సంఘటన అది సరిగా పన్నెండేళ్ళ తర్వాత విప్లవకారులు జార్ చక్రవర్తి ముగ్గురు కూతుళ్ళను నగరం మధ్య ప్రజల ఎదుట కాల్చిచంపారు తన పిల్లల హత్యకు పన్నెండేళ్ళముందే జార్ పథకం వేసి పెట్టాడు అతనికి అపుడు ఆ ఆలోచన వుండకపోవచ్చు కాని చివరకు జరిగింది అదే.

'ఏది న్యాయమైందో చెప్పేవారున్నారు నాకంటే గొప్పవారెందరో చెప్పారు. వ్యాసులవంటి వారెందరో చెప్పారు. 'I am the gramaphone speaking through which my elders speak" అంటారు మాస్తి

జ్ఞానపీఠ పుస్కారంద్వారా లభించిన పైకాన్ని 'ట్రస్టు'గా ఏర్పాటుచేసి, ఇతర రచయితలకు ఉపకరించే విధంగా ఏర్పాటుచేశారు "లేఖక సహాయనిధి"ని నెలకొల్పారు. అందువల్లనే ఆయనను 'మాస్తి కన్నడిగుల ఆస్తి' అంటారు.

మాస్తి వెంకటేశ అయ్యంగార్ సాహిత్యసృష్టి అపారమైనది వైవిధ్య పూర్ణమైనది అందరి మన్ననలందుకున్న వారాయన.

గవిపురం ఎక్స్‌టెన్షన్‌లోని వారి స్వంత ఇల్లు రచయితలకేకాదు అందరికీ ఆహ్వానం పలికేది.

మాస్తిగారు ఎల్లవేళలా ఏదో పనిలో నిమగ్నులై వుండేవారు తొంభైఏళ్ళు నిండినపుడు ఒక పత్రికావిలేకరి వారి వద్దకు వెళ్ళి 'ప్రస్తుతం మీరేం చేస్తున్నారు' అని ప్రశ్నించాడు. ఆ ప్రశ్నకు బదులు చెబుతూ "రచయిత" అన్నవాడు ఏదో రాస్తూవుండాలి. ఏమి రాసినా ఆలోచనాత్మకంగా వుండాలి ఆలోచనాశక్తిని పోగొట్టుకున్నపుడు రాయటం వీలుకాదు అపుడు నేను జీవించటం సాధ్యంకాదు అంటూ ప్రస్తుతం నేను వాల్మీకి రామాయణ అనువాదం చేస్తున్నానన్నారు చేతినిండా పని వున్నపుడు మనసుకెంతో హాయిగా వుంటుంది అన్నారు శ్రీ మాస్తి 6-6-1986న దివంగతులయ్యారు.

సాత్వికమైన సాంస్కృతిక విలువలను పంచిపెట్టి కన్నడ సాహిత్యానికి, భారతీయ సాహిత్యానికి వివిధ సేవలందించిన 'మాస్తి కన్నడ ప్రజల ఆస్తి' అన్నమాటలో అత్యుక్తి ఏమాత్రం లేదు ఆయన ధన్యజీవి.

● *(విశాలాంధ్ర 28-7-1994)* ●

★ ★ ★

# కన్నడ మహాకవి డా॥ కువెంపు

'కువెంపు'గా కన్నడిగుల ప్రేమాభిమానాలను అపారంగా చూరగొన్న కుప్పళ్ళి వెంకటప్ప పుట్టన్నగారు బహుముఖ ప్రతిభావంతులైన మహాకవి

విఖ్యాత సాహితీవేత్త డా॥ నాయక్‌గారు ఒకమారు, "మీ రచనలలో మీకు అత్యంత ప్రీతిపాత్రమైనదేది?" అని ప్రశ్నించారు. "నా రచనల ప్రధానధ్యేయం మానవజాతి 'తానొందెవలం' మానవజాతి అంతా ఒక్కటే, మనుజమత, విశ్వపథ, సర్వోదయ, సమన్వయ, సమదృష్టి ఇవేనా పంచమంత్రాలు మనిషి విశ్వమానవుడు కావాలి. ఎవరూ ఏ మతానికి బందీలు కారాదు ప్రతి వ్యక్తి తనను తాను తెలుసుకొని, తనకు నచ్చిన మతాన్ని అనుసరించాలి ప్రతి వ్యక్తీ స్వయందార్శనికుడు కావాలి. పుట్టిన బిడ్డను మనం కులం, మతం, భాష, దేశం, మార్గం మున్నగు భావాలతో బంధిస్తున్నాం. అన్ని శృంఖలాలనుండి, అతనిని విముక్తుని కావించి 'బుద్ధుడుగా' అంటే విశ్వమానవునిగా తీర్చి దిద్దాలి. మనం నేర్పే విద్య, సంస్కృతి, నాగరికత అతనిని విశ్వమానవునిగా తీర్చిదిద్దే సాధనాలు కావాలి. ప్రపంచ బాలలందరూ 'అనికేతనులు' కావాలి. అని చాటిచెప్పిన మహాకవి కువెంపు

కువెంపు, ప్రకృతి రామణీయకతకు పెన్నిధి అయిన సహ్యాద్రి సానువుల మధ్యకర్ణాటకలోని శివమొగ్గ (షిమోగా) సమీపంలోని కుప్పళ్ళి గ్రామంలో శ్రీయుతులు సీతమ్మ, వెంకటప్పగార్ల సంతానంగా 29-12-1904న జన్మించారు. వారిది రైతు కుటుంబం

ఆయన ప్రాథమిక విద్య స్వగ్రామంలోని వీధిబడిలో సాగింది. బడిలో నేర్చిన దానికంటె ప్రకృతి ఒడిలోనే ఆయన ఎక్కువగా నేర్చుకొన్నారు. మలెనాడు (ప్రాంతం) ప్రకృతి యొక్క సుందర రూపంతో పాటు రుద్రరూపాన్ని కూడా ఆయన తిలకించాడు. ప్రకృతి అతనికి పరమాత్మ. వైవిధ్యపూర్ణమైన అనుభవాన్ని ప్రసాదించింది ప్రకృతి ఆరాధనమే పరమేశ్వరుని ఆరాధన అన్నారాయన. స్వగ్రామం సమీపంలోని తీర్థహళ్ళిలోని ప్రాథమికోన్నత పాఠశాల విద్యార్థిగా కన్నడ సాహిత్య గ్రంథాలనెన్నిటినో ఆయన చదివారు. మైసూరులో ఉన్నత పాఠశాల విద్యార్థిగా ఆయన జ్ఞాన భండారాన్ని మరింత విస్తృతపరచుకొన్నారు. ఇంగ్లీషు సాహిత్యాన్ని తత్వశాస్త్రాన్ని బాగా అధ్యయనం చేశారు. శ్రీరామకృష్ణపరమహంస వివేకానందుల జీవితం సందేశాల ప్రభావాలకు లోనయ్యారు.

ఉన్నత పాఠశాల చివరి తరగతిలో వున్నప్పుడే (1922లో) ఆరు ఆంగ్ల కవితలను Beginners Muse అన్న శీర్షికతో వెలువరించారు. వాటిలో Ballads, sonnets, Descriptive poems వున్నాయి.

మైసూరు మహారాజా కళాశాలలో విద్యార్థిగా వున్నపుడు ప్రముఖ థియాసఫిస్ట్

మరియు విద్వాంసుడైన జేమ్స్ కజిన్స్ పుట్టప్పగారి కవితలను చదివి ఎదురుగా వున్న పుట్టప్పగారిని చూచారు. వారి దుస్తులవైపు చూపుతూ ఇది మాత్రం స్వదేశి, కవిత మాత్రం విదేశి. కన్నడములో ఏమైనా వ్రాసివుంటే చూపండి అన్నారు. అందుకు సమాధానంగా 'ఆధునిక భావాలను, మహత్తరమైన ఆలోచనలను అభివ్యక్తం చేయటానికి కన్నడం తగినదికాదు' అన్నారు. కజిన్స్‌గారు నవ్వుతూ కన్నడం అసమర్థమైన భాష అనటం సముచితంకాదు. భాషకు శక్తిని సాధించేవారం మనం. ఐదు శతాబ్దాల క్రితం ఇంగ్లీష్ భాష ఎలా వుండేది? ఇంగ్లీష్‌లో వ్రాయటానికి ఆంగ్లేయులున్నారు. మీరు ఇంగ్లీషులో ఎంత గొప్పగా వ్రాసినా ఆంగ్లేయుల దృష్టిలో అది అధమంగా వుంటుంది మాతృభాషలో భావాలను వ్యక్తపరచినంత శక్తివంతంగా ఆంగ్లంలో సాధ్యంకాదు. మీ ఇంగ్లీష్ కవితలు బాగున్నాయి కాని మీరు కన్నడంలో వ్రాస్తే మీకు మంచి భవిష్యత్తు వుంటుంది. మీరు వ్రాసిన మంచి కన్నడ, కవితలను ఆంగ్లంలోనికి అనువదించేవారుంటారు. రవీంద్రుల బెంగాలీ కవితలు విశ్వవిఖ్యాతి నార్జించిన విషయం మీకు తెలుసు కదా. కజిన్స్‌గారి మాటలు మొదట అంతగా కువెంపుగారికి రుచించలేదు. పుట్టప్ప గారి ఆలోచనల్లో మార్పు వచ్చింది కన్నడ కవితా రచనకు పూనుకున్నారు. ఆ కవితలను చదివి ఎంతగానో పులకరించారు కవి పుట్టప్పగారు.

మైసూరులో విద్యార్థిగా వున్నపుడు ఆరోగ్యం దెబ్బతినింది. శ్రీరామకృష్ణాశ్రమాధిపతి సిద్ధేశ్వరానందుల ఒత్తిడిపై ఆశ్రమంలో చేరారు. అక్కడే వుండి కళాశాల చదువు పూర్తి చేశారు. తర్వాత ఆధ్యాత్మిక భావాలతో పాటు, సాహిత్య సృష్టి నానాటికి విస్తృతమైంది.

1929లో మైసూరులోని యువరాజు కాలేజ్‌లో కన్నడ అధ్యాపకులుగా చేరి క్రమంగా ప్రొఫెసర్, ప్రిన్సిపాల్ పదవులను అలంకరించారు. చివరకు మైసూరు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులుగా వారు చేపట్టిన పథకాలు అత్యంత జయప్రదంగా సాగాయి. స్నాతకోత్తర బోధన, పరిశోధనాకేంద్రమైన 'మానస గంగోత్రి' కువెంపుగారి దూరదృష్టి ఫలితం.

వారి కథా కావ్యాలలో కొళలు, నవిలు, పాంచజన్య, కిందరిజోగి, చిత్రాంగదా, కళాసుందరి, కోగిలెమత్తు సోవియట్ రష్యా, కింకిణి, పక్షికాసి, షోడశి, అగ్నిహంస మొదలగు నవి కన్నడ పాఠకులనెంతగానో ఆకర్షించాయి.

"ఆనందమయ ఈ జగహృదయ, ఏతకెభయ, మాణొ, సూర్యోదయ చంద్రోదయ దేవరదయకాణో" (ఈ జగతి హృదయం ఆనందమయం, భయమెందుకు? సూర్యోదయ, చంద్రోదయములు దేవుని దయారూపాలు చూడు)

*"ఉదయ దొళేన్, హృదయ వకాణ్*
*అదే అమృత దహణ్ణో! శివకాణ*
*ద కవికురుడునో! శివకావ్యదకణ్ణో"*

'ఉదయంలో ఏముంది? హృదయంలో చూడు అదే అమృత ఫలం. శివుని (మంచిని) కానని కవి అంధుడు మంచిని (శివుని) కనునది కావ్యము.'

"నోడిదరెల్లియు చైతన్య, కల్లలి, మణ్ణలి హుల్లలి, హుడియలి, నీరి నహనియలి బెంకియ కిడియలి, నన్నలి - ఎల్లియ చైతన" (రాయి, మన్ను, గడ్డి, ధూళి, నీటి బిందువు, అగ్నికణం, నాలో ఎక్కడ చూచినా చైతన్యమే) కువెంపు గారి కవితలు ప్రకృతి పారమ్యమును చిత్రించాయి వారి దేశభక్తిగీతాలు అత్యంతజన ప్రియమైనవి.

'భారతాంబెయ కన్యె - కన్నడాంబెయె ధన్యె' భారతాంబయొక్క కన్యకావడం వల్లనే కన్నడాంబ ధన్యురాలైంది

'భారతాంబెయె జనిసినిన్నొళు ధన్యనాదెను దేవియె' భారతీయుడుగ జన్మించి ధన్యుడయ్యాను.

'కళాసుందరి' కవితలో కళల ప్రశస్తిని గురించి వ్రాశారు. 'అగ్నిహంస' భక్తిగీతాల గుచ్ఛము.

'కానూరు హెగ్గడితి' మలెగళల్లి మదుమగళు - వారి నవలల్లో ప్రసిద్ధమైనవి. నన్నదేవరు మత్తు ఇతర కధెగళు, సన్యాసిమత్తు ఇతర కథెగళు వారి కథా సంకలనాలు 'బెరళ్ గెకొరళ్, శ్మశానక్షేత్ర, శూద్రతపస్వి, రక్తాక్షి,' వారి ప్రముఖ నాటకాలు, కువెంపుగారు రచించిన శ్రీరామకృష్ణ పరమహంస, వివేకానంద జీవిత చరిత్ర పలు ముద్రణలందుకొన్న రచనలు బొమ్మన హళ్ళియ కిందరిజోగి, నన్నగోపాల, మరి విజ్ఞాని, హోళూరు మున్నగునవి బాలల కోసం రచింపబడినవి

డా. పుట్టప్పగారి ప్రతిభకు పరాకాష్ఠ వారి 'శ్రీరామాయణ దర్శనం' అను బృహత్కావ్యం వాల్మీకి రామాయణగాధను "బేరె కధెయెంబంతె, బేరెమైయాంతంతె మరుపుట్టువడెదంతె. విశ్వవాణి గెముడియమణిమాడి" (మరొక కధ అనునట్లు, మరో రూపం దార్చినట్లు, మరో పుట్టుక దాల్చినట్లు - విశ్వవాణి కబరినలంకరించిన మణియై వెలగినది.) కువెంపుగారు పదేళ్ళుకావించిన సారస్వత దీక్షాఫలమీ 'శ్రీరామాయణ దర్శనమ్' 23 వేల పంక్తుల ఈ కావ్యము అలౌకిక నిత్యసత్యముల సత్యకధనము 'జగద్భవ్యదైత్యకావ్య' అన్నారు. మహా ఛందస్సులో రచింపబడిన ఈ కావ్యము "ఆత్మకు శరీరమువలె, రాముని కథా పంజరమున రామ రూపపరాత్పరుని పురుషోత్తముని లీలాదర్శనము ఈ కావ్యముగ రూపొందిందని" కవి ప్రకటించారు

అనేక సత్కారాలందుకొన్న కావ్యమిది కువెంపుగారి సాహిత్య గురువు ఆచార్య టి.ఎస్. వెంకణ్ణయ్యగారు. (వీరి మాతృభాష తెలుగు).

"ఇదొముగిసితందిహెన్ ఈబృహద్
గానమం, నిమ్మసిరియడి గొప్పి
సల్కె, ఓ ప్రియగురువె."

(ఇదిగో పూర్తికావించాను ఈ బృహత్కావ్యమును, తమ్మ శ్రీచరణముల కర్పించుటకు, ఓ ప్రియగురూ.)

పుట్టప్పగారు పూర్వకవులను ప్రస్తుతిస్తూ రచించిన పంక్తులు వారి విశ్వవిశాల దృక్పథానికి నిదర్శనంగా వున్నాయి

"హోమరగే, వర్జిలగె, డాంటె మేణ్మిల్టనగె, నారణప్పంగె, మేణ్ పంపనిగె ఋషివ్యాస భాస భవభూతి, మేణ్ కాళిదాసాద్యరిగె నరహరి తులసిదాస మేణ్ కృత్తివాసాది, నన్నయ, ఫిర్దూసి కంబారవిందరిగె, హళబరిగె, హోసబరిగె, హిరియరిగె, కిరియరిగె కాలదేశదనుడియజాతియ విబేదమం, లెక్కిసదె జగతీకలాచార్య రెల్లర్గె. జ్యోతి ఇవ్వడెయల్లి భగవిద్విభూతియం దర్శిసుతె ముడిబాగా మణి దుకైజోడిసువెనాం"

(హోమర్: వర్జిల్, డాంటే, మిల్టన్, కన్నడ భారతకర్త నారణప్ప, పంపకవులకు వ్యాస, భవభూతి, భాసకవులకు, కాళిదాసాదులకు, నరహరి, తులసీదాసు, కృత్తివాసులకు, నన్నయ, ఫిరదౌసి, కంబ, అరవిందులకు, ప్రాచీనులకు, ఆధునికులకు, పిన్నలకు, పెద్దలకు, కాల, దేశ, భాషజాతులకు అతీతంగా జగదాచార్యులందరికీ, జ్ఞానజ్యోతి స్వరూపులందరికీ కైమోడ్చి నమస్సులందిస్తున్నాను.)

కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కార మందుకొన్న మొదటి కన్నడ కావ్యం 'శ్రీరామాయణ దర్శనమ్.' 1967వ సంవత్సర జ్ఞానపీఠ బహుమతి నందుకొన్న మహత్కావ్యమిది. కర్ణాటక ప్రభుత్వం 900 పుటల ఈ కావ్యాన్ని సామాన్యులకు కూడా లభింప చేయాలన్న లక్ష్యంతో కేవలం ఆరు రూపాయలకే, ఈ బృహత్కావ్యాన్ని అందజేయటం అభినందనీయం కన్నడ భాషకు ప్రప్రథమంగా జ్ఞానపీఠ ప్రశస్తిని అందజేసినవారు కువెంపు, కర్ణాటక ప్రభుత్వం ఏర్పాటు చేసిన పంప ప్రశస్తితోపాటు, కర్ణాటకమందలి అన్ని విశ్వవిద్యాలయాలనుండి గౌరవ డాక్టరేట్ పట్టములందుకున్న వారిలో మొదటివారు ఆయన పద్మభూషణ, పద్మవిభూషణ సత్కారాలందుకున్న వారిలో ప్రథములు. ఒక విశ్వవిద్యాలయానికి వైస్‌ఛాన్స్‌లర్‌గా నియమింపబడిన కన్నడ సాహితీ మూర్తులలో ప్రథములు కువెంపు గారు

"కన్నడభాషలో ఆధునిక వాల్మీకియైన కువెంపు నిస్సందేహంగా ఒక తపస్వి కాని 'శూద్ర తపస్వి'."

కన్నడము, కర్ణాటకము వారికత్యంత ప్రీతిపాత్రములు. సంకుచిత భావాలకు అతీతమైన కువెంపు "నూరు దేవరనెల్ల నూకాచెదూర" (నూరుగురు దేవతలను అవతలకి గెంటి వెయ్యి). ఈ దేవతలను తొలగిచటం సులభం, కాని దేవుడు లేని గుడివుండి లాభమేమి? ఆ శూన్యమును భర్తీచేయు మార్గమేది? ఎవరిని పూజించాలి? అన్న ప్రశ్నలకు "భారతాంబెయెదేవినమగింద పూజిసువబార" (మన దేశమే మన ఆలయం. మన శక్తి సేవలన్నీ విశ్వరూపిణి, విశ్వముఖి అయిన భారతాంబకు చెల్లాలి రండి ఆమెను పూజిద్దాం అన్నారు. కన్నడం పట్ల, కర్ణాటకం పట్ల అపారమైన భక్తి శ్రద్ధలుగల కువెంపు గారికి భారత భక్తి మొదటిది కన్నడ మాతను 'భారత జననియతనుజాతె' అని కీర్తించారాయన.)

కువెంపుగారి 'కన్నడభక్తి'. ఇతర భాషల ప్రేమాదరాలకు అడ్డురాలేదు. 'ఆంగ్ల వ్యామోహంలో పడి మాతృభాషలను విస్మరింపరాదన్నదే వారి ఆశయం.'

"సర్వరిగెసమబాళు, సర్వరిగెసమపాలు" అన్న ఉదాత్తమైన ఆశయం కలవారాయన.

"గుడి చర్చుమసజీదు గళబిట్టు హొరబన్ని
బడతనవ బుడమట్ట కీళబన్ని
మౌఢ్యతెయమారియను హొర
దూడలైతన్ని, విజ్ఞానదీవిగెయ
హిడియబన్ని, ఓబన్ని సోదరరెబేగబన్ని."

(గుడి, చర్చి, మసీదులను వదలి వెలకిరండి, బీదరికాన్ని కూకటి వేళ్ళతో పెకలించాలి రండి, మూఢాచార మహమ్మారిని తరిమివేయరండి. విజ్ఞాన జ్యోతిని వెలిగింప రండి రండి, సోదరులారా, త్వరగా రండి)

అంటూ ప్రజానీకాన్ని చైతన్యపథం వైపున నడిపించటానికి శంఖం పూరించిన మహాకవి డా॥ కువెంపు.

సత్కవిగా, విద్యావేత్తగా, మహామనీషిగా, వెలిగిన డా॥ కె.వి. పుట్టప్ప గారు 1994 నవంబర్ 10వ తేదీన దివంగతులయ్యారు

● *(విశాలాంధ్ర 30-3-1995)* ●

* * *

# పూర్వ-పశ్చిమ సాహిత్య వారధి

## డా॥ వి.కె. గోకాక్

కన్నడ - ఇంగ్లీష్ భాషల సవ్యసాచిగ, బహుముఖ సాహిత్య స్రష్టగ, విద్యావేత్తగ, ఖండాంతర కీర్తి ప్రతిష్ఠలందుకున్న కన్నడ సాహితీవేత్తలలో అగ్రగణ్యులుగ, జ్ఞానపీఠ పురస్కార గ్రహీతగా కన్నడ అక్షర బ్రహ్మగా సువిఖ్యాతులు డా॥ వి.కె. గోకాక్.

సాగర తీర జనజీవితాన్ని, సముద్ర సౌందర్యాన్ని తన్మయభావంతో చిత్రించిన కన్నడ కవులలో అగ్రగణ్యులు డా.వినాయక కృష్ణగోకాక్ 1936 - 37 ప్రాంతాల్లో ఉన్నతవిద్య కొరకు ఇంగ్లాండుకు నౌకాయానం చేశారు. మార్గమధ్యంలో చూచిన వివిధదేశాల చరిత్ర పట్ల గోకాక్ చూపిన ఆసక్తి వారి చారిత్రక ప్రజ్ఞకు సాక్ష్యంగా వుంది. ఏడెన్ నగర శిధిలాల మధ్యదేశప్రజలకు వెలుగుబాట చూపిన ప్రవక్త మహమద్ స్మరణ, ఆఫ్రికాను చూచినపుడు ఆ దేశ ప్రజలను దొరలు దౌర్జన్యంతో దోచుకున్న తీరును తలచుకుని భయపడకు ఆఫ్రికా, రావచ్చు నీ పున్నమ రేపటి దినాన" అన్న ఆశ్వాసనం క్రీట్‌ను చూచినపుడు, వామర్‌కవి స్మృతులు; కార్సికా ద్వీపాన్ని చూచినపుడు సేలియన్ వీరగాధల తలపులు, గోకాక్‌గారి కావ్యాభివ్యక్తిలో భాగంగా మారాయి. ఇంగ్లండు చేరిన తర్వాత సిపాయి పాలకుల పెత్తనంలో అస్వతంత్ర భారతప్రజగా తాను అనుభవించిన బాధలను 'సముద్ర గీతాలు' మరియు 'సముద్రపు ఆవలి వైపునుండి' అను కృతులలో వెల్లడించారు. "ఇందల్లనాళె" (నేడు కాక రేపు) అను రచనలో అమెరికాదేశాన్ని, ఆ దేశం ఆర్థికంగా సాధించిన పురోగతిని, సాంకేతిక ప్రగతిని మెచ్చుకున్నా, అమెరికా అనుసరించే వర్ణ వివక్షతను గమనించి తన మానసిక వేదనను అభివ్యక్తం చేశారు గోకాక్ మానవతా దృష్టి ఈ రచనల్లో స్పష్టమవుతుంది. గోకాక్ కావ్య వస్తువు పౌరాణిక - చారిత్రక - సాంస్కృతిక నేపథ్యంతో చేపట్టబడినట్లు స్పష్టమవుతుంది. గోకాక్ కావ్య ప్రతిభ సదా ప్రయోగశీలమైనదని విదితమవుతుంది.

'సముద్రగీతాలు' 1936-37 ప్రాంతాల్లో ముక్త ఛందో రూపంలో వెలువడినాయి. ఈ రచనారూపం పంద్రెండవ శతాబ్దం నాటి శివ శరణుల వచనములచే ప్రభావితములైనవి. వచన సాహిత్య ముక్త ఛందో రూపం, ఆధునిక యుగావసరాలకు అనుగుణమైన రూపుదాల్చుకున్నదని చెప్పవచ్చు. 'హొసగన్నడము' (ఆధునిక కన్నడ)లో ముక్త ఛందస్సును ప్రచలితం కావించిన వారిలో మొదటివారు డా॥ గోకాక్‌గారే నని డా॥ జి.యస్. శివరుద్రప్ప పేర్కొన్నారు

'సముద్ర గీతాలు, (1940)'కు ముందు ప్రచురింపబడిన 'పయణ' (పయనం) (1937), అంతకు ముందు వెలువరించిన మొట్టమొదటి కవితా సంకలనం 'కలోపాసక' మున్నగు రచనల్లో ఛందోలయ విన్యాసాలు, గిరి, నది, సరోవరాల సుందర దృశ్యాలు గోకాక్ చిత్తప్రవృత్తికి అద్దం పట్టాయి 'ద్యావాపృధివీ'లో వారు విమానయానం చేస్తూ చూచిన, నభోలోకదృశ్యాలు మనోహరంగా వర్ణింపబడినాయి. 'సముద్రగీతాలు' 'ద్యావాపృథివీ' కృతులు జలరాసుల మరియు నభోమండల అనుభవాలను పౌరాణిక శబ్ద చిత్రాల మూలకంగా అభివ్యక్తమైనాయి. సముద్రం కేవలం సాగర సమ్రాట్‌గా కనిపించదు. గోపురాలను నిర్మించి, గోపురాలను విధ్వంసనం కావించే రుద్రపురుషుడు నట సమ్రాట్‌గా కానవస్తాడు. సముద్ర తరంగాలు, అరుణుని అశ్వాల్లా, రాక్షసుల కోరపళ్ళ తళకుల్లా, తలపై పుష్యరాగం కలకాలసర్పంలా, దుర్గ వాహనమైన పంచాననంలా కనిపిస్తాయి. గోకాక్‌గారి కావ్యాలను పరిశీలించినపుడు, వారి మనసు మన పురాణాలు చరిత్రలను ఆపోసన పట్టినట్లు తెలుస్తుంది.

'ఊర్ణనాభావతార' అను కవితలో సాలెపురుగును కేంద్ర బిందువుగా తీసుకున్నారు. భీకరమైన సాలెపురుగు 'చెడు'కు ప్రతీకగా చిత్రింపబడింది. గోకాక్ భావగీతాలు సౌందర్యం భక్తి, మున్నగు అనుభూతులతో కూడినవి నిసర్గ వర్ణనగల కవితలలో, 'ఒందుసంజె'; మించు (మెరపు); నసుకు (వేకువ); బెళదింగళు (వెన్నెల), మనలనెంతగానో ఆకర్షిస్తాయి ఒక భావగీతం "ఇల్లెఇరు, అల్లిహోగి మల్లిగెయను తరువెను, నేహకొందు, నలుమెగొందు గురుతనిరిపి బరువెను, హోదమేలె సుత్తబేకు ఏళుకోటెద్వారపు, హాదియల్లి తీరదంధ దుఃఖ విహుదపారవు సాధిసుత్త జయిసువు దేబాళువుదర సారవు. ఇక్కడ వుండు, అక్కడికి వెళ్ళి మల్లెపూవులు" తెస్తాను, స్నేహం కోసం, ప్రేమకోసం గుర్తు వుంచివస్తాను. వెళ్ళిన తర్వాత సప్తద్వారాల కోటను చుట్టాలి. దారిలో అంతులేని దుఃఖం అపారం; సాధిస్తూ జయించుటే జీవితసారం గిళివిందు, (చిలుకలగుంపు) గుబ్బిమరి (పిచ్చుకపిల్ల) వంటి కవితలలో వారి భూతదయ కానవస్తుంది.

గోకాక్‌గారి 'సమరసవేజీవన' (సామరస్యమే జీవితం) (1300 పుటలు) దాంపత్య జీవితంలోని వైరస్య సామరస్యాలను చిత్రించే నవల, జననాయక, విమర్శక వైద్య, యుగాంతర, వారి నాటకాలలో ప్రధానమైనవి. 'నవ్యతె హాగూ కావ్యజీవన' 'సాహిత్య దల్లి ప్రగతి' వారి విమర్శనా గ్రంధాలు.

డా॥ గోకాక్ ఎనభై రెండేళ్ళ జీవితంలో అరువదేళ్ళు వాఙ్మయ తపస్విగా గడిపారు. ఇంగ్లీషులో ముప్పదికి పైగా రచనలు వెలువడినాయి. వాటిలో ఒకటి నవల (నరహరి - ప్రాఫెట్ ఆఫ్ న్యూ ఇండియా) మూడు కవితా సంకలనాలు. ఇన్ లైఫ్ టెంపుల్స్; ద సాంగ్ ఆఫ్ లైఫ్ అండ్ అదర్ పోయెమ్స్; పొయెటిక్ అప్రోచ్ టు లాంగ్వేజ్; బేంద్రె అండ్ హిజ్ పొయెట్రీ; కాశ్మీర్ అండ్ ద బ్లైండ్‌మాన్, ప్రధానమైనవి.

కన్నడములో అరువదికి పైగా రచనలు ప్రచురితమయినాయి. డా॥ వినాయక కృష్ణగోకాక్, కర్ణాటక రాష్ట్రం, ధారవాడ జిల్లాలోని సవణూర్‌లో 9-8-1909న

జన్మించారు. 1929లో ధార్వాడలోని కర్ణాటక కాలేజీలో ప్రథమశ్రేణిలో పట్టభద్రులయ్యారు. 1931లో ఎం.ఏ ప్రథమశ్రేణిలో కృతార్థులయ్యారు 1936-37లో ఇంగ్లండు వెళ్ళి ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయం నుండి ఎం.ఏ పట్టాపుచ్చుకున్నారు.

తమ ముప్పదవ ఏట సాంగ్లీలోని విలింగ్డన్ కాలేజీ ప్రిన్సిపాల్‌గా పనిచేశారు ప్రిన్సిపాల్‌గా కొత్త కాలేజీలను ప్రారంభించారు హైదరాబాద్‌లోని సెంట్రల్ ఇన్‌స్టిట్యూట్ ఫర్ ఇంగ్లీష్ అండ్ ఫారెన్ లాంగ్వేజెస్ సంస్థ డైరెక్టర్‌గా, 1971లో, సిమ్లాలోని, "ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ అడ్వాన్స్‌డ్ స్టడీస్" సంస్థ డైరక్టర్‌గా పనిచేశారు. 1966-69లో బెంగుళూరు విశ్వవిద్యాలయ వైస్ ఛాన్సలర్‌గా పని చేశారు.

సాహిత్య అకాడెమీ ఉపాధ్యక్ష, అధ్యక్ష పదవులను అత్యంత సమర్థవంతంగా నిర్వహించారు. సాహిత్య సంబంధమైన పర్యటనలలో భాగంగా జపాన్, అమెరికా, ఇంగ్లండ్, బెల్జియం, గ్రీస్ మున్నగు దేశాల్లో పర్యటించారు. 1958లో అమెరికాలోని విశ్వవిద్యాలయాల్లో పరీక్షా పద్ధతుల అధ్యయనం కోసం వెళ్ళిన విద్యావేత్తల బృందానికి నాయకత్వం వహించారు. భారతీయ జ్ఞానపీఠం ప్రారంభకాలం నుండి ఆ సంస్థ కార్యవర్గ సభ్యులుగా, పురస్కారాలను ఎంపిక చేసే సంఘం అధ్యక్షులుగ, కర్నాటక ప్రభుత్వం ఏర్పాటు చేసిన 'పంపప్రశస్తి' సమితి అధ్యక్షులుగా పనిచేశారు. 1970-84 మధ్యకాలంలో వారు భారతీయ సాహిత్య క్షేత్రంలో సాగించిన కృషి ఫలితంగా 1992లో భారత దేశమందలి ప్రతిష్ఠాత్మకమైన 'జ్ఞానపీఠ్' ప్రశస్తినందుకున్నారు. 'పద్మశ్రీ సత్కారం' స్వీకరించారు

"మహాకావ్యాల కాలం అంతరించింది" అన్నమాట అపుడపుడు వింటూ వుంటాం. అరవిందుల, "సావిత్రి"; విశ్వనాధవారి "రామాయణ కల్పవృక్షం"; డా.కె.వి. పుట్టప్ప (కువెంపు) గారి, "శ్రీ రామాయణ దర్శనం", గోకాక్‌గారి 'భారత సింధురశ్మి'పై మాటను వమ్ము చేసాయి. మహాకావ్యాల కాలం చెల్లిపోలేదు. సాహిత్య చరిత్రలో మార్పులు సహజం. యుగధర్మాన్ని అనుసరించి సాహిత్యం అవతరిస్తుంది.

డా॥ గోకాక్‌గారి మహాకావ్యం 'భారత సింధురశ్మి' ప్రాచీన భారతానికి సంబంధించిన ఇతివృత్తం. 35 వేల పంక్తుల ఈ బృహత్కావ్యం (మొదటి సంపుటం డెమ్మీ సైజ్ - 573 పుటలు, రెండవ సంపుటం డెమ్మీసైజులో 762 పుటలు - 1982 రెడు సంపుటాల వెల రూ.75/- ఇండియా బుక్ హౌస్ ప్రచురణ బెంగుళూరు - 9) గోకాక్ గారే ఈ కావ్యసారాంశాన్ని ఇంగ్లీషులో ప్రచురించారు. (భారత సింధురశ్మి, వినాయక వాఙ్మయ ట్రస్ట్, బెంగుళూరు, 1986, - 190 పుటలు వెల రూ 50/-)

'భారత సింధురశ్మి కావ్యరచనను 1971 - 72'లో ప్రారంభించారు. అప్పట్లోనే గోకాక్ గారు వైదిక సంస్కృతిని క్షుణ్ణంగా అధ్యయనం చేసారు. 1978లో కావ్యరచన పూర్తి చేశారు. భారతసింధురశ్మి విశ్వామిత్రుని కథ. విశ్వామిత్రుని జీవితం సాహసమయం, వైవిధ్య పూర్ణం. గోకాక్‌గారే "అతడు కవి, పాలకుడు, యోధ, ప్రేమి, సాధకుడు మహర్షి" ఈ గుణములన్నీ సమ్మిళితమైన విశ్వరథుడు 'విశ్వామిత్రుడయ్యాడు' అన్నారు. అది క్రీస్తు పూర్వం రెండు వేల ఏళ్ళనాటి భారతభూగోళం, చరిత్ర

మరియు నాటి సంఘం యొక్క దర్పణంగా వుంది. దాదాపు రెండు వందల పాత్రలు గల ఈ కావ్యం 'సంకీర్ణఛందస్సు'లో రచింపబడింది. ఆర్య ద్రావిడుల సమాగమ సంఘర్షణలు చిత్రింపబడినాయి ఈ కావ్యానికి భారతీయ విద్యాభవన్ వారి రాజాజీ పురస్కారం, కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం లభించాయి.

డా॥ వినాయక కృష్ణగోకాక్ ప్రాచ్య పాశ్చాత్యసాహిత్య సంస్కృతులను ఆకళింపుకున్న మహామనిషి. ఒకసారి వారు ప్రముఖ రచయిత డా॥ హెచ్.ఎం నాయక్ గారితో మాట్లాడుతూ "సాహిత్యక్షేత్రంలో స్థానమానాలు, పోట్లాడి మురాలు ఏర్పరచుకొని, సంపాదించ వీలు కాదు. అది స్వయంగా నిర్ధారణమవుతుంది కాలమే నిర్ణయిస్తుంది. సాహిత్య చరిత్రలో ఇందుకు ఎన్నో సాక్ష్యాలున్నాయి." అన్నారు.

"మనదేశం చాలా విచిత్రమైనది ఇక్కడ కళను కళాత్మక విలువలతో కొలవరు. సాహిత్యం ఆధారంగా సాహిత్య మహత్తును గుర్తించరు. గోకాక్ అరవిందుల భక్తులు, పుట్టపర్తి సాయిబాబా భక్తులు అన్న కారణాలతో వారి సాహిత్య విలువలను ఉదాసీనంగా చూచేవారున్నారు. ఎగతాళి చేసిన వారున్నారు. అతడు తినే వంకాయలకు - అతని కావ్యాలకు సంబంధాలను అంటగట్టేవారున్నారు! తమ ఇష్టాయిష్టాలననుసరించి రచనలను బేరీజువేసే వారున్నారు. అటువంటి కువిమర్శకుల రాతలతో బాధపడిన సాహితీమూర్తులలో గోకాక్‌గారొకరు." అన్నారు. డా॥ హెచ్.ఎం. నాయక్.

గోకాక్ తనను వైదిక యుగ ప్రతినిధినని చెబుతూ, తమ కావ్యాన్ని గురించి ఇలా అన్నారు. "భారత సింధురశ్మి" "ప్రాచీన సంస్కృతికి అంకితమైన కృతికాదు. వైదిక యుగపునరుజ్జీవన కాలాన్ని చిత్రిస్తూ సమకాలీన యుగమును కూడా చూపినతీరు ఈ కావ్యంలో కనిపిస్తుంది." విశ్వవిశాలమైన వర్ణన, పరిసరాలతో భీకరమైన పోరాటం, హృదయమాలిన్యాన్ని శుద్ధపరచే ప్రేమ, వ్యక్తిత్వానికి మకుటం పెట్టే అనుభవాలు - ఇవన్నీ ఈ కావ్యంలోని వస్తువులు, అష్టాదశవర్ణనలు ప్రాచీన పరంపరకు చెందిన కేవలం కవి సమయాలు కావు. సమగ్ర స్రష్టయొక్క రౌద్రము, అద్భుతమైన కావ్యంలో రావాలన్న ఆకాంక్ష, నవరసాలు (అభిప్రాయం మేరకు అవి పంద్రెండు) కృత్రిమ సంఖ్యామాలకాదు; మానవ సాధ్యమైన అన్ని జీవిత దృక్పధాల రసార్ద్ర అభివ్యక్తకాలు అవి. మహాకావ్య శరీరంలో ప్రాక్ పశ్చిమాలు అందంగా మిళితమయ్యాయి" అన్నారు డా॥ ఎచ్.ఎం. నాయక్. సార్వకాలికమైన విలువలు గల కావ్యం గోకాక్‌గారి 'భారత సింధురశ్మి'.

● (విశాలాంధ్ర) ●

★ ★ ★

# గ్రంథాలయ శాస్త్ర పితామహుడు రంగనాథన్

విద్యా, విజ్ఞాన కేంద్రాలైన గ్రంథాలయాలను ఒకప్పుడు మహారాజులు, సంపన్నులు నిర్వహించే వారు. కాలక్రమంలో ప్రజా ప్రభుత్వాలు ఏర్పడినాయి. ప్రజా సంస్థలు గ్రంథాలయాలను నిర్వహిస్తున్నాయి. విజ్ఞానం వివిధ భాషలలో, వివిధ శాస్త్రాలలో అపారంగా పెరిగింది. గ్రంథాలు విస్తృతంగా ప్రచురిస్తూ గ్రంథాలయాలను స్థాపిస్తున్నారు. ఈ గ్రంథాలయాలలో సమకూరిన విజ్ఞానాన్ని సమగ్రంగా, స్పష్టంగా, సత్వరంగా అందించడానికి శాస్త్రీయమైన విధానాలను రూపొందించడంలో అపూర్వంగా, అనన్యంగా కృషి చేసిన మహనీయుడు డాక్టర్ ఎస్ ఆర్ రంగనాథన్.

రంగనాథన్ 1892 ఆగస్ట్ 9న తమిళనాడులోని తంజావూరు జిల్లా షియాలిలో జన్మించారు. మద్రాసు విశ్వవిద్యాలయం నుంచి గణితశాస్త్రంలో ఎం.ఎ. పట్టా పుచ్చుకొన్నారు. ఆ విశ్వ విద్యాలయంలోనే మొదటి గ్రంథపాలకునిగా నియమితులయ్యారు. ఇరువదేళ్ళు ఆ పదవిలో వున్న రంగనాథన్ గ్రంథాలయోద్యమానికి కొత్త మలుపునిచ్చారు. విశ్వవిద్యాలయం గ్రంథాలయ శాస్త్రంలో ఉన్నత శిక్షణకై రంగనాథన్‌ను ఇంగ్లండు పంపింది. గ్రంథాలయ శాస్త్రంలో నిష్ణాతులైన డబ్ల్యు.సి. బ్రిక్ సేయర్ మున్నగు వారి వద్ద శిక్షణ పూర్తి చేసి స్వదేశం వచ్చారు. 1928లో రంగనాథన్ మద్రాసు లైబ్రరీ అసోసియేషన్ స్థాపించారు. 1929లో మొట్టమొదటి గ్రంథాలయ శాస్త్ర బోధనా సంస్థను ప్రారంభించారు గ్రంథాలయ శాసనం రూపొందించడానికి పూనుకొన్నారు. 1931లో బెంగాల్ రాష్ట్రం గ్రంథాలయ చట్టాన్ని అమలు పరచింది. 1933లో స్థాపించిన భారత గ్రంథాలయ సంఘానికి నియమ నిబంధనలను రూపొందించిన వారు రంగనాథన్.

గ్రంథాలయ రంగంలో ఆయన విశేష కృషి, భారత ప్రధాన న్యాయమూర్తి సర్ మారిస్ ష్రైర్ దృష్టిని ఆకర్షించింది. ఆయన ఢిల్లీ విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్‌గా కూడా వుండే వారు. రంగనాథన్‌ను ఢిల్లీ విశ్వవిద్యాలయ గ్రంథాలయ శాస్త్రాచార్యులుగా నియమించారు. పదవిని చేపట్టిన వెంటనే బి.ఎల్ ఎస్.సి., ఎం.ఎల్.ఎస్.సి. కోర్సులను, స్నాతకోత్తర విభాగాలను నెలకొల్పారు. 1947 నుంచి 1954 వరకు ఢిల్లీ యూనివర్సిటీ గ్రంథాలయ విభాగానికి అధిపతిగా అవిరళ కృషి చేశారు

1948 జూన్ నుంచి సెప్టెంబర్ వరకు రంగనాథన్ యూరోప్, అమెరికాలోని పెక్కు గ్రంథాలయాలలోను, విశ్వవిద్యాలయాలలోను గ్రంథాలయ విజ్ఞానాన్ని గురించి ఉపన్యసించారు. హేగ్ నగరంలో జరిగిన అంతర్జాతీయ గ్రంథాలయ మహాసభలో

పాల్గొన్నారు యునెస్కో సహకారంతో మన దేశంలో 1952లో ఇండియన్ నేషనల్ సైంటిఫిక్ డాక్యుమెంటేషన్ సెంటర్ స్థాపనకు తోడ్పడ్డారు.

రంగనాథన్ ప్రతిభా పాటవాలు ప్రపంచ వ్యాప్తమైనాయి ఎన్నో గ్రంథాలయ సంస్థలు, విశ్వవిద్యాలయాలు ఆయన మార్గదర్శకత్వాన్ని, సలహాలను కోరాయి.

1953-56, 1959-61 సంవత్సరాలలో ఆయనను అంతర్జాతీయ డాక్యుమెంటేషన్ సమాఖ్య ఉపాధ్యక్షునిగా ఎన్నుకొన్నారు. బ్రిటన్ లైబ్రరీ సంఘానికి గౌరవ ఉపాధ్యక్షునిగా కూడా ఎన్నుకొన్నారు.

1958లో అమెరికా, కెనడా, జపాన్‌లలోని విశ్వవిద్యాలయాల్లో విజిటింగ్ ప్రొఫెసర్‌గా ఉపన్యాసాలిచ్చారు. మన యూనివర్శిటీ గ్రాంట్స్ కమిషన్ ప్రథమాధ్యక్షుడుగా విశ్వవిద్యాలయాల, కళాశాలల గ్రంథాలయాల అభివృద్ధికి విశేషంగా కృషి చేశారు. ఇండియన్ స్టాండర్డ్స్ ఇనిస్టిట్యూట్ గ్రంథాలయ సమితి అధ్యక్షునిగా వర్గీకరణ, సూచీకరణ, గ్రంథాలయ భవన నిర్మాణ పద్ధతులు, ఉపకరణాలు మున్నగు వాటికి సంబంధించి శాస్త్రీయమైన ప్రమాణాలను రూపొందించారు.

గ్రంథాలయ శాస్త్ర పంచ సూత్రాలను నిర్ణయించారు. ఉపయోగం కోసం పుస్తకాలు; ప్రతి పుస్తకానికీ తన చదువరి; ప్రతి చదువరికీ తన పుస్తకం; చదువరి కాలం పొదుపు; గ్రంథాలయ పెరుగుదల అనే ఈ పంచ సూత్రాలను పటిష్టంగా అమలు చేయడంతో సమాచార సేవలు సులువుగా లభించాయి. గ్రంథాలయ శాస్త్రం పరిపూర్ణ సామాజిక శాస్త్రంగా వికసించింది.

భారతదేశ పరిస్థితులకు అనుగుణంగా గ్రంథాలయ సేవలందించడంలోను, సిబ్బంది నియామకంలోను ప్రామాణికమైన నియమ నిబంధనలను రూపొందించారు. గ్రంథాలయ శాస్త్రరంగంలో, రంగనాథన్ స్పృశించని అంశం లేదు. శాస్త్ర విజ్ఞానానికి సంబంధించిన 60 గ్రంథాలను 2 వేల వ్యాసాలను వ్రాశారు.

ఢిల్లీ విశ్వ విద్యాలయం 1948లో, అమెరికాలోని పిట్స్‌బర్గ్ విశ్వవిద్యాలయం 1964లో రంగనాథన్‌ను గౌరవ డిలిట్. పట్టాలతో సత్కరించాయి. గ్రంథాలయ వర్గీకరణ, సూచీకరణ కృషికి గుర్తింపుగా అమెరికన్ లైబ్రరీ అసోసియేషన్ 1970లో ప్రతిష్ఠాత్మకమైన 'మార్గరెట్ మాన్ ప్రశస్తి' నిచ్చి గౌరవించింది. భారత ప్రభుత్వం 1957లో పద్మశ్రీ అవార్డుతో సత్కరించింది. 1965 నుంచి జీవితాంతం వరకు జాతీయ ఆచార్య పదవిలో వున్నారు.

దేశానికంతటికీ వర్తించే జాతీయ గ్రంథాలయ చట్టం అమలు చేయించాలన్న రంగనాథన్ కోరిక ఫలించలేదు. గ్రంథాలయ శాస్త్ర జ్యోతిని మహోజ్జ్వలంగా వెలిగించిన రంగనాథన్ 1972 సెప్టెంబరు 27 న దివంగతులయ్యారు. మన దేశంలోనే కాక విదేశాలలో కూడా ఆ మహనీయుని శతజయంత్యుత్సవాలు జరుపుకొంటూ నివాళులర్పిస్తున్నారు.

*(ఆంధ్రజ్యోతి 23-8-1992)* ●

★ ★ ★

# గద్య రచనలో సిద్ధహస్తులు డా॥ పుట్టపర్తి

కవిత్వం, పాండిత్యం, వాగ్మిత్వం, సంగీతం మున్నగు కళావిశేషములన్నీ మూర్తీభవించిన సరస్వతీ పుత్రులు, డాక్టర్ పుట్టపర్తి నారాయణాచార్యులు.

పద్యం, గేయం, వ్యాసం, విమర్శ, నవల మున్నగు విభిన్న సాహిత్య ప్రక్రియలలో అసాధారణ ప్రజ్ఞా విశేషాలు గల మహామనీషి ఆయన.

ఆంధ్రదేశంలో రసభరితములైన పద్యములు వ్రాసేవారెందరో వున్నారు. హృద్యమైన గద్యం వ్రాయగలవారు కొందరు మాత్రమే.

'గద్య పద్యములు వాని విభిన్నత'అను వ్యాసంలో డాక్టర్ పుట్టపర్తి ఇలా అన్నారు; పద్యకవి భావాంబర విశ్రుత విహారి. భావసాక్షాత్కారంతో పరవశుడై కలం కదిలిస్తాడు. వచన రచయిత వాస్తవికతకు సన్నిహితంగా రచన సాగిస్తాడు కవికి ధ్వని, ఆవేశం ముఖ్యములైన, వచన రచయితకు ఔచిత్యం ముఖ్యం పద్య గద్యములు రెండూ భావనలో పూచు పూవులే. 'కవి కావేశము చాలభాగము దోడగును. ఆ వస్తువో లేక భావమో దాని సాక్షాత్కారముచే గలిగిన యానందమాతని కలమును నడుపును. ఆ యావేశమున నియమించిన ఛందమున నాతని కవిత వానకారున బీళ్ళ యందు జింక పిల్లలవలె నిశ్శంకముగ గ్రేళ్ళు దాటుచు పోవును. వచనమున మెదడు యొక్క భాగమే కొంచెమెక్కువగా నుండును. పద్యమొక పుష్పగుచ్ఛము వంటిది. తామరపువ్వు వంటిది.'

"పద్యమునందన్వయము క్లిష్టమైనచో క్షమింతురు కాని వచనమునందట్లుగాదు. స్పష్టముగా నన్వయము గుదింపవలెను. పద్యమునందు వలె రాగము, గుణములు మొదలగు బాహ్యోపరకణములు తోడుపడుట యందులేదు."

"కవిగతికొక సంప్రదాయమున్నది. వచన రచయిత కదిలేదు. కవికి భావన యెక్కువ. వచనకారునికి మేథ యెక్కువ. అతడు భావించును. ఇతడు గుణదోషములను వింగడించి తర తమ భావముల దేల్చును అతడు భావుకుడు. ఈతడు గొంతు వరకు విమర్శకుడు. కవికి తన్మయీభావము వెన్నతో బెట్టిన విద్య. గద్య రచయిత నావేశము జెరచును...వచనమునకౌచితి జీవగఱ్ఱ. గద్యమునకు స్పష్టత జీవధర్మము."

ఈ విధంగా విభిన్న కళలైన పద్యగద్యములను హృదయంగమంగా సృష్టించగల ఆచార్యుల వారు గద్య శైలికి పద్యపునడక నేర్పినవారు భావ వ్యక్తీకరణమున వారి అపూర్వ సంస్కారము వ్యుత్పత్తి గౌరవము ప్రత్యక్షమగుచుండును.

జానమద్ది హనుమచ్ఛాస్త్రి

డా. పుట్టపర్తి వారి విమర్శనా వ్యాసాలు సారస్వత జగత్తును చైతన్యవంతం చేసినాయి. ఆచార్యులవారి ప్రత్యేకతను ఈ విధంగా చెప్పవచ్చు.

పద్యమునందున్నట్లు గద్యమున భావరస స్ఫూర్తి కల్గించుట.

రేఖా మాత్రములైన శాబ్దిక వర్ణనల చేత సంపూర్ణ రూప చిత్రములను పాఠకుల మనోవీధిలో మెరయునట్లు చేయుట.

అపూర్వవర్ణనా గాంభీర్యం

మహోపన్యాస రచనా సంవిధానం వారి శైలీపరమైన వ్యవహారసరళిలో ఉదాత్తంగా వుంటుంది. ఆచార్యులవారి గద్యంలో రూప శబలత - భావశబలత మిళితమై వుంటుంది.

వాక్యాలు చిన్నవైనా భావబంధురంగా, సరసమైన హాస్యరసంతో జాతీయతను ప్రకటిస్తాయి.

సమకాలీన జీవితములోని లొసుగులను చిత్రిస్తూ, పుట్టపర్తి వారు విసరిన ఛలోక్తులు చూడండి.

"మన కాలమున కవులు తక్కువగా జదువుదురు యెక్కువగా వ్రాయుదురు. ఆ వ్రాసిన కవిత లెవ్వరును జదువరు ఇక వాని ప్రచారమునకై వారు బడు తికమకలు వర్ణనాతీతములు. కావ్యము వ్రాయని భావుకుని జీవితము వ్యర్థమై పోయెనని విలపించువారు నాడు తక్కువ. ఈనాడు మనమందుకు నేరుగా విరుద్ధము."

"రేషనింగు బియ్యమునకు ప్రాకులాడుటకే పొద్దులు చాలని మనకును, కళకును నేమి సంబంధము. నక్క యెక్కడ నాగలోకమెక్కడ? ఈ కడుపు గొడవలో గోష్ఠులెవరికి గాబట్టినవి? మన గృహిణులు గూడ మనకు దగినవారే తయారైనారు. వాకిండ్లముందు ముగ్గులు పెట్టుట వారికి మోటుతనము. పెండ్లినలుగులలో వక్కలాకుల ఖర్చేగాని యొక్క పాటైనను బాడుకొనరు. అట్లుపాడుట ఛాందసమనునొక రోగము కూడ మన నాగరికత దిగుమతి చేసిన సరుకు. వారికి హాయిగా దమలపాకు చిలుకలు గట్టుటకు రాదు. ప్రొద్దున లేచినది మొదలు - వారికి పదిగంటల కాఫీసునకు బోవుమగనీని కేమి వంట చేయవలెనన్న కూటి చింతయే. ఇక జీవితమున కళయేదీ? అందువలన కవికి దిక్కుతోచదు. వాడూరక వెర్రికి బెట్టుకొని మనలను జంపుచుండును." (తెనాలి రామకృష్ణుని తెనుగు కవిత - పుట:7)

ఆచార్యుల వారి నిశిత లోకపరిశీలనమునకు ఉదాహరణము "నేడు తాంబూలము వేసుకొనుట కిష్టపడని వారు నా స్నేహితులే చాల మందియున్నారు. అది వారి యభాగ్యము. స్త్రీలకు గూడ నీ రోగము సన్న సన్నగా వ్యాపించుచున్నది." "దేవదాసీలు సమాజమునకు గళంకమను వాదము ఈనాడు ప్రబలముగా వ్యాపించినది. ఈ ప్రచారముపై నాకు కళాదృష్టితోను, సామాజిక దృష్టితోను ఎక్కువ సానుభూతి లేదు."

ఆచార్యుల వారి వచన రచనలో రేఖా చిత్రములు మనోహరంగా వుంటాయి.

శ్రీనాథ మహాకవి చాల సుందరుడు. అతని ఫాలము విశాలమై యుండెను.

ముదురు పాలవంటి విబూది రేకలు దానియందము నభివీప్సు గావించినవి ఆనిడుద పెన్నెరి గుంపు! అది యొక్క విచ్చిన వర్షాకాల మయూర పింఛము అతని ముఖమునందే రాజసము నివసించినది. కర్ణకుండలముల కాంతి, యాచెక్కులకు నీరాజనమెత్తుటతో బాటు, బరవాదుల గనుల జీకటుల గూడ గ్రమ్మించినది. శ్రీనాధుని కపోలములు శిరీష కుసుమపేశలములే గాదు. ప్రాభాతిక పద్మవర్ణనలు గూడ. అతని విశాలమైన యెద, అదియొక రాజ్యలక్ష్మి సింహాసనము వాడున్నతస్కంధుడు సాలప్రాంశుడు అతని బాహువులు దీర్ఘములై నిజముగ మోకాళ్ళను దాకుచుండినవి. మరొక ఉదాహరణ శ్రీనాధుడు డిండిమునితో వాదముకు బయలుదేరిన తీరు:-

'భళ్ళున తెల్లవారెను...సూర్యోదయమునకు ముందే మహాకవి యనుష్ఠానముల దీర్చికొనెను. హస్తకంకణ ఝణత్కారంబు దోరంబుగా బద్మముఖులాడిగముసేయ బరమ శివున కభిషేకము గావించినాడు అంతకుముందెట్లెట్లో' యున్న యాతని మనస్సు శివాభిషేకముతో బ్రశాంతమయ్యెను. అప్పటి శ్రీనాధునకిరేడు జగత్తు లెత్తి వచ్చినను లెక్కలేదు. అతడు గిలుకుపావలు దొడిగించుకున్నాడు. కుంకుమ పూవు మేదించినది బొట్టు ముఖముపై కళకళలాడుచున్నది తెల్లటి విభూతి రేఖలు, నా కుంకుమపు బొట్టును శివపార్వతులిరువురాతని ఫాలముపై నిలిచి ఫక్కుమని జయోత్సాహమున నవ్వినటులున్నది. (వాదవిజయము-పు: 63)

"విద్వత్కవుల గుంపు నుండి శ్రీనాధుడు లేచినాడు ఆ లేచుట వికసించిన తామరలున్న సరస్సునుండి జక్రవాకము లేచుటైనది."

రాముడు అరణ్యమునకు వెళ్ళేముందు దశరధుని వద్దకు వచ్చినాడు. అప్పుడు దశరథుని చిత్రణము.

"పుత్రుని జూచిన వెంటనే దశరధుని కన్నులు కన్నీటి కడవలైనవి నోటిమాట రాలేదు. అతని యీ శోచస్థితిని జూచి పామును ద్రొక్కిన బాటసారి వలె రాముడదరిపడినాడు." (రామకథ-పుట:91)

"నారదుడు వచ్చినదే కలహము పెట్టుటకు. అతనికాభాగ్యము పండినది. ఇన్ని దినముల యేకాదశి ఈ పారణముతో ముగియునని మురిసినాడు. తిన్నగా మహతి నావల బెట్టి ప్రారంభించినా డుపన్యాసమును."

"పురాణ కృష్ణుడెటులున్నను బ్రబంధ కృష్ణుడు మాత్రము యువతీ పాంచాలుడే..."

డా. పుట్టపర్తి వారి గద్య రచన సరళము సుబోధకము.

శక్తివంతము సరళ సుందరము నైన వచన రచనలో పేర్కొనదగిన వారు శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ, డా. కట్టమంచి రామలింగారెడ్డి, డాక్టర్ పుట్టపర్తి నారాయణాచార్యులుగారు. వాగ్దేవి అనుగ్రహం పొందిన ఆచార్యుల వారు ఆరోగ్యభాగ్యంతో శతాయుష్కులై మరిన్ని రచనలు చేయవలెనని సాహిత్యాభిమానుల ఆకాంక్ష.

అయితే డా. పుట్టపర్తి 1-9-90 న దివంగతులయ్యారు.

● *(ఆంధ్రజ్యోతి 9-4-1990)* ●

# బహుముఖ ప్రజ్ఞానిధి
# డా॥ శివరామకారంత్

అదమ్యమైన ఉత్సాహం, అవిశ్రాంతకార్యానురక్తి, నిప్పులాంటి నిజాయితీ ముప్పేటగా మూర్తీభవించిన బహుముఖ ప్రజ్ఞానిధి డా॥ కోట శివరామకారంత్.

సాహిత్యం, సంగీతం, నాటకం, రూపకం, నృత్యం, చిత్రలేఖనం, పత్రికారంగం, విజ్ఞానశాస్త్రం, యక్షగానం, సినిమారంగం, నిఘంటు నిర్మాణం, విజ్ఞానకోశ నిర్మాణం - ఇలా అన్నిరంగాలలోను అనన్యంగా, అపూర్వంగా తనకుతానే సాటిగా వెలిగిన మహామనీషి డా॥ శివరామకారంత్.

సంపన్న కుటుంబం నుండి, ఏమీ ఆశించక ప్రజాజీవితాన్ని అధ్యయనం చేయాలన్న లక్ష్యంతో భారతదేశమంతటా పర్యటించి జీవితం సాహిత్యం కంటే గొప్పదని నిరూపించిన మహోన్నత వ్యక్తి డా॥ కారంత్.

కన్నడ నవలాకారుడుగా సుప్రసిద్ధులైన కారంత్ ప్రాచీనమైన యక్షగాన కళను సంస్కరించి దానికి విశిష్టతను సంతరించారు. వివిధ ప్రయోగాలు చేశారు. యక్షగాన కళపై ఉద్గ్రంథాలు రాయటమేకాక, స్వయంగా వేషం వేసి పలుచోట్ల ప్రదర్శనలిచ్చారు.

డా॥ కారంత్ దక్షిణ కన్నడ జిల్లాలోని 'కోట' అనే గ్రామంలో, ఈ శతాబ్దం తొలి దశలో (అక్టోబరు 10,1902) జన్మించారు. సహజమైన స్వేచ్ఛా ప్రవృత్తికల శివరామకారంత్ కాలేజి చదువుకు స్వస్తి చెప్పి స్వరాజ్యోద్యమంలో దూకారు. గ్రామ స్వరాజ్య స్థాపనకోసం శ్రమించారు. విద్యారంగంలో ప్రయోగం సాగిస్తూ "బాలవన" అన్న విద్యాసంస్థను నిర్వహించారు. బాలలకోసం పాఠ్యపుస్తకాలు రాశారు. బాలల మనోవిజ్ఞాన వికాసంకోసం 'బాలప్రపంచ' అను బృహత్తర విజ్ఞాన సర్వస్వాలను ప్రచురించారు.

కారంత్‌గారి ప్రతిభకు ముగ్ధులైన శ్రీమతి లీలాదేవి అతనిని చేపట్టారు. ఆమె ప్రతిభామతి. కారంత్‌గారితోపాటు గజ్జెకట్టి నృత్యప్రదర్శనలిచ్చారు. వారి ప్రచురణల బాధ్యతలను సమర్థవంతంగా నిర్వహించారు.

ఆయన అభిరుచులు అనంతమైనవి. మనసు కోరిన రంగాలన్నిటిలోను ప్రవేశించి, తన అనుభవాలన్నిటిని సమీకరించి 'హుచ్చు మనసిన హత్తుము ఖగళు ( పిచ్చిమనసు పదిరూపాలు) అన్న గ్రంథం వెలువరించారు. చిలుకలు, కుక్కలు, జింకలు, పాములు మున్నగువాటిని పెంచి పోషించిన తీరును ఆ గ్రంథంలో చిత్రించారు.'

పన్నెండేళ్ళపాటు ఏటా పుత్తూరులో దసరా ఉత్సవాలను నిర్వహించారు. కర్నాటమందలి వివిధ ప్రాంతాల నుండి కవులను, కళాకారులను ఆహ్వానించి,

సంగీత నాటక ప్రదర్శనలిచ్చారు స్వయంగా నాటకాలు రచించి, నటించి ప్రజల మన్ననలందుకున్నారు.

'కడల తడియ భార్గవ' అంటే సాగరతీరంలోని భార్గవుడుగా కన్నడిగులు కారంత్ గారిని అభిమానిస్తారు అనటం కంటే ఆరాధిస్తారు అనటం సముచితం.

అహంకారం, ఆడంబరం, మూఢత్వం, అధికార దర్పం గిట్టని శివరామకారంత్ ప్రభుత్వాధినేతలను కూడా నిర్భయంగా విమర్శించారు. తాము విశ్వసించిన సిద్ధాంతాలపట్ల అచంచలమైన దీక్షగలవారాయన.

జీవితపు విభిన్న ముఖములను చూచి నవలలు రాశారు అనుభవ సంపదతో, వాస్తవ దృష్టితో దాదాపు ఏబదికిపైగా నవలలు రచించారు. మరళి మణ్ణిగె, బెట్టదజీవ, కుడియర కూసు ప్రసిద్ధమైన నవలలు. 'మరళిమణ్ణిగె' 'మరలాసేద్యానికి' మూడుతరాల కథ. మూడుతరాలలోని గొప్ప ఆడవారిని, మగవారిని, వెలకట్టలేని మానవశ్రమను, నిరంతర కృషిని చిత్రించారు ఆ జీడిమామిడి చెట్లలోని నిట్టూర్పు ప్రశాంత విషాద మానవ సంగీతానికి శ్రుతిగా ఏకరువు పెడుతూ వుంటుంది తాటిచెట్లు తలవూపుతూ, ఆలయ విన్యాసాన్ని ఆస్వాదిస్తాయి పార్వతి, సరస్వతి, నాగవేణి అనే గొప్ప స్త్రీ పాత్రలను చిత్రించారు. 'మానవ హృదయం' ఎలా స్పందిస్తుందో ఆ విషయ పరిజ్ఞానం నిస్సంగత్వం ఆ నవల ముఖ్యలక్షణాలు.

జీవితం కోసం, మానవుడు సాగించే పోరాటంలో, జయాపజయాలు, మానవుడు కనే కలలు, వాటిని నిజం చేసుకోవాలన్న ఆరాటంతో సాగించిన పోరాటాలు అనుభవాలు కథా వస్తువులుగా స్వీకరించి నవలలు రాశారు.

1978వ సంవత్సరపు జ్ఞానపీఠ ప్రశస్తి గడించిన 'మూకజ్జియ కనసుగళు' (మూకవ్వ కలలు) అను నవల అతివిశిష్టమైనది. ఈ నవలలోని ప్రధానపాత్ర మూకవ్వ. ఎనభైయేళ్ళ వృద్ధురాలు. చిన్నతనంలోనే భర్తను పోగొట్టుకున్న మూకవ్వ తన చుట్టూ జరుగుతున్న పరిణామాలను నిశితంగా పరిశీలించిన వ్యక్తి. జీవితానుభవాలు ఆమె ఆలోచనకు పదును పెట్టాయి. సంప్రదాయం సృష్టించిన కట్టుబాట్లను అధిగమించి వాస్తవాలను అవగతం చేసుకుంది. చదువుసంధ్యలు లేకున్నా భూతభవిష్యత్ వర్తమానాలకు భాష్యం చెప్పగలదు. సాంఘిక నియమాలు, భయాలు, వివాహబంధంలోని విశ్వాసాలు ఆమెకు తెలుసు. జీవిత పరమార్థం ఏమిటో, బ్రతుకులోని బాధ్యతలేమిటో ఆమెకు తెలుసు. ఈ నవలను గురించి కారంత్‌గారే చెప్పుకున్న మాటలివి. "ఈ నవలకు కథానాయకుడు లేడు. కథానాయిక లేదు. ఈ మూకవ్వ కూడా నాయికకాదు. సంప్రదాయ పద్ధతులలో తుప్పుపట్టిన భావాలను ఆలోచనలతో పదును పెట్టి నవచైతన్యాన్ని కలిగించే కార్యాన్ని ఆమె చేపడుతుంది. అంతే! మన సంస్కృతీ సంప్రదాయాలను గాఢంగా నాటుకుపోయిన నమ్మకాలను సంశయదృష్టితో చూసే వ్యక్తి ప్రతిరూపం మూకవ్వ."

అస్పృశ్యతా సమస్యలు 'చోమనదుడి'లో చిత్రింపబడినాయి. ఇదొక విషాదాంత గాథ. చేరెడు నేలనైనా సొంతంగా చేసుకోవాలన్న చోమని ప్రయత్నం విఫలం కావడంతో వాడి జీవితం నాశనమవుతుంది. తన కష్టాలను విస్మరించుటకై డప్పు వాయిస్తుంటాడు.

'స్వాతంత్ర్య సమరంలో దేశభక్తులు ఎదుర్కొన్న కష్టనష్టాలను, స్వార్థపరుల వంచనలను చిత్రించిన నవల 'ఔదార్యద ఉరుళల్లి", 'ముగిద యుద్ధ' నవలలో బీద బడిపంతులు సాహస జీవితం, అతని మరణం హృదయవిదారకంగా చిత్రింపబడింది. హెత్తళాతాయి, బత్తద తూరె అను నవలల్లో స్త్రీల మాతృత్వపు కోరిక, కామవికారాలు చిత్రింపబడినాయి. 'సన్యాసియబదుకు'లో సంసారమునుండి పలాయనం చిత్తగించిన సన్యాసి ఆశ్రమజీవితం, అతని భార్యాబిడ్డలు పడిన అగచాట్లు, వారిని ఆదుకున్న విధవ త్యాగనిరతి - చిత్రింపబడినాయి

కారంత్‌గారికి ఆసక్తిలేని రంగమంటూలేదు. ముక్తద్వార, కిసాగౌతమి, శీలభంగ మున్నగుకొన్ని గేయనాటికలను రాశారు. నాటకరంగంలో కొత్త ప్రయోగాలెన్నో చేశారు. నాటకాల్లో స్వయంగా పాత్ర ధరించారు.

'మలెయమక్కళు,' 'చోమనదుడి' నవలలు సినిమాలుగా వచ్చాయి. ఈనాటి నాటకాలు, సినిమాలను గురించి తమ అభిప్రాయాలు చెబుతూ, "నేటి తరంవారు చేస్తున్న ప్రయోగాలు తక్కువ. కన్నడ చిత్రరంగంలో కొత్త పోకడలు వస్తున్న విషయం నిజం. కాని చాలా చిత్రాలు వ్యాపారదృష్టితో తీసినవే. చలనచిత్రరంగానికి ఎంతో సౌలభ్యం వుంది. కానీ చాలా డబ్బు కావాలి. ప్రభుత్వం ఇచ్చే సబ్సిడీతో చిత్రాన్ని నిర్మించవచ్చు. కాని ఆ చిత్రాన్ని ప్రదర్శించేందుకు థియేటర్లు కావాలి. ఆ చిత్రానికి డబ్బు వస్తుందన్న నమ్మకం థియేటర్ల యజమానులకు కలిగించాలి. ఇదో పెద్ద సమస్య."

ఇతర భాషల్లో ఏదైనా మంచి జరిగిందన్న విషయం తెలియగానే, అది మనలో ఎందుకు జరగలేదు అన్న ప్రశ్న ఆయనలో తల ఎత్తుతుంది. జీవితం అనంతమైనది. అదొక విశ్వరూపం. దాని నుండి మనం పొందవలసిన సుఖసంతోషాలు పలు విధాలుగా ఉంటాయి అంటారు కారంత్.

ప్రాచ్య పాశ్చాత్య విజ్ఞానములను జీర్ణించుకున్న కారంత్ బాలల కోసం నాలుగు సంపుటాల 'బాలప్రపంచ' సామాన్యుల కోసం 'విజ్ఞాన ప్రపంచం' అన్న గ్రంథాలను రచించారు.

'వసంత' అను మాసపత్రిక సంపాదకులుగా ఎన్నో విషయాలపై అభిప్రాయాలను నిర్భయంగా వెల్లడించారు.

యక్షగాన ప్రక్రియలనే కాక భారతదేశంలోని ప్రజాకళారూపాలన్నిటి పట్ల ఆసక్తితో దేశమంతటా పర్యటించారు. తాము చూసిన దానిని చెప్పాలన్న తపనతో, కర్ణాటక విశ్వవిద్యాలయం ప్రచురించిన 'కళాప్రపంచ' గ్రంథం రచించారు.

సమకాలీన రచయితల పట్ల వారికెంతో గౌరవం. యాభై ఏళ్ళకాలంలో పాండిత్యంలో వచ్చిన మార్పులేమైనా ఉన్నాయా? అని ప్రశ్నించినపుడు "ఏ రచయిత కూడ మరో రచయిత రచనలను విమర్శించటం సముచితం కాదు. సమకాలీన సాహిత్యాన్ని బాగా ఆకళించుకుని తులనాత్మకంగా పరిశీలించి బేరీజు వేయాలి. ఏదైనాసరే కాలానుగుణంగా మారక తప్పదు" అంటారు డా॥ కారంత్.

జీవితానికి, సాహిత్యానికి గల సంబంధం ఏమిటి? సాహిత్యం ద్వారా క్రాంతిని సాధించవచ్చు అని కొందరి అభిప్రాయం. ఈ విషయంగా మీరేమంటారు? అన్న ప్రశ్నకు సమాధానంగా "జీవితం నుంచే సాహిత్యం పుదుతుంది. కాని జీవితానికి సాహిత్యానికి పొత్తు కుదురుతుందో లేదో నేను చెప్పలేను. 'కాంతి' అన్న పదానికి 'మార్పు' అన్న అర్థం చెప్పకుంటే, ఇంతవరకు మారనిది ఏదీలేదు. మార్పు రెండు రకాలు. ఒకటి స్వాభావికమైన మార్పు. మార్పు రావాలని పట్టుపట్టి దాని కోసం తిరుగుబాటు లేవదీసి ఉద్దేశ పూర్వకంగా తీసుకొచ్చే మార్పు. ఉపన్యాసాల ద్వారా, చప్పట్ల మోతల ద్వారా మనం మార్పును సాధించలేము సాహిత్యంతో కొంత మార్పును సాధించవచ్చు. సాహిత్యం సృష్టించిన వెంటనే మార్పురాదు. దానికి వ్యవధి కావాలి. విత్తనాలు చల్లేవరకే రచయిత బాధ్యత. మొక్కను పెంచి, ఫలితాన్ని అందుకోవడం సమాజం యొక్క బాధ్యత మొక్కను పెంచి, ఫలితాన్ని అందుకోవడం సమాజం యొక్క బాధ్యత. జీవితంలో మనం చూసిన దానిని, అనుభవించిన దానిని సాహిత్యంగా మలచగలం అంటే వేలాది మందితో పాటు రచయిత గొంతుకలుపుతాడన్న మాట రచయిత ఒక్కడే సమాజాన్ని మార్చలేడు. ఫలానా పుస్తకాల వల్ల సమాజం మారిందని ఎవరూ చెప్పలేరు. కాని రాసిన పుస్తకంలోని ఏదో ఒక అంశం సమాజానికి ప్రేరణ కలిగిస్తుంది అని చెప్పవచ్చు."

డా॥ కారంత్ విదేశాల్లో విస్తృతంగా పర్యటించారు 1957లో సాధారణ ఎన్నికలలో పోటీ చేశారు. రాజకీయాలు వారికి తగనివి అన్నపుడు "రాజకీయాలు అందరి కర్తవ్యం. దేశంలో సుపరిపాలన అందరూ చూడాల్సిందే రాజకీయాలను ఉపేక్షిస్తే మన బాధ్యతలనుండి తప్పించుకుని తిరిగినట్లే అన్నారు డా॥ కారంత్."

తాము సత్యమని విశ్వసించిన వాటికి అవరోధం కలిగినపుడు వారు 'కొరకరాని కొయ్య' అనే అభిప్రాయాన్ని కలిగిస్తారు. ఆయన నిరాడంబర వ్యక్తి. పిల్లల పట్ల వారి కత్యంత వాత్సల్యం. 'తరంగ' వార పత్రికలో "బాలవనం" శీర్షికలో పిల్లల ప్రశ్నలకు 'కారంతజ్జ' (కారంత్ తాతగారు) సమాధానాలు పదేళ్ళపాటు ధారావాహికంగా రాశారు.

డా॥ శివరామకారంత్ గారి కార్యక్షేత్రం అతి విస్తృతమైనది బ్రతకటం కాదు. ప్రయోజనాత్మకం కావాలి బ్రతుకు అంటారాయన ఆయన పూర్ణ మానవుడు. కన్నడిగులే కాదు. భారతీయులందరూ గర్వించ దగ్గ మహామనీషి డా॥ శివరామకారంత్.

(డా. శివరామకారంత్ 9-12-1997 న కన్నుమూశారు.)

● *(విశాలాంధ్ర 16-6-1994)* ●

* * *

# జనప్రియుడైన ఇండో-ఆంగ్లియన్ రచయిత ఆర్.కె. నారాయణ్

ప్రస్తుత విద్యా విధానం గురించి, చదువు పేర చిత్రహింసలకు గురి అవుతున్న బాలల గురించి యిటీవల రాజ్యసభలో ప్రసంగించి సంచలనం కలిగించిన మేధావి, ప్రముఖ ఇండో - ఆంగ్లియన్ రచయిత ఆర్.కె. నారాయణ్.

వారి 'మాల్గుడి డేస్' ధారావాహిక చిత్రం రెండుమార్లు దూరదర్శన్‌లో ప్రదర్శింపబడి అసంఖ్యాకుల ప్రశంస అందుకుంది.

ఇంగ్లీష్‌లో ఎన్నో కథలు, నవలలు రచించి బ్రిటన్, అమెరికా, ఫ్రాన్స్ మున్నగు విదేశాలలో భారతీయ సాహిత్య కీర్తి కేతనాన్ని ఎగురవేసిన విఖ్యాత ఆంగ్ల రచయిత ఆర్.కె. నారాయణ్.

నారాయణ్ 1906లో మైసూరులో జన్మించారు. తండ్రి కృష్ణస్వామి ఉపాధ్యాయులుగా వుండేవారు. వీరి సోదరుడు జగద్విఖ్యాతిగాంచిన వ్యంగ్య చిత్రకారుడు ఆర్.కె. లక్ష్మణ్. ప్రతిభావంతులైన యీ అన్నదమ్ముల విద్యాభ్యాసమంతా మైసూరు నగరంలోనే జరిగింది. అసామాన్యమైన విధంగా కృషి సాగిస్తూ సాహిత్య చిత్రకళారంగాల్లో విశేష కీర్తి ప్రతిష్ఠలార్జించారు. అన్న నారాయణ్ మైసూరులో స్థిరనివాసం ఏర్పాటు చేసుకున్నారు. తమ్ముడు లక్ష్మణ్ బొంబాయిలో వుంటూ, ఏడాది కోమారు విధిగా మైసూరుకు వచ్చి అన్నగారితో ఆనందంగా కొంతకాలం గడిపి వెళ్ళటం ఆనవాయితీగా పెట్టుకొన్నారు.

బాల్యం నుండి ఇంగ్లీష్ భాషపట్ల ఆసక్తిగల నారాయణ్ ఆంగ్లభాషను తమ అభివ్యక్తిమాధ్యమంగా ఎంచుకొన్నారు. ఆధునిక కన్నడ సాహిత్యంపట్ల ఆదరాభిమానాలుకల ఆర్.కె. మాతృభాష తమిళం. తమిళయాసలో కన్నడం మాట్లాడే నారాయణ్‌గారి పలుకుల్లోని హాస్యం అందరినీ అలరిస్తుంది.

మాస్తి వెంకటేశం అయ్యంగార్, శివరామకారంత్, ఎస్.ఎల్. భైరప్ప వంటి కన్నడ రచయితల నెంతగానో అభిమానించే నారాయణ్, తమిళంలో పై పేర్కొన్నవారి రచనలకు దీటైన సాహిత్యం లేదంటారు.

"మాస్తిగారు అతి సామాన్య విషయాలను అత్యంత సుందరంగా వ్రాస్తే, కారంత్ సాహిత్యంలో నిత్య నూతన ప్రయోగాలు చేస్తూంటారు. కారంత్‌గారి రచనలను ఇంగ్లీష్ చేయటం కష్టం. కారంత్‌గారే ఇంగ్లీష్‌లో వ్రాసి వుండినవారి కెపుడో నొబెల్ బహుమతి లభించి ఉండేది" అన్నారు నారాయణ్.

చాలమంది మేధావులు మీకెప్పుడో నొబెల్ సాహిత్యబహుమతి లభించివుండవలసినది కదా? అని ప్రశ్నించినపుడు "నేను డబ్బుకోసం, పేరు ప్రతిష్ఠల కోసం, బహుమతుల కోసం రచనలు చేయలేదు, చేయను. అంతరాత్మ ప్రేరేపించినప్పుడు, నా

తృప్తికోసం రచనలు చేస్తుంటాను. ఇతరులు చదివి ఆనందిస్తే నా కెంతో సంతోషం. నా రచనలు ఇంగ్లండ్, అమెరికాలలో బాగా ప్రజాదరణ పొందాయి. నొబెల్ బహుమతి నిర్ణాయక సంఘంవారి నియమాలెన్నో వున్నాయి. ఆ బహుమతిని సంపాదించిన వారందరూ ప్రజాభిమానాన్ని చూరగొన్న రచయితలని చెప్పలేం. ఇతరులతో వ్రాయించి బహుమతులు కాజేసినవారూ ఉన్నారు! నొబెల్ పురస్కారాని కోసం ఏనాడూ వెంపర్లాడలేదు." అన్నారు చిన్నపిల్లవాడిలా చిరునవ్వు చిందిస్తూ.

మైసూరు నగరంలోని యాదవగిరి ప్రాంతం ప్రశాంతంగా వుంటుంది. అక్కడ ఎప్పుడో కొన్న స్థలంలో రెండంతస్తుల పెద్ద ఇల్లు కట్టుకున్నారు. క్రింది భాగంలో మరో సోదరుడు పట్టాభి తక్కిన కుటుంబ సభ్యులు నివసిస్తుంటారు. పై భాగంలో విశాలమైన వసారా, ఏకాంతంగా వుండేందుకు గది వున్నాయి పైభాగం చేరేందుకు మెట్లు ఎక్కగానే పెద్ద 'గూబ' చిత్రం అతిథులను ఆహ్వానిస్తుంది. ఆర్.కె. లక్ష్మణ్ గీచిన చిత్రమది.

"లక్ష్మణుడు కాకిని తనదిగా చేసుకుంటే, నేనేమో గూబను ఎంచుకున్నాను." అంటూ చిలిపిగా చెబుతారాయన నా ఏకాగ్రతను ఎవరూ భంగపరచ కూడదంటారు. యవ్వనంలోనే భార్యా వియోగం కల్గింది. మరలా వారు వివాహం చేసుకోలేదు. ఒకే ఒక కూతురు కోయంబత్తూరులో వుంటుంది ఆమె భర్త చిన్న పరిశ్రమను నెలకొల్పారు. మనమరాలి భర్త పుస్తకప్రచురణ సాగిస్తున్నారు. నారాయణ్ తమ్ముడి కుటుంబంతోపాటు ఆనందంగా కాలక్షేపం చేస్తుంటారు.

ఆధునిక జీవితవిధానం పట్ల అనాసక్తిగల నారాయణ్ సనాతన సంప్రదాయాలను అభిమానిస్తారు. అప్పుడప్పుడు విదేశపర్యటనలు సాగిస్తున్నా, స్వస్థలమైన మైసూరు అంటే ప్రాణం ఆయనకు. సంపూర్ణ శాకాహారి అయిన ఆయనకు కాఫీ అతి ప్రియమైన పానీయం. గీతాపారాయణం, సాయంకాల వాహ్యాళి వారి దినచర్యలో భాగం. నిర్మలమైన మనస్సుతో సాహిత్యకారులను ఆదరిస్తారు. వారి ఎదుట వున్నప్పుడు, గొప్పవారి సమక్షంలో వున్నట్లు భావించినా, వారి మధురవాక్కులు సందర్శకుల నెంతగానో అలరిస్తాయి. తమ అభిప్రాయాలను నిర్మొహమాటంగా వెల్లడించే నారాయణ్ గారిని విమర్శించేవారు లేకపోలేదు.

గత అయిదు దశాబ్దాలుగా ఆంగ్లసాహిత్య రంగంలో కృషిచేస్తున్న నారాయణ్ తమ కథలకు, నవలలకు మధ్యతరగతి కుటుంబ జీవనాన్ని ఇతివృత్తం చేసుకున్నారు ఉద్యోగ విరమణ చేసిన వృద్ధుడు, చిటపటలాడే యువకుడు, భర్తను, పిల్లలను వేధించుకునే భార్య, తోటమాలి, చాకలి, మంగలి, హోటెల్ బాయ్, పూజారి, జట్కాసాహెబ్, పనిమనిషి, బడిపంతులు, చిలకజోస్యం చెప్పేవాడు, పాములవాడు, విద్యార్థి మున్నగువారు వీరి కథానాయకీ - నాయకులు. జీవితంలోని వెలుగునీడలను హాస్యచ్ఛాయల్లో చిత్రించుటలో దిట్ట ఆయన. ఒకచోట హాస్యం జలపాతంగా వుంటుంది మరొకచోట సెలయేరులా ప్రశాంతంగా సాగుతుంది. వారి రచనలు యింకా కన్నడ రూపం దాల్చకపోవటం ఆశ్చర్యం. 'స్వామి మరియు స్నేహితులు' మాత్రం లక్ష్మణ్‌గారి రేఖా చిత్రాలతో 1940 ప్రాంతాల్లో ఎచ్.వై.శారదాప్రసాద్‌గారిచే కన్నడీకరింపబడి వెలువడింది.

నారాయణ్‌గారి నవల 'గైడ్' హిందీ చిత్రంగా రూపొంది హిందీ భాషీయుల హృదయాల నలరించింది. వారి మరో నవల 'ఫైనాన్షియల్ ఎక్స్‌పర్ట్' 'బ్యాంకర్ మార్గయ్య'గా వెండితెరకెక్కినపుడు, ఆ చిత్రం కన్నడ నవల ఆధారంగా నిర్మింపబడలేదంటూ కన్నడిగులు విమర్శించారు సినీరంగంలోని కుట్రలు, పాక్షిక ధోరణులూ, రాజకీయాలు వీరికెంతో మనస్తాపం కలిగించాయి

నారాయణ్‌గారి 'మాల్గుడి డేస్' దూరదర్శన్‌లో ప్రసారం అయినపుడు అత్యంత జనప్రియచిత్రమని కొనియాడారు. మాల్గుడి ఒక కాల్పనిక గ్రామం. అట్లే నారాయణ్‌గారి 'స్వామి' చిత్రంకోసం, భాష, ప్రాంతం మున్నగువాటిని విస్మరించి దేశమంతటా ప్రేక్షకులు వేచివుండటం విశేషం. మద్రాసు నుండి వెలువడే 'ఫ్రంట్ లైన్' పక్షపత్రికకోసం కథ, చిన్న నవల, వ్యాసం వగైరా వ్రాస్తుంటారు. వారి తమ్ముడు సందర్భానుసారంగా రేఖాచిత్రాలు వేస్తుంటారు.

మైసూరునగరం పట్ల వారికెంతో ప్రేమ. అక్కడి ప్రాచీన భవనాలను, ఉద్యానవనాలను, చెట్లు చేమలను ఆత్మీయంగా చూస్తూంటారు. పరిశ్రమల నెలకొల్పటానికోసం చెట్లను కూల్చివేయటాన్ని వారు తీవ్రంగా వ్యతిరేకించారు. పరిసరాల పరిశుభ్రతకోసం నగరపాలక సంస్థతో సయోధ్యతో కృషి చేస్తుంటారు. మైసూరు ఆకాశవాణి కేంద్రం ప్రాంగణంలో వారు పెంచిన రావిచెట్టు బాగా పెరుగుతూ వుంది. వీలున్నప్పుడల్లా ఆ వృక్షం వద్దకు వెళ్ళి 'కాంపౌండ్ గోడల కేమాత్రం భంగం కల్గించక వేళ్ళు వదలుతూ వుండమ్మా!' అంటూ చెట్టును అర్థిస్తారు. 1954 - 55లో మైసూరు ఆకాశవాణి కేంద్రం బెంగుళూరుకు తరలించే ప్రయత్నాలు సాగుతుండగా కేంద్ర సలహాసమితి సభ్యులుగా వుండిన నారాయణ్ ఎంతగానో కృషి చేసి, చివరకు అప్పటి కేంద్ర సమాచార శాఖామంత్రి శ్రీమతి ఇందిరాగాంధిని ఒప్పించి, 1974లో మరల మైసూరు ఆకాశవాణి కేంద్రం అక్కడినుంచే పనిచేయునట్లు చేశారు.

1986లో శ్రీ ఆర్.కె. నారాయణ్ రాజ్యసభ సభ్యులుగా నామినేట్ చేయబడ్డారు. ఈ పదవితో వారిలో ఏమాత్రం మార్పు కానరాలేదు. కాని వారి పదవిని పురస్కరించుకొని పరిచయం కోసం వచ్చేవారి సంఖ్య బాగా పెరిగింది. తమను గురించి ఏమాత్రం పట్టించుకోకపోయినవారు రాజ్యసభ సభ్యులైన వెంటనే గౌరవించటం మొదలు పెట్టడాన్ని హాస్యభరితంగా 'ఫ్రంట్ లైన్'లో చిత్రిస్తుంటారు. వారి వేనాడూ పలకరించని పొరిగింటి యజమాని, ఎం.పి. అయినతరువాత వీధిమధ్య సైకిల్ దిగి కుశల ప్రశ్నలు వేయటాన్ని వ్యంగ్యంగా చిత్రించారు. ఆ రచనకు ఆర్.కె. లక్ష్మణ్‌గారి రేఖా చిత్రాలు మరింత పుష్టి నిచ్చాయి. ఇటీవల సోవియట్‌ల్యాండ్ బహుమతి కూడా అందుకున్న ఆర్.కె. గారికి కేంద్రసాహిత్య అకాడమి అవార్డు ఎప్పుడో లభించింది. ఈ బహుమతులు నొబెల్ పురస్కారానికి సుగమం చేయగలవని ఆశించటంలో ఏమాత్రం తప్పులేదు.

('తరంగ'లోని, డా. జ్యోత్స్నాకామత్ రచన ఆధారంగా).

● ఆంధ్రపత్రిక *(2-9-1989)* ●

# ప్రతిభా ప్రపూర్ణ కవయిత్రి కమలాదాస్

నిర్మొహమాటంగా, నిర్భయంగా తన అభిప్రాయాలను వెల్లడిస్తూ, సంప్రదాయ వాదులను రెచ్చగొడ్తున్న కేరళ కవయిత్రి.

**మాధవికుట్టి:**

మలయాళ భాషలో నాటకం, నవల, కథ, మున్నగు ప్రక్రియలలో రచనలు చేసి కేరళలో మార్మోగిన పేరు.

**కమలా:**

చేనేత చీర ధరించి ఒంటినిండా చెరుగుతో, నొసట కుంకుమ, ముక్కుపుడక ధరించి, క్యూలో నిల్చుని ఎలక్ట్రిక్ బిల్ చెల్లించే, ఆదాయపు పన్ను చెల్లించే సామాన్య స్త్రీ.

ఈ త్రిముఖ వ్యక్తిత్వం కల కమలాదాస్ ఉరఫ్ మాధవికుట్టి, ఉరఫ్ కమలా గొప్ప రచయిత్రిగా దేశ విదేశాల్లో కీర్తి గడించారు సెక్స్ గురించి తన అభిప్రాయాలు నిర్మొహమాటంగా ప్రకటిస్తూ, సంప్రదాయవాదుల కోపానికి గురైన రచయిత్రి కమలాదాస్.

కేరళ రాష్ట్రంలోని మలబార్ ప్రాంతంలోని గ్రామంలో 1934లో ఆమె జననం నళపట్ కుటుంబానికి కేరళలో గొప్పపేరు. తండ్రి కలకత్తాలో ఉద్యోగం చేసేవారు. తల్లి బాలమణి అమ్మ 'పద్మ భూషణ' ప్రశస్తి విజేత అయిన కవయిత్రి. పుట్టిన 56 రోజులకే తల్లితో పాటు కలకత్తా చేరారు. ప్రాథమిక విద్య అక్కడే.

మధ్యలో అమ్మమ్మతో స్వస్థలంలో నివాసం. తలనిండా చమురు రాసుకొని ఒత్తుగా జడ వేసుకుని, తోటపనితో నిమగ్నం కావడం అంటే మాధవి కెంతో ఇష్టం. చల్లని నీరు పైన మండే సూర్యుడు. అదొక విలక్షణమైన బాల్యం. తండ్రి విధించే క్రమశిక్షణ, సుసంస్కృతీపరురాలుగా చేయాలన్న తండ్రి పట్టుదల మాధవికి నచ్చలేదు.

తండ్రి ఆదేశంపై మరలా స్వగ్రామం చేరింది. తర్వాడ్ కుటుంబంలో మామగారి పెత్తనం ఎక్కువ. అయిదు ధనిక కుటుంబాల వారికి పనిపాట్లు చేసేందుకు 200 బీద కుటుంబాలు వుండేవి. వారిది అతి సంపన్న కుటుంబం. మామగారైన నళపట్ నారాయణ మీనన్ తత్వవేత్త. వారి గ్రంథాలయంలో ఎన్నో పుస్తకాలుండేవి. బాల మాధవికి లైబ్రరీలో మంచి కాలక్షేపం. కవయిత్రి బాలమణి అమ్మ రచనలకు అన్నగారి లైబ్రరి ప్రేరణ కాబోలు.

పదునైదేళ్ళకే మాధవదాస్ గారితో వివాహం. ఏడాదికే కొడుకు పుట్టాడు. (పెద్ద కొడుకు ఎం.డి. నళపట్ - టైమ్స్ ఆఫ్ ఇండియా పత్రిక - బెంగుళూరు ఎడిషన్ రెసిడెంట్ ఎడిటర్) మాధవదాస్ బ్యాంక్ ఆఫీసర్. వయసులో పెద్ద.

మోను, చిన్నన్ మరియు జైసూర్య ముగ్గురు మగపిల్లలు, ఆడ పిల్లలు లేరు.

'కమలాదాస్'గా ఆంగ్ల కవితలల్లే ఈమె మలయాళ భాషలో వ్రాసేటప్పుడు 'మాధవి కుట్టి'.

మాధవి కుట్టి కవితలు వ్రాయరు కమలా దాస్ ఆంగ్ల కవితలు తప్ప మరేమీ వ్రాయలేదు. ఈ రెండు పేర్లతో ఆమె ఇప్పటికే 25కు పైగా పుస్తకాలు వ్రాశారు. మాధవి కుట్టి ఒక మలయాళ పత్రిక కాలమిస్ట్. ఆమె రచనలతో పత్రిక సర్క్యులేషన్ బాగా పెరిగింది.

తన రచనలలో 'చైల్డ్ హుడ్ రెమినిసెన్సస్' చాలా గొప్పదని ఆమె అభిప్రాయం. నేషనల్ బుక్ ట్రస్ట్ ఆ రచనను 12 భారతీయ భాషలలో అనువదించి ప్రచురింపనున్నది. ఆమె చిన్న కథలు సినిమాలకు ఇతివృత్తాలయ్యాయి. ఒక చిత్రానికి ఆమె దర్శకురాలు. 'సనాతన్ వర్మాస్ వైఫ్' అన్న స్వీయ వీడియో చిత్రాన్ని పూర్తి కథా చిత్రంగా నిర్మించదలచినారు.

శ్రీమతి కమలాదాస్ ప్రస్తుతం కేరళ ఫారెస్ట్ బోర్డ్ అధ్యక్షులుగా పనిచేస్తున్నారు. బోర్డు చేసిన ఉత్తమ కృషికి 1990 ఇందిరా ప్రియదర్శిని అవార్డు లభించింది.

1984లో స్వతంత్ర అభ్యర్థిగా ఎన్నికలలో పోటీ చేశారు. విజయం సాధించి మహిళాభివృద్ధికి మరింత కృషి సాగించాలని ఆశించారు. కాని, మహిళలే ఆమెకు ఓటు వేయలేదు.

ముగ్గురు కొడుకులున్నా, ఇర్షాద్, ఇంతియాజ్ అను ఇద్దరు గుడ్డి బాలురను దత్తత తీసుకుని వారి చదువులకు వీలు కల్పించారు. భర్త మాధవదాస్ సెలవు పెట్టి అంధబాలుర పరీక్షలలో వారి జవాబులు వ్రాసిపెట్టాడు.

పుస్తకం వ్రాసి పూర్తిచేయడం ప్రసవవేదన వంటిదంటారు కమలాదాస్. సెక్స్ విషయంలో నిర్భయంగా వ్రాశారు. 'నా భర్త నా స్తనాలకోసం నన్ను ప్రేమిస్తారు' 'మేమిరువురం కలుసుకునేది పడకమీదనే' అన్న వాక్యాలతో సాహిత్య రంగంలో అలజడి రేకెత్తించారు. 'సనాతనాచారవంతులు అదిరిపోయారు.' వివాహం అంటే శారీరక సంబంధం. ఈ భావన పట్ల నాకెంతో అసహ్యం. 'వివాహ విషయంగా నేను విఫలమయ్యాను. కాని, నాకంటే మంచి భార్య లభించదు' అంటారు.

"లోగడ 'మాధవి కుట్టి' అని పిలిచే వారికి నేను ఇప్పుడు 'అమ్మ' అయ్యాను. యువకులు నన్ను ఎంతగానో గౌరవిస్తారు."

కమలాదాస్ గారికి పట్టుచీరలు, నగలపట్ల మోజు ఇంకా పోలేదు. పొగ త్రాగడం ఎప్పుడో మానివేశారు.

'మనోమి' ఒక పెద్ద కథ; శ్రీలంకలోని మానవీయ సమస్యల ఇతివృత్తం. ఈ కథ మలయాళం, హిందీ, తెలుగు భాషలలో చిత్రంగా నిర్మింపబడుతూ వుంది.

కమలాదాస్ రచనలలో 'మదిలుగళ్' (గోడలు) పత్ కదగళ్ (పది కథలు), చువన్న పావడ (ఎర్ర లంగా), పక్షాయొడె మణవల్ (పక్షి వాసన), 'సమ్మర్ ఇన్ కలకత్తా', 'ది డిస్సేడన్స్', 'ద ఓల్డ్ ప్లే హౌస్ అండ్ అదర్ పోయెమ్స్', 'మైస్టోరి', ప్రసిద్ధ మైనవి. ఈమె రచనలకు కేరళ సాహిత్య అకాడమి అవార్డు, చమన్‌లాల్ అవార్డు, "ఏషియన్ పెన్ పొయెట్రి" అవార్డు కుమారన్ ఆశాన్ ప్రశస్తి లభించాయి. 'స్త్రీలు పురుషుల వలె మనీ మైండెడ్‌గా వుండరు. మగవారికంటే ఎక్కువగా సేవా మనస్తత్వం కలవారు.' "దేవాలయంలో బందీగా వున్న దేవుని పట్ల నాకంతగా శ్రద్ధ లేదు. నా చుట్టూ వున్న ప్రజలకోసం శ్రమించడం నాకిష్టం. నా రచనలు నిర్మోహ మాటంగా సాగాలి. స్త్రీత్వాన్ని కాపాడాలి." జాతీయత కంటే మానవత గొప్పదంటారు కమలాదాస్.

● *(ఆంధ్రజ్యోతి 7-3-1991)* ●

★ ★ ★

# అగ్రశ్రేణి భారతీయాంగ్ల రచయిత రాజారావు

ప్రముఖ ఇండో ఆంగ్లియన్ రచయితగా విఖ్యాతులైన రాజారావుగారు కర్ణాటక రాష్ట్రంలోని హాసన్ పట్టణంలో 5-11-1908న జన్మించారు. హైదరాబాద్‌లో ఉన్నత పాఠశాల, కళాశాల విద్య పూర్తిచేసి అలిఘర్ విశ్వవిద్యాలయం నుంచి పోస్టుగ్రాడ్యుయేట్ పట్టా పుచ్చుకున్నారు. పంథొమ్మిదవయేట ఫ్రాన్స్ వెళ్ళారు. తర్వాత పదేళ్ళు ఇంగ్లండులో వుండి అమెరికా వెళ్ళారు. అక్కడే స్థిరపడ్డారు. ఏడాదికో, రెండేళ్ళకో బెంగుళూరు రావడం, కేరళలోని మలక్కారాలోని తమ గురువులను సందర్శించి వెళ్ళడం వారి అలవాటు. ఒక్కోసారి ప్రకృతి చికిత్స కోసం జిందాల్ లో కొంత కాలం వుండి వెదుతుంటారు. పత్రికలవారికి, సాహిత్య గోష్ఠులకు వారు సాధారణంగా దూరంగా వుంటారు.

జీవితంలో అత్యధిక భాగం విదేశాలలో గడిపిన రాజారావుగారి జీవితం పై ఎందరో పాశ్చాత్య విద్వాంసుల ప్రభావం పడింది అలిఘర్ విశ్వవిద్యాలయంలో కలుసుకున్న డికిన్‌సన్ రావుగారి ప్రథమ విదేశయాత్రకన్ని విధాలా తోడ్పడ్డారు. వారి 'సర్పెంట్ అండ్ ద రోప్' అన్న నవలను చదివిన టెక్సాస్ విశ్వవిద్యాలయ వైస్ ఛాన్సలర్ రాజారావుగారిని తమ యూనివర్సిటీలో తత్వశాస్త్రాచార్యులుగా నియమించి గౌరవించారు. రావుగారి 'కాంతాపుర' నవల ఇంగ్లండులో ప్రచురింపబడింది. వారి అర్థాంగి విదేశీ మహిళ.

తమ జీవితంలో అత్యధిక భాగం విదేశాలలో గడిపిన రాజారావుగారు తాను భారతీయుడనని సగర్వంగా వచ్చినపుడల్లా భావోద్వేగవశులవుతారు. విశ్వ సంస్కృతి, నాగరికత ఇతిహాసాలను అధ్యయనమొనర్చిన రావుగారు భారతీయ సంస్కృతీ వైశిష్ట్యాన్ని తమ రచనల్లో ప్రస్ఫుటం కావించారు.

రాజారావుగారి తాత్విక చింతనకు ప్రేరకులు పండిత్ తారానాథ్. తుంగభద్రా తీరమందలి ప్రేమాయతన ఆశ్రమం ప్రముఖ కన్నడ రచయితలైన టి.పి. కైలాసం, అ.న. కృష్ణారావు, విఖ్యాత నటులు బళ్ళారి రాఘవ వంటి వారికి జ్ఞానకాశిగా వుండేది.

గాంధీజీని భారతదేశం ఆచరణలో విస్మరించిందని, ప్రపంచ దేశాలలో గాంధీతత్వం పట్ల నానాటికి విశ్వాసం ఇనుమడిస్తున్నదన్నారు రాజారావుగారు. ఒకమారు గాంధీజీ 'నేను విశ్వసించిన విధంగా జీవితం సాగించుటకు శక్తుడనైతే అది తన మహద్భాగ్యమని భావిస్తా'నని రావుగారితో అన్నారట.

రాజారావుగారు ప్రాచ్య, పాశ్చాత్య తత్వవేత్తల రచనలను క్షుణ్ణంగా అధ్యయనం చేశారు. అరవిందులు, రమణమహర్షి, రామకృష్ణ పరమహంస మున్నగు మహనీయుల వ్యక్తిత్వ విచారాలను మథించారు. స్వామి ఆత్మానందుల శిష్యులు రావుగారు.

కేరళలోని తిరువనంతపురం జిల్లా చెంగనూరు తాలూకా కేంద్రానికి ఆరు కిలో మీటర్లలోని చిన్న గ్రామం మలక్కరా అక్కడ ఆశ్రమం నిర్మించుకున్న మహనీయులు స్వామి ఆత్మానంద.

ఒకమారు బెంగుళూరులోని మిత్రులతో మాట్లాడుతూ పాశ్చాత్య తత్వవేత్తలైన హాల్డేన్, హక్స్లీ, ఫాస్టర్ వంటి మేధావులు తమ సమస్యలకు సరైన సమాధానం మన అద్వైత, వేదాంతాలలో లభిస్తున్నట్టు చెప్పారని, అట్టి ప్రగాఢ విశ్వాసం కలిగించిన భారతీయ సంస్కృతి, గురువుల కృప చిరంతనమైనవన్నారు రావుగారు. మిత్రులతో చర్చలు జరుపుతూ వారి సమస్యలకు తగిన పరిష్కారం భారతదేశంలో లభించగలదంటూ ఆనందాశ్రమాన్ని సందర్శింప ప్రేరేపించారు.

రాజారావుగారికి జవహర్‌లాల్ నెహ్రూ కుటుంబ సభ్యులతో సన్నిహిత సంబంధాలుండేవి. నెహ్రూ మరణానంతరం 'ఇలస్ట్రేటెడ్ వీక్లీ ఆఫ్ ఇండియా' నెహ్రూ స్మృత్యర్థం ప్రత్యేక సంచికను ప్రచురించింది. ఆ పత్రికలో వ్రాసిన వ్యాసాల్లో నెహ్రూ ఆత్మీయతను, కళాభిరుచిని, హాస్య ప్రవృత్తిని రావుగారు వెల్లడించారు.

ఒకమారు జవహర్‌లాల్ నెహ్రూ రాజారావుగారిని తమ సాంస్కృతిక రాయబారిగా దక్షిణ ఆఫ్రికాకు పంపారు.

ఒక్లహోమా విశ్వవిద్యాలయం రాజారావు గారిని 75 వేల డాలర్ల నగదుతోపాటు న్యూస్టాడ్ సత్కారాన్ని అందజేసింది.

ఆధ్యాత్మిక నవలాకారుడుగా, ఆంగ్ల భాషా స్వరూపాన్నే మార్చిన మేధావి అని ఎడ్విన్, రావుగారిని ప్రశంసించారు.

రాజారావుగారి 'సర్పెంట్ అండ్ ద రోప్' నవలను ప్రస్తుతిస్తూ ఈ రచన భారతదేశానికి గౌరవంతోపాటు, ఆంగ్లభాషా గౌరవాన్ని కూడా ఇనుమడింప చేసిందన్నారు లారెన్స్ డరెల్. ఆంగ్ల భాషా మర్మాలను అవగతం చేసుకొని, భారతాత్మ, ఆధ్యాత్మిక స్వరూపాన్ని తమదైన శైలిలో విదేశీయులకు పరిచయం కావించిన మేధావి, రాజారావుగారని పత్రికలు ప్రశంసించాయి.

రాజారావుగారు ఆధునిక భారత విశిష్ట రచయిత అని నవలా రచయిత్రి శాంతారామారావ్ ప్రశంసించారు. ముల్క్‌రాజ్ ఆనంద్, కె.ఎ. అబ్బాస్, నయ్‌పాల్, రష్దీ, ఆర్.కె. నారాయణ్, హరీంద్రనాథ్ చటోపాధ్యాయ మున్నగు విఖ్యాత భారతీయ రచయితలందరూ రాజారావుగారికి అత్యంత ఆప్తులు.

రావుగారి రచనల వలె వారి వ్యక్తిత్వం అతి విశిష్టమైనది. వారితో సంభాషణ మొదలిడిన తర్వాత ఆ ప్రవాహంలో మునకలువేయక తప్పదు. అదొక విశిష్టమైన అనుభూతి. ఇటీవల విఖ్యాత సినీ, దూరదర్శన్ నిర్దేశకులైన శ్యామ్ బెనగల్ -

రాజారావు గారి 'కాంతాపుర' నవలలోని మూడు ఘట్టాలను అత్యంత హృదయంగమంగా చిత్రించారు.

రాజారావుగారు వృత్తిరీత్యా రచయితకాదు. అది వారి ప్రవృత్తి. రచన అభివ్యక్తికొక్క మాధ్యమం. ఇప్పటి వరకు మూడు పెద్ద నవలలు, రెండు చిన్న నవలలు, మూడు కథా సంపుటాలు, ఎన్నో వ్యాసాలు రచించారు. ప్రస్తుతం వారి వయసు 86 ఏళ్ళు

రాజారావుగారి కీర్తిప్రతిష్ఠలకు తగినన్ని రచనలు వెలువడలేదని కొందరి అభిప్రాయం. 65 ఏళ్ళుగా వారు ఇంగ్లండు, అమెరికా దేశాలలో నిరాడంబరంగా జీవితం సాగిస్తున్నారు. వారి రచనలు ఎన్నో భాషలలోకి అనువదింపబడినవి. లక్షలాది ప్రతులు విక్రయింపబడినాయి. అవార్డులకు, సత్కారాలకు వారెప్పుడూ దూరంగా వుంటారు. అవే వారిని వరించాయి. వారి ఆధ్యాత్మిక భావ స్రవంతి - ఆంగ్ల భాషలో విస్తృతంగా విహరించింది. ఆరు దశాబ్దాలకు పైగా విదేశాల్లో వున్నా, ఖాదీ వస్త్రధారిగా, మద్యమాంసాదులకు అతీతంగా జీవితం కొనసాగిస్తున్నారు. భారతదేశం చెప్పుకోదగిన ఆంగ్ల రచయితలలో మేటివారు రాజారావుగారు.

● ఆంధ్రజ్యోతి ●

★ ★ ★

# ఉత్తమ సాహిత్యం సత్యాన్ని చాటుతుంది

## కేంద్ర సాహిత్య అకాడమీ అధ్యక్షులు డా॥ యు.ఆర్. అనంతమూర్తితో ఇంటర్వ్యూ

డాక్టర్ అనంతమూర్తి ఇటీవల కర్ణాటక రాష్ట్రంలోని శివమొగ్గ నగరానికి వచ్చినప్పుడు కువెంపు విశ్వవిద్యాలయం ఆంగ్ల శాఖాధిపతి శ్రీరాజేంద్ర చెన్నీకి ఇచ్చిన ఇంటర్వ్యూలో సాహిత్య, తాత్విక, సామాజికాంశాలను విపులంగా స్పృశించారు అందులో కొన్ని భాగాలు-

**శ్రీ రాజేంద్ర చెన్నీ:** డాక్టర్ అనంతమూర్తిగారూ, మీరు కేంద్ర సాహిత్య అకాడమీ అధ్యక్షులుగా ఎన్నికయినందుకు మాకెంతో సంతోషంగా వుంది.

ఇది మీ వ్యక్తిగత సాధనకు లభించిన గౌరవం అనడం కంటే కన్నడ భాషకు లభించిన గౌరవ మనడం సముచితం. పాఠకుల పరంగా మీకు అభినందనలు.

**డాక్టర్ అనంతమూర్తి:** అవును. ఇది నిజంగా కన్నడ సాహిత్య సాధనకు లభించిన ప్రశస్తి. కన్నడంలో కారంత్, బేంద్రె, అడిగ మొదలైనవారు వ్రాశారు. నేనూ ఆ వలయంలోని వాడినే. కాని, మరోమాట, నా రచనలేవీ నేషనల్ బుక్ ట్రస్టు లేదా సాహిత్య అకాడమీ ప్రచురించలేదు. అందువల్ల నేను ఏ సంస్థ దయా దాక్షిణ్యాలకు పాత్రుణ్ణి కాలేదు. నేషనల్ బుక్ ట్రస్టు కమిటీలో నేను సభ్యుడిగా వున్నాను ఇంకా గోకాక్, మరికొందరు వుండేవారు. కన్నడంలోని ఏ పుస్తకాన్ని ప్రచురించాలి అన్న చర్చ వచ్చింది. నా పుస్తకం మాత్రం వద్దు అన్నాను. ఎస్.ఎల్. బైరప్పగారి రచనలు కాని మొకాశిగారి రచనలుకాని అనువదించబడాలి అన్నాను. ఏ సంస్థ సహాయాన్ని నేను కోరలేదు. నా సాహిత్య రచనలకు చలనశక్తి వుంది, అందువల్లనే ప్రజలు చదువుతున్నారు అది నాకెంతో గర్వకారణం.

**ప్రశ్న:** మీరు సంస్థ విషయం చెప్పారు. మీరేమన్నా, సాహిత్య అకాడమీ కూడా ఒక సంస్థ. ఆ సంస్థకో వైశిష్ట్యం, వ్యక్తిత్వం వున్నాయి. ఈ నేపధ్యంలో మీరేమైనా కొత్త పథకాలను చేపడతారా?

**జవాబు:** కేంద్ర సాహిత్య అకాడెమీకి ఒక నిర్దిష్టమైన లక్ష్యం వుంది. "ఇండియన్ లిటరేచర్ ఈజ్ వన్, ఆల్దో ఇట్ ఈజ్ రిటెన్ ఇన్ మెని లాంగ్వేజెస్." నేను అధ్యక్షుడుగా పదవీ భాధ్యతలను స్వీకరించిన తర్వాత నా మొదటి ఉపన్యాసంలో

మార్పులు కావాలన్నాను. "ఇండియన్ లిటరేచర్ ఈజ్ వన్ బికాజ్ ఇట్ ఈజ్ రిటెన్ ఇన్ మెని లాంగ్వేజస్" అన్నాను.

ఇండియాలోని వైవిధ్యానికి నేను ఎక్కువ ప్రాధాన్యాన్నిస్తాను. ఈ బహుళత్వాన్ని వ్యతిరేకించే వారికి, నాకూ పడదు. గాంధీజీకి ఈ బహుళత్వం అత్యంత ప్రేమాస్పదం. రామజన్మభూమి పరమైన ఆలోచనలను నేను ఖండిస్తాను. ఇది మన దేశ సాంస్కృతిక వ్యవస్థయొక్క బహుళత్వాన్ని నాశనం చేసే ఆలోచన ఈ బహుళత్వాన్ని సమాదరించే సంస్థ కేంద్ర సాహిత్య అకాడమి ఏ భాషా రచయితకైనా పురస్కారమిస్తాము అంటే అట్టి రచయితను అఖిలభారత స్థాయిలో గుర్తిస్తామన్నమాట. ఈ రీతిగా చూచిన అడిగ, కువెంపు, కారంత్‌గార్లు అఖిలభారత స్థాయి రచయితలు. కన్నడ రచయితలు మాత్రమే కాదు ఈ బహుళత్వం యూరోప్‌లో కూడా కానవస్తుంది. బహుళత్వాన్ని అన్వేషిస్తూ వెళితే ఏకత్వం కనిపిస్తుంది. ఏకత్వాన్ని అనుశీలిస్తే బహుళత్వం కనిపిస్తుంది.

ప్రశ్న: బహుళత్వం గురించి చర్చిస్తే విభిన్న భాషల్లో సాహిత్యంలో ఒక విధమైన చైతన్యం కానవస్తుంది. దీనిని కేంద్ర సాహిత్య అకాడెమీ గుర్తించే విధానాలేవి? ఇందుకు అకాడెమీ ఏం చేయగలదని మీరు భావిస్తున్నారు?

**జవాబు:** సాహిత్య అకాడమి ఇచ్చే బహుమతుల గురించి ఫిర్యాదు వుండేది. అక్కడో మురా వుంది. వాస్తవమైన ప్రతిభకు పురస్కారం లభించడంలేదు అన్నఅభియోగం వుంది. ఈ ఫిర్యాదుకు కారణాలను అన్వేషించాలి. ఈ వ్యవస్థలోని మంచి చెడ్డలను బేరీజు వేయాలి. నేనీపదవిలో వున్న కాలంలో ప్రతిభాషలోని ఉత్తమ సాహిత్యాన్ని గుర్తించాలని నా తపన. ఉదాహరణకు కన్నడంలోనే ఉత్తమ రచనలను అకాడమి కాని, అకాడమి సభ్యులుకాని గుర్తించటం లేదు. నేను అధ్యక్షుడుగా వున్న వ్యవధిలో ఆ పని చేయాలి. సాహిత్య అకాడమికి తాత్విక సమస్య వుంది. ఈ విషయాన్ని ఇంత వరకు ఎవరూ గమనించలేదనుకుంటాను. ఒక చలన చిత్రానికి బహుమతి ఇవ్వదలచినపుడు, ఆ సంవత్సరంలో నిర్మింపబడిన ఉత్తమ చిత్రానికి బహుమతి లభిస్తుంది. సాహిత్య అకాడమి అలాకాక మూడేళ్ళ వ్యవధిలో వెలువడిన ఉత్తమ రచనను ఎన్నుకోవాలి. ఒక గొప్ప రచయిత మూడేళ్ళ కాలంలో ఉత్తమ రచన చేయకపోయినా, అతని కృషిని బేరీజు వేయాలి. ఏదో విధంగా అతనికి బహుమతి ఇవ్వాల్సి వుంటుంది. ఒక గొప్ప రచయిత ఆ వ్యవధిలో మేలు కృతిని సృష్టింప లేకపోవచ్చు. కాని బహుమతి ప్రకటించునపుడు మాత్రం ఆ రచనను పేర్కొనాలి. ఇట్టి సందర్భాల్లో అకాడమి ఏమి చేస్తుందో చెప్పలేము. అధ్యక్షుడుగా నాకున్న ప్రత్యేకతను పురస్కరించుకుని ఫలానా రచనకు బహుమతి ఇవ్వాలంటాను. రచనకు ఇవ్వాలంటాను. రచయిత అక్కడ ముఖ్యం కాదు.

ప్రశ్న: ఒక భాషా సాహిత్యంలో జరుగుతున్న కృషి ఇతరులకు కూడా తెలియాలి. ఇట్టి పూరకమైన కృషి జరుగకున్న, సాహిత్య అకాడమి ఉద్దేశం సఫలం కాదు. ఈ దిశలో మీ ఆలోచనలెట్లున్నాయి?

జవాబు: రచన విలువను నిర్ధారణ చేయాలి. కాని ఒక్కోమారు కొన్ని చిక్కులేర్పడుతాయి. ఇటీవలి సంఘటనను పేర్కొంటాను. కేంద్రసాహిత్య అకాడమి సాహిత్యోత్సవం జరిగింది. అప్పుడు కొందరు యువకులు నన్ను తీవ్రంగా విమర్శించారు. ఆంగ్ల భాష మన భాషలపై పెత్తనం చెలాయిస్తూ మన భాషలను నిర్వీర్యం చేస్తున్నది అన్నందుకు నా మీద విరుచుకు పడినారు. పదవతరగతి వరకు బోధన అందరికీ ఒకే మాధ్యమంలో జరగాలని ఆ మాధ్యమం మాతృభాషగా వుండాలని నా అభిప్రాయం. ఆంగ్లంలో కాదు. ఒక విద్యార్థి పదవ తరగతి ముగించే వరకు తన మాతృభాషలో నేర్చుకున్నపుడే మాతృభాషపై పట్టు ఏర్పడుతుంది. అలా అన్నప్పుడు ఇంగ్లీషులో రాసే యువకులు నన్ను తీవ్రంగా విమర్శించారు. నేనూ అంతే తీవ్రంగా ప్రతిఘటించాను. అంత మాత్రంతో సాహిత్య అకాడమీ అధ్యక్షుడిగా నా ప్రతిష్ఠకేమీ భంగం కలుగలేదని నా భావన. సాహిత్య విషయంలో ఘనత గౌరవాలే ప్రధానం కాదు. పరస్పరం జరిగిన వాదోపవాదాల వెనుక ఒక సంస్కృతి వుంది ఆ సంస్కృతికి మన వాద వివాదాల వల్ల ప్రయోజనం కలుగుతుంది. అట్టి చర్చలు సాగాలి. పేరు ప్రతిష్ఠలు అడ్డు రాకూడదు.

ఇంతవరకు సాహిత్య అకాడమి బహుమతుల విషయం గోప్యంగా వుండేది. ఇది మారాలి. అకాడమి ఎగ్జిక్యూటివ్‌లు అయిదేళ్ళపాటు వుంటాడు. వారు బహుమతుల గురించిన తుది నిర్ణయంలో ప్రముఖ పాత్ర వహిస్తారు. నా అభిప్రాయంలో వారు అనవసరం. ముగ్గురు విమర్శకులుండాలి. వారు ఎవరు అన్నది అందరికీ తెలియాలి. వారు షార్ట్ లిస్ట్ చేస్తారు. చర్చించి ఆ రచనలను ఎందుకు ఎన్నుకున్నదీ సంగ్రహంగా ప్రకటించాలి. ఏయే పుస్తకాలు వారి పరిశీలనకు వచ్చినదీ చెప్పాలి అప్పుడు పురస్కారమందుకున్న రచనలే తుది తీర్పుకు నిలవబడిన రచనలంత ముఖ్యం కాగలవు. ఏ గ్రంథానికి, ఏ కారణంగా బహుమతి ఇవ్వబడిందో ప్రకటించినపుడే అర్థవంతమైన వాగ్వాదం సాధ్యమవుతుంది. పురస్కారం ప్రకటించే ప్రాసెస్ కూడా సాహిత్య వాగ్వాదానికి వీలు కల్పిస్తుంది.

ప్రక్రియకు సంబంధించిన మరో ముఖ్య విషయం. ప్రస్తుతం మరాఠీలో దళితులు రాసిన ఆత్మ కథలు నవలకంటే అద్భుతంగా వున్నాయి. ఏ యూరోపియన్ భాషకూ లేని వైశిష్ట్యం మన భాషా సాహిత్యానికుంది. మన సాహిత్యాలు వివిధ మూలముల నుండి సంపన్న మవుతున్నాయి. సజీవమైన జానపద సాహిత్యం వుంది. గొప్ప క్లాసికల్ సాహిత్యం వుంది. ఇంగ్లీషు భాష లేనికాలంలో శ్రేష్ఠ సాహిత్యాన్ని సృష్టించిన పంప మహాకవి (కన్నడ భారత కర్త) వున్నాడు. మూడవది మన సంస్కృత సాహిత్యం. ఈనాటికీ కొన్ని సంస్కృత రచనలు మనలను ప్రభావితం చేస్తున్నాయి.

నాల్గవ అంశం యూరోపియన్ సాహిత్యం గురించి. మన దేశంలో కాలేజీలో చదువు ప్రతి విద్యార్థికీ షేక్స్‌పియర్ తెలుసు. కాని యూరోప్‌లో ఇండాలజీ చదివే విద్యార్థికి మాత్రమే కాళిదాసు గురించి తెలుసు. ఇలా సాంస్కృతికంగా మనం సమృద్ధమైన వారం.

ప్రశ్న: బహుళత్వం వికేంద్రీకరణానికి సన్నిహితంగా వుంటుంది. సాహిత్య అకాడమి సంవిధాన స్వరూపం యొక్క వికేంద్రీకరణకు మీరేదైన నిర్దిష్టమైన విధానం పాటిస్తున్నారా?

**జవాబు:** ఇంతవరకు నిర్దిష్ట విధానం నిర్ధారణ కాలేదు. మొదట మన దేశంలో హేతుబద్ధమైన చర్చ జరగాలి. రవీంద్రనాథ టాగూర్ నవల 'గోరా'పై చర్చ జరగాలి. డిసెంబర్ 6న* జరిగిన సంఘటన. హిందుత్వం దాని వైశిష్ట్యం - ఏం జరిగింది ఏం జరగాలి. ఈ విషయంగా టాగూర్ ఈ శతమానం ఆరంభంలోనే తీవ్రంగా ఆలోచించి ప్రపంచమందలి గొప్ప నవలల్లో ఒకటైన 'గోరా' రచించారు. 'గోరా' నవలపై ఢిల్లీలోనే కాదు అన్ని భాషలలో, అన్ని చోట్లా చర్చ జరగాలి. ఆ తర్వాత ప్రేమ్‌చంద్ నవలపై - ఆ తర్వాత శివరామకారంత్ నవలపై అన్ని భాషల్లోనూ, జరగాలి. అనువాదాలున్న చోటల్లా జరగాలి. ఇలా దేశమంతటా చర్చ జరగాలి. ఈ విధంగా బహుళత్వ ప్రధానమైన దేశంలో తులనాత్మక విమర్శ జరగాలి. దేశంలోని విభిన్న భాషల తులనాత్మక అధ్యయనం సాగాలి. ఇట్టి అధ్యయనం వల్ల మన దేశం ఇతర దేశాలకు మార్గదర్శకం కావాలి. వేర్వేరు భాషలలో ఇతర భాషల్లోని రచనలపై విమర్శ జరగాలి. వికేంద్రీకరణం గురించి మొదట నాకు తోచిన అభిప్రాయాలవి కొన్ని నవలలపై చర్చ కొనసాగాలి.

'గోరా' నవలపై నాకీ అభిప్రాయం కలగటానికి డిసెంబర్ ఆరు నాటి సంఘటనలకు సంబంధం వుంది. మరో విచారధారకు అవకాశమివ్వాలి.

ప్రశ్న: డిసెంబర్ ఆరునాటి సంఘటనను పేర్కొన్నారు. అకాడమి అధ్యక్ష పదవి స్వీకరించిన తర్వాత మీ మొదటి ప్రసంగంలో ఈ విషయం ప్రస్తావించారు. ఈ విషయంగా మనం చేయాల్సిందెంతో వుందన్నారు. ఆ విషయం కొంత విపులంగా తెల్పండి.

**జవాబు:** అదో స్పిరిచ్యుయల్ ఎక్స్‌పీరియన్స్. అవును ఆనాడు అయోధ్య గురించి మాట్లాడాను. నా ప్రసంగం విన్న తర్వాత ఒక కాశ్మీరి రచయిత నా వద్దకు వచ్చాడు. పురస్కారం తిరస్కరించాలనుకున్నాడట కాని నా ప్రసంగం విన్న తర్వాత మనసు మార్చుకున్నాడట. భారతీయ సాంస్కృతిక ఇథోస్ కొన్ని ముఖ్యమైన వాగ్వివాదాల మూలంగా ఏర్పడింది. గాంధీజీ టాగూర్‌ల మధ్య జరిగిన వాగ్వాదం. జాతీయతను గురించిన వాదోపవాదం. ఇట్టి వాదనలు జరగాలి.

డిసెంబర్ ఆరు నాటి సంఘటనలు మన సాంస్కృతిక శక్తిని విచ్ఛిన్నం చేయటానికి ప్రయత్నించాయి. బహుళత్వ ప్రధానమైన దేశంలో ఏకత్వ బద్ధులుగ మనలను మార్చటానికి ప్రయత్నం జరిగింది. ఈ ఏకత్వ వాదం రాజకీయ బలాన్ని పెంచుకోవటానికి చేసిన ఒక తంత్రం. ఇంతకంటే ముఖ్య విషయం. నేను హిందూ మతంలోని ముఖ్యాంశములతో ప్రభావితమయ్యే తత్వం కలవాణ్ణి. ఆర్.ఎస్.ఎస్.లాంటి వాళ్ళు నన్ను హిందువును కానీయకుండ చేస్తున్నారు. హిందువు అనిపించుకోడానికి

* అయోధ్యలో బాబ్రీ మసీదు విధ్వంసనం 1994 డిసెంబరు 6న జరిగింది.

సిగ్గుపడేటట్లు చేస్తున్నారు. అందుకే నేను వారిని వ్యతిరేకిస్తాను. నాకు రామకృష్ణ పరమహంస కావాలి. వివేకానంద కావాలి. రమణ మహర్షి కావాలి. గాంధీ కావాలి. బసవేశ్వరుడు కావాలి. దేవాలయాలన్నీ అర్థం లేనివన్నాడు బసవేశ్వరుడు. మందిర్ - మసీదులన్నీ 'మీనింగ్ లెస్' అన్న కబీర్ కావాలి. నిబద్ధతకు కట్టుపడే రాజకీయం నాకు వద్దు. అలా అయినపుడు నా సాహిత్యసృష్టికి కావలసిన నేపథ్యాన్ని నేను కోల్పోతాను. ఈ సమృద్ధమైన పుష్టభూమి ఇస్లాం నుండి వచ్చింది క్రైస్తవ మతం నుండి వచ్చింది. దేవుడు లేడు అన్న వాదం నుండి వచ్చింది. ఎన్నో భావాల సంఘర్షణ నుండి వచ్చింది. అందువల్ల సాహిత్యం గురించి మాట్లాడే ముందు ఈ విషయం చర్చించాలనిపించింది.

ప్రశ్న: సెక్యులర్ అనే పదం - పరిభాష మూలంగా ప్రజలను చేరలేము అంటున్నారు. ఈ విషయం వివరించేది:

**జవాబు:** మనలో సెక్యులర్ అన్న పదానికి మత నిరపేక్షత-ధర్మ పవిత్రతా భావాన్ని నాశనం చేసే పెట్టుబడిదారీ శక్తిని పెంచే ఆలోచనలవి. మరోమాట బి.జె.పి. వారు భారతదేశాన్ని అమెరికా, ఇజ్రేల్ లాంటి రాష్ట్రాలుగ మార్చాలనుకుంటున్నారు. అందుకు యూరోప్ వత్తాసువారికి లభించవచ్చునని నా అనుమానం. నెహ్రూ గారికి ఆధునికీకరణ పట్ల వ్యామోహం వున్నా గాంధీని వదులుకోలేదు.

ప్రశ్న: పవిత్రతను గురించి మాట్లాడేటప్పుడు ఒక ప్రశ్న తలఎత్తుతుంది. అక్రమమైన వినాశకరమైన ధోరణిని వ్యతిరేకించటం పవిత్రత ఆధారం పైనేనా? అంతకు మించినదేమైనా వుందా!

**జవాబు:** మన చరిత్ర నుండి మనం నేర్చుకోవాల్సిన అంశాలెన్నో వున్నాయి. ఇస్లాం భారత దేశంలో వున్నంత సమృద్ధంగా, శ్రీమంతంగా మరేదేశంలోనూ లేదు ఇస్లాం మతం మరో మతంతో కలసి జీవించటానికి వున్న ఆవశ్యకత మరెక్కడా కానరాలేదు. ఇక్కడ మాత్రమే ఆ వీలు కల్గింది. సంగీతం, శిల్పం, అక్బర్ కాలంనాటి చిత్రకళ ఇలా వివిధ రంగాల్లో అందజేసిన ప్రయోజనాలున్నాయి. హిందూమతంలోని హిపోక్రసి ఇస్లాంలో కనిపించదు. తత్వ రీత్యా గొప్పగా మాట్లాడుతాం కాని ఆచరణలో అల్పత్వం చేస్తాం. వారిలో ఈక్వాలిటి అంటే అది నిజమైన ఈక్వాలిటి.

నేను రాజకీయ వాదినై వుంటే ముస్లిమ్‌లతో ఇలా అనేవాణ్ణి "మీరు ఈ దేశంలో పెరిగినట్టు, మీ మహిళలు పెరిగినట్టు మరే దేశంలోనూ పెరిగేందుకు వీలులేదు. ఈ దేశంలో మీరు మీ మతాచారాలను వదులుకోకుండా మీకు కావలసిన రీతిగా వ్యాఖ్యానించవచ్చు. ఇది మౌల్వీల పాలనలో సాధ్యం కాదు. అందువల్లనే మీరు పాకిస్తాన్‌లో కంటే ఇక్కడ వుండటమే మీకు శ్రేయస్కరం. రాజకీయ వాదులు మాత్రమేకాదు మీరు, మేము చేయవలసిన పని ఇది."

ప్రశ్న: మనం ఇకముందు వాస్తవాలనే అనుసరించాలన్నారు. అయోధ్య తర్వాత విషయమే చర్చించాలి అన్నారు. దానివల్ల మన క్రియేటివిటికి ఆస్పదం వుంటుందా?

**జవాబు:** కథ రాయటం, లేదా కావ్యం రాయటం మాత్రమే సృజనాత్మకత కాదు.

ఉత్తమ  సాహిత్యం మనసుకు ఆహ్లాదం కలిగించుటతోపాటు సత్యాన్ని చాటుతుంది.

**ప్రశ్న:** మీరు 'సంస్కార' అన్న నవల రాసినపుడు ఒక వర్గం వారు మాత్రమే మిమ్మ  వ్యతిరేకించారు. కాని సల్మాన్ రష్దీ 'సెటానిక్ వర్సస్' రాసినపుడు ముస్లిం ప్రపంచమంతా వ్యతిరేకించింది. ఇందుకు మీరేమంటారు?

**జవాబు:** రష్దీ నా మిత్రుడు. కాని ఆ రచన ఉత్తమ రచన కాదు. పవిత్రతను వ్యతిరేకిస్తూ  రాయాలనుకున్నప్పుడు తీవ్రమైన అధ్యయనం చేయాలి. నేను రచయితగా మరో రచయితకు ఇచ్చే సలహా ఇది. రష్దీని  చంపమని కాదు ఇస్లాంలో కూడా ఆధునికతపట్ల పాశ్చాత్య ధోరణిపట్ల వ్యతిరేకత వుంది. వేస్ట్ నుండి మన  ప్రభావానికి ఆటంకం కలుగవచ్చునన్న భయం వారికుంది.

ఫండమెంటలిస్ట్ అయ్యే ప్రమాదం నివారించుటకు మార్గం గాంధీమార్గంలో వుంది. గాంధీ ఎన్నో అంతర్గత  సంఘర్షణలను అవగాహన చేసుకొని భారతదేశ సమగ్రత కోసం కృషి చేశాడు. రామజన్మ భూమి కావాలన్నవారు  కేవలం ఫండమెంటలిస్ట్లు కారు. యూరోప్‌వలె బలిష్ఠమైన రాజ్య నిర్మాణం కావించాలనుకుంటున్నారు. వారిపట్ల నాకు  విరోధముంది.

● *31-5-93* ఆంధ్రజ్యోతి ●

★ ★ ★

వ్యాస భారతి

# సాహిత్యాకాశంలో ధ్రువతార 'వావిళ్ళ'

"చేతి వ్రాత పుస్తకములు చదువుకొనే దినాలలో శ్రీ వావిళ్ళ రామస్వామి శాస్త్రులు వారు ముద్రణాలయమును స్థాపించి చదువరుల కష్టముల నివర్తి చేసిరి" అని ఆంధ్రభాషా సముద్ధారకుడైన సి.పి. బ్రౌన్ ప్రశంసలందుకొన్న మహనీయులు వావిళ్ళ రామస్వామి శాస్త్రులు.

గత శతాబ్దం మొదలు, ఆంధ్రప్రదేశ్ అవతరించేవరకు ఆంధ్ర భాషా వాఙ్మయాలకు మద్రాసు నగరమే కేంద్రంగా వుండేది. విద్వత్కవులకు, చక్కని అచ్చు యంత్రములకు మద్రాసు నగరమే నిలయంగా వుండేది. తెలుగు లిపిలో సంస్కృత గ్రంథాలు, తెలుగు పద్య గ్రంథాలు, జానపద వాఙ్మయం ప్రచురించే వారిలో బి.వి. రంగయ్యశ్రేష్ఠి, వంకాల కృష్ణస్వామి సెట్టి మొదలైన వారు పేరు గాంచారు వారు సొంత ముద్రణాలయాలలో పుస్తకాలను చవక రకం కాగితం పై ముద్రించి, చవక వెలకు అమ్మేవారు. అప్పట్లో రీము కాగితం వెల ఒక రూపాయి! పదానికి పదానికీ మధ్య స్థలం లేకుండా అక్షరాలు కూర్చేవారు. అచ్చు తప్పులు తప్పనివి కాదు. నిరక్షరాస్యత ఎక్కువగా వుండేది. ప్రచురింపబడిన పుస్తకాలకు తగిన ఆదరణ వుండేది కాదు.

సి.పి.బ్రౌన్ గ్రంథ సేకరణ, పరిష్కరణల ద్వారా లభించిన శ్రమ ఫలితాన్ని గ్రంథ రూపంలో పెట్టిన తెలుగు ప్రచురణ కర్తలలో అగ్రగణ్యులు వావిళ్ళ రామస్వామి శాస్త్రులు.

శాస్త్రుల వారు నెల్లూరు జిల్లా కోవూరు తాలూకాలోని 'వావిళ్ళ'లో 1826లో జన్మించారు. తండ్రి వేంకటేశ్వరశాస్త్రి, తల్లి మంగమ్మ వీరికి నలుగురు కుమారులు, ఒక కుమార్తె. వారందరిలో చిన్నవారు రామస్వామిశాస్త్రి. పండితులైన తండ్రి గారి వద్దనే సంప్రదాయబద్ధంగా వారి విద్యాభ్యాసం సాగింది. అందరిలో పెద్దవారైన వేంకటరమణ శాస్త్రిగారు నెల్లూరులో ఇంగ్లీషు నేర్చుకొని బళ్ళారి కలెక్టరు ఆఫీసులో గుమస్తాగా స్థిరపడ్డారు. రెండో అన్న సుబ్రహ్మణ్యశాస్త్రి సాధారణ విద్యతో తృప్తి చెంది స్వగ్రామమందే స్థిరపడ్డారు. తర్వాతి వారు అనంతనారాయణ శాస్త్రి, రామస్వామి శాస్త్రి.

చివరి సోదరులైన అనంతనారాయణశాస్త్రి, రామస్వామి శాస్త్రి నెల్లూరు చేరి విద్యాశేఖరులైన గట్టుపల్లి శాస్త్రుల వద్ద వేదాధ్యయనం ముగించి, ద్రాక్షారామం వెళ్ళి సుప్రసిద్ధ వ్యాకరణ పండితులైన పాపయ్యశాస్త్రిగారి శిష్యులుగా వ్యాకరణం అధ్యయనం చేశారు. సోదరులిద్దరూ చెన్నపట్నం చేరి తండియార్పేటలోని, తంజావూరు

రామానాయనివారి సంస్కృత వేద పాఠశాలలో, సరస్వతీ తిరువెంగడాచార్యులతో కలిసి తమ సాహిత్య వ్యాకరణ జ్ఞానానికి మెరుగులు పెట్టుకున్నారు. అక్కడే కొంత కాలం ఉపాధ్యాయులుగా పనిచేశారు. విద్వాంసులకు మైసూరు సంస్థానంలో గౌరవాదరములు హెచ్చుగా లభిస్తున్నాయని తెలుసుకుని అక్కడి మహారాజు ముమ్మడి కృష్ణరాయల ఆశ్రయాన్ని, సంపాదించుకున్నారు. కన్నడ భాష నేర్చుకొని, మిత్రుల ప్రోత్సాహంతో ముద్రణాలయం నెలకొల్పి కన్నడ లిపిలో రామాయణ భారతాదులను ముద్రించారు. ఆ ప్రయత్నంలో తగిన ప్రోత్సాహం కరవైంది. మహారాజుగారి వేద సంస్కృత పాఠశాలలో అధ్యాపకులుగా కొంతకాలం పనిచేశారు.

మద్రాసులో ఉన్నప్పుడే శ్రీ శృంగేరీ పీఠాధిపతుల దర్శన భాగ్యం లభించింది. శృంగేరీ వెళ్ళారు. పీఠాధిపతులు వావిళ్ళ సోదరుల విద్యా విశేషాలకు సంతోషించి మూడు వందల రూపాయిలు సంభావన అందజేసి అనుగ్రహించారు. మద్రాసు వెళ్ళి సంస్కృత తెలుగు గ్రంథముల సంపాదకత్వం, ప్రచురణ కర్తృత్వం జరుపునట్లు ప్రోత్సహించారు.

సోదరులిద్దరు మద్రాసులోని ప్రముఖుల ప్రోత్సాహంతో, శ్రీ వేదం వేంకటాచల శాస్త్రితో కలిసి 'వివేక రత్నాకర' ముద్రణాలయాన్ని ప్రారంభించారు. కొన్ని గ్రంథాలను ప్రచురించారు. ఆశించినట్టు సాగనందున నెల్లూరు వారైన ఆసూరి సరస్వతీ తిరువేంగదాచార్యులతో కలిసి "సరస్వతీ నిలయ ముద్రాక్షరశాల"ను స్థాపించారు. ఈ ప్రయత్నం కూడా విఫలమైంది. 1854లో రామస్వామి శాస్త్రిగారు తండియార్పేటలోని సొంత ఇంటిలో "ఆది సరస్వతీ ముద్రణాలయము"ను నెలకొల్పారు.

ఆది సరస్వతీ నిలయ ముద్రణాలయం నుంచి 140 పుస్తకాలను ప్రచురించి తెలుగు వారి కత్యంత ఉపకృతి గావించిన మహనీయులు వావిళ్ళ రామస్వామి శాస్త్రిగారు. వారు స్వయంగా తాటాకు ప్రతులను సేకరించారు. పండితుల చేత పరిష్కరింపజేశారు. తీరిక దొరికినప్పుడు స్వయంగా పరిశోధించి ప్రెస్ కాపీలు సిద్ధం చేయించారు. కొన్ని గ్రంథములకు - ఆముక్త మాల్యద, మనుచరిత్రలకు వ్యాఖ్యానాలు వ్రాశారు. వైదిక ఆచార వ్యవహారాది విషయాలలో నిష్ణాతులైన రామస్వామి శాస్త్రిగారి పాండితీ గరిమకు ముగ్ధులైన ప్రెసిడెన్సీ కాలేజీ తెలుగు పండితులు, మహా మహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నం పండితులుగారు శాస్త్రుల వారికి అత్యంత సహాయకారులుగా వుండేవారు. శాస్త్రుల వారు సంస్కృతాంధ్రములలో అఖండ పండితులుగా ప్రశంసలందుకున్నారు.

రామస్వామి శాస్త్రిగారు ముద్రణలోని తప్పులను తొలగించుటకు, అవలంబించిన విధానమును కథగా చెప్పేవారు. ముద్రణకు సిద్ధము చేయబడిన ఫారమును ముద్రణాలయం బయట ప్రదర్శించి అందులో దోషమును కనిపెట్టిన వారెవరైనా సరే, వారికి ఒక దోషానికి 8 అణాలు చొప్పున ఇచ్చేవాళ్ళు. (తెలుగు వాఙ్మయము వావిళ్ళ రామస్వామిశాస్త్రి గారి కృషి-పుట 7- పునుగు వెంకట శంకరశాస్త్రి)

"వావిళ్ళ వారు రామాయణమును (18 సంపుటాలు) భారతమును దేవనాగరి లిపిలో ముద్రించి వెలువరించినందుకు వారిని ఘనంగా సత్కరించారు. ఆ రెండు

గ్రంథములను పట్టుపు ఏనుగు అంబారిపై పెట్టి మంగళ వాద్యములతో, పురప్రముఖులు వెంట నడువ నగర ముఖ్య వీధులలో అత్యుత్సాహంతో ఊరేగించినారు" (ఆంధ్ర వాఙ్మయము-వావిళ్ళ-డాక్టర్ మరుపూరి కోదండ రామిరెడ్డి-పుట 105)

తెలుగు పుస్తక ప్రచురణా రంగంలో ఆద్యులుగా, ప్రసిద్ధ పండితులుగా విఖ్యాతి గాంచిన వావిళ్ళ రామస్వామిశాస్త్రుల వారు 1891 మే నెలలో దివంగతులయ్యారు

"ఈనాటికీ తెలుగు దేశమున సర్వే సర్వత్రా వ్యాప్తిలో వున్న, గ్రేట్ ప్రైమర్ అనే టైపును మొదట కనిపెట్టి పోత పోయించిన వారు రామస్వామి శాస్త్రుల వారే."

తండ్రిని మించిన తనయుడిగా, భాషోద్ధారకులుగా, కళాప్రపూర్ణులుగా విఖ్యాతులై జీవితాంతం సంస్కృతాంధ్ర సాహిత్యములకు అనన్యంగా, నిస్వార్థంగా సేవలందించిన మహనీయులు వావిళ్ళ వేంకటేశ్వర శాస్త్రి.

వావిళ్ళ రామస్వామి శాస్త్రి కుమారులైన వేంకటేశ్వరశాస్త్రి 1884 ఏప్రిల్ 1వ తేదీని జన్మించారు.

వేంకటేశ్వర శాస్త్రి ప్రాయానికి వచ్చిన వెంటనే ప్రచురణ కార్యమును స్వయంగా చేపట్టారు. ప్రెస్ పేరు "వావిళ్ళ"గా మారింది వీరి కాలంలోనే.

వేంకటేశ్వర శాస్త్రిగారు ఒకసారి బొంబాయికి వెళ్ళినప్పుడు నిర్ణయసాగర్ ప్రెస్‌కు పోయి వారి కార్యాచరణవిధానమును గమనించారు. ప్రతి ప్రూఫ్‌ను ఆరుగురు పండితులు పరిమాచేవారు. ఆ పద్ధతినే అనుసరించాలని నిశ్చయించారు. అందువల్లనే వావిళ్ళ వారి పుస్తకాలలో అచ్చు తప్పులు కలికానికైనా కనబడకుండా వుండేవి.

శాస్త్రిగారు పూర్వాచార సంపన్నులైనా మూఢ విశ్వాసి కాదు. సేవా తత్పరులు. వేయింటికి పైగా వివిధ గ్రంథాలను మేటి పండితులచే పరిష్కరింప జేసి నిర్దుష్టంగా ముద్రణ కావించి సాహిత్యాభిమానులకు వాటిని చదివే అవకాశం కల్పించారు. శాస్త్రిగారి భాగ్యవశమున మహనీయులైన స్వామి వివేకానంద, షిర్డిసాయిబాబా, రమణ మహర్షి, అరవింద ఘోష్‌ల పరిచయంతో పాటు స్వాతంత్ర్యోద్యమ నాయకులైన లోకమాన్య బాలగంగాధర తిలక్, లాలా లజపతిరాయ్, దేశబంధు చిత్తరంజన్ దాస్, ఎస్ శ్రీనివాస అయ్యంగార్ మొదలగు వారితో కలిసి పనిచేశారు. గాంధీజీతో పరిచయంతోపాటు, ఆంధ్ర ప్రముఖులైన ప్రకాశం, సాంబమూర్తిగార్లతో సన్నిహిత అనుబంధాలుండేవి. రాజాజీ, సత్యమూర్తిగార్లు శాస్త్రిగారికి సుపరిచితులైన కారణంగా మద్రాసు నగరంలోని అన్ని రంగాల్లోను ప్రాముఖ్యం వహించారు. బ్రాహ్మణేతర ప్రాబల్యం కలిగి వుండిన పచ్చయప్పమొదలి ట్రస్టు బోర్డు మెంబరుగా 25 ఏండ్లు పనిచేశారు. అందరితోనూ కలిసిమెలిసి వున్న స్నేహశీలి శాస్త్రిగారు.

ఆంధ్ర ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో తెలుగు వారి ప్రాముఖ్యతను వెల్లడించుటకై ఆంధ్ర ఛాంబర్ ఆఫ్ కామర్స్‌ను 1929లో స్థాపించి తొలి గౌరవ కార్యదర్శిగా, ఉపాధ్యక్షులుగా ఆ సంస్థకు గట్టి పునాదులు వేశారు. మద్రాసు పోర్టుట్రస్టు, సౌత్ ఇండియన్ అథ్లెటిక్ అసోసియేషన్, సుగుణ విలాస సభ మొదలైన సంస్థలలో ప్రముఖ సభ్యులుగా వుండేవారు.

కార్మికోద్యమ రంగంలో ప్రవేశించి ఆనాటి ట్రామ్‌వే, రేవు, మిల్లు కార్మికుల శ్రేయస్సు కోసం ఎంతో కృషి చేశారు. సమ్మెల నివారణకు తోడ్పడి నిర్వాహకులతో పాటు కార్మికుల ఆదరణను చూరగొన్నారు.

విద్యార్థుల పట్ల అత్యంత ఆదరణ కలవారు. బీద విద్యార్థులకు భోజన వసతి, ఉపకార వేతనాలు, పుస్తక సామగ్రి సమకూర్చి విద్యాదాతగా ఖ్యాతి గాంచారు.

కాంగ్రెసు పెద్దలకు చాలాసార్లు గుప్తంగా ఆర్థిక సహాయం అందించారు. మహావక్త ఎస్. సత్యమూర్తి, తమిళ జాతీయకవి సుబ్రహ్మణ్య భారతికి పలుమార్లు ఆర్థిక సహాయం అందించారు. ఆంధ్రకేసరి పటాలున వచ్చి "ఏమిరా వేంకటేశ్వర్లూ, బొంబాయికి పోవాలి రా. పైకం ఇప్పించు" అన్నప్పుడల్లా వందలకొద్దీ ఇచ్చేవారు

ఎన్నో గ్రంథాలయాలకు ఉచితంగా పుస్తకాలిచ్చారు. కవుల నెందరినో పోషిస్తూ వారి గ్రంథాలను స్వయంగా ప్రచురించారు. తిరువత్తియూరు ఆనరరి మెజిస్ట్రేట్ కోర్టు అధ్యక్షులుగా 1927-42 వరకు పనిచేశారు.

శాస్త్రిగారు 'త్రిలిజ్ఞ' పత్రికను 1916లో మాస పత్రికగా ప్రారంభించారు. 22 సంవత్సరాలు వారపత్రికగా నడిచి 1941 ఆగష్టులో ఈ పత్రిక రజతోత్సవం పెద్ద ఎత్తున జరుపుకొన్నది.

శాస్త్రిగారు 1927 జనవరిలో 'ఫెడరేటెడ్ ఇండియా' అనే ఆంగ్ల వార పత్రికను ప్రారంభించారు ఈ పత్రికకు మొదటి ఎడిటర్ కె. వ్యాసరావుగారు.

'బాల వినోదిని' అనే బాలల తమిళ మాస పత్రికను సుబ్రహ్మణ్యభారతి గారి సహకారంతో ప్రచురించారు. వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రి నిష్కామ కర్మయోగి. వారి సేవలను గుర్తించి కాశీ క్షేత్ర విద్వన్మండలి 'శాస్త్ర ప్రచార భూషణ' బిరుదుమిచ్చింది. ఆంధ్ర పండిత లోకం కడపలో గొప్ప సభ జరిపి 'భాషోద్ధారక' బిరుద ప్రదానం చేశారు. ఆంధ్ర విశ్వవిద్యాలయం 1955లో 'కళాప్రపూర్ణ' పట్టాతో గౌరవించింది

లోకమాన్య తిలక్‌గారి పట్ల అత్యంత గౌరవభావం కలిగిన శాస్త్రిగారు తిలక్ మాండలే జైలులో వ్రాసిన 'గీతా రహస్యం' గ్రంథాన్ని తెలుగులోకి అనువదింపజేసి, ప్రచురించారు. శాస్త్రిగారిని మద్రాసులో ఘనంగా సత్కరించిన సభలో పిఠాపురం రాజాగారు వేపా రామేశం (హైకోర్టు జడ్జి) అల్లాడి కృష్ణస్వామి అయ్యర్, జవమంచి శేషాద్రిశర్మ మొదలైన వాళ్ళు పాల్గొని, వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రులుగారి సన్మాన సంచిక (1100 పుటలు) వెలువరించారు. ఇంగ్లీషులో 300 పేజీల్తో 'కమెమొరేషన్ వాల్యూం' సమర్పించారు.

సాంఘిక, సాహిత్య సేవా రంగాలలో దాదాపు 5 దశాబ్దాలు అవిరళ కృషి చేసిన శాస్త్రిగారికి దురదృష్టవశంగా పక్షవాత వ్యాధి సోకింది. 1942లో మంచాన పడినారు. దైవానుగ్రహం కొద్దీ వారి మేధా శక్తికి ఎటువంటి భంగం కలుగనందున పడకలోనే వ్యవహారాలన్నింటినీ దక్షతతో నిర్వహించారు. ప్రతిదినము వారిని చూడవచ్చే పండితులు, మిత్రులు, విద్యార్థులు, అభిమానులతో కాలం వెళ్ళబుచ్చేవారు.

తమకు సంతానం లేనందున తమ సోదరి కుటుంబాన్ని చేరదీసి వారిని పెంచి పెద్ద చేసి విద్యాబుద్ధులు కలిగించారు వృద్ధాప్యంతో పాటు వ్యాధి తీవ్రత కారణంగా 1956లో వేసవిలో కాలధర్మం చెందారు.

వారి మరణానంతరం ఏర్పడిన అనూహ్య పరిస్థితుల కారణంగా వావిళ్ళ మహా సంస్థ చిక్కుల పాలై మద్రాసు అఫిషియల్ ట్రస్టీ అధీనంలో పడింది. దాదాపు 14 దశాబ్దాల పాటు విశిష్టంగా భాషా సేవ చేసిన వావిళ్ళ సంస్థ అంతరించినందుకు సాహిత్యాభిమానులెంతగానో బాధపడినారు.

ఆ విపత్కర పరిస్థితి నుండి సంస్థను కాపాడి, సంస్థను పునరుద్ధరించుటకు వావిళ్ళ రామస్వామి శాస్త్రిగారి పుత్రిక అల్లాడి శారదాంబగారు న్యాయం కోసం పోరాడారు. వీరు కన్నుమూసిన తర్వాత వారి సంతానం వ్యాజ్యము సాగించి సంస్థకు విముక్తి కలిగించారు

"సంస్కృతాంధ్ర సాహిత్యాలు భువిలో వున్నంత కాలం సాహిత్యాకాశంలో 'వావిళ్ళ'నామం ధ్రువతారగా ప్రకాశిస్తూనే వుంటుంది".

● *ఆంధ్రజ్యోతి 16-6-1997* ●

★ ★ ★

# ఒరియా సాహిత్యం ఒక పరిచయం

మనదేశానికి తూర్పుతీరంలో, ఆంధ్రప్రదేశ్‌కు ఈశాన్యంలో వున్న రాష్ట్రం-ఒరిస్సా. ఇక్కడి ప్రజలు, వారి భాష, కళలు, సాహిత్యం - అన్నీ 'ఒరియా' అన్న పేరుతో వ్యవహరించ బడుతున్నాయి. 'ఒరిస్సా'కు మరోపేరు 'ఉత్కల'. ఇది 'ఉత్తరకళింగ' అన్న పదానికి సంక్షిప్త రూపం. ఒకప్పటి 'ఉడ్రదేశం' అన్న పేరు ఒరిస్సాగా మారిందని ఒక అభిప్రాయం. క్రీ.పూ. 3వ శతాబ్దిలో, భరతుని 'నాట్యశాస్త్రం'లో ఈ ప్రాంతమందలి భాష ఉడ్రవిభాషగా పిలువబడేది. ఈ ప్రాచీన భాషలో మాగధి, శౌరసేని మున్నగు ప్రాకృత భాషలే కాక స్థానికమైన మాండలిక పదాలు చేరి ఒరియా భాష పెరిగింది. ఒరియా భాష ప్రాచీన ప్రయోగాలు, భాషా వైశిష్ట్యాలు, వ్యాకరణ ప్రయోగాలు, ఈ ప్రాంతం భౌగోళిక వర్ణనలు మొదలగు విశేషాలు లుయిపా, బుసుకుపా, ఢెంకిఫ మొదలగు వారి కావ్యాలలో కానవస్తాయి.

ఒరియా సాహిత్య చరిత్ర మూడు యుగాలుగా విభజింపబడింది. ప్రాచీన యుగం (క్రీ.శ 1042-1435) మధ్యయుగం (క్రీ.శ.1435-1757) మరియు అర్వాచీనయుగం (క్రీ.శ.1758 నుండి నేటివరకు). అర్వాచీన యుగాన్ని సత్యయుగం, హరిత యుగం మరియు ఆధునిక యుగం - అని పేర్కొన్నారు

## ప్రాచీనయుగం

ఉత్కళదేశంలో గంగవంశ రాజుల పాలనాకాలం 11, 12 శతాబ్దాలలో ప్రాకృత భాష అపభ్రంశమై నూతన భాష నిర్మాణం కానున్న వికాసయుగం. ఈ కాలంలోనే మహాయాన బౌద్ధసన్యాసులు అపభ్రంశ ప్రాకృత భాషలో గీతాలు రచించారు. ఈ కాలంలోనే ఒరియాభాషను ఉడ్ర గీతాలు రచించారు. ఈ కాలంలోనే ఒరియాభాషను ఉడ్ర ప్రాకృత అన్నారు. శంకరదాసు 'ఖారామపి' మార్కాండదాసు 'కేళవకాయిళీ' ఈ కాలంనాటి జనప్రియ రచనలు.

## మధ్యయుగం

సూర్యవంశరాజుల (1435-1568) తొలికాలంలో ఒరియా భాష బాగా వికసించింది. సిద్ధేశ్వర పరిడా (సీరళదాసు) గారిని ఒరియా సాహిత్య పితామహుడుగా భావిస్తారు. సామాన్యుల కోసం ఆయన మహాభారతమును ముక్తఛందస్సులో రాశాడు. ఈ రచన సంస్కృత భారతమునకు అనువాదం కాదు. కాని అందలి మౌలికాంశములతో సమకూర్చబడింది. సమకాలీన జీవితం ఈ కావ్యంలో చిత్రించ బడటం మరో విశేషం. 15వ శతాబ్దం నాటి వత్సదాసకృతి- 'కళసచౌతిస' కావ్యంలో శివపార్వతుల వివాహం వర్ణింపబడింది. వృద్ధుడైన భర్త యవ్వనం తొణికిసలాడే భార్య - వీరి వివాహాన్ని

హాస్యరసభరితంగా చిత్రించాడు. 15వ శతాబ్ది కొసలో శైవుడైన అవధూత స్వామి నారాయణ ఆనందదాసుగారు గద్య పద్యములతో కూడిన 'రుద్రసుధానిధి' అన్న గ్రంథం రాశారు.

## 16వ శతాబ్ది వైశిష్ట్యం

క్రీ.శ.1510 నాటికి వైష్ణవ భక్తపథ దర్శకుడైన చైతన్య స్వామి పురి క్షేత్రంలో స్థిరపడ్డారు. సర్వ ధర్మసమన్వయ తత్వంతో విశిష్టమైన వైష్ణవ సాహిత్య రచన ప్రారంభమైంది. జ్ఞాన భక్తి తత్వాల ప్రచారమే నాటి సాహిత్య లక్ష్యం. ఈ లక్ష్యాని కనుగుణంగా బలరామదాసు, జగన్నాథదాసు, అచ్యుతానందదాసు, యశవంతదాసు గార్లు తమ రచనల ద్వారా పురాణ, శాస్త్ర, ధర్మశాస్త్రములను విరివిగా ప్రచారం చేశారు.

## క్రీ.శ. 1568 - 1757 కాలం

భారతదేశంలో ముస్లింపాలకుల కాలం, చైతన్యుల భక్తితత్వ నేపథ్యంలో ఒరియా కావ్య యుగం ప్రారంభమైంది. ఉపేంద్ర భంజ్ కవి ఈ కాలంనాటి ప్రముఖకవి. మధుసూదనరాయ్ విద్యారంగంలో గొప్ప కృషి చేయటంతో పాటు చక్కని సాహిత్య రచనలు చేశారు.

## 1758 నుండి 1994 వరకు

19వ శతాబ్దం మొదటినుండి ఒరియా సాహిత్యంపై పాశ్చాత్య సాహిత్య ప్రభావం బాగా పడింది. రాధానాథ్‌రాయ్ గారు 'మహాజాత్రా' కావ్యం, మొదటిసారి ముక్తఛందస్సులో (బ్లాంక్‌వర్స్) రాశారు. మధుసూదనగారు పెక్కు సునీతులను (సానెట్స్) ప్రగాథలను (ఓడ్స్) చ్యాలే (బ్యాలెడ్స్) రచించారు. వీరిలో రాధానాధ్‌రాయ్ గారిని ఆధునిక ఒరియా కావ్యకర్తగా భావిస్తారు.

బ్రిటిష్ పాలనాకాలం నాటి చివరి 80 ఏళ్ళలో ఒరియా సాహిత్యం మంచి పురోగతిని సాధించింది. ఫకీర్ మోహన్ సేనాపతి నవీన రీతుల నావిష్కరిస్తూ 'ఛోమణో అరగుంఠో' అను ప్రసిద్ధ నవలను 20 కథలను మరో 5 నవలలను రచించారు. 1877లో ఆయన రచించిన 'లఛమనియ' ఒరియా సాహిత్యంలోని మొదటి ఆధునిక కథ అంటారు. 1872 లో ఒరిస్సాలో తీవ్రమైన కరువు రావటంతో ప్రజలు పలు కష్టాలు అనుభవించారు. గౌరీశంకరరాయ్ తమ సొంత దినపత్రిక ఉత్కల దీపిక ద్వారా ఒరియా సమాజ స్థితిగతులు భాష, సాహిత్యం, కళలు మున్నగు వాటిని గురించి విస్తృతంగా ప్రచురించారు. గౌరీ శంకర్‌రాయ్, ఒరియా పత్రికా రంగ పితామహుడుగా పరిగణింపబడినాడు. గంగాధర్‌మెహర్ సమకాలీన సమాజ స్థితిగతులను చిత్రించారు.

రవీంద్రనాథ్ టాగూర్ గారికి 1913లో నొబెల్ సాహిత్య బహుమతి లభించింది. వారి గీతాంజలి భారతీయ భాషలన్నిటిలో అనువదింపబడింది. ఒరియా సాహిత్యంపై రవీంద్రకవి ప్రభావం బాగా పడింది. ఈ ప్రభావంతో ఒరియా సాహిత్యంలో

హరితయుగం ప్రారంభమైంది. కాళిందీచరణపాణిగ్రాహిగారి 'మాటేరో మానుష్' (మట్టి మనిషి) సుప్రసిద్ధమైన నవల.

సామాజిక ప్రగతితోపాటు జాతీయ భావాలుగల రచనలు చేసిన ఒరియా రచయితలలో గోపబంధుదాస్, నీలకంఠగోదావరిమిశ్రా, కుంతల కుమారి మున్నగువారు సువిఖ్యాతులు.

ఒరియా కావ్య నిర్మాతలలో మాయాధర్ మాన్‌సింగ్, సచ్చిదానంద రావుత్‌రాయ్, అనంతపట్నాయక్, రాధామోహనగడనాయక్, రమాకాంతరథ్, సీతాకాంత మహాపాత్ర, దీపక్ మిశ్రా సుప్రసిద్ధులు.

1877లో ఒరియా నాటకం బాగా పుంజుకుంది. ఒరియా నాటక కర్తలలో బ్రిజ్‌మోహన్ లాహో, రామశంకరరాయ్, కాళీచరణపట్నాయక్ ఒరియా నాటక యుగానికి చెందిన ప్రముఖులు. మనోరంజన్ దాస్ నేతృత్వంలో నవ్యనాటక, ఏకాంకికల రచన బాగా సాగింది.

నవల, కథారచయితలలో కాళిందీచరణమహంతి, గోపీనాథ మహంతి, వసంత కుమారి పట్నాయక్, శంతను ఆచార్య, ప్రతిభారాయ్ నవలా రచయితలుగా, బాపు చరణమిశ్రా, సురేంద్ర మహంతి, నీలమణిసాహు, చతురానంద్ మున్నగువారు గొప్ప కథలు రాశారు.

గోపాలచంద్రపహరాజ్‌గారి సంపాదకత్వంలో వెలువడిన పూర్వచంద్ర భాషాకోశ్ ప్రపంచ మందలి గొప్ప విశ్వకోశాలలో ఒకటిగా పరిగణింపబడింది. గోపీనాధమహంతి (నవల) సచ్చిదానంద రౌత్రాయ్ (కావ్యం) సీతాకాంత మహాపాత్ర (కావ్యం) జ్ఞానపీఠ పురస్కారాన్ని అందుకొన్న ఒరియా సాహితీ మూర్తులు. రమాకాంత రధ్‌గారికి సరస్వతీసమ్మాన్ పురస్కారం లభించింది.

ఒరియా సాహిత్యం విభిన్నసాహితీ ప్రక్రియలలో ముందంజవేస్తూ భారతీయ సాహిత్య చరిత్రలో ప్రతిష్ఠాత్మక స్థానం సంపాదిస్తూ వుంది.

(తరంగ సౌజన్యంతో)

● విశాలాంధ్ర ●

★ ★ ★

# భాషా ప్రపంచంలో భూకంపం

ప్రకృతి సంపదలోను, జనసంపదలోను అగ్రశ్రేణికి చెందిన భారతదేశం భాషా సంపదలో కూడా మహత్తరమైనదిగా పరిగణింపబడుతున్నది ఈ భాషా సంపదను మరింత పెంపొందించుట మన బాధ్యత. కాని మనం భాష పేర పోరాటాలు సాగిస్తూ, ప్రగతి నిరోధకులు కావటం విచారకరం.

he Worlds Languages - Edited by Christopher Moseley and R.E Asher Publisher - Routledge London and New York Price £ 395 దాదాపు రు.15000) వెల గల "ఈ బృహద్గ్రంధం భాషాప్రపంచంలోని అద్భుతాలను వెల్లడించింది. ప్రపంచ భాషల గురించి ఇంత విస్తృతమైన, లోతైన అధ్యయనంతో దాదాపు ఎనిమిదేళ్ళ ఫలితంగా ప్రచురింపబడిన ఉద్గ్రంధమిది. భాషా చరిత్రకు సంబంధించి ఇటువంటి బృహత్తరగ్రంథం ఇదివరకు వెలువడలేదని భాషాశాస్త్ర వేత్తలంటున్నారు

అతి విశిష్టమైన ఈ గ్రంథాన్ని చదివే అవకాశమే కాదు చూచే అవకాశం కూడా అందరికీ వీలుకాదు. "భాష పేర పోరాటాలు జరపటం మూర్ఖత్వం. భాషలను ద్వేషించరాదు" అన్న సందేశం అందిస్తుందీ గ్రంథం.

నేడు కానవస్తున్న మానవుడు ఈ రూపంతో భూమిపై అవతరించి 35 వేల సంవత్సరాలై వుంటుందని మానవ శాస్త్రవేత్తల అభిప్రాయం. వాచ్య భాష వాడుకలోకి వచ్చి 20 వేల సంవత్సరాలై ఉంటుంది ఈ కాలంలో మొత్తం 5 లక్షల భాషలు పుట్టాయి. అలాగే అంతరించాయి ఈనాడు ప్రపంచంలో సుమారు 6వేల భాషలు మిగిలాయి. గత 5 వందల సంవత్సరాల్లో దాదాపు వేయిభాషలు నామావశేషమయ్యాయి. రాబోవు శతాబ్దంలో మరో వేయి భాషలు మాయం కానున్నాయి. సుమారు 2 వేల భాషలకు ప్రమాదం పొంచి వుంది. భాషా శాస్త్రజ్ఞుల అంచనాలో కొన్ని భాషల ఆయుర్దాయం 3 వందల ఏళ్ళ నుండి వేయేళ్ళ లోపుగా వుంది. అంటే ప్రపంచం కుంచించుకు పోతున్నదని అర్థం.

మానవుడి సృజనాత్మక క్రియలలో ప్రముఖమైనది భాష. అది అతని జీవితంతో అవిభాజ్యంగా పెరుగుతూ వుంటుంది. భావానుబంధంతో శాఖోపశాఖలుగా విస్తరిస్తుంది సమాజంలోని వ్యక్తులు సంప్రదాయకంగా, సమ్మతితో పరస్పర వ్యవహారాలకు, భావ ప్రకటనకు వినియోగించు సంకేతాలే భాషగా ఏర్పడ్డాయి. భాష మానవ సహజాతమా? అనుకరణతో పుట్టిందా? ఈ విషయాన్ని గురించి ఒక కథ కూడా వుంది.

ఈజిప్టు రాజు మొదటి ఫెరోవాసామతిక్ (క్రీ.పూ. 663-609) రెండు వేల అయిదు వందల సంవత్సరాల క్రితం ఒక ప్రయోగం చేసి చూశాడు. మానవుని మూలభాష ఏది అన్న జిజ్ఞాస కలిగిందా రాజుకు. అప్పుడే పుట్టిన ఇద్దరు పిల్లలను

ప్రత్యేకంగా పెంచాడు. ఆ పిల్లలు వినేలా ఎవరూ మాట్లాడరాదని శాసించాడు. రెండేళ్ళపాటు ఆ పిల్లలు మానవ ధ్వనికి దూరంగా పెరిగారు. క్రమ పరిణామంలో, ఆ పిల్లలు 'బెకోస్' అని కేక వేయసాగారు. ప్రాచీన ఈజిప్టు భాషలో 'బెకోస్' అంటే రొట్టె అను అర్థమిచ్చే పదం వుంది. కాని ఆ పిల్లలు కోరింది రొట్టెకాదు! గొర్రెల అరుపును అనుకరించారు ఆ పిల్లలు మానవుడు తన ధ్వనిని పరిసరాల ధ్వనితో పొత్తు కురుర్చుకోవటంతో, 'అతని భాష' ఏర్పడుతుంది. అని ఆ ప్రయోగం నిరూపించింది. మానవ జాతి రూపొందిన మొదటి 20 వేల సంవత్సరాల్లో అతడు ఏ విధంగా వ్యవహరించే వాడన్న విషయం ఇదమిత్థంగా తెలియదు.

భాషవేరు, లిపి వేరు. భాషలు పెరిగి 20 వేల సంవత్సరాలు దాటిన తర్వాత లిపులు రూపుదాల్చాయి. లిపులు పుట్టి సుమారు 4 లేక 5 వేల ఏళ్ళు గడిచి వుండవచ్చు. ఈనాటికీ లిపిబద్ధంకాని భాషలు ఎన్నో ఉన్నాయి. అంటే సొంత లిపిలేని భాషలు. ఎరువు తెచ్చుకున్నవే ఎక్కువ. భాషపేర, లిపుల పేర పోట్లాడుకునే ప్రబుద్ధులు, ఈ గ్రంథాన్ని చదివితే చాలామటుకు కనువిప్పు కలుగుతుందనుకోవచ్చు.

ఉదాహరణకు ఇంగ్లీష్, సంస్కృత, హిందీ, మరాఠి మున్నగు భాషలకు నేటిదాక స్వంతలిపి లేదు. చాలా భాషలకు ఉపభాషలు, మాండలికాలు ఉంటాయి. ప్రపంచంలో ఎక్కువమంది మాట్లాడే భాషచీనీభాష. దానిలో వందలాది మాండలికాలున్నాయి. చీనీ భాష (1021 మిలియన్‌లు) ఇంగ్లీష్ (435 మిలియన్లు) వాటి తర్వాత హిందీ (330 మిలియన్లు) బెంగాలి 7వ స్థానం, తెలుగు 16వ స్థానం, తమిళం 18 స్థానం, మరాఠి 19వ స్థానం, కన్నడం 27వ స్థానం, గుజరాతి 28 స్థానం, మలయాళం 29వ స్థానంలో ఉన్నాయి.

వెనుకబడిన దేశాలనే వాటిలోనే పెక్కు భాషలున్నాయి భారతదేశంలో సుమారు వేయి భాషలున్నాయి. (91 భాషలలో పత్రికలు ప్రచురితమవుతున్నట్లు ఇటీవలి ప్రెస్‌కౌన్సిల్ నివేదిక) ఆఫ్రికాలో 700 భాషలు, ల్యాటిన్ అమెరికాలో 100 భాషలు ఉన్నాయి.

కొన్ని భాషలు మాట్లాడే వారి సంఖ్య చాలాకొద్ది. గ్రీస్ దేశంలోని సారెనియన్ భాష మాట్లాడేవారు కేవలం 300 మంది మాత్రమే!

ఆస్ట్రేలియా ఆదిమజాతుల వారి 200 భాషలలో, పదిమందికి మించకుండా వుండేవారు 135 రకాల భాషలు మాట్లాడుతారు. ఇక్కడి భాషల్లో 90 శాతం భాషలు కొన్ని ఏళ్ళలో మాయమవుతాయి. ప్రస్తుతం ప్రపంచ భాషలలో 300 నుండి 600 భాషలు మాత్రం సురక్షితంగా వున్నాయి.

భాషల గాథలు విచిత్రంగా ఉంటాయి. మెక్సికో దేశంలో ఈలవేసి మాట్లాడే భాష వుంది. సాంకేతికంగా ఎంతో ముందంజ వేసిన జపాన్ దేశ టైప్ రైటర్ ఇంకా వెనుకబడే ఉంది. జపాన్ భాషలోని 2000 సంకేతాలతో కూడిందా టైప్‌రైటింగ్ కీబోర్డు.

భాషలు మాత్రమే కాదు. ఆ భాషలు మాట్లాడేవారి రాత, మాట, సాహిత్యం, వ్యాకరణం, శబ్ద సంపద, పద ప్రయోగం, అభివ్యక్తి, స్వర, వ్యంజనాదులు అన్నీ

మరుగైపోతాయి. మాట్లాడుతుంటేనే భాష జీవిస్తుంది. భాషకు శ్రుతిస్మృతులే ప్రధానం. మనదేశం ఈ పద్ధతినే అనుసరిస్తున్నది.

భాషల చరిత్ర పరిశీలించిన, ప్రపంచ మానవులందరు ఒకే కుటుంబానికి చెందిన వారని అవగతమవుతుంది. భాషా శాస్త్రవేత్తలు భాషలను ప్రధానంగా పదిగుంపులుగా విభజించారు.

1) ఇండో యూరోపియన్ కుటుంబం: దీనిలో నాలుగు ముఖ్యభాగాలు:

అ) జర్మనిక్: ఇంగ్లీష్, జర్మనీ, డచ్, స్వీడన్, డేనిష్, నార్వేజియన్, ఐస్‌లాండిక్.

ఆ) రోమాన్స్: ఫ్రెంచ్, స్పానిష్, పోర్చుగీస్, ఇటాలియన్, రొమానియన్.

ఇ) బాల్టో-సాల్విక్: రష్యన్‌పాలిష్, ఉక్రేనియన్ ఝెక్, స్లావాక్, సెర్బోక్రోశియన్, బుల్గేరియన్.

ఈ) ఇండో యురోపియన్: ఇరానియన్, ఇండిక్ (ఇండో ఆర్యన్) సంస్కృతం ఇండోఆర్యన్ భాష యొక్క మాతృస్వరూపం ప్రపంచమందలి 85 శాతం భాషలు - ఈ గుంపుకు చెందినవే.

2) సేమిటా-హెమెటిక్ కుటుంబం: అరబిక్, హీబ్రూ, లిబ్యన్, బర్బర్, గెల్లా, అమరికో (ఇథియాపియా) సోమాలి మున్నగునవి.

3) సిన్హొ-టిబెటిక్ కుటుంబం: చీని, టిబెటన్, బర్మీస్ కొరియన్ మొదలైనవి.

4) ద్రవిడ భాషా కుటుంబం: తమిళం, తెలుగు, కన్నడం, మలయాళం, తుళు కొడగు మొదలైనవి.

5) ఉరాల్-ఆల్టిక్ కుటుంబం: ఫిన్నిశ్, హంగేరియన్, తుర్కి, మంగోలి, మంచూ మొదలైనవి.

6) మలయొ-పాలినేష్యన్ కుటుంబం: న్యూజీలాండుకు చెందిన మావరి, మలగాసి (మడగాస్కర్) మలయ ఇండోనేశ్యన్ వగైరా.

7) ఆఫ్రికా - నీగ్రో కుటుంబం: ఆఫ్రికా ఆదిమ జాతుల ప్రముఖ భాషలు, సుడానీస్, గీని, బాంటు, నైజీరియాకు చెందిన, హౌసా, సాహలి వగైరా.

8) అమెరికన్ ఇండియన్: రెడ్ ఇండియన్ల పలుభాషలు ఎస్కిమో, అల్యుట్స్ వగైరా.

9) కాకేషియన్ కుటుంబం: చిన్న భాషలైన జార్జియన్ సుర్క్యనొష్కన్ వగైరా.

10) పైగుంపులకు చెందని మిగతా పెక్కు భాషలు.

మన 'ముండ' భాష ఆస్ట్రిక్ కుటుంబానికి చెందినది. ఆస్ట్రేలియా, టాస్మేనియా, న్యూగినీకి చెందిన కొన్ని భాషలు, యూరోప్ చుట్టుట్లలోని బాస్క్, భాష మెడిటరేనియన్ ఉపబృందానికి చెందినది. బాస్క్ భాష చాలక్లిష్టమైనదంటారు. భూత పిశాచాలు కూడా ఈ భాషను నేర్వలేక చతికిల పడ్డాయట. యూరోపియన్ భాషలతో ఎటువంటి సంబంధంలేని ఈ విచిత్రమైన భాష దక్షిణ అమెరికా భాషలను పోలింది. బహుశ అదృశ్యమైన అట్లాంటిస్ భూ ఖండ జనుల భాష ఇదే కావచ్చు! జపాన్ ఉత్తర ప్రాంతంలో 'హుక్కైదు'లో 'ఐన' అనుభాష వాడుకలో వుంది.

మనదేశంలో పిశాచ, బిల్ మొదలగు పెక్కు విచిత్రములైన భాషలున్నాయి సంస్కృతం మృతభాష అని వాదించేవారికి ప్రపంచ భాషా చరిత్ర తెలియదు సంస్కృతం అత్యంత జీవద్భాష. అంతే కాదు పెక్కు భాషలు బ్రతికి వుండటానికి కారణంగా వుంది. భాషల పుట్టుక, వికాసం గురించిన సమగ్రమైన అవగాహన ఇంకా కాలేదు. భాషల అధ్యయనం కంటె భాషల పేర పోట్లాటే మనకు ముఖ్యంగా వుంది

భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటు తర్వాత మనలో భాషలపట్ల సంకుచిత దృష్టి పెరిగింది. మనదేశ భాషల సంపద మనకు తెలియదు. దానిని తెలుసుకునే ప్రయత్నం కంటే, మన రాజకీయ వాదులు భాషలను అస్త్రాలుగా ప్రయోగించి పరస్పర వినాశనానికి పూనుకుంటున్నారు. మనం ఈ వలలో పడికొట్టుకుంటున్నాము.

భాషా సంహార కార్యానికి మానవుని సామ్రాజ్య వాదతత్వం, స్వార్థలోలుపత్వం కారణం. దూరదర్శన్ వంటి ప్రసారసాధనం మన భాషలను సంహరిస్తున్నదంటే మీరు విశ్వసిస్తారా? భాషాశాస్త్రజ్ఞులకు భయం కలుగుతూ వుంది. ప్రసార మాధ్యమాలవల్లనే భాషా మాధ్యమానికి ముప్పు ఏర్పడనున్నది. గొడ్డలి చెట్టునే నరికినట్లు.

చిత్రవిచిత్రములైన భాషా క్రీడలలో మనం క్రీడాకారులు కావాలే కాని భాషాద్వేషులు కారాదు. మన భాషను ప్రేమించటం ఇతర భాషల పట్ల ద్వేషం కారాదు అన్న భావం అందరిలో అంకురించాలి. సబ్ కోసన్మతి దే భగవాన్.

('తరంగ కన్నడ వారపత్రిక' సౌజన్యంతో)

●విశాలాంధ్ర ●

★ ★ ★

# సరోద్ వాద్యవిద్యానిధి ఉస్తాద్ అల్లావుద్దీన్ ఖాన్

మధ్యప్రదేశ్‌లోని మైహార్ పట్టణమున గల శారదా మందిరమున గాయకుడొకడు తన్మయుడై పాడుతుండేవాడు. ఆయన గానమాధుర్యానికి, ప్రగాఢ పాండిత్యానికి ముగ్ధుడైన మైహార్ సంస్థానాధిపతి మహారాజా బ్రజ్‌నాథ్‌సింగ్ అతనిని ఆహ్వానించి తన సంగీత గురువుగా నియమించుకొన్నాడు. నాటినుండి మైహార్ అతని స్థిరనివాసమైనది. ఆ ప్రముఖ సంగీత విద్వాంసుడే 'పద్మవిభూషణ' బిరుదాంకితుడైన ఉస్తాద్ అల్లావుద్దీన్‌ఖాన్.

నూటపదేండ్ల వయస్సుగల ఉస్తాద్ మహోత్తమ గాయకుడుగనే కాక, ఉదాత్త మానవుడుగ ప్రసిద్ధుడు. ఒకప్పుడు అత్యున్నత శ్రేణికి చెందిన సరోద్ వాద్య నిపుణుడేకాక, వాగ్గేయకారుడు, సంగీతాచార్యుడు కూడ. అతడు లోక ప్రసిద్ధినందుకొన్నది సరోద్ వాద్యవిన్యాసములో అయినప్పటికి పదునెనిమిదికి పైగా వాద్యములు వాయించుటలో నిష్ణాతుడు. 'బాబా' యని అత్యంత ఆప్యాయతతో పిలువబడుతూ, ఆ గాయకశిరోమణి వర్గభావములకు కులతత్వములకు అతీతుడుగా వ్యవహరించే విశాల హృదయుడు

మతపరంగా అచ్చమైన మహమ్మదీయుడు. కాని ప్రగాఢమైన మతాతీత దృక్పధము కలవాడు. మైహార్‌లోని నిరాడంబరమైన రెండంతస్తుల అతని నివాసగృహమే అందుకు ప్రత్యక్ష సాక్ష్యము. ఆ భవన కుడ్యములపై రాధాకృష్ణుల, శ్రీరామ, శారదాదేవి, గోవిందసింగ్, ఏసుక్రీస్తుల చిత్రములు అలంకరింపబడినవి. అతని తలగడ కొకవైపు కొరాన్ ప్రతి మరొకవైపు భగవద్గీత రామాయణములుండును. ఆరోగ్యము బాగుండినంత కాలము ప్రతి దినము అయిదువందల అరువది మెట్లెక్కి శారదాదేవి దర్శనము చేసికొనెడి భక్తుడు.

సంగీత శాస్త్రమున అతడు శుద్ధ సంప్రదాయవాది. తన అసమాన గానమాధుర్యముచే శ్రోతలను మంత్రముగ్ధులుగ జేసెడివాడు. హిందుస్తానీ గానమున నొటేషన్ పద్ధతిని ప్రవేశ పెట్టుటలో ఆద్యుడేకాక 1920లో నాట్యాచార్యుడగు ఉదయశంకర్ బృందము వెంట పాశ్చాత్య దేశములలో పర్యటించి అచటి రసికులకు భారతీయగానామృతమును పంచి పెట్టిన మొదటి భారతీయుడు. అంతకు మించి పండిట్ రవిశంకర్, అలీఅక్బర్‌ల వంటి విశ్వవిఖ్యాతులైన కళాకోవిదులను, గాయకులను తీర్చిదిద్దిన సంగీత కళాశిల్పి ఉస్తాద్ అల్లావుద్దీన్ ఖాన్.

సంగీత శాస్త్రమునకు యీతడు చేసిన సేవలకు భారతప్రభుత్వం గుర్తుగా "పద్మవిభూషణ" బిరుదముతో సత్కరింపబడిన ప్రథమ సంగీత కళావిద్యచతుష్టయములో యీయన ఒకరు.

జావవుది హేమమచ్ఛాస్త్రి

బాల్యమాదిగ అష్టకష్టముల కోర్చి నిద్రాహారములు మాని నానా యాతనల నెదుర్కొని సంగీత విద్యారహస్యములను సాధించిన తపస్వి ఆయన.

అల్లావుద్దీన్ ఖాన్ 1862లో త్రిపురా రాష్ట్రములోని శివపూర్ అనే గ్రామములో సామాన్య రైతు కుటుంబములో జన్మించెను. తల్లికి, తన పుత్రుడు పెద్దగా చదువుకోవలెననే ఆశ బలంగా వుండేది తండ్రి సాధూఖాన్ మంచిగాయకుడు. అతనినుండి సంగీతాభిరుచి సంపాదించుకొన్నాడు ఆలమ్ అనే పేరుతో పిలువబడుతుండిన అల్లావుద్దీన్ ఖాన్, ఆలమ్ బడికి నామాలు పెట్టూ తల్లిపోరు పడలేక ఎనిమిదవయేటనే యిలువదలి పారిపోయాడు.

తల్లికి తెలియకుండా ఆమె పెట్టెలో నుంచి కొంత డబ్బు తీసుకొని ప్రయాణం సాగించాడు దారిలో దుండగులు నాలుగు తన్ని వున్న కొంత పైకాన్ని దోచుకొని వెళ్ళారు ఢాకా పరిసర ప్రాంతములలో అల్లల్లాడుచు ఎట్లో కాలం వెళ్ళ బుచ్చుచూ పడిగాపులు పడ్డాడు. కొంతకాలం తర్వాత కలకత్తా చేరాడు. కలకత్తాలో తన అసలు పేరుతోనేగాక, మన్‌మోహన్ డే, ప్రసన్న కుమార్ బిశ్వాస్ అనే పేర్లతో ప్రముఖగాయకుల నెందరినో ఆశ్రయించాడు. చివరకు నందగోపాల్ అనే సంగీత విద్వాంసుడు ఆలమ్ యొక్క ప్రతిభను గుర్తించి తనయింటనే వుంచుకొని గాత్రసంగీత శిక్షణ నిచ్చాడు. గాత్ర సాధనలో ఏడేండ్లపాటు అపూర్వంగా సాధన చేశాడు ఆలమ్.

సంగీత సాధనలో ఒక దశ చేరుకొనే సుసమయమది. దురదృష్ట వశమున ఆలమ్ కుటుంబీకుల కీతని జాడ తెలిసినది. బలవంతంగా గ్రామానికి తీసుకొని వెళ్ళడం పదేళ్ళ అమ్మాయిని ముడివేయటం జరిగినది. వివాహబంధముకంటె సంగీతానుబంధము గాఢమైనది. శోభనపు గదిచేరిన కొన్ని నిముషాలకే ఇల్లువదలి కలకత్తాకు పరుగెత్తాడు గురువు నేర్పిన గీతములను గానము చేస్తూ నందగోపాల్ గారి యిల్లు చేరేసరికి అతని శవ సంస్కార సన్నాహములు జరుగుచుండినవి. ఆ సంఘటన అతనికి హృదయవిదారకమైనది. అంతటితో గాత్రసాధనము మాని వాద్య సాధనకుపక్రమించాడు.

మూడేళ్ళపాటు కలకత్తాలో స్టార్ థియేటర్‌కు చెందిన వాద్యబృందములో పనిచేస్తూ వివిధ వాద్యాలను వాయించుటలో దిట్ట అనిపించుకొన్నాడు. ముక్తాగాచ్ అనేగ్రామములో దుర్గాపూజల సందర్భములో ప్రసిద్ధ సరోద్ విద్వాంసుడు రాయపూర్‌కు చెందిన ఉస్తాద్ అహమద్ అలీఖాన్ దర్శనం చేసుకొన్నాడు. తనను శిష్యునిగ చేసికొమ్మని బ్రతిమాలుకొన్నాడు. కాని నాటి ఉస్తాదులు, సంగీత విద్వాంసులు కొద్దిమందిని ఎన్నుకొని వారికిమాత్రం శిక్షణ నిచ్చేవారు. గ్రామములోని పెద్ద జమీందారుగారి బలవంతంతో ఇష్టము లేకపోయినప్పటికి పరేనని ఆలమ్‌ను దగ్గర చేర్చుకొన్నాడు

అహమద్ అలీఖాన్ మాత్రము సంగీత విద్యారహస్యములను చాల గుట్టుగ పెట్టుకొన్నాడు. ఆలమ్ ఉస్తాద్‌గారి ఇంటిపనులన్నీ చేస్తూ ఆయన మెప్పుపొందడాని కెన్నో విధాల యత్నించాడు

కుశాగ్రబుద్ధిగల ఆలమ్ తన ఉస్తాద్‌గారి మెళుకువల నాకళించుకొన్నాడు ఒకసారి గురువుగారు ఇంటలేనప్పుడు సరోద్ వాయిస్తున్నాడు. గుప్తముగా నుంచుకొన్న విద్యారహస్యాల నెన్నిటినో గ్రహించిన శిష్యుని తెలివితేటలను మెచ్చుకొనే ఉదారహృదయములేని ఆ విద్వాంసుడు ఆలమ్‌ను తన యింటినుండి తరిమివేసాడు.

అల్లావుద్దీన్ ఖాన్ మరల వీధిన పడ్డాడు పెక్కు కష్టాలనధిగమించి చివరకు రామ్‌పూర్ నవాబుగారైన హామీద్ ఆలీఖాన్‌గారి సంస్థానము నాశ్రయించినాడు. ఆస్థాన విద్వాంసుడైన ఉస్తాద్ వజీర్ ఖాన్‌ను దర్శించవలెననుకొని ఎన్నో ప్రయత్నాలు చేశాడు.

ఆ మహావిద్వాంసుని దర్శనము దుర్లభమైనది. గత్యంతరము కానని ఆలమ్ ఒకనాడు నవాబుగారి కారుముందుకు దూకాడు దయామయుడైన నవాబ్ ఆలమ్‌ను పిలిపించి ఉస్తాద్ వజీర్ ఖాన్ వద్ద శిక్షణ పొందేటట్లు ఏర్పాటు చేశాడు.

ఆలమ్ జీవితములో చీకటి మలుపుతిరిగి వెలుగు రేఖ వెలసింది. ప్రసిద్ధ విద్వాంసుల ప్రక్కన సరోద్ వాయించే అవకాశం లభించింది. ఆస్థాన వాద్యబృంద నాయకుడగు రాజా హుసేన్ నమీ (లక్నో)తో మైత్రికుదిరింది ఆయనే ద్రుపద్‌ను నేర్పించారు. సరోద్‌తోపాటు సుర్‌సింగార్, సుర్ బహార్, మరియు "రబాబ్" లను నేర్చుకొన్నాడు

ఉస్తాద్ వజీర్ ఖాన్ గారివద్ద కొన్నేళ్ళు సాధన చేసి చివరకు 1918లో మైహార్ సంస్థానాధిపతి మహారాజా బ్రజ్‌నాథ్ సింగ్‌కు సంగీత విద్యాగురువుగా, నియుక్తుడయి అచ్చటనే స్థిరపడ్డాడు. దశాబ్దాల వియోగమునునుభవించిన తరువాత అల్లావుద్దీన్‌ఖాన్ సతి అతనిని కలుసుకొన్నది. వారి సాంసారిక జీవితము సుఖప్రదంగా సాగుతూవుండేది. తన భార్యపేర 'మదనమంజరీ' అనే క్రొత్తరాగాన్ని సృష్టించుటయే కాక తన యింటికి 'మదనాభవన్' అని పేరు పెట్టుకొన్నాడు.

ఆ దంపతులకు ఇద్దరు కుమార్తెలు ఒక కుమారుడు అతడే ప్రసిద్ధ సరోద్ వాద్య విద్వాంసుడయిన ఆలీఅక్బరు. చిన్నకూతురు అన్నపూర్ణను విశ్వవిఖ్యాత సితార్ నిపుణుడు రవిశంకర్ కిచ్చి పెళ్ళి చేశాడు. పెద్దకూతురు కొన్నేళ్ళక్రితం గతించింది.

పండిట్ రవిశంకర్, ఆలీఅక్బర్, పన్నాలాల్ ఘోష్, తిమిర్ బరన్, నిఖిల్ బెనర్జీ, శరణ్‌రాణి మున్నగు అంతర్జాతీయ యశోధనులెందరో మదీనా భవనమందలి శారదా పుత్రుడగు ఉస్తాద్ అల్లావుద్దీన్ ఖాన్‌గారి వల్ల తీర్చిదిద్ద బడినవారు.

సామాన్యంగా మృదుస్వభావుడుగా వుండే అల్లావుద్దీన్ ఖాన్ సంగీతాచార్యుడుగ కూర్చొనేటప్పుడు చండశాసనుడుగా మారేవాడు. తనకు వుద్యోగమిచ్చి సర్వసౌఖ్యములను సమకూర్చిన మహారాజును సైతము విద్యాభ్యాసకాలములో తీవ్రంగా మందలించేవాడు.

"మై మ్యూజిక్ - మై లైఫ్" అనే తన గ్రంథములో రవిశంకర్ ఉస్తాద్‌ను గురించి వ్రాస్తూ "సాధారణంగా పరమ సాధుశీలుడు, వినయమూర్తి భక్తశిఖామణి వలె వుండెడి ఆ మహనీయుడు శిష్యులకు బోధన మొదలు పెట్టేటప్పుడు ప్రళయరుద్రుని వలె భాసిల్లుచు, చిన్న దోషమును సైతము ఓర్చుకొనేవాడు కాదు."

ఆయనకొన్ని నెలలుగా అనారోగ్యముతో శయ్యాగ్రస్తులయివున్నారు. కొడుకు ఆలీఅక్బర్, భార్య మదీనా, కోడలు జుబేదాఖాన్ కాకుండా శిష్యులెందరో ఆ సంగీత విద్యానిధికి పరిచర్యలు చేస్తున్నారు. శాంతి కుటీరమని పిలువబడే మదీనాభవన్‌ను ప్రతిదినము అతని అభిమానులు పత్రికా విలేఖరులు దర్శించుచున్నారు. అర్ధశతాబ్దికి పైగా అసమాన సంగీత చక్రవర్తిగా వెలిగిన ఉస్తాద్ అల్లా ఉద్దీన్ ఖాన్ మాత్రం నిర్లిప్తుడై తన ఇష్టదైవమును స్మరిస్తూ కాలమును వెళ్ళబుచ్చేవాడు.

1972 సెప్టెంబరు 6 రాత్రి 11-10 గంటలకు ఖాన్ కీర్తిశేషులయ్యారు.

(సరోజిని బర్ట్‌సాల్ గారి ఆంగ్లవ్యాసాధారం)

● నాట్యకళ ●

★ ★ ★

# 'గృహలక్ష్మి'గా ఎం.ఎస్. సుబ్బులక్ష్మి

"ఈ సంగీత సామ్రాజ్ఞి ముందు నేనొక సామాన్య ప్రధానిని మాత్రమే" అంటూ నాటి భారత ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ చేత ప్రశంసలందుకొన్న సప్తగిరి సంగీత విద్వన్మణి శ్రీమతి ఎం.ఎస్. సుబ్బులక్ష్మి.

సంగీత ప్రపంచంలో మహత్తరమైన సాధన, మహోన్నత కీర్తిప్రతిష్ఠలు గడించినా, ఆమె అత్యంత నిరాడంబరమూర్తి. ఆమె దినచర్య పూజాపురస్కారం, అతిథిమర్యాద మున్నగు వాటిలో నాటి మన భారతీయ సంస్కృతి ప్రతిబింబిస్తుంది. శ్రీమతి సుబ్బులక్ష్మి సదాశివమ్ దంపతులను వారి ఇంటి సహజ వాతావరణంలో ఆ మహాగాయని వ్యక్తిత్వాన్ని దర్శిస్తే భక్తితో వినమ్రుల మవుతాం.

మద్రాసులో నుంగంబాకం ట్యాంక్ రోడ్‌లో వుంది వారిల్లు

చక్కగా అమర్చిన పెద్ద హాల్. గోడలకు గాంధీజీ, నెహ్రూ, రాజగోపాలాచారి మున్నగు జాతీయ నాయకుల చిత్రపటాలు. ఆ ఇంట్లో సాధారణమైన నూలుచీర ధరించిన సుబ్బులక్ష్మిగారు వారితో పాటు సదాశివం గారూ. అతి నిరాడంబరమూర్తి ఎం.ఎస్. సదాశివం. శ్వేతవస్త్రధారులు. పిలకజుట్టు, నొసటి విభూతి ధరించి సాత్వికతకు సాకారంగా వుంటారు. దంపతులిద్దరూ వచ్చినవారిని ఎంతో ఆప్యాయంగా పలకరిస్తారు.

## సద్గృహిణి

ఇంట్లో బంధుమిత్రులందరితో ఆత్మీయంగా "కుంజమ్మ" అంటూ పిలవబడే సుబ్బులక్ష్మి గారు ఇంటిపనులలో ఎంతో ఆసక్తి గల సద్గృహిణి. పసిపాపలాంటి ముగ్ధ సరళత్వం ఆమె వ్యక్తిత్వంలోని ప్రధానమైన ఆకర్షణ. ఆమె వయసు డెబ్బయ్యేడేళ్ళయినా ఆమె ముఖవర్చస్సులో ఎటువంటి తరుగుదల కానరాదు.

ఎం.ఎస్. గారి దినచర్య వేకువనే ప్రారంభమవుతుంది. ఉదయం పూజకు కావలసిన పూవులను స్వయంగా సేకరిస్తారు. పూజా మందిరంలో రోజూ స్వయంగా ముగ్గులు వేస్తారు. దాదాపు రెండు గంటల సేపు సాగే పూజాకార్యక్రమం పూర్తి అయ్యేసరికి ఉపాహార వేళ. వంట మనిషి, పనిమనుషులు వున్నప్పటికీ ఉపాహారం ఎం.ఎస్. గారు స్వయంగా తయారుచేస్తారు.

సుబ్బులక్ష్మిగారి గృహం అతిథి గృహంలా వుంటుంది. ఇంటిలో పనిచేసేవారందరూ కుటుంబంలోని సభ్యులుగా అతిథులను ఆదరిస్తారు. గత ఏభైఏళ్ళుగా సుబ్బులక్ష్మిగారి

ఇంట్లో పనిచేస్తున్న 'విశాలం' ఆ కుటుంబంలో ఒక భాగంగా కలిసిపోయింది. ఉపాహారం తర్వాత కూతురు రాధతో కలిసి రెండు గంటల సేపు సంగీత సాధన చేస్తారు.

## ధ్యానంలో...

ఉదయం పూజాసమయం. అది పూజాగృహం కాదు. పెద్ద గదిలోని ఒకమూల గోడలపై దేవతామూర్తుల చిత్రాలు పక్కన శ్రీకృష్ణ, సరస్వతుల మూర్తులు. సుబ్బులక్ష్మిగారి గురువైన 'కంచి కామకోటి పీఠాధిపతి శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ మహాస్వామీ' వారి దివ్యమైన చిత్రం

శ్రీమతి సుబ్బులక్ష్మి దేవుడిముందు వేసిన ముగ్గుల కెదురుగా ధ్యానమగ్నురాలయి వుంటారు. ఆ ధ్యానంలో వున్నప్పుడు బయట ప్రపంచంతో ఏమాత్రం సంబంధం వుండదు. పూర్తి ఏకాగ్రత, తదేక నిష్ఠ, చెదరని ధ్యానం. అంతర్ముఖత్వం.

ఆమె భర్త సదాశివంగారు, అతిథులతో మాట్లాడేటప్పుడు ఆప్యాయంగా, ఛలోక్తులతో హాస్యపు జల్లులు కురిపిస్తూ మాట్లాడుతారు. సహృదయులైన ఆ దంపతులను చూస్తే ఆదిదంపతులను దర్శించినట్టే వుంటుంది. కీర్తనలను భక్తితో, తాదాత్మ్యంతో పాడి భగవంతుని ఆరాధించడం ఆమె దినచర్యలో ముఖ్యభాగం. ఆ గానంతో గానలోలుడైన సర్వేశ్వరుడు పరవశించడం సహజం.

## సంగీతం వారసత్వం

సంగీతం ఆమెకు వారసత్వంగా సంక్రమించింది. ఆమె తల్లి 'షణ్ముగవడివు' ప్రసిద్ధ వీణావాదకురాలు. సుబ్బులక్ష్మి గారు స్వయంగా వీణ వాయించడంలో దిట్ట. ఇంటి వసారాలో వేలాడదీసిన చిత్రం సుబ్బులక్ష్మి గారి మాతృమూర్తి వీణ వాయిస్తున్న చిత్రం.

"ఆ చిత్రంలోని మాతల్లి గారి వీణ నేటికీ నా వద్ద వుంది. అది నా అమూల్య సంపద" అంటారు ఎం.ఎస్. సుబ్బులక్ష్మి తాదాత్మ్యంతో.

"ఆమె నా తల్లి మాత్రమే కాదు. నా సంగీత గురువు కూడా. సంగీత క్షేత్రంలో నేను సాధించిన విజయం ఆమె అనుగ్రహఫలం" అన్నారు భావపారవశ్యంతో, భక్తి భావంతో.

శ్రీమతి ఎం.ఎస్. సుబ్బులక్ష్మి 16-9-1916లో జన్మించారు. తల్లి మదురై షణ్ముగవడివు. పదహారవ ఏటనే ఎం.ఎస్. సుబ్బులక్ష్మి గారు మద్రాసు మ్యూజిక్ అకాడమీలో పాట కచ్చేరి చేసి మహావిద్వాంసుల ప్రశంస లందుకొన్నారు. 1940లో మద్రాసు సమీపంలోని తిరునీర్ మలై దేవాలయంలో సదాశివం గారితో వివాహం వారిది కులాంతరవివాహం. అన్యోన్య ఆదర్శ దాంపత్యం.

సంగీత కళానిధి

ఎం.ఎస్. సుబ్బులక్ష్మి-సేవాసదన్, శకుంతల, మీరా సినిమాల్లో అద్భుతంగా నటించారు. 1947లో సినిమారంగం వదిలారు. 1944లో కస్తూరిబా గాంధి స్మారకనిధి సేకరణ కోసం కచ్చేరీలు చేసి కోటి రూపాయలకు పైగా నిధిని సమకూర్చారు. 1954లో భారతప్రభుత్వం 'పద్మభూషణ్'తో సత్కరించింది. 1963లో బ్రిటన్‌లోని 'ఎడిన్‌బరో ఫెస్టివల్' కచ్చేరితో ఆమె అంతర్జాతీయ ఖ్యాతి నందుకున్నారు.

1968లో ప్రపంచ మహాసభ (యు.ఎన్ ఓ.) ఆహ్వానం పై అమెరికా వెళ్ళి మహాసభలో కచ్చేరి చేసి ఎన్నెన్నో ప్రశంసలు పొందారు.

1968లో మద్రాస్ మ్యూజిక్ అకాడమి అధ్యక్షులుగా ఎన్నుకోబడి "సంగీత కళానిధి" బిరుదు అందుకున్న మొదటి మహిళ శ్రీమతి సుబ్బులక్ష్మి.

1974లో ప్రతిష్ఠాత్మకమైన 'రామన్ మెగాసెసే' అవార్డు, 1975లో 'పద్మ విభూషణ్' ప్రశస్తి అందుకున్నారు. పలు విశ్వవిద్యాలయాల డాక్టరేట్ గౌరవపట్టాలతో గౌరవం పొందారు. తిరుమల తిరుపతి దేవస్థానం ఆస్థాన విద్వాంసురాలామె.

అసంఖ్యాక సత్కారాలందుకున్నా, అంతర్జాతీయ కీర్తి ప్రతిష్ఠలార్జించినా, ఆమె మూర్తీభవించిన వినయం, తన పురోగతికి కీర్తి ప్రతిష్ఠలకు కారకులూ, ప్రేరకులూ తన భర్త సదాశివం గారే అంటూ - "వారు నాకు తల్లీ, తండ్రి, దైవం-నా సర్వస్వం" అని ఆనంద భాష్పాలు రాలుస్తారు శ్రీమతి సుబ్బులక్ష్మి

('తరంగ'కన్నడ వార పత్రిక సౌజన్యంతో)

● స్వాతి - వారపత్రిక *1-10-1993* ●

★ ★ ★

# తబలా వాద్య విశారదుడు ఉస్తాద్ అల్లారఖా

వేదకాలంనాటి భూమి దుందుభి నుండి ఈనాటి మృదంగం. పఖావజ్, డోలు, తబలా మున్నగు తాళ ప్రధానమైన వాద్యాలు రూపొందాయి. వేలాది సంవత్సరాల వికాసంతో వాటి చరిత్ర విస్మయం కలిగిస్తుంది. భారత దేశంలో 500 మించిన తాళ వాద్యాలున్నాయి. సుమారు 5000 సంగీత వాద్యాలున్నాయి. ఇంతటి వైవిధ్యం మరెక్కడా కానరాదు. మన దేశంలోనే కాక విదేశాల్లో కూడా తబలా జనప్రియమైన వాద్యం. తబలా జగద్వ్యాప్తమైన జనరంజకత్వం సాధించటానికి కారకులు ఖాన్ సాహెబ్ ఉస్తాద్ అల్లారఖా. 75 ఏళ్ళ అల్లారఖా సాహెబ్ తబలాకు పర్యాయపదం

నేలలో గొయ్యి త్రవ్వి దానిని చర్మంతో కప్పి వాయించినపుడు దాని నాదం ఎంతో అద్భుతం సృష్టించగలదు అన్న అంశం కృష్ణయజుర్వేద మందలి ఐతరేయ అరణ్యములో 'చర్మణా ఆచ్ఛాదిత ముఖమ్ భూగర్భం' అని చెప్పబడింది. శత్రువులను తరిమి వేయుటకు, అందరినీ పురిగొల్పుటకు, విజయసాధనకు, జ్ఞానప్రసారానికి మానవుడు చర్మ వాద్యాలను ఉపయోగిస్తూ వచ్చాడు. కాల క్రమంలో కొయ్య కాండములను తొలిచి వాటికి చర్మం కప్పి వాద్యములను సృష్టింపసాగారు. (వనస్పతయే విముచ యద్ధమ్ - శుక్ల వాజసనేయ సంహిత) వేదకాలంలోనే మన దేశంలో 50 రకాల చర్మవాద్యాలున్నట్లు తెలుస్తున్నది. మట్టితోను, లోహాలతోను అవనద్ధ వాద్యాల తయారీ జరుగుతుంది. (మృత్ + అంగ = మృదంగ) శివుడు తాండవ నృత్యం సలిపే వేళ పలికించిన ఢమరుకం - తాళ వాద్యాలకు మూలం. సృష్టి, స్థితి, లయాల భావ కల్పనల సంకేతం.

తబలా వాద్యం మొఘల్ చక్రవర్తుల కాలంలో ఆవిష్కరింపబడిందంటారు కాని 'సంబల' అనబడు రెండు కలశాల వాద్యవిశేషమొకటి కాళికా పురాణంలో కనిపిస్తుంది. వీటిలో ఒకటి 'నర' అని రెండవది 'మాదా' అని పిలువబడేవి. దుక్కి, డగ్గా, మాణీయ, దుక్కడ, నరఘు అన్న పేర్లున్నాయి. యూదు భాషలో 'తిబెల' సిరియా 'తబల' - బాబిలోనియా, అస్సీరియాలో, "తబ్బల్", టర్కీ 'ధవులు', పర్షియాలో 'దుహుల్', అరేబియా, తబ్లం అన్నవి తబలా వలె ప్రచారంలో వున్న ఆయా దేశాల తాళవాద్యాలు. డమరు లేదా మృదంగ నుండి తబలా ఆవిష్కృతమైందని భావింపబడింది. ఈ వాద్యసృష్టికి అమీర్ ఖుస్రో లేదా ఖద్దార్ ఖాన్ కారకులని ప్రతీతి.

తబలా మొదట పంజాబ్‌లో ప్రచారంలోనికి వచ్చింది. పూరబ్ (లక్నో - ఫరూకాబాద్) బనారస్, పంజాబ్, అజరడా శైలుల ప్రత్యేక ఘరానాలున్నాయి. జమ్ము ప్రాంతం నుండి వచ్చిన అల్లారఖా పంజాబ్ ఘరానాకు చెందిన వారు.

తబలా వాద్యం పుట్టుకకు సంబంధించి స్వారస్యకరమైన కథలున్నాయి. తాళవాద్య పోటీలో మృదంగాన్ని రెండు ముక్కలుగా చేసి వాయించినా నాదం వెలువడింది. అందువల్లనే 'తబ్ భీ బోలా (అప్పుడు కూడా పలికింది)' అన్నారట! అదే తబలా పంజాబ్‌కు చెందిన ఒక ఉస్తాద్ గారు తమ మనుమరాలి పెళ్ళిలో వరకట్నంగా 500 తబలాబోల్‌లను ఇచ్చారట! ఎడమ చేతితో వాయించే 'డగ్గా' పురుషవాద్యం అయితే కుడిచేతితో వాయించు తబలా "స్త్రీ-శివ-శక్తుల జంట. ప్రకృతి - పురుషుల జంట - శక్తి రుచ్యతే" (తకారం అంటే శివుడు లకారం అంటే శక్తి)

తబలా వాదకులలో ఎందరో ప్రసిద్ధులుండే వారు. ఇటీవలి వారిలో విఖ్యాతులు అహమద్‌జాన్ తిరఖ్వా. అనోఖెలాల్ మిశ్రా, కంఠేమహరాజ్, కరామతుల్లాఖాన్, కిశన్ మహరాజ్, సామతాప్రసాద్ మిశ్ర, శంసుద్దీన్ ఖాన్, పండిత తారానాథ్ మున్నగువారు.

ఇంతటి విశిష్టపరంపరకు చెందిన అల్లారఖా తబలా వాద్యాన్ని జగత్ ప్రసిద్ధం చేశారు. రవిశంకర్ - అలీ అక్బర్‌లతో పాటు వినవచ్చేవారు అల్లారఖా. గొప్ప తబలా వాద్యకారుడిగా పేరుగాంచిన ఝాకీర్ హుసేన్ అల్లారఖా కుమారుడు.

అల్లారఖా పంజాబ్ రైతు హాకిమ్ అలీగారి తొమ్మిది మంది సంతానంలో ఒకరు. గురుదాస్ పూర్‌లో జన్మించారు. (1915). బాల్యంలో జమ్ములోని ఒకనాటక సంఘంలో నటించేవారు. రామలీలా, రామాయణ నాటకాల్లో నటించేవారు. తబలా వాద్యంలో విశిష్టులైన లాల్ మహమద్, కాదిర్‌బక్ష్ గార్ల వద్ద తబలా శిక్షణ పొందారు. ఢిల్లీ, బొంబాయి ఆకాశవాణి కేంద్రాల్లో. సినిమాల్లో సంగీత దర్శకులుగా పనిచేశారు.

చిరునవ్వులు చిందిస్తూ అలవోకగా, లీలా జాలంగా తబలాను పలికించే కరామత్, అల్లారఖా గారిది. ఒకమారు ఆయన రష్యాలో తబలాను అతివేగంగా వాయిస్తున్నప్పుడు వేళ్ళకు ప్రత్యేక మినియేచర్ యంత్రాలేమైనా కట్టుకున్నారా అన్న అనుమానంతో, వారి వేళ్ళను పరీక్షించారు. ఆ అద్భుత విన్యాసం కొన్నేళ్ళ సాధన ఫలితం.

అల్లారఖా మధురగాయకులు కూడా. కాని వారి సాధన ప్రధానంగా తబలా పైనే సాధించాలన్నదే ఆయన ధ్యేయం. తబలా వాయిస్తున్నప్పుడు వారి దేహం ఆద్యంతం కంపిస్తుంది. కళ్ళ మెరుపులు, వేళ్ళ చలాకీతనం, పెదవుల చిరునవ్వులు అద్భుతం! రవిశంకర్ - అలీ అక్బర్‌లతో అల్లారఖా 30 ఏళ్ళపాటు ప్రపంచ దేశాలన్నిటా పర్యటించారు. చికాగో, కాలిఫోర్నియా, శాన్‌ఫ్రాన్సిస్కో, న్యూయార్క్, నగరాల్లో తబలా శిక్షణా తరగతులు నిర్వహించారు. మహారాష్ట్ర ప్రభుత్వం వారికి శివాజీ పార్క్‌లో (బొంబాయి) స్థలం ఇచ్చింది. అక్కడ శిక్షణాలయం ఏర్పడింది. శిష్యులందరికీ ఆయన అబ్బాజీ. ఆయన ఎందరో శిష్యులను తయారుచేశారు.

తండ్రిని మించిన తనయుడు ఝాకీర్ హుసేన్. తండ్రి తబలా స్టార్ అయితే కొడుకు సూపర్‌స్టార్! వారి జంట ప్రదర్శన అంటే శ్రోతలకు, పసందైన విందు. ఝాకీర్‌హుసేన్ డాక్టర్ కావాలని అతని తల్లి ఆశించింది. తండ్రి తనకుమారుడు తబలా వాద్యవిశారదుడు కావాలనుకున్నాడు. అల్లారఖా కొడుకును బాగా తర్ఫీదు చేశాడు. తన ఆరోగ్యాన్ని కూడా విస్మరించి కుమారుని ప్రగతికి శ్రమించాడు.

సంగీత పరంపరకు చెందిన అల్లారఖా విశాల హృదయం కలవారు. తన కూతురును ఆలీ అక్బర్‌ఖాన్ కుమారునికిచ్చి పెళ్ళి చేయాలనుకున్నారు. కాని ఆ అమ్మాయికి ఆ సంబంధం నచ్చలేదు. ఆమెకు పూర్తి స్వేచ్ఛ నిచ్చారు అల్లారఖా. ఝాకీర్ హుసేన్ అమెరికా అమ్మాయిని పెళ్ళి చేసుకున్నాడు.

అల్లారఖా కేవలం తబలా వాదకుడు మాత్రమే కాదు. వంటలు చేయటంలో కూడా ఆయన ఉస్తాద్!

అల్లారఖా 1994 ఏప్రిల్ 29 నాటికి 76 ఏళ్ళు పూర్తి చేశారు. 1994లో వారి జన్మదినోత్సవాన్ని బొంబాయి, పుణె, కలకత్తా, ఢిల్లీ, లండన్, న్యూయార్క్, నగరాల్లో వైభవంగా జరిపారు. తన జీవితాన్ని నెమరువేసుకుంటూ, ఆయన "మాలిక్ బనాకర్ భేజ్‌తా హై" (జీవితమంతా దైవ కృప అంటారు.)

భారతదేశ సాంస్కృతిక రాయబారి అల్లారఖా. 'నా జీవితానికి రక్ష ఆ అల్లాహు, ఆయన అనుగ్రహమే నా బలం' అంటూ సంతోషంగా నవ్వుతూ చెబుతున్నపుడు ఆయన కళ్ళలో నక్షత్రాలు కనిపిస్తాయి. వేళ్ళు బోల్ వాయిస్తూ నృత్యం చేస్తాయి. అల్లారఖా సాహెబ్ ఆయురారోగ్యాలతో జీవిస్తూ భారత కీర్తిపతాకను విశ్వవిహాసయంలో రెపరెపలాడింప చేయాలని ఆశిద్దాం.

● *విశాలాంధ్ర 15-5-1994* ●

* * *

# సంగీత కళానిధి 'ద్వారం'

"ఫిడేలు నాయుడు"గా అఖిలభారత ఖ్యాతి నార్జించిన 'సంగీత కళానిధి' ద్వారం వెంకటస్వామి నాయుడు గారి శతజయంత్యుత్సవాలను వైభవోపేతంగా జరపాలని సంగీత కళాభిమానులు సన్నాహాలు చేస్తున్నారు.

ద్వారం వెంకటస్వామినాయుడు 1893 నవంబర్ 8వ తేదీన బెంగుళూరులో జన్మించారు. ఆయన తండ్రి సైన్యంలో కమిషన్డ్ ఆఫీసర్‌గా వుండేవారు. సంగీత విద్వాంసులకు, సంగీత శాస్త్రవేత్తలకు పెన్నిధి వంటివారాయన.

ద్వారం వారి కుటుంబం సంగీత విద్యాలయంగా వుండేది. తండ్రి సంగీత శాస్త్ర నిష్ణాతులుకాగా అన్న వెంకట కృష్ణయ్య నాయుడు వాయులీన వాద్య విన్యాసంలో ఆరితేరినవారు. వీణ సంగమేశ్వరశాస్త్రిగారి శిష్యులు అన్నగారి వద్ద తొలిదశలో నాయుడుగారు శిష్యరికం చేశారు. సమకాలీన మహా విద్వాంసులైన వీణ సంగమేశ్వరశాస్త్రి, వీణ ధనమ్మాళ్, గోవింద స్వామి పిళ్ళేల కచ్చేరీలకు వెళ్ళి ఎన్నో మెళకువలను ఆకళించుకున్నారు.

అవిచ్ఛిన్నంగా అసుర సాధనమ్‌చేసి ఫిడేలును వశపరచుకొన్నారు నాయుడుగారు. ఆ తర్వాతనే కచ్చేరీలకు పూనుకొన్నారు.

1919లో నాయుడుగారు విజయనగరం మహారాజా సంగీత కళాశాలలో ఫిడేలు ప్రొఫెసర్‌గా నియమితులయ్యారు. ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ప్రారంభించిన మొదటి కళాశాల అది. బహుముఖ ప్రజ్ఞానిధి అయిన 'హరికథా పితామహ' ఆదిభట్ల నారాయణదాసు ఆ కళాశాల మొట్టమొదటి ప్రిన్సిపాల్. ఆదిభట్లవారు పదవీ విరమణ తర్వాత (1936) నాయుడుగారు ఆ కళాశాల ప్రిన్సిపాల్‌గా నియమితులయ్యారు.

సంగీత ప్రపంచంలో దిగ్గజాలవంటి ప్రముఖుల కచ్చేరీలకు పక్క వాద్యకారులుగా ద్వారంవారు పాల్గొనేవారు. ఏనాడూ ప్రధాన గాయకుడిని మించి రాణించాలని భావించలేదు. మెప్పులకోసం ఏనాడూ పరుగులు తీయలేదు

నాయుడుగారి చేతిలో ఫిడేలు వైఖరి అనుపమానం. అవిచ్ఛిన్నమైన అతి సూక్ష్మ ఘన నాదాలు, దురిత విళంబ లక్ష్య సౌలభ్యం అద్వితీయంగా వుండేవి. అసాధారణ లయజ్ఞానం అపార మనోధర్మం నాయుడుగారి ప్రత్యేకతలు.

గానకళానిధులైన అరియక్కుడి రామానుజ అయ్యంగార్, మహారాజపురం విశ్వనాథ అయ్యర్, పల్లడం సంజీవరావు, సెమ్మంగుడి శ్రీనివాస అయ్యంగార్ మున్నగువారి కచ్చేరీలలో పక్క వాద్యం వాయించేవారు.

'శృతిర్మాతాలయః పితా' అన్న సూక్తి మేరకు శృతి శుద్ధతలోను, లయ శుద్ధతలోను, పల్లవి పాడుటలోను నయనా పిళ్ళై గారికి దీటైన వారని డాక్టర్ శ్రీపాద పినాకపాణి అభిప్రాయం.

నాయుడుగారి సోలో కచ్చేరీలు అమృత ప్రాయంగా వుండేవి. వేదికపై ఆసీనులై ఫిడేలు పై కమాను ఆడించడంతోనే శ్రోతలు మంత్రముగ్ధులయ్యేవారు. భావనాతీత రసావేశ వైశద్యాన్ని రసికులకు అందించడమే వారి జీవిత లక్ష్యంగా వుండేది.

కదనకుతూహల రాగంలో 'రఘువంశ సుధాంబుధిచంద్ర,' రీతిగౌళ రాగంలో 'జనని నినువినా' మొదలగు కృతులు శ్రోతలను మైమరిపించేవి. పాశ్చాత్య బాణీలో 'మేఫ్లవర్స్' గీతాన్ని అత్యంత రంజకంగా వాయించే వారు. ద్వారంవారి కచ్చేరీలలో చివరగా 'అపనా తనామనా' అను జానపద గీతాన్ని వాయించి శ్రోతలకు పరమానందాన్ని ప్రసాదించేవారు. లీళ నాయుడుగారి శైలి విశిష్టమైనదని వారి శిష్యులు, ప్రముఖ గాయకులు నేదునూరి కృష్ణమూర్తి అభిప్రాయం. సురసరస్వతి ప్రసాద మందుకొన్నవారు ద్వారంవారు.

నాయుడుగారి శిష్య సంతతి గొప్పది. గురుశిష్యుల అనుబంధం అనురాగమయం. ప్రముఖుల కచ్చేరీలకు వెళ్ళి వారి గాయన ప్రతిభా విశేషాలను జాగ్రత్తగా గమనించమని శిష్యులను ప్రోత్సహించేవారు. పాధన, నిరంతర సాధన అత్యంత ప్రధానమనేవారు నాయుడుగారు.

వ్యక్తిగా ఆయన అత్యంత విశుద్ధవర్తనులు. అతి నిరాడంబరులు. జీవిత మంతా క్రమశిక్షణ పాటించిన వారు. అట్టి మహాపురుషుల వల్లనే సంగీత విద్వాంసులకు సమాజంలో గౌరవాదరాలు లభించాయడనంలో అత్యుక్తిలేదు.

నాయుడుగారు నాదయోగి. సమకాలీన సంగీత విద్వాంసులు అయనపట్ల అనన్యమైన గౌరవం కలిగి వుండేవారు.

మొట్టమొదటి సత్కారం నాయుడుగారికి 1931 సెప్టెంబర్ 5వ తేదీ విశాఖపట్నంలో జరిగింది. అప్పటికే నాయుడుగారి వయసు నలుబదేళ్ళు మాత్రమే. ఆంధ్ర విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సెలర్‌గ వుండిన మహామనిషి డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్, నాయుడు గారికి రత్నాంగుళీయకంతోపాటు, ఫిడేలు జీవితాన్ని మాధుర్యం కావించిన మహనీయుడు అని ప్రశంసించారు. ఆ తర్వాత లెక్కలేనన్ని సత్కారాలు, బిరుదులు ఆయనకు లభించాయి.

బాబూ రాజేంద్రప్రసాద్, జవహర్‌లాల్ నెహ్రూ, రాజాజీ వంటి జాతీయ నాయకుల ప్రశంసలందుకొన్నారు. 'నాయుడుగారి వేళ్ళలో సరస్వతి నాట్యం చేస్తుంద'న్నారు రాజాజీ.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నాయుడుగారిని ప్రథమ ఆస్థాన సంగీత విద్వాంసుడుగ నియమించి గౌరవించింది. నాయుడుగారు అన్ని సత్కారాలకు మించిన మహనీయులు. సంగీత సరస్వతి అయిన నాయుడుగారి శతజయంతి ఉత్సవాల సందర్భంగా నాయుడుగారు పుట్టిన బెంగుళూరులో, కొంతకాలం గడిపిన విశాఖపట్నంలో, సంగీత

ఆచార్యులుగా పనిచేసిన విజయనగరంలో, ఉద్యోగ విరమణానంతరం కొన్నేళ్ళు గడిపిన మద్రాసులో, చివరకు 1964 నవంబర్ 25న స్వర్గస్థులైన హైదరాబాదులో ఉత్సవాలు జరపడం నాయుడు గారికి సంబంధించిన వస్తువుల ప్రదర్శన ఏర్పాటు చేయడం అత్యంత ముదావహం. వారి విపులమైన జీవిత చరిత్రను వెలువరింప నుండడం హర్షణీయం. ఆకాశవాణి కేంద్రాలు ప్రత్యేకంగా వారి ధ్వని ముద్రికల ప్రసారంతోపాటు వారి శిష్యులైన డాక్టర్ నేదునూరి కృష్ణమూర్తి, డాక్టర్ శ్రీపాద పినాక పాణీల కచ్చేరీలను ఏర్పాటు చేయడం సముచితం కాగలదు. సంగీత ప్రతిభా ప్రపూర్ణులైన ద్వారంవారు చిరస్మరణీయులు.

● *ఆంధ్రజ్యోతి 18-12-1992* ●

★ ★ ★

# సంగీత కళానిధి
# డా॥ శ్రీపాద పినాకపాణి

## సంగీత కళానిధి - పద్మభూషణ్ డాక్టర్ శ్రీపాద పినాకపాణి జీవితానుభవాలు

తన మనస్సుకు గోచరించిన భావ సౌందర్యాన్ని మరో హృదయం అనుభవించేలా చేయటం చిత్రకారుడి లక్ష్యం

తన హృదయం అనుభవించిన భావ మాధుర్యాన్ని మరో హృదయంలో స్పందింపచేయటం గాయకుడి లక్ష్యం

హృదయానుభవాల వినిమయమే కళల పరమార్థం ఈ పరమార్థానికి ప్రతీక డాక్టర్ శ్రీపాద పినాకపాణిగారు

వైద్యశాస్త్రంలో నిష్ణాతులై ఉన్నత పదవులను అలంకరించి, సంగీత కళానిధులై అఖిల భారత ప్రశస్తినార్జించిన ఏకైక ఆంధ్ర ప్రతిభాప్రపూర్ణులు డాక్టర్ శ్రీపాద పినాకపాణి.

వారి మాట సరళం - వారి వ్రాత సుందరం. వారి 'పరిచయం మధురానుభవం వారు హృదయ' సంపన్నులు

ఇటీవల వారిని కలుసుకునే అదృష్టం కలిగింది. వారి జీవితానుభవాలు. విశేషాలు వారి మాటల్లోనే అందిస్తాను.

"మా పూర్వీకులు గంజాం జిల్లా నుంచి వచ్చి శ్రీకాకుళం జిల్లాలో స్థిరపడ్డారు. మా తల్లి జోగమ్మ. తండ్రి కామేశ్వరరావు గారు. శ్రీకాకుళం జిల్లా ప్రియాగ్రహారంలోని మా అమ్మమ్మగారింట్లో 1931, ఆగష్టు 3న పుట్టాను"

మా తండ్రి శ్రీపాద కామేశ్వరరావు గారు రాజమండ్రిలో బి.ఎ.ఎల్.టి. చదివి అక్కడే స్థిరపడ్డారు. విద్యాశాఖలో ఉన్నత పదవులందుకొన్నారు. ఆయన నటుడుగా, నాటకకర్తగా పేరుగాంచారు. 13 నాటకాలు రాశారు. విఖ్యాత నటులు బళ్ళారి రాఘవ ఆ ప్రాంతాలకు వచ్చినప్పుడల్లా మా తండ్రిగారిని కలుసుకుని ఎన్నో విషయాలు చర్చించేవారు.

మా తండ్రిగారికి మేము నలుగురు కుమారులం. ఒక కూతురు. మొదటి వారు అంటే మా పెద్దన్నగారు శ్రీపాద రామకృష్ణరావు మంచి నటుడు, జిల్లా విద్యాశాఖాధికారిగా పనిచేశాడు. రెండో అన్న జగన్నాథరావు క్రీడాకారుడు. మూడో అన్న డాక్టర్ శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు. వీరు మద్రాసు ప్రెసిడెన్సి కాలేజీలో ఫిజిక్స్ ప్రొఫెసర్‌గా, ఆ తర్వాత పలుచోట ప్రభుత్వ కళాశాలల ప్రిన్సిపాల్‌గా

పనిచేశారు. సాహిత్య విమర్శకులుగా, కళా విమర్శకులుగా ప్రఖ్యాతులై, చివరి దశలో మాతృశ్రీ జిల్లెళ్ళమూడి అమ్మగారి సందేశాన్ని గ్రంధరూపంలో అందజేసిన జిజ్ఞాసువు మా అక్క శ్రీమతి కామేశ్వరమ్మ.

నాకు బాల్యం నుంచీ అందమైన దస్తూరి నేర్చుకోవాలన్న అభిలాష ఉండేది అప్పట్లో ప్రాథమిక పాఠశాలల్లో విధిగా 'కాపీరైటింగ్' ఉండేది. పై పంక్తిలోని వాక్యాన్ని పంక్తి కింద పంక్తిగా కాక కింది వరుస నుండి పై వరుసలు రాయించేవారు. అలా రాస్తే మొదటి పంక్తిలోని అక్షర రూపం స్థిరంగా మనసులో నాటుకుంటుందని వారి అభిప్రాయం

మైసూరు ప్రాంతానికి చెందిన బి.ఎస్ లక్ష్మణరావుగారు రాజమండ్రిలోని ట్రైయినింగ్ కాలేజీకి అనుబంధంగా ఉన్న మోడల్ స్కూల్‌లో సంగీతం మాస్టర్‌గా ఉండేవారు. నాన్నగారు ఆ కాలేజీలో పనిచేస్తున్నందున వారిద్దరికీ మంచి స్నేహం మా అక్క కామేశ్వరమ్మగారికి సంగీత గురువు లక్ష్మణరావుగారు ఆమెకు పాఠం చెప్పేటప్పుడు, నేను కూడా ఆమె వద్ద కూర్చుని వినేవాణ్ణి. సంగీత సాధనలో 'వినికిడి' చాలా ముఖ్యం. మూడేళ్ళలో నేను 40 కృతులు నేర్చుకొన్నాను. అప్పటికి నా వయస్సు ఆరేడేళ్ళు కావచ్చు.

ఇంటర్మీడియట్ చదువు కోసం మా నాన్నగారు నన్ను కాకినాడ పి.ఆర్ కాలేజీలో చేర్చారు. వేమూరు రామకృష్ణరావుగారు మా ప్రిన్సిపాల్ ఆంగ్లోపన్యాసకులుగా, క్రమశిక్షణకు పెట్టిన పేరు. విశాఖపట్నం మెడికల్ కాలేజీలో ఎం.బి.బి.ఎస్ పాసైన తర్వాత 1943లో అసిస్టెంట్ సర్జన్‌గా చేరి, 1945లో ఎం.డి చేశాను. వైజాగ్ మెడికల్ కాలేజీలో సూపరింటెండెంట్‌గా చేరి 1968లో రిటైరై కర్నూలులోనే స్థిరపడ్డాను.

కాకినాడ కాలేజీలో చదువుతున్నప్పుడు బాడీబిల్డింగ్ మీద ఆసక్తితో వ్యాయామం చేశాను. సాయంత్రం, తెల్లవారురఝామున సంగీత సాధన చేసేవాణ్ణి. శరీరానికి 'అలివ్ ఆయిల్' పట్టించుకుని వివిధ భంగిమలలో కండర సౌష్ఠవాన్ని చూపే ఫోటోలు తీయించుకోవటం అప్పటి నా సరదా. రూపాయికి పది ఫోటో కాపీలు ఇచ్చేవారు కర్నూలు వచ్చిన తర్వాత బరువులెత్తడం (వెయిట్ లిఫ్టింగ్) ప్రాక్టీస్ చేశాను

బాల్యం నుంచి సంగీత వాతావరణంలో పెరిగాను. విశాఖపట్నంలో జరిగే సంగీత కచ్చేరీలకు తప్పకుండా వెళ్ళేవాణ్ణి. ప్రతి దినం సంగీత సాధన చేసేవాణ్ణి. నాతోపాటు జయంతి శ్రీరామమూర్తి కూడా సాధన చేస్తుండేవాడు. ఆ కాలంలో సంగీత పరీక్షలు లేవు. బాగా నేర్చుకోవాలన్న పట్టుదల రాజమండ్రిలో ముదిగొండ వెంకటరామశాస్త్రి ఈమని అచ్యుతరామశాస్త్రి (ఈమని శంకరశాస్త్రి గారి తండ్రి) గార్ల కచ్చేరీలకు వెళ్ళి వారి గానరీతులను శ్రద్ధగా ఆకళించుకున్నాను

మెడికల్ కాలేజీలో చేరకముందు మా తండ్రిగారు నన్ను ద్వారం వెంకటస్వామి నాయుడుగారి వద్ద సంగీత సాధనకు పంపారు. నాయుడిగారికి మా నాన్నగారంటే ఎంతో గౌరవం. నేను వారిని 'గురువుగారు' అంటే, వారు నన్ను "శిష్యుడుగారూ" అనేవారు. నన్నెంతో ప్రేమతో చూచేవారాయన. సుమారు 3 నెలలు వారి ఇంట్లోనే

ఉండి సంగీత సాధన చేశాను. ఉదయం మొదలు రాత్రి పడుకునే దాకా సంగీతం వింటూ ఉండేవాణ్ణి. నాయుడుగారు ఉదయాన్నే సంగీత కళాశాలలో [విజయనగరం] పాఠాలు చెప్పి 10 గంటలకు ఇంటికి వచ్చేవారు. కూతుళ్ళకు పాఠాలు చెప్పేవారు భోజనం తర్వాత కాసేపు విశ్రాంతి. తర్వాత సాధన. వారు కనీసము 3 గంటల సాధన ప్రతి నిత్యం చేసేవారు. వారి వద్ద పల్లవి రాగాలాపన - నిరవల్ - అభ్యసించాను.

ఒకసారి నాయుడుగారు ఫిడేల్ వాయిస్తున్నారు. ఆ నాద మాధుర్యానికి ముగ్ధుడనైన నేను 'సెభాష్' అన్నాను. నాయుడుగారు చాలా 'క్రిస్టిక్'గా 'భేష్' కొట్టొద్దు - శ్రద్ధగా వినటం ముఖ్యం అన్నారు. ఎవరెవరి కచ్చేరీలకు విధిగా వెళ్ళాలో చెప్పేవారు నాయుడుగారు.

వైజాగ్‌లో ప్రసూతి శిక్షణా విభాగం ఉండేది కాదు ఆ శిక్షణ కోసం వైజాగ్ మెడికల్ కాలేజీ విద్యార్థులుగా మేము మద్రాసు (ఎగ్మూర్‌లోని మహిళా వైద్యశాల) వెళ్ళేవాళ్ళం. కాలేజీ క్లాసులైన తర్వాత మద్రాసులో జరిగే కచ్చేరీలకు వెళ్ళి పెద్దల గానాన్ని వినేవాణ్ణి. రాగాలాపనలో నాకు శ్రద్ధ ఎక్కువ. టి.ఎన్. నాగరత్నం పిళ్ళైగారి నాదస్వర కచ్చేరీలకు అరియకుడి రామానుజ అయ్యంగార్, నయనాపిళ్ళై గోవిందస్వామి గార్ల కచ్చేరీలకు తప్పక వెళ్ళేవాణ్ణి.

శుక్రవారం సాయంకాలాల్లో జార్జిటౌన్‌లోని గోవిందప్ప నాయక్ వీధిలోని వీణ ధనమ్మాళ్‌గారి ఇంట్లో సంగీత గోష్ఠులు జరిగేవి. వీణ ధనమ్మాళ్ శిష్యులైన ఆర్. రంగరామానుజ అయ్యంగార్ వద్ద ఎంతగానో నేర్చుకున్నాను. ధనమ్మాళ్ గానం వినటం మహద్భాగ్యం. బేగడ రాగంలో వర్ణం వినటం నా పురాకృత పుణ్య విశేషం.

తమిళ దేశంలో సంగీత వ్యాప్తికి ప్రధాన కారణం సన్నాయి మేళం. ప్రతి శుభకార్యంలోను సన్నాయి మేళం తప్పక ఉంటుంది. ఉత్సవాలలో సన్నాయి వాద్య కచ్చేరీలుండేవి.

ఆంధ్రదేశంలో సన్నాయి మేళం అంతగా వ్యాప్తిలో లేదు. పాట కచ్చేరీలు తక్కువ. అసలు తెలుగువారు పాడితే అట్టే రారు. తమిళుల కచ్చేరీలకు ఎక్కువగా వస్తారు. తంజావూరు పరిసరాల్లో త్యాగరాజులవారు ఉన్నందున వారి ప్రభావం ఎక్కువ. అంతేకాదు ఆ ప్రాంతంలో సంగీత త్రిమూర్తుల ప్రభావం ఎక్కువ. మన వారికి ఆ డైరెక్షన్ లేదు. మన విద్యార్థులు వారి వద్దకు వెళ్ళి నేర్చుకునేవారు. తంజావూరు శైలి గోదావరిలో నేర్పాలన్నది నా ఆశ.

సంగీత త్రిమూర్తులు మహర్షుల వంటివారు. త్యాగరాజుల వారిది ద్రాక్షాపాకం, దీక్షితుల వారిది నారికేళ పాకం. శ్యామశాస్త్రుల వారిది కదళీపాకం. అన్నమాచార్యుల సంగీత సంప్రదాయం మనకందలేదు. వారి పదాల్లో కవిత్వం పాలు ఎక్కువ.

సంగీతం ద్వారా రోగ నివారణ చేయవచ్చు అన్న విషయం గురించి చెబుతూ, అందరికీ, అన్ని రీతుల్లో సంగీతం నచ్చదు. కొందరికి కర్ణాటక సంగీతం ఇష్టం, కొందరికి హిందూస్తానీ గాత్రం, మరి కొందరికి వాద్య సంగీతం ఇష్టం. రసికులకు

మాత్రమే సంగీతం ఆనందం ప్రసాదిస్తుంది. నాదం వినేవారి మనసుపై కొంత ప్రభావం కలిగిస్తుంది. ధ్వని తరంగాలు మన చెవులకు, చర్మానికి తాకుతాయి. అప్పుడు ఒక విధమైన 'మసాజ్ ఎఫెక్ట్స్' కలుగుతుంది. అది 'వైబ్రేషన్ ఎఫెక్ట్'. ఇంతవరకు ప్రయోగాత్మకంగా సంగీతం ద్వారా రోగ నివారణ చేసిన దాఖలా లేవీ లేవు. సంగీత రసాస్వాదనా శక్తి అందరికీ ఉండదు. గాయకుడికీ, శ్రోతకు సంస్కారం - యోగ్యత - ఉండాలి. ప్రతి రాగం లేదా కృతి మాధుర్యంలోని సూక్ష్మాంశాలను గ్రహించేందుకు అనుభవజన్యమైన సూక్ష్మ సంవేదనా శక్తి అవసరం శ్రోతలలో ఈ సంస్కారం లేనప్పుడు వారికి మిగిలేది ధ్వని. అది చెవికి సోకినప్పుడు అదే సంగీతం అనిపిస్తుంది. "ఇయర్ ఆఫ్ ది ఇయర్ ఈజ్ బ్రెయిన్".

సంగీతం పరిశుద్ధంగా ఉండాలి. సామాన్యుల కొరకు శాస్త్రీయ సంగీతం విలువలను విస్మరించరాదు.

1938 అక్టోబర్ 30న మొదటిసారిగా నా గానం ఆకాశవాణిలో ప్రసారమైంది. 1939 సెప్టెంబర్‌లో విశాఖపట్నంలో నా మొదటి కచ్చేరీ జరిగింది ఆ కచ్చేరీకి ప్రముఖ వయొలిన్ విద్వాంసులు శ్రీ మైసూర్ టి. చౌడయ్య విచ్చేసి, కచ్చేరి చివరి దాకా విని, చిన్నవాడైనా గొప్పగా పాడావు అని సభలో ప్రశంసించారు నన్ను మైసూరుకు ఆహ్వానించి రాజాస్థానంలో కచ్చేరి చేయించి, ఎంతగానో ప్రోత్సహించారు చాలా గొప్ప మనసు వారిది. చాలా చోట్ల కచేరీలు చేశాను. ఏనాడూ, ఎక్కడా ఇంత సంభావన ఇవ్వమని కోరలేదు. వచ్చిన దాంతో తృప్తిపడేవాణ్ణి.

నా శిష్యులలో ప్రసిద్ధులు నేదునూరు కృష్ణమూర్తి ఓలేటి వెంకటేశ్వర్లు (29-12-1989న కన్ను మూశారు) శ్రీరంగం గోపాలరత్నం. శ్రీమతి ఎస్ వసుంధరాదేవి (ప్రస్తుతం విజయనగరం మ్యూజిక్ కాలేజీ ప్రిన్సిపాల్) శ్రీమతి కట్టమూరి సుబ్బలక్ష్మి సత్యానంద్ నా వద్ద కొన్నేళ్ళు సాధన చేశారు. ప్రస్తుతం ధర్మపురి రామమూర్తిగారి అమ్మాయి లిద్దరు నా వద్ద సంగీతాభ్యాసం చేస్తున్నారు.

ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ 'గాన కళా ప్రపూర్ణ' బిరుదంతో సత్కరించి, విశిష్ట సభ్యత్వంతో గౌరవించింది. 1973లో కేంద్ర, సంగీత నాటక అకాడమీ ఫెలోషిప్, అదే సంవత్సరం ఆంధ్రా యూనివర్సిటీ 'కళా ప్రపూర్ణ' లభించాయి మద్రాస్ ఫైన్ ఆర్ట్స్ అకాడమీ 'సంగీత కళా శిఖామణి' బిరుదంతో సత్కరించింది. సంగీత విద్వాంసులకు ప్రతిష్ఠాత్మకమైన మద్రాస్ మ్యూజిక్ అకాడమీ అధ్యక్షత వహించే అవకాశం లభించింది. వారిచే 'సంగీత కళానిధి' సత్కారం అందుకోవటం నా అదృష్టం. 1983లో ఈ గౌరవం నాకు కలిగింది 1984లో భారత ప్రభుత్వం 'పద్మభూషణ' బిరుదం ప్రసాదించింది.

విజయవాడ ఆకాశవాణి కేంద్రంలో బాలాంత్రపు రజనీకాంతారావు గారు స్టేషన్ డైరెక్టర్‌గా ఉన్నపుడు వోలేటి వేంకటేశ్వర్లుగారు మ్యూజిక్ ప్రొడ్యూసర్‌గా ఉండేవారు. వారు 'ఏకరాగ సభ' అనే గానలహరి కార్యక్రమాన్ని నాతోనే ప్రారంభించారు. వర్ణం, స్వరజతి మొదలు పదము జావళీ ఒకే రాగంలో పాడాలి. ఈ ఏకరాగ సభ

1975లో ప్రారంభమైంది. ఈ సీరిస్‌లో డి.కె. పట్టమ్మాళ్ (శంకరాభరణం), ఎం.ఎల్. వసంతకుమారి (కల్యాణి), ఓలేటి వెంకటేశ్వర్లు (బేగడ) గానం చేశారు.

1972లో జాతీయ సంగీత కార్యక్రమంలో పాల్గొనవలసిందిగా ఆహ్వానించారు. పదిహేనేళ్ళు ఆలస్యంగా అందజేసిన ఆహ్వానాన్ని తిరస్కరించాను

అరయకుడి రామానుజ అయ్యంగార్ వంటి మహా విద్వాంసులు, తిరువయ్యార్‌లో జరిగిన త్యాగరాజు ఉత్సవాలలో నా గానం విని అభినందించటం నా అదృష్టం. ఉత్సవంలో నా గానం ముగించి బస్ స్టాండ్‌కు వెళ్తున్న నన్ను కలుసుకుని 'చాలా బాగా పాడారు' 'మే గాడ్ బ్లెస్ యు' అన్నారు శ్రీ అరియకుడి. అంతకంటే నాకేం సన్మానం కావాలి? ఆయన నా ఆదర్శం, సెమ్మంగుడి శ్రీనివాస అయ్యర్ నా కల్యాణి రాగాలాపనను ఎంతగానో మెచ్చుకున్నారు. అలాగే జి.ఎన్. బాలసుబ్రహ్మణ్యం నా రఘుప్రియ గానాలాపన విని అభినందించారు.

నేను 800 కృతులకు స్వర ప్రస్తారం (నొటేషన్) సిద్ధపరిచాను. 108 అన్నమయ్య కృతులకు నొటేషన్ సిద్ధం చేశాను భావి తరాల వారికి ఇవి ఎంతో ఉపయోగం. 12 ఏళ్ళ కృషి వల్ల ఇవి సాధ్యమైనాయి. ఈ నొటేషన్‌లను నాలుగు సంపుటాల్లో 1987లో సిద్ధం చేశాను. వీటి ప్రచురణకు తిరుపతి దేవస్థానం వారు, తెలుగు విశ్వవిద్యాలయం వారు పూనుకోవాలి వ్యక్తులు ఈ పనిచేయటం కష్టం. పెద్దగా ఆర్థిక వనరులు కావాలి.

నేను డబ్బుకోసం ఏనాడూ కచేరీలు చేయలేదు. భగవంతుడు నాకు కావలసినంత ఇచ్చాడు. నాకు తృప్తిగా ఉంది. నాకు నలుగురు కుమారులు - ఒక కుమార్తె అందరూ బాగా చదివి ఉద్యోగాల్లో ఉన్నారు. వారికి శాస్త్రీయ సంగీతం పట్ల ఆసక్తి తక్కువ. లైట్ మ్యూజిక్ వారికి ఇష్టం. కూతురుకు సంగీతం పట్టలేదు. రాత్రి పడుకునే ముందు ఆధ్యాత్మిక గ్రంథాలు చదువుతాను. మా ఆవిడ బాగా పాడుతుంది. భగవంతుడు నాకు మంచి ఆరోగ్యం ప్రసాదించాడు.

వర్ధమాన గాయకులకు నా సలహా - "బాగా సాధన చేయండి. పేరు ప్రతిష్ఠల కోసం పరుగులు తీయకండి. సంగీతాన్ని శుద్ధంగా ఉంచండి. కర్ణాటక సంగీతం అమరం'.'

● *ఆంధ్రప్రభ 28.1.1990* ●

★ ★ ★

# ఇరవయ్యో శతాబ్ది తాన్‌సేన్
# పండిట్ భీమ్‌సేన్ జోషి

"సంగీతం మతాలకు కుల వలయాలకు అతీతమైనదని మన చరిత్ర నిరూపించింది మన గురువులు ముస్లిమ్‌లు, వారి గురువులు హిందువులు, సంగీత శాస్త్ర వేత్తలకు సంగీతమే ఒక మతం. ఈనాడు పార్లమెంటులో 'సెక్యులరిజమ్' అంటూ వాదోపవాదాలు సాగిస్తున్నారు. ఆ పనిని సంగీతజ్ఞులేనాడో ఇదివరకే సాధించారు. ప్రజలను విభజించకుండా, వారిని బాధించకుండా వారికి మనశ్శాంతిని ప్రసాదించడమే సంగీతపరమార్థం - అంటూ భారతీయ సంగీతానికి ఇతోధిక గౌరవాదరాలను పెంపొందించుటకు విశేష కృషి చేస్తున్న 20వ శతాబ్దపు తాన్‌సేన్ పండిట్ భీమ్‌సేన్‌జోషి. ఈ సిద్ధి శిఖరాన్ని చేరుకునేందుకు బాల్యం నుండి ప్రయత్నించిన తీరు అనితర సాధ్యమైనది. భీమసేన్ జోషి గారి తాత గారైన భీమాచార్యులు ప్రముఖ గాయకులు, సంగీతవేత్తలు తండ్రి గురురాజజోషి స్నాతకోత్తర పట్టభద్రులు, అధ్యాపకులు, నిఘంటుకర్తలు. మంత్రాలయ మహాస్వామి రాఘవేంద్రుల జీవిత చరిత్రను ఇంగ్లీష్‌లో రచించినవారు.

భీమ్‌సేన్ జోషి 04-02-1922న, కర్ణాటక రాష్ట్రంలోని తాలూకా కేంద్రం గదగ్‌లో జన్మించారు. తల్లి గోదావరీ బాయి సనాతనాచారపరురాలు. కన్నడ, భజనకీర్తనలను అత్యంత శ్రావ్యంగా పాడేవారు. ఆబాల్య ప్రతిభామతియైన భీమసేన్ భజన బృందాల వెంట వెళ్ళిపోయేవాడు. అలసిపోయి వీధి అరుగుమీద నిద్రించే బాలుణ్ణి ఎత్తుకు వచ్చి ఇంట్లో దించేవారు కొందరు పుణ్యాత్ములు.

గృహ వాతావరణానికి తగినట్లు కుమారుడు కళాకారుడుగానో, ఇంజినీర్‌గానో, డాక్టర్‌గానో ఎదగాలని తండ్రి ఆశించారు బాలభీమ్‌సేన్ ప్రతిగురువారం స్థానిక దేవాలయంలో జరిగే భజనకార్యక్రమాల్లో పాల్గొనేవాడు. భావపూర్ణమైన అతని గాన మాధుర్యానికి శ్రోతలు ముగ్ధులయ్యేవారు కుమారుని సంగీతాభిరుచిని గమనించి గురురాజగారు, చెన్నప్ప కుర్తుకోటే అను గాయకుని వద్ద నెలకు అయిదు రూపాయల సంభావనతో సంగీత సాధనకు ఏర్పాటు చేసారు చెన్నప్ప వృత్తి రీత్యా రజకుడు. ఇనాయత్ ఖాన్‌గారి శిష్యుడు. ఏడు నెలల తర్వాత, పండిత శ్యామాచార్ గారి వద్ద సాధన ప్రారంభించారు. శ్యామాచార్ పురోహితులు, గాయకులు, హార్మోనియం వాద్య నిపుణులు.

ఒకమారు గదగ్, సమీపంలో కుందగోళకు తండ్రితో పాటు వెళ్ళారు. ప్రముఖ సంగీత విద్వాంసులు సవాయిగంధర్వ గారి గానం విన్నాడు ఆయన వద్ద సంగీతం

నేర్చుకోవాలన్న కోర్కెను తండ్రికి తెలిపాడు. కొన్ని కారణాల వల్ల వీలు కాదన్నారు అప్పుడు భీమ్‌సేన్ వయసు పదకొండేళ్ళు. గురువును అన్వేషిస్తూ వెళ్ళాలనుకొన్నాడు. ఒకరోజు మధ్యాహ్నం భోజనం చేస్తూ మరో చంచానెయ్యి వేయమని కోరాడు, పట్టుపట్టాడు. తండ్రి సున్నితంగా మందలించాడు. అదే సాకు, చొక్కా నిక్కరు ధరించిన భీమ్‌సేన్ గుట్టుచప్పుడు కాకుండా గదగ్ రైల్వే స్టేషన్ చేరాడు. చిల్లి గవ్వ లేదు ధైర్యంతో బీజాపూర్‌కు బయలు చేరనున్న రైలెక్కాడు. ప్రయాణంలో తనకునచ్చిన భజన గీతాలను, అభంగాలను పాడి ప్రయాణికుల ప్రశంసలందుకొన్నాడు. వారు అతనికి ఫలహారం, భోజనం సమకూర్చారు. బీజాపూర్ చారిత్రక పట్టణం ప్రపంచఖ్యాతి గాంచిన గోల్ గుంబజ్, మరెన్నో అందమైన భవనాల నిలయం. భీమ్‌సేన్ బీజాపూర్ స్టేషన్‌లో దిగాడు. చిల్లర పైసలు సమకూరేయి. రాత్రుల్లో ఏ అరుగు మీదో, దేవాలయం ప్రాంగణంలోనో పడుకొనేవాడు. ఒకమారు భీమ్‌సేన్ పాట విన్న ఒక సంగీత ప్రేమికుడు ఆ బాలుని చేరదీశాడు. గురువుగారి కోసం అన్వేషిస్తున్నా నన్నాడు. అయితే నీవు గ్వాలియర్ వెళ్ళు. అక్కడ ఎందరో గొప్ప విద్వాంసులున్నారు - అన్నాడు. చేతిలో వున్న నాలుగు రూపాయలతో పూనా వెళ్ళే రైలెక్కాడు.

పూనా నగరం సంగీత దిగ్గజాల నిలయం, అక్కడక్కడ పాటలు పాడుతూ కొన్ని వారాలు గడిపాడు. కొందరి సూచన మేరకు భీమ్‌సేన్ ప్రముఖ విద్వాంసులు కృష్ణారావు పులంబ్రికర్ గారిని కలుసుకొని - సంగీతం నేర్పమని బతిమలాడాడు. కృష్ణారావు పాడమన్నాడు. పాటవిని మెచ్చుకున్నాడు కానీ నెలకు వంద రూపాయలిమ్మన్నాడు. కానిపని అంటూ భీమ్‌సేన్ మరుసటి దినం ఢిల్లీ రైలెక్కాడు. ఖాద్వా స్టేషన్‌లో రైల్వే సిబ్బంది టికెట్ లేని భీమ్‌సెన్‌ను రెండు రోజులు బందీగా వుంచారు. ఇలా ఊళ్ళు మారుతూ, రైల్లో పెట్టెలు మారుతూ, అక్కడక్కడ స్టేషన్‌లలో తలదాచుకొంటూ, పాటలు పాడుతూ కడుపు నింపుకొంటూ మూడు నెలల పర్యటన తర్వాత గ్వాలియర్ చేరాడు. గదగ్‌లో తల్లీ, తండ్రి, బంధువులు భీమ్‌సేన్ కానరాలేదని పోలీసులకు తెలిపారు. అంతే విధి నిర్ణయం అనుకొన్నారు.

**గ్వాలియర్ అనుభవాలు:** గ్వాలియర్‌లో ప్రతి ఇంటిలో సంగీతం అంగంగా వుంటుంది. తమ పర్యటనలో నేర్చుకొన్న హిందీ భాష ఆయనకెంతో సహకరించింది. గ్వాలియర్ సంస్థానాధీశుల ఆశ్రయంలో సరోద్ వాద్య నిపుణుడైన హఫీజ్ అలీఖాన్ గారిని ఆశ్రయించాడు. మాధవ సంగీత విద్యాలయంలో చేరటానికి సిఫారసు పత్రం సాధించాడు. విద్యాలయంలో వ్యక్తిగత గమనం వుండేది కాదు. సామూహిక శిక్షణ భీమ్‌సేన్‌కు రుచించలేదు కాని తరగతులకు హాజరవుతున్నందున విద్యాలయంలో ఖయాల్ నిరూపణా తంత్రాన్ని అభ్యసించాడు

గ్వాలియర్‌లోని స్థానిక గాయకుణ్ణి భీమ్‌సేన్ కలుసుకొన్నారు. ఆయన భజన కీర్తనల గానంలో నిష్ణాతుడు, భీమ్‌సేన్ గానాన్ని మెచ్చుకొని, తనతో తంబూరా వాదకుడుగా, రాజమందిరంలో కార్యక్రమాలకు వెళ్తుండేవాడు. ఆ గాయకుడు

భీమ్‌సేన్ సమకూరుస్తున్న తంబూరా సాథ్‌తో సంతుష్టుడయ్యాడు. భోజన వసతి కల్పించలేదు గాని, నివాస వసతి కల్పించాడు. గాయకునికి సాథ్ ఇచ్చినందుకు మహారాజా గారు పదిరూపాయల దక్షిణ, టెంకాయ ఇచ్చారు. ఇదే భీమ్‌సేన్‌గారి వృత్తి రీత్యా మొదటి సంపాదన. ఒక జత దుస్తులు కొన్నాడు.

ఉస్తాద్ హాఫీజ్ అలి ప్రేమాదరాలు చూరగగొన్న భీమన్‌సేన్, మారవా, పూరియా రాగాల సూక్ష్మ వ్యత్యాసాలను సాధన చేశాడు. ఉస్తాద్ భీమ్‌సేన్ సాధనను ప్రశంసించాడు. భీమ్‌సేన్ కోరికపై ఖరఖ్‌పూర్‌లోని ప్రఖ్యాత సంగీతవేత్త కేశవ ముకుంద్ లుభే గారిని కలుసుకొన్నాడు. ఆయన కొందరి ఇళ్ళకు వెళ్ళి సంగీత పాఠాలు చెప్పేవారు. ఇంటికి వచ్చి అలసిపోయిన గురువుగారి పాఠాలు భీమ్‌సేన్‌కు నచ్చలేదు. శిష్యుని తపనను గ్రహించి కలకత్తాలోని సుప్రసిద్ధ విద్వాంసులైన భీష్మ చటర్జీ వద్దకు పంపారు.

కలకత్తా వాసం: కలకత్తా చేరిన భీమ్‌సేన్ మనసు మారింది. భీష్మ చటర్జీకి బదులుగా, కలకత్తాలోని న్యూథియేటర్స్ చిత్ర నిర్మాణ సంస్థకు చెందిన ప్రముఖ నటుడు, గాయకుడైన పహరీ సన్యాల్‌ను కలుసుకొన్నాడు తనతో వుండేందుకు వసతి కల్పించాడు. ఆరునెలలపాటు పహరీ సన్యాల్ ఇంటి పనులు, నీళ్ళుతోడటం సాగింది. చివరకు లుభే గారి వద్ద సంగీత సాధన ప్రారంభించాడు. గాంధారి రాగం అభ్యసించారు. చటర్జీ న్యూ థియేటర్స్ వారి సంగీత దర్శకుడు సదా ధ్వని ముద్రణ - చిత్రీకరణ కార్యక్రమాల్లో మునకలు వేస్తుండేవాడు. శిష్యులకు పాఠాలు చెప్పే తీరికే వుండేది కాదు. ఒకమారు నిర్మాణంలో వున్న చిత్రంలో పాత్రధారణ వేయమని, వీలున్నపుడు సంగీతం నేర్పుతానని చెప్పాడు చటర్జీ. "నేను శాస్త్రీయ సంగీతం నేర్చుకోవడానికి వచ్చాను కాని నటుడు కావాలని రాలేదు" అన్నాడు. చటర్జీకి కోపం రావటం వెంటనే యాభై రూపాయలిచ్చి నీ ఇష్టమొచ్చిన చోటికి వెళ్ళి పొమ్మన్నాడు. భీమ్‌సేన్ జలంధర్ వెళ్ళాడు. హిందూస్తాని సంగీత కేంద్రం జలంధర్. ప్రతి యేటా విఖ్యాత భక్త కవిబాబాహరివల్లభ్ గారి ఆరాధనోత్సవాలు డిసెంబర్‌లో మూడురోజుల పాటు అత్యంత వైభవంగా జరుగుతుండేవి. ఎందరో సంగీత వేత్తలు ఆ ఉత్సవాల్లో పాల్గొనేవారు. నగరంలోని సంగీతవేత్తల కచేరీలకు వెళ్తూ వారి సంగీత రీతులను శ్రద్ధగా ఆకళించుకొన్నాడు భీమ్‌సేన్,

అదృష్టం వరించింది. నగరంలోని నూనె మిల్లు యజమాని సంగీతం అంటే చెవి కోసుకొనేవాడు. భీమ్‌సేన్ అతని వద్దకు వెళ్ళాడు. ఆ రసికుడు నెలకు నాలుగు రూపాయల వేతనంపై భీమ్‌సేన్‌ను తన ఇంట సంగీతం నేర్పటానికి ఏర్పాటు చేసుకొన్నాడు. ఆ కాలంలో నెలకు మూడు రూపాయలు, రెండు పూటలా భోజనానికి సరిపోయేది. భీమ్‌సేన్‌కు నివాసం, భోజనం చింత తీరింది. భీమ్‌సేన్ మంగల్‌రామ్ గారి ఆర్యసంగీత విద్యాలయంలో చేరి ధ్రుపద్ ధమార శైలిని సాధన చేశాడు.

భీమ్‌సేన్ దశ మారింది. మంచి భోజనం, పాలు, నేయి లభించాయి. వ్యాయామం చేస్తూ పైల్వాన్‌గా మారాడు. అంతలోనే హరివల్లభ ఆరాధనోత్సవాలు

ప్రారంభ కావటం భీమ్‌సేన్‌కెంతో సంతోషం. ప్రముఖ సంగీత విద్వాంసుల ఖయాల్ గానం మనసారా విని ఆనందించాడు. ఆ ఏట వచ్చిన సంగీత విద్వాంసులలో విష్ణుదిగంబర పలుస్కర్ గారి శిష్యులైన వినాయకరావ్ పట్వర్ధన్ గారిని భీమ్‌సేన్ ఆశ్రయించాడు. ఖయాల్ గానంలో ఉన్నత శిక్షణ కోసం చేస్తున్న తన ప్రయత్నం నెరవేరలేదని పట్వర్ధన్ గారికి చెప్పాడు సవాయి గంధర్వ వంటి మహా విద్వాంసులు మీ గదగ్ సమీపంలో కుందగోళలో వున్నారు వారినాశ్రయించు. ఆయన మహావిద్వాంసుడైన అబ్దుల్ కరీంఖాన్‌గారి శిష్యుడు. ఇంతదూరం ఎందుకొచ్చావు వెళ్ళి సవాయి గంధర్వుల వద్ద సాధన సాగించమని ఉపదేశించాడు.

సవాయి గంధర్వ వద్ద శిక్షణ కోసం భీమ్‌సేన్ గదగ్ వచ్చారు. కుటుంబం అంతా సంతోషించారు.

**సవాయి గంధర్వ:** తండ్రి భీమ్‌సేన్‌తోపాటు సవాయి గంధర్వ గారి వద్దకు వచ్చి నెలకు వంద రూపాయల శుల్కం చెల్లించు షరతుపై కుమారుణ్ణి వారి వద్ద వదలి వెళ్ళారు. సవాయి గంధర్వ గారి ఇంటికి మైలు దూరం నుండి మంచినీరు తీసుకురావటం నౌకరుతో పనిచేయుటం, గురువుగారి శుశ్రూష మున్నగు వాటిలో ఒకటిన్నర ఏడాది గడచింది. మండు వేసవిలో మంచినీళ్ళు మోసుకువచ్చే భీమ్‌సేన్‌ను చూసి, గురువుగారి ఇంటికి ఎదురుగా గుడిసెలో వుంటున్న ముసలమ్మ మనసు కరిగింది. ఆమె పాలు అమ్ముకొని బ్రతికేది. రోజూ భీమ్‌సేన్‌కు పెద్ద లోటా పాలు ఉచితంగా ఇచ్చేది. శిక్షణ కఠినంగా వుండేది. దియాజ్‌లో ఏ మాత్రం పొల్లు పోయినా చేతి కర్రను ప్రయోగించేవారు శిష్యునికి తోడి, ముల్తాని, పూరియా రాగాలలో శిక్షణ ఇచ్చారు. ఐదేళ్ళ శిక్షణలో గురువుగారితో పాటు కచ్చేరీలలో పాల్గొనే వారు. అగాధమైన స్మరణ శక్తి ప్రతిరోజు 16 గంటల సాధన చిన్న కచ్చేరీలు. మరలా రామ్‌పూర్‌లో ముస్తాక్ హుసేన్ గారి శిష్యరికం - వారి ఇంట్లో వంటా, వార్పు చేస్తూ మాంసంకూడా వండేవారు. ఆరు నెలలు నటమల్హార్ రాగాన్ని సాధన చేశారు. లక్నో ఆకాశవాణి కేంద్రంలో అవకాశం లభించింది. భీమ్‌సేన్ గారి జీవితంలో అదొక గొప్ప మలుపు. భీమ్‌సేన్ జోషి పేరు దేశమంతా వ్యాపించింది. శాస్త్రీయ సంగీతవేత్త అయిన జోషి మరారి నాటకాల్లో పాత్రధారణ చేస్తూ భక్తి కీర్తనల గానంలో అద్వితీయులనిపించుకొన్నారు. దేశమంతటా కచ్చేరీలు సాగాయి.

**విదేశీ యాత్ర:** 1964-82 మధ్య అయిదు మార్లు విదేశాలలో పర్యటించారు. అత్యంత జన ప్రియగాయకులుగా మన్ననలందుకొన్నారు. 1964లో అఫ్ఘనిస్తాన్ ప్రభుత్వ సత్కారమందుకొన్నారు. 1965లో డచ్ చిత్ర నిర్మాత భీమ్‌సేన్ జోషి 'రాగమియా మల్హార్' పేరుతో 25 నిమిషాల డాక్యుమెంటరీ నిర్మించారు. 1941లో బెంగుళూరులో జరిగిన కచ్చేరీలలో 200 మంది ప్రముఖ సంగీత విద్వాంసుల సమక్షంలో తోడిఖయాల్ గానం చేసి సభను మైమరిపించారు. డాక్టర్ సి.వి. రామన్, అతని సతీమణి, భీమ్‌సేన్ జోషిగారిని ముక్తకంఠంతో కొనియాడారు.

వ్యక్తి-వ్యక్తిత్వం: జోషి అదమ్యధైర్యశాలి, నిరంతర సాధకుడు. మధురతరమైన గంభీర స్వరం ఆయనకు దైవదత్తం. బాల్యం యవ్వనంలో మంచి పైల్వాన్ , నాటకాల్లో పాత్ర ధారణ కావిస్తూ మంచి పేరు గడించారు. నాటకాల్లో అభినయిస్తూ 'భాగ్యశ్రీ' అను నాటకంలో, సహనటీమణి వత్సలాబాయితో ప్రేమను పంచుకొన్నారు ఆమె గొప్ప గాయకురాలు కూడా. ఆ అనుబంధం వివాహంగా మారింది. అప్పటికే మేనమామ కూతురు సునందతో 1940లో వివాహమైంది

కీర్తి, ప్రతిష్ఠలు గడించిన జోషీగారికి కొత్త కారు అంటే మోజు. రెండు కార్లున్నాయి. స్వయంగా అతివేగంగా కారు నడపటం ఆయనకిష్టం. పూనా నగరంలో స్వయంగా 'లక్ష్మి పార్క్' అనే భవనం నిర్మించుకొన్నారు భారత ప్రభుత్వం నుండి పద్మభూషణ సత్కారం, సంగీత నాటక అకాడమీ సత్కారం, మరెన్నో సత్కారాలందుకొన్నారు. ఇపుడు కాలం మారింది. మా కాలంలో సంగీత సాధన చాలా శ్రద్ధతో సాగేది. ఇప్పుడు చంచలత్వం ఎక్కువ. నేటి యువకులు ఇతర ఆకర్షణలో పడ్డారు. త్వరలోనే టి.వి., సినిమాలకు ఎగబడతారు. నేటి సాధకులకు వేగం ప్రధానం. 5,6 నెలల సాధనతో టి.వి. ప్రోగ్రామ్ శక్యం కాదు. ఆనాటి రాజకీయ విలువలు నేడు మృగ్యం. స్వార్థపరత్వం పెరిగింది. నేను పాడిన 'మిలే సుర్ మేరాతుమ్ హారా' *(మనమందరం కలిసి పాడుదాం గొంతులు కలుపుదాం - సమైక్యంగా వుందాం)* అనే పాటను ఆసక్తితో వింటారు. కానీ మరుసటి రోజే బ్లాక్ మార్కెట్ చేస్తారు, లంచాలు తీసుకొంటారు, టి.వి.లో రెండు గంటలు సినిమా చూపిస్తారు. రెండు నెలలకొక మారైన శాస్త్రీయ సంగీతం వినిపించాలి అంటారు జోషీగారు.

● వార్త *10-7-1996* ●

★ ★ ★

# గానంతో శిలల్నే కరిగించగల పండిట్ జస్‌రాజ్

పండిట్ జస్‌రాజ్ వర్తమాన గాయకులలో అగ్రగణ్యులు, భావపూర్ణమైన సంగీతం, స్వరమాధ్యమంతో కావ్య సౌందర్యాన్ని ప్రదర్శించటం జస్‌రాజ్ ప్రత్యేకత, 'మేవాడి' ఘరానాకు చెందిన విఖ్యాత సంగీత కళామూర్తి జస్‌రాజ్ శాస్త్రీయ సంగీతం కావచ్చు, గీత గోవిందం వంటి సంగీత రూపకాలే కావచ్చు, వల్లభ సంప్రదాయ కీర్తనలు కావచ్చు. అన్నిటిలోను వారి విశిష్ట భావపూర్ణ గాన శైలి శ్రోతలను తన్మయులను కావిస్తుంది

తమకత్యంత అభిమాన పాత్రమైన హవేలి సంగీతం, భక్తిగీతాల ఆలాపనలో ఆయనకాయనే సాటి అని అంటారు సంగీత రసజ్ఞులు.

సంత్ సూరదాస్ పంచశత సంస్మరణ సందర్భంగా ఏర్పాటు చేసిన సంగీత సమారోహ్‌లో, సూరదాస్ గుణ గానాన్ని చేయడానికి సంగీత విద్వాంసులందరూ ఏకగ్రీవంగా జస్‌రాజ్‌నే ఎన్నుకున్నారు.

హర్యానాలో జన్మించి, ఆంధ్రప్రదేశ్‌లో పెరిగి, గుజరాత్‌లో ఎదిగి, చివరకు ముంబైలో స్థిరపడిన జస్‌రాజ్ స్వదేశంలోనే కాక, విదేశాలలో కూడా ఎన్నో ప్రదర్శనలిచ్చి ఘనసత్కారాలనందుకొన్నారు. అరవై ఎనిమిదేళ్ళ వయసులో ఆయన "వెనుదిరిగి చూసినపుడు - నేను సాధించింది ఏమీ లేదు అనిపిస్తుంది సమయ్ హాథ్ సేగయా" అంటూ వినయంగా చెబుతారు.

ఆయన జీవితంలో ఎన్నో చేదు అనుభవాలున్నాయి జస్‌రాజ్ తబలా వాద్యంలో దిట్ట. సంగీత కచేరీలలో తబలా, హార్మోనియం వాదకులు కూడా వేదికపై గాయకునితోపాటు కూర్చోవాలని ఆయన అభిమతం. తమ పద్నాలుగవ ఏట లాహోర్‌లో జరిగిన సంఘటనను ఆయన మరవలేదు. వేదికపై తనకు కూడా (తబలావాదకుడు) స్థానం కల్పించమన్నాడు. "చచ్చిన చర్మాలపై వేళ్ళాడించే నీకు సంగీత వేత్తల సరసన స్థానమా?" అన్నారు. ఆ మాట శరాఘాతంలా తగిలిందాయనకు. ఆనాడే సంగీత విద్వాంసుడు కావాలనే శపథం చేశారు. ఆ సంఘటన జస్‌రాజ్ జీవితాన్ని మలిచింది.

**సహృదయత:** జస్‌రాజ్‌గారి హృదయ సంపదను నిరూపించే ఘట్టాలు కొల్లలు. క్యాన్సర్ వ్యాధిగ్రస్తుడైన బాలుడొకడు జస్‌రాజ్ దర్శనం కొరకు తపించేవాడు. వృద్ధుడైన ఆ బాలుని తండ్రి జస్‌రాజ్‌ను కలుసుకొని తన కుమారుని కోరికను తెలిపాడు. వెంటనే జస్‌రాజ్ ఆసుపత్రికి వెళ్ళారు. పాటల కేసెట్లు ఇచ్చారు. బాలుని పక్కనే కూర్చొని సాంత్వన వాక్యాలు పలికారు. ఆ ఊళ్ళో వున్నవాళ్ళు ఆ బాలుని వద్దకు వెళ్ళి, కొన్ని నిమిషాలైన వుండి వెళ్ళేవారు.

ఒకమారు పండిట్ జస్‌రాజ్ ఒక ఊళ్ళో కచేరి ముగించేసరికి రాత్రి మూడుగంటలైంది. తిరుగు ప్రయాణంలో ఒక గ్రామాన్ని చేరారు. గ్రామప్రజలు కారు చుట్టు మూగారు. 80 ఏళ్ళ గ్రామ పెద్ద మాట్లాడుతూ పండిట్‌జీ వయోభారంతో తమ కచేరీకి రాలేకపోయాను. ఆరోగ్యం కూడా అంతమాత్రమే తమగానం వినే భాగ్యం నాకు లేదేమో" అంటూ కన్నీరు కార్చాడు. ఆ మాట విన్నంతనే పండిట్ జస్‌రాజ్ "తో క్యా హువా? హమ్ అభీ సునాతే హై" అంటూ గ్రామప్రజల మధ్య తంబూరా శృతి చేసుకొని పాడారు. మనసు విప్పి పాడారు. గ్రామ పెద్ద ఆనంద బాష్పాలు రాలుస్తూ విన్నాడు. తిరిగి వెళ్తూ "ఈరోజు నేనేదో పరమార్థాన్ని సాధించిన అనుభవం కల్గిందన్నారు".

పండిట్ జస్‌రాజ్ భక్తితత్పరులు. ప్రతి కచేరీ చివర, తమకు అత్యంత ప్రీతిపాత్రమైన, జనప్రియమైన "మహాకాళీ భవానీ..." పాట పాడుతారు. ఈ కృతిని రచించినది ఆయనే.

జస్‌రాజ్ తమ సీనియర్ కళాకారుల పట్ల అత్యంత గౌరవభావం కల్గివుంటారు. అమరావతిలో ఒక జోగిని గానం చేసిన "జీవన్‌పురి" రాగం విని ఆనంద బాష్పాలు రాల్చటం వారి సహృదయతకు సాక్ష్యం. పండిట్ భీమ్‌సేన్ జోషీకి జరిగిన సన్మానోత్సవంలో పాల్గొన్న జస్‌రాజ్ సంగీత ప్రపంచంలో తాన్‌సేన్ తర్వాత సంగీత సామ్రాజ్య చక్రవర్తిత్వానికి అర్హులు భీమ్‌సేన్ జోషీ మాత్రమేనని అన్నారు. పండిట్ రవిశంకర్, తత్వవేత్త జిడ్డు కృష్ణమూర్తి జస్‌రాజ్ సంగీత వైదుష్యాన్ని ముక్తకంఠంతో ప్రశంసించారు.

యువతరానికి చెందిన సంగీత కళాకారులపట్ల ఎంతో ఆదరం కల జస్‌రాజ్ "ఈనాటి యువకళాకారుల జ్ఞానం ఆగాధం సాధన చేయాలన్న పట్టుదల వారిలో వుంది. అందుకు అనుగుణంగా కొత్త పరికరాలున్నాయి వారికి తగిన మార్గదర్శకత్వం అవసరం" అంటారు. ఆయన తమ తండ్రి స్మృత్యర్థం పండిట్ మోతీరామ్ సంగీత నాట్య అకాడమీ స్థాపించి యువ కళాకారులను తీర్చిదిద్దుతున్నారు.

ప్రతిభావంతుల కుటుంబం : ప్రముఖ చిత్ర నిర్మాత, దర్శకుడు శాంతారామ్ కుమార్తె మధురా జస్‌రాజ్ అర్థాంగి. ఆమె స్వయంగా గొప్పగాయని, రచయిత్రి. సంస్కృత భాషా విశారద, సినిమా, నాటకాల దర్శకురాలు, టి.వి కార్యక్రమాల దర్శకులుకూడా

శాంతారామ్ ఆత్మకథ 'శాంతా రామా'ను తండ్రి చెప్పగా శ్రీమతి మధురా అక్షర బద్ధం చేశారు. తన భర్తతో కలిసి సుర్ పదావళి, రామచరిత మానస్, దూరదర్శన్ చిత్రాలను నిర్మించారు. భర్త జస్‌రాజ్‌తో సంగీత కచేరీలలో పాల్గొన నేపథ్యంలో గానం చేస్తారు.

జస్‌రాజ్ దంపతుల కుమారుడు సారంగదేవ్. 14వ ఏటనే శాంతారాం 'రాజా రాణికో చాహె వసీనా' చిత్రానికి సంగీత దర్శకత్వం వహించారు. 13వ ఏటనే అతని సంగీత రికార్డులు వెలువడ్డాయి కూతురు దుర్గ సంగీతంలో నిష్ణాతురాలు.

విదేశాల్లో తండ్రితోపాటు కచేరీల్లో పాటలు పాడేది. తాత శాంతారాం చిత్రాల్లో పాటలు పాడింది.

పండిట్ జస్‌రాజ్‌ను 1975లో భారత ప్రభుత్వం 'పద్మశ్రీ' బిరుదుతో సత్కరించింది. 1976లో హర్యానా ప్రభుత్వం 'సంగీత మార్తండ' బిరుదుతో గౌరవించింది. ఆయనతో జరిపిన ఇంటర్వ్యూలోని కొన్ని ముఖ్యాంశాలు...

**'మేవాడీ' ఘరానా పుట్టుక, వికాసం.. జస్‌రాజ్‌కు ఘరానాతో గల సంబంధం గురించి...?**

"ఘరానాలు ఎక్కువగా స్వామి హరిదాస్ నుండే అవతరించాయి. రాజస్తాన్, హర్యానా, అజ్మీర్ ప్రాంతాలకు చెందిన సీమను 'మేవాత్' అంటారు. శక్కర్ ఖాన్, మక్కర్ ఖాన్‌లు ఈ ఘరానాలో ప్రసిద్ధులు. వీరే ఖాయాల్ పద్ధ"తిని ప్రారంభించారు. ఈ పరంపరలోని ఆలీఖాన్ శిష్యుడు నజీర్‌ఖాన్ మేవాడీ ఘరానా స్థాపకులు సత్తూలాల్‌జీ, చమన్‌లాల్‌జీ, మా తండ్రి మోతీరాంజీ, చిన్నాన్న జ్యోతి రామ్‌జీ మేవాడీ ఘరానా ప్రసిద్ధికి కారకులు.

**తండ్రిప్రభావం....** మా తండ్రి ఆశ్రయ భాగ్యం ఎక్కువకాలం నాకు లభించలేదు. వారు కన్ను మూసేనాటికి నేను కేవలం నాలుగేళ్ళవాణ్ణి. వారు కాశ్మీర్ మహారాజా ప్రతాప సింహ్ ఆస్థాన కళాకారులలో ఒకరు. తర్వాత హైదరాబాద్ చేరారు అక్కడ దర్బారు గాయకులుగా ఘన సన్మానం అందుకొనే రోజు ఉదయం వారు అకస్మాత్తుగా మరణించారు. మా అన్న పండిట్ మనిరామ్ నన్ను పోషించారు. వారే నా సంగీత గురువు వారు పాడుతుంటే నేను తబాలా వాయించినపుడు వారికివ్వవలసిన పారితోషికం మా కుటుంబానికే చెందాలన్న ఆశతో నేను తబలా నేర్చుకున్నాను. అప్పట్లో మా కుటుంబం ఆర్థికంగా దుర్దశలో వుండేది

**విదేశీ శ్రోతలకు, మన దేశ శ్రోతలకు గల తేడాలు.....** అక్కడి శ్రోతలు క్రమశిక్షణతో వ్యవహరిస్తారు. సరైన వేళకు వస్తారు. వారు రావటానికి ఆలస్యమైతే పాడుతున్న పాట పూర్తి అయ్యేదాక బయటనే నిల్చుంటారు. ఆ తర్వాతే సభామందిరంలోకి వస్తారు. పాట పూర్తి అయితేనే వారు హర్షధ్వానాలు చేస్తారు.

**సినిమా సంగీతం గురించి అభిప్రాయం....** ఎవరేమనుకొన్నా నేను ఈ పాటలను ప్రశంసిస్తాను. ఎందుకంటారా? ఈ పాటలే మన సంగీత కళాకారులను వారితో పాటు శాస్త్రీయ సంగీతాన్ని ప్రతి ఇంటికి చేరవేస్తున్నాయి. లతామంగేశ్కర్ వలననే మనదేశంతో బాలబాలికలు బాత్‌రూమ్‌లో పాటలు పాడసాగారు. ఈ మాట మీకు విడ్డూరంగా కనిపించినా, సంగీత ప్రపంచానికో వరప్రసాదం. దీనిని లతామంగేశ్కర్ పురస్కారంగా భావించవచ్చు. శాస్త్రీయ సంగీతాన్ని సినిమా పాటలకు కలిపిన నౌషద్ ఆలీ, సి. రామచంద్ర, రోషన్, మదన్ మోహన్ వంటి సంగీత దర్శకుల్ని మనం మరవలేము.

**రేడియో, టీవీలలో ప్రసారమయ్యే సంగీతంలో ప్రభుత్వ ప్రమేయం గురించి:** ప్రభుత్వం విదేశాల్లో సంగీతోత్సవాలను ఏర్పాటు చేస్తున్నది అది హర్షింపదగ్గ విషయం. కాని అంత దూరం వెళ్ళిన సంగీత వాద్యకారునికి లేదా గాయకునికి కేవలం పాతిక నిమిషాల వ్యవధి ఇస్తారు. పండిట్ రవిశంకర్‌గారికైనా అంతే సమయం! సత్యజిత్ రే చిత్రాలకు పూర్తి వ్యవధిని ఇస్తారు. ఈ కార్యక్రమాల ద్వారానే, అక్కడివారికి కళాకారుల పరిచయం ఏర్పడుతుంది. చిత్రంలోని ఏదో ఒక అంశాన్ని మాత్రమే వారెందుకు చూపరు? నృత్యకళాకారులకు, సంగీత కళాకారులకు పూర్తి కాలం ఎందుకు కేటాయించరు? 10, 15 నిమిషాల్లో భారతీయ సంగీత వైశిష్ట్యాన్ని విదేశీయులకు నివేదించగలమా? కనీసం రెండు గంటలైనా కళాకారునికి కేటాయించాలి. పలుమార్లు ఈ విషయం నేను చెప్పాను. ఈ తర్కం రేడియో, టీవీలకు కూడా వర్తిస్తుంది.

శాస్త్రీయ సంగీతానికి మృతి లేదు. గజల్స్, భజనలవల్ల శాస్త్రీయ సంగీతానికి అవరోధం ఏర్పడుతూ వుందన్న వాదం వుంది. కానీ శాస్త్రీయ సంగీత అభిమానుల, సంఘాల గణనీయమైన కృషివల్ల శాస్త్రీయ సంగీతం గురించిన ప్రచారం మంచి స్థితిలోనే వుంది.

**శాస్త్రీయ సంగీత ప్రాచుర్యానికి ప్రభుత్వం, ప్రజలు ఏం చేయాలి?**

ప్రభుత్వం ముందుగా సంగీత కళాశాల విద్యార్థులకిచ్చే విద్యార్థి వేతనం మొత్తాన్ని పెంచాలి. క్రీడారంగంలోని క్రీడాకారుల్ని పెద్ద పారిశ్రామిక సంస్థలు ప్రోత్సహించినట్లే ప్రతిభావంతులైన సంగీత కళాకారుల్ని ప్రోత్సహించాలి.

("తరంగ" కన్నడ వార పత్రికలోని ఎచ్.కె కర్వేరా వ్యాసం ఆధారంగా)

● వార్త *22.6.1997* ●

* * *

# నటసార్వభౌమ పృథ్వీరాజ్ కపూర్

1912 నాటిమాట. చిత్రనిర్మాత, దర్శకుడు, ఖాన్ బహదూర్ అర్దేశిర్ ఇరాని తన మొట్టమొదటి టాకీ సినిమా కోసం కొత్త ముఖాలను అన్వేషిస్తున్నాడు. వందల సంఖ్యలో యువకులు యువతులు ఇంటర్వ్యూకు వచ్చారు. అప్పటికే మూకీ చిత్రాల్లో నటులుగా పేరు మోసిన మాస్టర్ విఠల్, నిసార్, జాల్ మర్చెంట్, బిల్ మోరియా మొదలగు వారు కూడా క్యూలో నిల్చున్నారు. నిల్చుని విసిగి పోయారు. ఆ వరుసలో ఒక యువకుడు అందమైన విగ్రహం. ఎంత సేపటికీ దృష్టి తనపై పడనందుకు చిరాకు పడ్డాడు. లాభం లేదనుకొని దగ్గరలోని మేజా బల్లపై వున్న గాజుపేపర్ వెయిట్‌ను ఎత్తి నేలకు కొట్టాడు. అందరిదృష్టి అతనిపై మళ్ళింది. నిర్మాత ఇరానీ తీవ్రంగా గద్దించాడు.

"క్షమించండి ఈ నటుడు, ఎంతసేపటి నుంచి కాదు కాదు ఎన్ని రోజులు ఇలా క్యూలో నిల్చుని తమ దర్శనం కోసం వేచి వున్నాడో తెలుపటానికై ఆ పని చేశాడు" అన్నాడు ఆ తర్వాత చిత్రరంగంలో నటసార్వభౌముడుగా వెలిగిన పృథ్వీరాజ్ కపూర్. "ఆలం ఆరా" అన్న టాకీ చిత్రంతో నటలోకంలో ధృవతారగా వెలుగ సాగాడు.

నేటి పాకిస్తాన్‌లోని పెషావర్ పట్టణానికి సమీపంలోని సముంద్రి అన్న గ్రామ పెద్ద లాలా బశేర్‌నాథ్, మొదటి కుమారునిగా 1906 నవంబర్ 3న పృథ్వీ పుట్టాడు. లయల్‌పూర్ హైస్కూల్‌లో మెట్రిక్ చదువు. ఆ హైస్కూల్ హెడ్‌మాస్టర్ అకాలీ నాయకుడు మాస్టర్ తారాసింగ్. మెట్రిక్ పరీక్ష పాసై పెషావర్‌లోని ఎడ్వర్డు కాలేజీలో చేరాడు ప్రొఫెసర్ జయదయాళ్ పృథ్వీని చేరదీసాడు. షేక్స్‌పియర్ నాటకాల్లో నటించుటకు ప్రోత్సహించాడు. పృథ్వీ గొప్పనటుడనిపించుకున్నాడు.

పృథ్వీనాథ్‌గా వుండిన ఆ యువకుడు నటించిన మొదటి మూకీ చిత్రం, 'సవాల్' (ఛాలెంజ్)లో నెగ్గాడు పృథ్వీనాథ్ 'పృథ్వీరాజ్'గా ప్రశస్తి గాంచాడు.

1933లో సొహ్రాబ్‌మోది తన మినర్వా బ్యానర్‌తో విశ్వవిజేత అలెగ్జాండర్ చిత్రం తీయాలనుకున్నాడు. సికిందర్ పాత్రకోసం బాబూరావ్, వసంతరావ్, నాంద్రేకర్ వంటి ప్రముఖ మరాఠీ పైల్వాన్లు, నటనలో, గానంలో పేరుగాంచిన వారెందరో స్క్రీన్ టెస్ట్‌కు వచ్చారు. అందరూ ఆరితేరిన వారే. కానీ అలెగ్జాండర్ దుస్తులు, ఉక్కు కవచం, శిరస్త్రాణం, పాదస్త్రాణం మున్నగు వాటితో గుర్రం ఎక్కలేక పోయారు ఆ పరీక్షలో నెగ్గిన ఏకైక నటుడు పృథ్వీరాజ్ కపూర్. సొహ్రాబ్‌మోది ఆనందంతో "అలెగ్జాండర్ దొరికాడు" అని కేకవేశాడు. "అలెగ్జాండర్"గా పృథ్వీరాజ్, ఆచార్య అత్రే భార్య వనమాల రుక్సానాగా, సొహ్రాబ్ మోది పురుషోత్తముడుగా వెలువడిన 'అలెగ్జాండర్' చిత్రం దేశమంతటా విజయఢంకా మోగించింది. అలెగ్జాండర్‌గా

పృథ్వీరాజ్ నటన అద్భుతం, అమోఘం, అనితరసాధ్యం అంటూ పత్రికలన్నీ ప్రశంసావర్షం కురిపించాయి.

పృథ్వీరాజ్ జన్మతః నటుడు. ఆయన నాటకాలు అత్యంత జనానురాగాన్ని గడించాయి. అప్పట్లో నాటకాలకు సరైన రంగస్థలాలు లేవు. సినిమా థియేటర్లలో మధ్యాహ్నం 12 నుండి 3 గంటలదాకా నాటక ప్రదర్శనలుండేవి 'శకుంతల'లో దుష్యంతుడుగా పృథ్వీరాజ్ రంగ ప్రవేశం చేయటం మరువరాని దృశ్యం. ఆయన నటనకు మురిసిపోయిన ప్రేక్షకులు రూపాయల నోట్లు; నాణేలు కుప్పలుగా రంగస్థలంపై విసరి వేసేవారు. శాంతారాం భార్య జయశ్రీ తన వ్యానిటీ బ్యాగ్ నిండా నాణాలు తీసుకెళ్ళి రంగస్థలంపై వెదజల్లేది.

1944లో పృథ్వీ థియేటర్స్ స్థాపించి, దీవార్, గద్దర్, పఠాన్, పైసా వంటి ప్రబోధాత్మక నాటకాలతో దేశమంతా ప్రదర్శనలిచ్చాడు పృథ్వీరాజ్. సినిమాల్లో సంపాదించినదంతా నాటకాల్లో ఖర్చు చేసేవాడు.

రాజ్‌కపూర్ నిర్మించిన 'ఆవారా' చిత్రంలో తండ్రి నటుడు, కొడుకు డైరెక్టర్ - చిత్రంలో జడ్జి రఘునాథ్ పాత్రధారి పృథ్వీరాజ్ పారితోషికంగా లభించిన 75 వేల రూపాయలు పృథ్వీథియేటర్స్‌కు చెల్లు. అందరికీ పృథ్వీరాజ్ **'పాపాజీ'** ఆయన పాదాలను తాకి నమస్కరించేందుకు పోటీ పడేవారు. ఎంత గొప్ప నటుడో అంత కరుణామయుడు పృథ్వీరాజ్. వారి ఇంటికి సమీపంలో నివసించే జి. మొఘ్లో "సేనాపతి" చిత్రం తీయనారంభించాడు. పృథ్వీరాజ్‌ను నాయక పాత్ర కాహ్వానించాడు. డబ్బు తప్ప తక్కిన వన్నీ వున్నవాడు మొఘ్లో. చిత్ర నిర్మాణం సాగుతూ వుంది. నటులు ఎలాగో సర్దుకు పోతున్నారు. కాని ఇతర ఖర్చులకు పైకం కావాలి. ఒకరోజు పృథ్వీరాజ్‌కు పైకం అవసరమొచ్చింది. పెద్ద సెట్ వేశారు. షూటింగ్ ప్రారంభంకావాలి. ప్రధాన పాత్రధారి పృథ్వీరాజ్, చేతిలో అయిదువేలు పెట్టాడు. ఆ రోజు షూటింగ్ ముగిసింది.

నవ్వుతూ ఇల్లు చేరిన, పృథ్వీ 'రమా, ఇదిగో అయిదువేలు మొఘ్లో ముక్కుపిండి వసూలు చేశా తీసుకో - హల్వా పూరీ తయారు చేయి' అన్నాడు. నోట్ల కట్టను చూచిన రమాదేవి నవ్వుతూ "భాభీ అర్జంటుగా అయిదువేలు కావాలి సాయంత్రం మీ భర్తతో ఇచ్చిపంపిస్తా" అంటూ మధ్యాహ్నం ఆమెనుండి పట్టుకెళ్ళాడు మొఘ్లో. ఆడిన మాట తప్పని వాడు! - అన్న మాట ప్రకారం సాయంకాలం మీతోనే భాబీకి పైకం పంపాడు పాపం మొఘ్లో!

పృథ్వీ థియేటర్స్ ద్వారా ఆర్తుల సహాయార్థం ఎన్నో నాటకాలు ప్రదర్శించాడు. క్షామ పీడితులకు వరద బాధితులకు ఆర్థిక సహాయం అందించాడు నాటకం పూర్తి అయిన వెంటనే ఆ మేకప్‌తోనే ప్రేక్షకుల మధ్య 'జోలె' పట్టి నిధి సేకరించిన మానవతావాది పృథ్వీరాజ్ కపూర్.

భారతప్రధాని నెహ్రూ పృథ్వీరాజ్ పట్ల అపార గౌరవం కలవాడు. రష్యా, చైనా దేశాలకు పంపిన భారత కళాకారుల బృందం నాయకుడుగా పృథ్వీరాజ్‌ను పంపారు.

జెకోస్లవేకియా పృధ్వీరాజ్‌కు అకాడమి ఆఫ్ ఆర్ట్స్ అండ్ మ్యూజిక్ పరంగా ప్రత్యేక అవార్డు సమర్పించింది. భారత ప్రభుత్వం 1969లో పృధ్వీరాజ్‌ను 'పద్మభూషణ్'తో సత్కరించింది. ఎనిమిదేళ్ళపాటు రైల్వే యూనియన్ అధ్యక్షుడుగా పనిచేసిన కార్మిక శ్రేయోభిలాషి పృధ్వీరాజ్.

ప్రముఖ కన్నడ దర్శకుడు కణగాల్ పుట్టణ్ణ 1971లో నిర్మించిన కన్నడ చిత్రం 'సాక్షాత్కార'లో పృధ్వీరాజ్ నటించాడు. అతి నిరాడంబరం అతని జీవితం. మద్యం, మగువల కెంతో దూరంగా వుండేవాడు. విశ్రాంతి లభించినపుడు 'సితార్' వాయించేవాడు.

అరువదేళ్ళు మత్తు పదార్థాలు తాకని పృధ్వీరాజ్ చివరిదశలో మదిరాలోలుడయ్యాడు. 'హాడ్జ్‌కిన్ డిసీజ్' అనే వ్యాధికి గురై టాటా మెమోరియల్ ఆసుపత్రిలో చేరాడు. కొందరు కాన్సర్ అన్నారు. 1972 మే 29వ తేదీన 'పాపాజీ' కన్ను మూశాడు. ఒక నెలలోపుగానే అతని భార్య రమా కూడా ఆయనను అనుసరించింది.

● విశాలాంధ్ర ●

★ ★ ★

# ప్రజానటుడు బలరాజ్ సాహ్ని

సాంస్కృతిక విలువలు, నైతిక విలువలు గల చలనచిత్రాలను నిర్మించాలని ఉద్యమించిన బలరాజ్ సాహ్ని కేవలం నటుడే కాదు, కవి, కథకుడు, పాత్రికేయుడు, ఛాయా గ్రాహకుడు, సామ్యవాద ప్రతిపాదకుడు, బహు భాషా కోవిదుడు.

1930 నాటిమాట. లాహోర్‌కంటోన్మెంట్‌లో తెల్లదొరల మాటకు తిరుగులేని కాలం. జిల్లా అధికారి డాబూ, దర్పం జులుంలకు హద్దులుండేవికావు. యువత మాత్రం కాంగ్రెస్, ఖద్దరు అంటూ గంతులు వేసేవారు. బలరాజ్ సాహ్ని కుటుంబం లాహోర్ కంటోన్మెంట్ సమీపంలో వుండేది

1930 చివర, బలరాజ్ సాహ్ని బి.బి సి.లో అనౌన్సర్‌గా ఎంపికయ్యాడు. లాహోర్ ప్రభుత్వ కళాశాల నుండి ఆంగ్లంలో ఎం.ఏ. పట్టాపుచ్చుకున్న బలరాజ్ సాహ్నికి షెల్లీ కవిత అంటే ఎంతో అభిమానం. ఆంగ్ల కావ్య, నాటకాలు, నవలలను బాగా అవగతం చేసుకున్న బలరాజ్ కాలేజీ చదువు ముగించి శాంతినికేతన్, ఆ తర్వాత వార్ధా ఆశ్రమాలకు వెళ్ళాడు అప్పటికే ఇంగ్లీషులో, హిందీలో కవితలల్లేవాడు తన మాతృభాష పంజాబీలో కూడా కవితలల్లుతుండేవాడు

పాశ్చాత్య సంస్కృతి పట్ల అభిమానం వున్నా స్వీయభారతీయ సంస్కృతిని విస్మరించని వ్యక్తి "బలరాజ్. గ్రీటా గార్బో," రొనాల్డ్ కోల్మన్‌లు అతని అభిమాన నటులు. ఆంగ్ల అమెరికన్ చిత్రాలను మెచ్చుకునేవాడు. కాని సినిమా పూర్తి అయిన తర్వాత హాల్‌లోని ప్రేక్షకులందరూ నిల్చుని 'గాడ్ సేవ్ ద కింగ్' అన్న స్తుతిగీతాన్ని పాడేవారు. ఈ బృందగానంలో గళం మేళవించేందుకు ఇష్టం లేక సద్దులేకుండా హాల్ నుండి బయటపడేవాడు

బలరాజ్ తండ్రి ఆర్యసమాజ్‌వాది. ఆ కాలంలో లాహోర్, మరియు పంజాబ్‌లోని ఇతర ప్రాంతాల్లో గురుకుల పద్ధతిలో విద్యాబోధన జరిగేది. హిందీ, సంస్కృత భాషలు బోధింపబడేవి. బలరాజ్ ఆ సంస్థలో దాదాపు రెండేళ్ళు చదివాడు. బలరాజ్ తండ్రి వ్యాపారంలో పేరు మోసినవాడు. కొడుకు కూడా వ్యాపార రంగంలో ప్రసిద్ధుడు కావాలని ఆశించాడు. తండ్రి కోరిక మేరకు కామర్స్ కోర్సులో చేరటానికి దరఖాస్తు పెట్టాడు. కాని చేరింది ఆర్ట్స్ కోర్సులో.

1930-40లో భారతదేశంలో జాతీయోద్యమం ముమ్మరంగా సాగుతుండేది. అప్పట్లో బలరాజ్ ఇంగ్లాండులో వుండేవాడు. బి బి.సి.లో నాలుగేళ్ళ ఉద్యోగం తర్వాత భారతదేశం వచ్చాడు. ఆకాశవాణిలో ప్రోగ్రామ్ ఎగ్జిక్యూటివ్‌గా నియమింప బడినాడు కాని ఆ ఉద్యోగంలో చేరలేదు. తండ్రి ఆశించినట్లు వ్యాపారాన్ని చేపట్టలేదు నాటక రంగం పట్ల ఆకర్షితుడయ్యాడు.

1940 చివర బొంబాయి చేరి ఇండియన్ పీపుల్స్ థియేటర్ అసోసియేషన్ కార్యక్రమాల్లో పాల్గొన్నాడు. నాటకాలంటే ఎంతో ఆసక్తి చూపసాగాడు. కొన్ని సాంఘిక నాటకాల్లో నటించాడు. నాటి ప్రముఖ నటులైన శంభుమిత్ర, తృప్తి మిత్రా, ఋత్విక్ ఘటక్ మున్నగు వారు పీపుల్స్ థియేటర్ అసోసియేషన్ సభ్యులుగా నటించేవారు.

వార్ధా ఆశ్రమ జీవితం బలరాజ్ సాహ్ని జీవితంలో మార్పు తెచ్చింది. క్రమశిక్షణ, సంయమనం అలవడినాయి. వీలున్నప్పుడల్లా గాంధీజీ సన్నిధిలో గడిపేవాడు. గాంధీజీ ప్రారంభించిన 'నయీతాలీం' పత్రిక సంపాదకుడుగా కొంతకాలం పనిచేశాడు.

'ఇప్టా' (ఇండియన్ పీపుల్స్ థియేటర్ అసోసియేషన్)లో క్రియాశీల కార్యకర్తగా పనిచేసిన తర్వాత బలరాజ్ సాహ్ని సినిమారంగంలో అడుగు పెట్టాడు. తన అభినయ ప్రతిభకు అనుకూలమైన నాటకరంగం వదలిరావటానికి ఇష్టపడలేదు. కాని కుటుంబ పెద్దల మాటను కాదనలేక పోయాడు. అంతవరకు భార్య దమయంతి సంపాదనతో కుటుంబ నిర్వహణ సాగేది. బలరాజ్‌కు నిర్ణీతమైన ఆదాయం కాని, ఉద్యోగం కాని వుండేవి కావు - బలరాజ్‌కు ఇద్దరు పిల్లలను అప్పగించి దమయంతి హఠాత్తుగా కన్ను మూయటం విషాదకరం. కుటుంబ నిర్వహణ కోసం చిత్రరంగ ప్రవేశం అనివార్యమైంది. ఆ కాలంలోనే దేశ విభజన జరగటం, బలరాజ్ కుటుంబం ఇక్కట్ల పాలు కావటం జరిగింది.

గోర్కి కథ ఆధారంగా నిర్మింపబడుతున్న సినిమాలో పాత్రధారిగా బలరాజ్ బొంబాయి చేరాడు. నిర్మాత చేతన్ ఆనంద్

బలరాజ్ సాహ్ని నటనకు అద్దం పెట్టిన చిత్రం 'దోభిఘా జమీన్'. చిత్ర నిర్మాణం కలకత్తాలో జరుగుతుండేది. చిత్రీకరణ జరుగుతున్న లొకేషన్‌కు సమీపంగా వున్న రహదారి ప్రక్కన ఒక రిక్షావాలా కూర్చుండుట గమనించాడు బలరాజ్. ఆ ముసలి రిక్షావాలా దగ్గర కూర్చుని అతనిని పలుకరించాడు. ఆ సన్నివేశాన్ని ఎంతో ఆత్మీయంగా చిత్రించాడు 'తన ఆత్మకథలో' బలరాజ్.

ముసలి రిక్షావాలా, బలరాజ్‌కు సన్నిహితుడయ్యాడు. తను నటిస్తున్న సినిమా కథను ఆ ముసలి వాడికి చెప్పాడు. కథ వింటూ, ముసలాయన కన్నీరు కార్చాడు. 'బాబూ, ఇది నా కథే-నా బ్రతుకే ఈ కథ' అంటూ ఏడ్చాడు. తనకు బీహార్‌లో రెండు బిఘాల భూమి వుండినట్లు చెప్పాడు. ఆర్థికంగా కృంగిపోయిన దశలో ఆ భూమిని పదిహేనేళ్ళ క్రితం తాకట్టు పెట్టానని, భూమిని మళ్ళా వశపరచుకునేందుకు కావలసిన పైకం కోసం పదిహనేళ్ళుగా కలకత్తా వీధుల్లో రిక్షాతొక్కుతున్నానని చెప్పాడు. 'బాబూ ఇది నాకథే బాబూ-నాకథే' అంటూ వెళ్ళి పోయాడని బలరాజ్ తన ఆత్మకథలో పేర్కొన్నాడు.

బీదరికంలోని దారుణమైన అనుభవాలను అభినయం ద్వారా లోకానికి చాటే భాగ్యం ఎందరికి లభిస్తుంది? అన్న ప్రశ్న పాత్రలో జీవించాడు బలరాజ్ సాహ్ని. ఆ

అభినయం పుస్తకాల చదువుతో వచ్చిందికాదు. వాస్తవిక జీవితం నుండి నేర్చుకున్న పాఠం.

బలరాజ్ సాహ్ని అద్భుత నటనను చిరంజీవ మొనర్చిన మరో చిత్రం 1943లో కె.ఎ. అబ్బాస్ దర్శకత్వం వహించిన 'ధర్తీ కె లాల్' బెంగాల్ క్షామంలో నలిగిన రైతు కుటుంబ గాథ ఈ చిత్రం.

బలరాజ్ 135 చిత్రాలలో అభినయించాడు. చిరస్మరణీయమైన అభినయం అతనిది. తన ఆత్మకథలో ఒకచోట చిత్రసీమలో అంతా గ్లామర్‌పై ఆధారపడి వుంటుంది. అక్కడి జీవితాలు అస్థిరమైనవి. ప్రజలు నటుణ్ణి కళాకారుడుగా కాక, వినోదం పంచే వ్యక్తిగా గుర్తిస్తారు. అన్నారు.

ఒకమారు బలరాజ్, తమ్ముడు భీష్మసాహ్నితో పాటు ఢిల్లీలోని కన్నాట్ ప్లేస్‌లో షాపింగ్‌కు వెళ్ళాడు. అంగళ్ళ వద్ద వున్న వారు బలరాజ్‌ను గుర్తించి చుట్టుముట్టారు కొందరు తమ వద్దనున్న కరెన్సీ నోట్లపై బలరాజ్ సంతకం కోరారు. కొద్దిసేపట్లో పెద్ద గుంపు - బలరాజ్ అతికష్టం మీద బయటపడి, కారు వద్దకు వచ్చి, త్వరగా వెళ్ళిపోదామన్నాడు. భీష్మ సాహ్ని నవ్వుతూ 'నీ పట్ల ప్రజల అభిమానం ఎంతగా వుందో చూశావా?' అన్నాడు. బదులు చెబుతూ 'జనప్రియత్వం లోని ఒక ముఖాన్ని మాత్రం చూచావు. రెండు వైపులా చూడాలి. అభిమానులకు కాస్త నిరాశ కలిగితే ఈలలు వేస్తారు. అసభ్యంగా మాట్లాడుతారు. అశ్లీల సంబంధాలు అంటగడ్తారు' అన్నాడు.

బలరాజ్ వినోదప్రియుడు. మానవతా దృష్టికలవాడు. మహారాష్ట్రంలో భివాండిలో మత కలహాలు చెలరేగినపుడు, బలరాజ్ సాహ్ని, భీష్మసాహ్ని.కె.ఎ అబ్బాస్‌లు ఆ ప్రాంతాల్లో పర్యటించి పీడితులను ఓదార్చారు. 15 రోజులు ఆ బాధితుల మధ్య గడిపారు. బలరాజ్ సాహ్ని బహుభాషా కోవిదుడు. గాలిబ్, టాగూర్ రచనలు మూల భాషల్లోనే చదివాడు. పీడిత ప్రజల పట్ల అపారమైన ప్రేమ, దయ కలవాడు.

సినిమా దేశ సాంస్కృతిక, నైతిక విలువల సముద్ధరణకు సాధనం కావాలని అభిలషించాడు. ఎం.ఎస్. సత్యుదర్శకత్వంలోని 'గరమ్ హవా'లో బలరాజ్ సాహ్ని నటన అద్భుతమైనది.

సామాన్య ప్రజల శ్రేయస్సే జీవితాశయంగా జీవించి నటించిన బలరాజ్ సాహ్ని 1973లో గుండెపోటువల్ల కన్ను మూశాడు. అప్పుడతని వయస్సు అరవైఏళ్ళు

● విశాలాంధ్ర ●

★ ★ ★

# నటశేఖరుడు బళ్ళారి రాఘవ

ఆంధ్ర నాటక రంగం అనగానే జ్ఞప్తికి వచ్చే మొట్టమొదటి మహానటుడు బళ్ళారి రాఘవ. ఆంగికాభినయంలో అలమటిస్తున్న తెలుగు నాటక రంగానికి సాత్వికాభినయ ప్రాధాన్యతను ప్రయోగాత్మకంగా చూపి నటనలో విప్లవాత్మకమైన మార్పులను సాధించిన నటశేఖరుడు రాఘవ.

పాత్రల మనస్తత్వాలను అధ్యయనం చేసి అంతస్సంఘర్షణలను అత్యద్భుతంగా ప్రదర్శించి నటలోకానికి మార్గదర్శకుడైన నట సార్వభౌముడు రాఘవ. జాతి సర్వతోముఖ వికాసానికి నాటకం ప్రధాన సాధనం కావాలని, నాటక కళ ద్వారా ప్రజలలో ఉత్తమాభిరుచులను, ఉన్నతాశయాలను పెంపొందించాలని ఆశించిన మహామనీషి రాఘవ.

స్త్రీపాత్రలు స్త్రీలే ధరించాలని, ప్రతి పట్టణంలోను అన్ని హంగులు గల నాటకశాల వెలయాలని ఎలుగెత్తి చాటిన నాట్యాచార్యుడు రాఘవ పాశ్చాత్య రంగస్థలాలను దర్శించి తెలుగు నాటకరంగంలో వినూత్న ధోరణులను ప్రవేశపెట్టడానికి విశిష్టంగా కృషి చేసిన మహా నటుడు రాఘవ.

పాటలు, పద్యాలు సుదీర్ఘాలాపనలతో అరుపులతో, వాద్యఘోషలతో అలమటిస్తున్న తెలుగు నాటకరంగానికి సహజాభినయ ప్రాశస్త్యాన్ని చూపి, నటనకు కొత్త భాష్యం కల్పించిన నటయోగి రాఘవ

విశ్వవిఖ్యాతి గడించిన బళ్ళారి రాఘవ 1880 ఆగస్టు రెండున అనంతపురం జిల్లా తాడిపత్రిలో జన్మించారు. తండ్రి నరసింహాచార్యులు బళ్ళారిలోని మునిసిపల్ హైస్కూలులో తెలుగు పండితులుగా వుండేవారు. తల్లి శేషమ్మ 'ఆంధ్ర నాటక పితామహ' ధర్మవరం రామకృష్ణమాచార్యుల చెల్లెలు. ఉన్నత పాఠశాల విద్య బళ్ళారిలో ముగించి, మద్రాస్ క్రిస్టియన్ కాలేజిలోను, ఆ తర్వాత మద్రాసు లా కాలేజిలోను చదివాడు. కళాశాల విద్యార్థిగా ఆంగ్లనాటకాలలో నటిస్తూ, ప్రముఖ నటుల మన్నన లందుకొన్నాడు. 1906 లో మేనమామ ధర్మవరం రామకృష్ణమాచార్యుల వద్ద జూనియర్‌గా న్యాయవాది వృత్తిని చేపట్టాడు. షేక్స్పియర్ క్లబ్ నాటకాలకు దర్శకత్వం వహిస్తూ, స్వయంగా పాత్రధారణ చేసేవాడు. ధర్మవరం వారి 'సరస వినోదినీ సభ' నాటకాలలోను, కోలాచలం శ్రీనివాసరావు 'సుమనోరమ సభ' నాటకాలలోను నటిస్తుండేవాడు. తమ అభినయ ప్రతిభాప్రదర్శనకు ఎక్కువ స్వేచ్ఛను అనుమతించిన సుమనోరమ సభనే ఎక్కువగా అభిమానించేవారాయన.

పౌరాణిక నాటకాలకంటే, చారిత్రక సాంఘిక నాటకాల పట్ల రాఘవ కెక్కువ అభిరుచి వుండేది. కోలాచలం శ్రీనివాసరావు 'విజయనగర పతనం' నాటకంలో

రాఘువ పరాన్ రుస్తుంగా అద్భుతంగా నటించేవాడు ఆ నాటకం హిందూ ముస్లిమ్ సఖ్యతకు భంగం కల్గిస్తుందన్న అనుమానంతో నాటి బ్రిటీష్ ప్రభుత్వం మద్రాసు రాష్ట్రంలో ప్రదర్శనను నిషేధించింది.

చాణక్య పాత్రధారిగా రాఘువ విశ్వకవి రవీంద్రుని ప్రశంసలందుకొన్నాడు. ఒక క్షణం పాషాణ కాఠిన్యం, మరో క్షణంలో పూవుకంటే మార్దవం, ఒక క్షణంలో దుర్భేధ్యమైన తంత్రం. మరొక క్షణం భయానకమైన కపాల మాలికలతో ప్రళయరుద్రునిలా తాండవం. కళాభిమానులందరికీ రాఘువ చాణక్య పాత్రాభినయం షడ్రసోపేతంగా వుండేది. భక్తి భావ ప్రకటనలో రాఘువ చిరస్మరణీయుడు, పౌరాణిక నాటకాల్లో ఆయన యమధర్మరాజు, కీచకుడు, దుర్యోధనుడు మొదలైన పాత్రల్లో అద్భుతంగా నటించేవాడు. రాఘువ కన్నడం, హిందీ, ఇంగ్లీషు నాటకాల్లో నటించి సహృదయులను అలరించాడు.

1928 రాఘువ పాశ్చాత్య నాటక కళా రీతుల అధ్యయనానికై ఇంగ్లండు, ఫ్రాన్స్, జర్మనీ తదితర దేశాల్లో పర్యటించాడు. విఖ్యాత నాటకకర్త జార్జి బెర్నార్డ్‌షాను కలుసుకొన్నాడు. పది నిమిషాలు మాత్రమే మాట్లాడే వీలుంటుంది అన్నాడు బెర్నార్డ్‌షా. ఇద్దరి మధ్య సంభాషణ ఎనభై నిమిషాలకు పైగా జరిగింది. నాటక కళ, అభినయం, షేక్స్‌పియర్ నాటకాలు, రంగస్థలం ఇలా పలు అంశాలపై వారి గోష్టి జరిగింది. 'మర్చెంట్ ఆఫ్ వెనిస్' నాటకంలోని ఒక సన్నివేశాన్ని, బెర్నార్డ్‌షా కోరికపై రాఘువ ప్రదర్శించాడు. ముగ్ధుడైన షా - 'షేక్స్‌పియర్ రాశాడు మీరు నటించారు. దురదృష్టం కొద్దీ మీరు ఇండియాలో పుట్టారు ఇంగ్లండులో జన్మించి వుంటే, షేక్స్‌పియర్ అంత గొప్ప వారై ఉండేవారు' అంటూ ప్రశంసించాడు.

1927లో గాంధీ బెంగుళూరు సమీపంలోని 'నందిహిల్స్'లో విశ్రాంతి తీసుకొంటున్నాడు. పండిట్ తారానాథ్ రచించిన హిందీ నాటకం దీనబంధు కబీర్ నాటకాన్ని చూడమని గాంధీ గార్ని కొందరు పెద్దలు కోరారు కొన్ని నిమిషాలు చూద్దామన్నాడు గాంధీ. గంట దాటింది. ఇంకా చూస్తూనే వున్నాడు గాంధీ కార్యదర్శిగా వుండిన రాజాజీ 'ప్రార్థనకు వేళ అయింది' అని గుర్తు చేశాడు. 'మనం ప్రార్థనలోనే వున్నాం కదా?' అంటూ నాటకం చివరి దాకా చూసి, రాఘువను అభినందిస్తూ 'రాఘువ మహరాజ్ కీ, జై' అన్నాడు.

బెంగుళూరులో 1919లో జరిగిన 'ఫెస్టివల్ ఆఫ్ ఫైన్ ఆర్ట్స్' ఉత్సవాల్లో రాఘువ చాణక్య పాత్రాభినయాన్ని చూసిన రవీంద్ర నాథ్ టాగూర్ 'బెంగాల్'కు సంబంధించినంత వరకు చాణక్య పాత్రధారిగా శిశిర్ బహదూరి గొప్ప నటుడే కాని అఖిల భారత స్థాయిలో 'చాణక్య పాత్రధారణలో రాఘువ అగ్రగణ్యుడు' అని కొనియాడాడు.

రాఘువ 1936లో కొందరు మిత్రుల ఒత్తిడిపై సినీరంగ ప్రవేశం చేశాడు. 'ద్రౌపదీ మాన సంరక్షణం'లో దుర్యోధనుడుగా నటించాడు. గూడవల్లి రామబ్రహ్మం కోరికపై 'రైతుబిడ్డ'లోను, రాజరాజేశ్వరి వారి 'చండిక' లోను నటించాడు. రంగస్థలంపై సహజ

'రైతుబిడ్డ'లోను, రాజరాజేశ్వరి వారి 'చండిక' లోను నటించాడు. రంగస్థలంపై సహజ స్వతంత్ర అభినయంలో యశస్సు నార్జించిన రాఘవకు సినిమారంగం రుచించలేదు రాఘవ న్యాయవాదిగా గొప్ప పేరు గడించాడు. ఆ వృత్తిలో లక్షలార్జించి నాటకరంగంలో ఎంతో ఉదారంగా ఖర్చుపెట్టేవాడు. కోర్టునుంచి వచ్చిన తర్వాత ప్రతిరోజు సాయంత్రం - నటులు, పండితులు, కవులు తదితరులతో గడిపేవాడు. సంఘ సంస్కరణాభిలాషతో రాఘవ 'సరిపడని సంగతులు' అనే నాటకాన్ని రాశాడు. నాటక కర్తగా రాఘవ అంతగా యశస్సు సాధించలేకపోయాడు. ప్రతి నటుడు తన గొప్పను చాటుకోరాదని, ప్రదర్శనానంతరం మిత్రులతో 'నేనెలా నటించాను' అనకుండా 'నాటకం ఎలా వుంది' అని చర్చించాలని ఆయన హితవు చెప్పేవాడు.

● వార్త ●

★ ★ ★

# సాంస్కృతిక రాయబారి పుపుల్

ఒకదేశం సాంస్కృతిక రూపాలైన కళల వికాసానికి అనన్యంగా కృషి చేసేవారు కొందరుంటారు. ఆ కళారూపాల ప్రాచుర్యానికి, పటిష్టతకు అపూర్వంగా కృషి చేసే కళాహృదయులు కొందరుంటారు. వీరిలో రెండవ కోవకు చెందిన భారతీయ సాంస్కృతిక రాయబారి - ఇటీవల కన్నుమూసిన శ్రీమతి పుపుల్ జయకర్. ఆమె నృత్య విశారద కాదు, సంగీత సరస్వతి కాదు, భారతీయ సంగీత నృత్య నాటకోత్సవాలను మనదేశంలోనే కాక, విదేశాల్లో కూడా అత్యంత వైభవోపేతంగా ప్రదర్శింపజేసిన సాంస్కృతిక రాజ్య సామ్రాజ్ఞి.

'పద్మభూషణ' ప్రశస్తినందుకున్న పుపుల్ జయకర్ సంపన్న కుటుంబంలో జన్మించారు. తండ్రి కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలో పట్టభద్రుడై, మనదేశంలో ఐ.సి.యస్. అధికారిగా పనిచేశారు. పుపుల్ తల్లి గుజరాతీ బ్రాహ్మణ కుటుంబానికి చెందిన విదుషి. బాల్యంలో ఐరిష్ ఉపాధ్యాయుని వద్ద శిక్షణ సాగించిన పుపుల్ ఐర్లాండ్, ఇంగ్లాండ్ రాజ వంశాల చరిత్రను బాగా అవగాహన చేసుకున్నారు. తండ్రి ఉద్యోగంలో బదిలీల కారణంగా ఆమె అలహాబాద్, బికనీర్, శ్రీనగర్‌లలో చదవటం తప్పనిసరి అయింది. ఉన్నత విద్యకోసం లండన్ విశ్వవిద్యాలయంలో జర్నలిజం శాఖలో శిక్షణ పూర్తిచేశారు. అక్కడే న్యాయశాస్త్ర విద్యార్థిగా ఉండిన మన్మోహన్ జయకర్‌ను 1937లో వివాహం చేసుకున్నారు. దంపతులిద్దరూ చదువు పూర్తి చేసుకుని బొంబాయిలో స్థిరపడ్డారు గృహిణిగా ఉంటూ సాంఘిక సేవాకార్యక్రమాల్లో చురుగ్గా పాల్గొనేవారు. దంపతుల సంతోషానికి అవరోధంగా వారి సంతానంలో ఇద్దరు పిల్లలు చనిపోవడం, తండ్రి మరణం, తాత్కాలికంగా నేత్ర పాటవం కోల్పోవడం వంటి విషాదానుభవాలు కలిగాయి. ఆ పరిస్థితుల్లోనే ప్రముఖ తత్వవేత్త జిడ్డు కృష్ణమూర్తి పరిచయం కలిగింది. కృష్ణమూర్తి ఫౌండేషన్ కార్యక్రమాల్లో ఆమె పూర్తిగా లగ్నమయ్యారు. ఫౌండేషన్ యాజమాన్యంలోని రిషివ్యాలీ పబ్లిక్ స్కూల్ (మదనపల్లె దగ్గర) నిర్వహణ చేపట్టారు. ప్రస్తుతం పుపుల్ జయకర్ కుమార్తె రాధికా హెర్జ్ బర్జర్ ఈ సంస్థ డైరెక్టర్‌గా ఉన్నారు.

సమాజ సేవారంగంలో ముమ్మరంగా కృషి చేస్తూనే శ్రీమతి జయకర్ గాంధీజీని దర్శించారు. ఆమె కార్యదీక్షాదక్షతలను గాంధీజీ ప్రశంసించారు. 1944లో ఆమె కస్తూరిబా గాంధీ స్మారక నిధి సేకరణ సంఘ కార్యదర్శిగా అందరి మన్నన లందుకున్నారు. గాంధీజీ వద్దకు వెళ్ళినపుడు ఆమె ధరించిన విదేశీ చీరను గమనించిన కొందరు పుపుల్ ఖద్దరు వస్త్రాలను ధరించలేదన్నారు. అందుకు గాంధీజీ నవ్వుతూ "ఆమె ఇష్టం. నాకు ఆమె చేస్తున్న సేవా కార్యక్రమాలే ప్రధానం కానీ ధరించే వస్త్రాలు కావు" అన్నారు.

1950లో ఆమె ఢిల్లీ వెళ్ళి అక్కడ తమ కార్యక్రమాలను విస్తృతం చేశారు. ప్రధాని ఇందిరాగాంధీతో పరిచయం క్రమంగా మైత్రిగా మారింది. తాను విశ్వసించిన విశ్వాసాలు, సిద్ధాంతాలపట్ల ఆమె ధృఢ మనస్సుతో నిలిచింది ఇందిరాగాంధీ ఎమర్జన్సీ ప్రకటించినపుడు ఆమె సన్నిహితులెందరో దూరమైనారు. కానీ శ్రీమతి జయకర్ ప్రధాని పక్షాన నిలిచారు.

శ్రీమతి జయకర్ కార్యదక్షతకు గీటురాళ్ళు, ఆమె విదేశాల్లో నిర్వహించిన భారతీయ నృత్యసంగీతోత్సవాలు, హస్తకళా ప్రదర్శనలు. ఈ ప్రదర్శనల వల్ల భారతీయ కళల పట్ల ఆదరాభిమానాలు ఎంతగానో పెరిగాయి. తాను అవిశ్రాంతంగా శ్రమిస్తూ, ఇతరులను కూడా సమధికోత్సాహంతో కృషి చేయునట్లు ప్రేరేపించిన చైతన్యస్ఫూర్తి శ్రీమతి జయకర్.

ఆమె భారతీయ హస్తకళల వికాసానికి చేసిన కృషి అనన్యమైనది. భారతీయ చేనేత కళా నైపుణ్యాన్ని విదేశాలలో ప్రదర్శింపజేశారు. అఖిలభారత హస్తకళా సంఘం, చేనేత వస్త్రాల ఎగుమతి కార్పొరేషన్ సంస్థల అధ్యక్షతను సమర్థవంతంగా నిర్వహించారు. జాతీయ నమూనాల సంస్థ అధ్యక్షులుగా ఆమె కృషి అవిస్మరణీయం.

రచయిత్రిగా విశిష్ట స్థానం అందుకున్న పుపుల్, ఇందిరాగాంధీ జీవిత చరిత్ర, జిడ్డు కృష్ణమూర్తి జీవిత చరిత్ర, ఎర్త్ మదర్ అను గ్రంథాలు, ఆర్తన్‌డ్రీమ్ (భారతీయ కళల అంతరార్థం) మరెన్నో విలువైన వ్యాసాలు, కథలు రాశారు.

భారతీయ సాంస్కృతిక వారసత్వం పట్ల ఆమెకు గల ప్రగాఢమైన అనురక్తి వల్లనే మనదేశంలోని ప్రాచీన చారిత్రక కట్టడాల జీర్ణోద్ధరణకు సంరక్షణ కొరకు 1984లో ప్రారంభమైన 'ఇండియన్ నేషనల్ ట్రస్ట్ ఫర్ ఆర్ట్ అండ్ కల్చరల్ హెరిటేజ్' సంస్థకు జీవితాంతం అధ్యక్షులుగా ఆమె ఎంతో కృషి చేశారు.

ప్రజల్లో చారిత్రక అవగాహనను పెంపొందించాలని, దేశ రాష్ట్ర భావాల విప్లవాల పట్ల ఆసక్తిని పెంచుకోవాలని ప్రజలకు, కళాభిమానులకు ఉద్బోధించారు. దేశ రాజధానిలోనే కాక రాష్ట్ర రాజధానులలోనూ, జిల్లా కేంద్రాలలోనూ భారత జాతీయ వారసత్వ పరిరక్షణ జిల్లా శాఖలను నెలకొల్పారు.

అదివరకే కమలాదేవి చటోపాధ్యాయ హస్తకళల వికాసానికి అనన్యంగా శ్రమించారు. కమలాదేవి రమణీయమైన కణ్వాశ్రమంలోని శకుంతల అయితే పుపుల్ జయకర్ సాంస్కృతికోద్యానవనాల రూపశిల్పి అయిన బషనారా అంటూ, దక్షిణాఫ్రికాలో భారత హైకమీషనర్‌గా ఉన్న గోపాలకృష్ణగాంధీ గారి మాటలలో ఏ మాత్రం అతిశయోక్తి లేదు.

అదమ్యమైన శక్త్యుత్సాహాలతో భారతీయ సాంస్కృతికోద్దీపన కోసం అహరహం శ్రమించిన శ్రీమతి జయకర్‌కు జోహార్లు.

● *వార్త 17-5-97* ●

★ ★ ★

# ప్రపంచంలోనే అతి పెద్ద మ్యూజియం 'లూవర్'

చిన్న కళాఖండాలు మొదలు, బృహత్తరమైన కళాఖండాలను సేకరించి ప్రదర్శింప చేస్తున్న లూవర్‌లోని ఒక్కొక్క అకృతి ముందు కేవలం అరనిమిషం (30 సెకన్లు) నిల్చున్నా, ఆ మ్యూజియమ్ అంతటినీ, రేయింబవళ్ళు, అవిశ్రాంతంగా చూచినప్పటికీ-కనీసం మూడు నెలలు పడుతుంది. వ్యష్టి నుండి సమష్టిగా విస్తరించిన, బ్రహ్మాండమైన ఈ మ్యూజియంను చూచేందుకు ఏటా అయిదు మిలియన్ల మంది వస్తుంటారు. చూచి ఆనందిస్తారు.

దాదాపు 800 ఏళ్ళనాటి ఫ్రెంచి కోట మరియు రాజ ప్రాసాదాల సమూహం, వాటి వాస్తు వైభవం మనలను ముగ్ధులను కావిస్తుంది. జగద్విఖ్యాతి గాంచిన-లియొనార్డో డావిన్సీ చిత్రించిన నిగూఢమైన చిరునవ్వుల 'మొనాలిసా' చిత్రం ఇక్కడ సురక్షితంగా వుంది.

ఫ్రెంచ్ ప్రజల అభిమాన-అహంకారాల సంకేతమైన ఈ మహా మ్యూజియం చూచేందుకు కళాభిజ్ఞులు, రసహృదయులు ఉవ్విళ్ళూరుతుంటారు. కళాభిరుచిగలవారు అప్పు చేసైనా, ప్యారిస్‌లోని అతి పెద్ద మ్యూజియం చూచి తీరాలనుకొంటారు. అలా అప్పుచేసి, ఆ మ్యూజియంను చూచివచ్చినవారు, తరంగ (కన్నడ వారపత్రిక) సంపాదకులు శ్రీ సంతోష్ కుమార్ గుల్వాడి.

ప్యారిస్ అన్న పేరు విన్నంతనే అలౌకికమైన రొమాంటిక్ కలలు, కళాకారుల రమ్యమైన కల్పనలు మనలో చిత్రవిచిత్రమైన ఆలోచనలను రేకెత్తిస్తాయి బాల్జాక్ కవి ప్యారిస్‌ను ఒక సముద్రానికి పోల్చాడు. దాదాపు రెండు వేల సంవత్సరాల చరిత్రగల, సుందరమైన కళాత్మకమైన మహానగరాన్ని చూడాలని ప్రతి కళాకారుడు, సాహితీ హృదయుడు ఆశిస్తుంటాడని యూరోప్‌లో ఒక సామెత ప్రచలితంగా వుంది. ప్యారిస్ విప్లవ కేంద్రం - అట్లే లలిత కళలన్నిటికీ సుక్షేత్రం

ప్యారిస్ నగరంలో 220కి పైగా మ్యూజియంలు, ఆర్ట్ గ్యాలరీలు వున్నాయి. అతి శ్రేష్ఠమైనదల్లా తమ వద్ద వుండాలని ఫ్రెంచి ప్రజల ఆకాంక్ష ఈ మ్యూజియం ప్రవేశరుసుం, భారతీయ వినిమయం ప్రకారం 600 రూపాయలు. ప్రవేశమైన వెంటనే, మన మొక అద్భుతప్రపంచంలో వున్నట్లు భావిస్తాం నెపోలియన్ హాల్ 6 వేల భాగాలను అతిక్రమించిన, ఉక్కు పంజరంలాంటి గాజు పిరమిడ్ ముందు, మనం మరుగుజ్జులా కనిపిస్తాం. వంద అడుగుల వెడల్పు, 71 అడుగుల ఎత్తు 200 టన్నుల బరువుగల గాజు పిరమిడ్ మనకు స్వాగతమిస్తుంది ఇదో పెద్ద ఆకర్షణ.

పారిస్ నగరం మధ్య ప్రవహించే నది సియెన్. ఆ నది గట్టున లూవర్ ఒక పెద్ద కోట. ప్యారిస్ రాజు 6వ ఫిలిప్. ఆగస్ట్ (క్రీ.శ. 1165-1223) సాగ్జనుల దాడిని ఎదుర్కొనేందుకు ఈ కోటను కట్టించారు. లూవర్ అనగా భద్రమైనది. సురక్షితమైనది అని అర్థం. ఆ కోట నేలమాళిగ ఎత్తు 100 అడుగులు. తర్వాత వచ్చిన ఫ్రాన్స్ రాజులు కోటను విస్తృతపరుస్తూ వచ్చారు 5వ ఛార్లెస్ రాజు (క్రీ.శ. 1360) కాలంలో ఆ కోట రాజభవనంగా మారింది. పుస్తక ప్రియుడైన 5వ ఛార్లెస్, భవనం పై వున్న గోపురంలో పెద్ద గ్రంధాలయాన్ని నెలకొల్పాడు 16 వ శతాబ్దం వరకు ఫ్రాన్స్ రాజులు ఆ భవనంలోనే వుండే వారు

ఇంగ్లండు, ఫ్రాన్స్ బద్ధశత్రువులు, వంద ఏళ్ళపాటు ఆ దేశాల మధ్య యుద్ధం జరిగింది. ఒక మారు ఫ్రాన్స్ ఇంగ్లండ్ వశమైంది. అప్పుడు లూవర్‌కోట ఆయుధాగారంగా వుండేది. ఇటీవల త్రవ్వకాలలో, అక్కడి 100 అడుగుల నేల మాళిగలు బయలుపడ్డాయి. 1వ ఫ్రెంక్ష్యూ (క్రీ.శ. 1494-1547) ఇటలీనుండి, శిల్పులను, కళాకారులను పిలిపించుకొని, భవనాల పునర్నిర్మాణం కావించాడు. ఫ్రాన్స్ దేశ వెలుగునీడలకు కేంద్రం ఈ భవనం. ఈ భవనంలోనే ఫ్రెంచ్ అకాడమీ ఏర్పడింది. 1776లో ఫ్రెంచి మ్యూజియంగా ప్రకటింపబడింది. 1793లో అది ప్రజలకు అంకితం చేయబడింది. నెపోలియన్ బోనపార్టీ, లూవర్‌ను మరింత పెంచాడు. 1981లో ఫ్రాన్స్ అధ్యక్షుడు మిట్టరాండ్ ఈ భవనానికి కొత్తదనం కల్పించాడు.

## పిరమిడ్

ఈ మ్యూజియంలో కొట్టవచ్చినట్లు కనిపించేది అక్కడి గాజు పిరమిడ్. ప్రపంచంలోని దేశాలలోని, మ్యూజియం లన్నింటిని తలదన్నే మ్యూజియం ఫ్రాన్స్‌లో వుండాలని ఫ్రెంచ్ ప్రజలు ఆశించారు. వాషింగ్‌టన్‌లోని నేషనల్ గ్యాలరీని రూపొందించిన చైనా శిల్పి ఐమింగ్‌పైని ఆహ్వానించారు. కొత్త నమూనాలు కంప్యూటర్‌లో తయారు చేసినందుకు అతనికి ఏడు నెలలు పట్టింది. ఇది వరకు వున్న 240 గదులున్న లక్ష చదరపు అడుగుల భవనాన్ని రెట్టింపు కావించారు. లూవర్ మ్యూజియం జీర్ణోద్ధరణ కోసం 20 మిలియన్ రూపాయలు వెచ్చించారు.

గాజు పిరమిడ్ పైకి వెళ్లేందుకు పెద్ద ఎలివేటర్ వుంది. అత్యాధునిక మ్యూజియం కుండవలసిన, ఫలహార శాల, ఫోన్, పోస్టాఫీసు, గ్రంథాలయం, దుకాణాలు, సభా భవనం వగైరాలున్నాయి. అక్కడి హోటల్‌లో నిల్చుని కాఫీ తాగితే తక్కువ పైకం, కూర్చొని తాగితే ఎక్కువ బిల్లు!

మ్యూజియంలో 6 వేల పెయింటింగ్స్ ఒక లక్షకుపైగా ఇతర కళాఖండాలు వున్నాయి. 10 వేల అమృత శిలామూర్తులున్నాయి.

జర్మన్, ఇంగ్లీషు, జపాన్, ఫ్రెంచ్ మొదలగు ఇరువది భాషలలో అక్కడి వివరాలున్నాయి. కాని హిందీలో కానరావు. యూరోపియన్, ఈజిప్ట్, చైనా, జపాన్ వస్తువులున్నాయి భారతదేశానికి ప్రాతినిధ్యం దాదాపు లేదు!

లూవర్ మ్యూజియం ద్విశత జయంత్యుత్సవం (1793-1993) రెండేళ్ళపాటు అత్యంత వైభవంగా జరిపారు. మ్యూజియంలోని కళాఖండాలను, ఏడు భాగాలుగా ఏర్పరిచారు.

1. గ్రీక్, రోమ్ ప్రాచ్య వస్తువులు.
2. యూరోప్‌కు తూర్పున వున్న ప్రాచ్య దేశాల ప్రాచీన వస్తువులు.
3. ఈజిప్టుకు చెందిన ప్రాచీన వస్తువులు.
4. ఫర్నిచర్.
5. కళాత్మక వస్తువులు.
6. చిత్రాలు-డ్రాయింగ్స్.
7. శిల్పాలు.

ఈ మ్యూజియంలోని మాస్టర్ పీసెస్ ఒకటికంటే మరొకటి మిన్నగా అందాలు చిమ్ముతుంటాయి. అసంఖ్యాకమైన నగలు, బంగారు పాత్రలున్నాయి. రోమన్ కాలం నాటి ఒక బంగారు పాత్ర ఎంత పెద్దది అంటే, దానిలో పదిమంది కూర్చునే అంత!

## కళాబ్రహ్మ

మైకేలాంజిలో చిత్రించిన బందీలు (ప్రిజనర్స్) శిల్పంలో వారి ముఖాలలోని దైన్యం, బాధ, శోకం, మొదలగునవి కళాకారుని సూక్ష్మసంవేదనలను ప్రతికణంలోను చాటుతున్నాయి. ఈ మ్యూజియం నిర్వహణకోసం 3 వేల మంది నియమింప బడినారు.

ప్రపంచంలోని అతి శ్రేష్ఠమైన చిత్రకళా ఖండాలు - యూరోపియన్ శైలి, ప్రాచీన, మధ్యయుగ, పునరుజ్జీవన (రినైసాన్స్) కాలం నుండి నేటి ఆధునిక కళాకారుల గ్రాఫిక్స్ కూడా వున్నాయి. వీటినన్నిటినీ చూచేందుకు రెండు కళ్ళు చాలవు! ఒక జీవితం చాలదు! ఇంగ్లీషు, స్పానిష్, డచ్ శైలికి చెందిన కళాఖండాలు, వున్నాయి. చరిత్రాత్మకమైన ఆభరణాలు, పంచలోహ, పింగాణి కళాకృతులు, అపూర్వమైన వజ్రాలు, 20 కేరట్ల రీజెంట్ వజ్రాలు, దంతపు కళాఖండాలు యిలా అనంతానంత కళా ఖండాల నిలయం లూవర్ మ్యూజియం.

## మొనాలిసా - లియొనార్డో డావిన్సీ

ఫ్లారెన్స్‌కు చెందిన (ఇటలీ) జగద్విఖ్యాత కళాకారుడు లియొనార్డో డావిన్సీ (1452-1519) చిత్రించిన అమర కళాఖండం మొనాలిసాను చూడడానికే లూవర్ మ్యూజియంకు వచ్చే వారెందరో వున్నారు.

ప్రపంచంలో ఎవరికీ అవగతం కాని, చూచి ఆనందించే - మొనాలిసా నిష్కల్మషమైన, ముగ్ధమోహనమైన - నవ్వును చూచేందుకోసమే మ్యూజియం కెందరో వస్తారు. గంటలకొద్దీ, చిత్రం ముందు నిల్చుని తదేక దృష్టితో చూచే రసికులున్నారు. కాని ఆ చిత్ర రహస్యం ఇంకా నిగూఢంగానే వుంది. ఈ మొనాలిసా ఎవరు? ఆ విషయంగా ఎన్నో చర్చలు జరిగాయి. ఈకళాకృతి మరోపేరు లాజియో

కొండ ఈ చిత్రాన్ని డావిన్సీ క్రీ॥శ॥ 1503 - 1505 మధ్య చిత్రించాడు. ఆ చిత్రం అతనికి అత్యంత ప్రేమ పాత్రం కావటంతో, ఎక్కడికి వెళ్ళినా, ఆ చిత్రాన్ని తీసుకెళ్ళేవాడు. ఫ్రాన్సిస్ కోడెల్ జియ కొండా అనే శ్రీమంతుని సతీమణే ఈ మొనాలిసా అంటారు. ఆమె లియోనార్డో డావిన్సీ మానస సుందరి లేదా ప్రేయసి కావచ్చునని కొందరి భావన.

ఆమె నేపథ్యంలో కళాకారుడు చిత్రించిన దృశ్యం. దూరసామీప్యాల యథార్థదృష్టి చిత్రణ, పర్‌స్పెక్టివ్‌లు లియొనార్డ్ వైశిష్ట్యానికి నిదర్శనం. రంగుల వెలుగు నీడలు-చిత్రింపబడిన తీరు - లియొనార్డ్ అద్భుత కళా నైపుణికి మచ్చుతునకలు. ల్యాండ్ స్కేప్ మరియు పోర్ట్రేట్ చిత్రణలో సవ్యసాచి డావిన్సీ. లియొనార్డొడావిన్సీ కేవలం చిత్రకారుడేకాదు. అతని ప్రతిభ బహుముఖమైనది. మిలటరీ ఇంజనీర్‌గా వుండిన డావిన్సీ వాస్తుశిల్పం, శిల్పం, మరియు చిత్రలేఖనంలో అత్యంత ఆసక్తి కల్గినవాడు. ఇంత గొప్ప ప్రతిభామతియైన లియోనార్డొ డావిన్సీ, కళా ప్రతిభకు ఈ ప్రపంచం జోహార్లు అర్పిస్తూ గౌరవిస్తున్నది.

● విశాలాంధ్ర ●

★ ★ ★

# 'షెహనాయ్ నవాజ్'
# ఉస్తాద్ బిస్మిల్లాఖాన్

షెహనాయ్ అత్యంత సుమధురమైన సుషిర వాద్యం, అరేబియాకు చెందిన హకమ్ బూ అలీ, ఈ వాద్య ఆవిష్కర్తగా పరిగణింపబడినాడు. ఆకారంలో దాక్షిణాత్య నాదస్వర వాద్యాల్ని పోలినా, గాత్రంలో మాత్రం చిన్నది. భారతీయ శాస్త్రీయ సంగీతంలోని విశేషాంశాలన్నింటినీ శ్రవణ పేయంగా అభివ్యక్తం చేయగల వాద్యం షెహనాయ్. షెహనాయ్ వాదనలో ఖండాంతర కీర్తినందుకొన్న 'షెహనాయ్ సమ్రాట్' ఉస్తాద్ బిస్మిల్లాఖాన్.

బీహార్ రాష్ట్రంలోని ఒకనాటి చిన్న సంస్థానం దుమ్‌రావ్. సంస్థానాధీశులు కళాపోషకులు. షెహనాయ్ వాదనలో ప్రసిద్ధులైన హుసేన్ బక్ష్, అతని కుమారుడు రసూల్ బక్ష్ ఆ సంస్థానానికి చెందిన కళాకారులు. రాజాగారి ప్రాసాదంలోని ఆలయ పూజాసమయంలో షెహనాయ్ వాదనం జరిగేది బక్ష్ కుటుంబం వారందరూ సంగీత విద్యాప్రదాతలు.

బిస్మిల్లాఖాన్ తండ్రి పైగంబర్ బక్ష్.

బిస్మిల్లా, అతని అన్న షమ్ సుద్దీన్‌ల ప్రతిభను గుర్తించిన వారి మేనమామ అలీబక్ష్, ఈ బాలురిద్దరిని బెనారస్‌లో తన వద్ద వుంచుకొని, షెహనాయ్ వాదనలో శిక్షణ ఇచ్చారు. ప్రతిరోజు వేకువనే ఈ బాలురతో పాటు అలీబక్ష్, గంగానది నానుకొన్న పంచగంగా ఘాట్ వద్ద సాధన చేసేవాడు ఆ ప్రాంతమంతా ఆలయాలు చేరువలోనే బాలాజీ మందిరం. ఆ పవిత్ర వాతావరణంలో బాలకళాకారుల ప్రతిభా కుసుమాలు వికసింపసాగాయి. మేనమామ గారితో పాటు వారు వివాహాలలో, సంగీత కచేరీలలో షెహనాయ్ వాద్యం మనోజ్ఞంగా వినిపించేవారు. అప్పట్లో వారి వయసు ఎనిమిదేళ్ళలోపే.

1930లో అలహాబాద్‌లో అఖిల భారత సంగీత మహాసభ జరిగింది అలీబక్ష్ బృందం వారి షెహనాయ్ వాదనం సభికులను మంత్రముగ్ధులను కావించింది హర్షధ్వానాలతో సభామందిరం మార్మోగింది బాల బిస్మిల్లా (14 ఏళ్ళు) వాదనం విని 'సెబాష్' అంటూ కేకలు వేసారు. అలీబక్ష్ ఆనందానికి హద్దులు లేవు ఈ బాల కళాకారుడు పైగంబర్ బక్ష్‌గారి కుమారుడని పరిచయం చేశారు. సభలో బిస్మిల్లాకు బంగారు పతకం బహూకరింపబడింది. మేనమామ కన్ను మూసేవరకు ఆయనతో కలిసి కచేరీలు చేసేవారు. 1938లో లక్నో ఆకాశవాణి కేంద్రం నుంచి తొలిసారిగా, బిస్మిల్లాఖాన్ షెహనాయ్ వాదన ప్రసారమైంది. ఉత్తర భారతదేశంలో వరుసగా వారి కచేరీలు సాగుతూవచ్చాయి.

"షెహనాయ్ వాద్యాన్ని అతిలోక సౌందర్యంతో తీర్చిదిద్ది అనితరసాధ్యంగా ఆపాత మధురంగా వాయిస్తూ, శ్రోతలను గంధర్వ లోకానికి తీసుకువెళ్ళే ఐంద్రజాలికుడు బిస్మిల్లాఖాన్. అతి మంద్రంగా, మృదువుగా, పాదాల కిందనలిగే మల్లెపూల ఆర్తనాదాలు వినిపించినట్లుగా, వాయించగలగడం ఆయనకే తెలుసు. భయంకరాటవులలో దావాగ్నిచ్ఛటలు వ్యాపించినపుడు, దిక్కులేక కాతరమైన, వనరాజు చేసే గర్జారావాన్ని సైతం అంత అవలీలగానూ ప్రతిధ్వనించగలరాయన! ఒక్కసారి ఆయన మ్రోల నిలచి ఆ నాదఝురిలో స్నాతుడైన రసికుడు ఎన్ని జన్మలెత్తినా మరచిపోలేని గాఢముద్రను ఆయన షెహనాయ్ కలిగించగలదు" - అన్న డాక్టర్ ఆవంత్ససోమసుందర్. పలుకుల్లో అతిశయోక్తి లేదు.

బిస్మిల్లాఖాన్ కీర్తి సౌరభాలు భారతదేశం నలుమూలలా వ్యాపించాయి. విమానయానమన్నా, విదేశ పర్యటనలన్నా ఆయనకు భయంగా వుండేది.

భారతీయ సంగీత కళాప్రతిభను విదేశాల్లో ప్రదర్శించిన రవిశంకర్, కుమారగంధర్వ, బడేగులామ్ అలీఖాన్, ఓంకారనాధ్ టాగూర్‌లను మించిన కళాకారుడు బిస్మిల్లాఖాన్. చివరకు 1965లో జరిగిన ఎడింబరో అంతర్జాతీయ సంగీతోత్సవంలో ఆయన పాల్గొన్నారు. యూరోప్ ఖండంలోని ప్రముఖ దేశాలలో ప్రదర్శనలిచ్చారు. కెనడాలో జరిగిన ఎక్స్‌పో 1967లో పాల్గొన్నారు.

షెహనాయ్ వాద్యాన్ని పెళ్ళిళ్ళనుండి ప్రపంచ కళావేదికల కెక్కించిన ఘనత ఆయనకే చెల్లు. 1965లో ఎడింబరోలో జరిగిన అంతర్జాతీయ సంగీతోత్సవంలో, షెహనాయ్ వాదన విని శ్రోతలు లేచి ఆనందంతో నృత్యం చేసారు. అంతవరకు వారు షెహనాయ్ వాద్యాన్ని చూసి ఎరుగరు.

1982లో బెంగుళూరులో జరిగిన సార్క్ దేశాల మహాసభలో బిస్మిల్లా ఖాన్ షెహనాయ్ కచేరి ఏర్పాటు చేయబడింది. బిస్మిల్లాఖాన్ అతినిరాడంబరుడు. భక్తి తత్పరుడు. నిత్యసంగీత సాధకుడు. ఉదయాన్నే లేచి, వ్యాయామం ప్రార్థనాదికాలు ముగించిన తర్వాతనే తేనీరు సేవిస్తారు. మద్యమాంసాదులంటని అత్యంత నియమబద్ధ జీవితం గడుపుతున్న సత్వగుణ సంపన్నుడు. తొమ్మిది మంది సంతానం. అనుకూలదాంపత్యం వారిది. పెద్ద కుమారుడు నైత్యూర్ ఖాన్ తండ్రితోపాటు విదేశాల్లో పర్యటించి షెహనాయ్ కళాకారుడుగా పేరుగాంచాడు. చిన్న కుమారుడు తబలా వాద్యంలో ప్రసిద్ధుడు.

వారణాసి అన్నా, అక్కడి గంగానది అన్నా ఆయనకెంతో ఆసక్తి. ఒకమారు అమెరికా నుండి వచ్చిన ఒక కోటీశ్వరుడు 'ఖాన్ సాహెబ్ గారూ, మీరు అమెరికాకు రండి, మీకు అన్ని సౌకర్యాలు సమకూరుస్తాను. మీరు హాయిగా సంగీతం వినిపిస్తూ వుండవచ్చు' అన్నాడు 'సరే కాని, నా గంగామాయిని కూడా అమెరికాకు తరలించగలరా?' అన్నారు. ఆ కోటీశ్వరుడు అవాక్కయ్యాడు. తోటి కళాకారులను ఎంతగానో గౌరవించేవారు. ప్రముఖ ఆంధ్రసంగీత విద్వాంసుడు వాసా కృష్ణమూర్తి బిస్మిల్లాఖాన్‌గారికి సన్నిహితులుగా వుండేవారు. వాసా కృష్ణమూర్తి మరణవార్త విని

- "నేనీ దారుణ వార్త విని నిలువెల్లా కంపించిపోయాను. మరణం తప్పదని తెలియక కాదు. నాకొక తమ్ముని వంటి కృష్ణమూర్తికి అప్పుడే మరణం ఆసన్నమైనందుకు. ఆ రెండు రోజులపాటు అన్నపానీయాలు ముట్టుకోడానికి మనస్కరించలేదు"-అన్నారు.

కేంద్ర సంగీతనాటక అకాడమీ అవార్డు, భారత ప్రభుత్వం నుండి పద్మభూషణ్ ప్రశస్తి మున్నగు ఎన్నో సత్కారాలందుకొన్న మహా కళాకారుడాయన.

దుమ్‌రావ్ సంస్థానంలో ప్రతినెలా చివరి మంగళవారం బూర్వా మంగళ్ ఉత్సవంలో బిస్మిల్లాఖాన్ మంగళ వాదనం వినిపించేవారు. సంస్థానాలు అంతరించిన తర్వాత ఆ సంప్రదాయం కానరాలేదు ఇటీవల ఒక పెద్ద పడవలో కూర్చొని ఖాన్ సాహెబ్ షెహనాయ్ వాదనం చేస్తుండగా, ఆ పడవ చుట్టూ పదహారు పడవలలో శ్రోతలు ఆ మధుర మంజుల గానంలో ఓలలాడినారు.

'షెహనాయ్ నవాజ్ బిస్మిల్లా ఖాన్'గా శ్రోతల మన్ననలందుకొన్న సంగీత కళాప్రపూర్ణుడు 1916 నవంబర్ 21 జన్మించారు. 80 వసంతాలు పూర్తి చేసిన ఆ షెహనాయ్ చిరంజీవమై శ్రోతలను అలరించాలని ఆశిద్దాం.

● *వార్త 12-6-96* ●

★ ★ ★

# ‘అంధులకు అక్షరభిక్ష పెట్టిన లూయీబ్రెయిల్’

పారిస్ నగర వీధుల్లోని ఒక పెద్ద హోటల్ వద్ద ఒక సాయంకాలం జనం గుమిగూడి, వింత ప్రదర్శనను చూస్తూ విరగబడి నవ్వుతున్నారు. ఆ ప్రదర్శనలోని పాత్రధారులు పండ్రెండుమంది గుడ్డివారు. రంగు రంగుల దుస్తులు ధరించి, రంగు కాగితములతో తయారుచేసిన ముక్కద్దములు తగిలించుకొని, వారి మధ్యన బల్లమీద అమర్చిన వివిధ తంతి వాద్యములను మీటుతూ, పాడుతూ వున్నారు. అపశ్రుతిలోని ఆనందాన్ని అనుభవిస్తూ ప్రజలు హర్షధ్వానాలు చేస్తున్నారు. ఆ సమూహంలోని, ‘లావెంటిన్ హే’లో యీ దృశ్యము గొప్ప సంచలనాన్ని కల్గించింది. గుడ్డివారు వివిధ స్థాయిలలో స్వర భేదములను గుర్తించినట్లే, వివిధ దుస్తులలోని ఆకృతి భేదమును గుర్తించి యిది ఫలాన వస్తువు అని చెప్పటలో కష్టమేమున్నది? వస్తు రూపమును స్పర్శ ద్వారా తెలుసుకొని ‘అ’ కు క్ష కు వున్న వ్యత్యాసమును కనుగొనలేరా? అన్న ఆలోచనలు అంకురించినవి.

ఈ ఆలోచనలు హే, లో అంకురించినది 1783లో. కొద్ది రోజుల తర్వాత లావెంటిన్ హే, వీధిలో భిక్షమెత్తుకొని తిరుగుచున్న ఒక గుడ్డి పిల్లవానిని చేరదీసి, తన ఆలోచనలకు ప్రయోగరూప మివ్వసాగెను. తేలికయైన చెక్క ముక్కలపై అక్షరములను చెక్కించి వాటి ద్వారా తన బోధన సాగించుచుండెను. ఆ విద్యార్థి సంవత్సరము తిరుగక ముందే భాష, భూగోళము, సంగీతములయందు మంచి అభివృద్ధిని చూపించెను. ఈ ప్రయోగముతో ఉత్సాహితుడైన ‘హే’ తన గుమాస్తా పదవిని పరిత్యజించి 1784లో ముప్పది మంది గుడ్డి పిల్లలతో తన పాఠశాల ప్రారంభించెను అదే ఆధునిక యుగములో, అంధుల కోసం ప్రారంభించిన మొట్టమొదటి పాఠశాల.

అంతలోనే ఫ్రెంచి విప్లవ మారంభమైనది. ప్రజలు, ప్రభువుల పోరాటంలో యీ పాఠశాలను పోషించువారు లేరైరి. వాలెంటిన్ అష్ట కష్టాలకోర్చి కొంతకాలము పాఠశాలను నడిపి గతించాడు. 1813లో డాక్టర్ గిల్ అను నతడు దీనిని పునరుద్ధరించాడు. పియానో వాయించుటతోపాటు మరి కొన్ని చేతి పనులను కూడా నేర్పుతూ శిక్షణ ప్రారంభించినాడు. ఉబ్బెత్తు అక్షరములను వ్రేళ్ళతో చదువుట ద్వారా అచట చదువు సాగుచుండేది. ఈ పద్ధతి ద్వారా కొంతవరకు చదువగల్గిరి కాని మిక్కిలి వ్యయ ప్రయాసలతో కూడుకొని వుండినది

అంధులకు అందుబాటులో నున్న లిపిని సాధించుటకు ఎందరో ప్రయత్నించిరి కాని అందు కృతకృత్యుడైనవాడు లూయీబ్రెయిల్ మాత్రమే కనులుండినవారు కనుగొనజాలని యీ లిపి సృష్టికి కారణజన్ముడైన లూయీబ్రెయిల్ అంధుడు.

జానమద్ది హనుమచ్ఛాస్త్రి

లావెంటిన్ హే అంధుల విద్యావిధానానికి ఆధారభూతుడైనప్పటికీ ఆ విధానానికి ప్రాణ ప్రతిష్ఠచేసి స్పష్టత సౌలభ్యత కల్గిన లిపిని సృష్టించిన ఘనత లూయీ బ్రెయిల్‌కు చెందుననుటలో అతిశయోక్తి వుండదు.

లూయీ బ్రెయిల్ 1809 సంవత్సరం జనవరి 4 వ తేదీన పారిస్ నగర సమీపమందలి 'ప్రే' అను గ్రామములో జన్మించాడు. తండ్రి సైమన్ రీనిబ్రెయిల్ గుర్రపు జీనులను తయారుచేయు సామాన్య కార్మికుడు.

చిన్నవాడైన లూయీబ్రెయిల్ చిలిపి చేష్టలను చూచి సైమన్ మురిసిపోతూ తన బిడ్డ పెద్దవాడై తన కెంతో పేరు ప్రతిష్ఠల తేగలడని తలుచుచుండేవాడు. అరుణరేఖలు ఉషోదయమును సూచించునట్లు బాల్యము జీవిత భవితవ్యమును సూచించును.

మూడేళ్ళవాడైన లూయీ ఒకనాడు తన నాన్న కర్మాగారములోని వస్తువులతో ఆడుకొనుచుండగా అరె యొకటి పట్టుతప్పి ఆకస్మికంగా కంట గుచ్చుకొన్నది. సూక్ష్మమైన నరములు తెగిపోవుటచే రెండుకండ్లు కాంతి హీనమైనవి తేజోవంతమైన కనులు చీకటి కోణములైనవి.

ఈ సంఘటన లూయీ తల్లిదండ్రులను కృంగదీసినది. ఆ గ్రామ, మతాచార్యుడగు జేకన్‌పాలి యీ పిల్లవానిని చేరదీసి కంటి గాయమును మాన్పించి చేరువలోనున్న పాఠశాలలో ప్రవేశపెట్టెను తక్కిన పిల్లలందరూ చదువు వ్రాతల ద్వారా సంపాదించుకొన్న దానికంటే లూయీ బ్రెయిల్ తన స్మృతి శక్తి ద్వారా ఎక్కువ సాధింపగల్గెను. ఇంటిలో తల్లి పియానో వాయించుట నేర్పెడిది. వినయశీలుడైన లూయీ కమ్మని కంఠముతో పాడుతూ శ్రోతలను మైమరపించేవాడు.

ప్రాథమిక విద్య పూర్తి కావడముతో 1819లో లూయీ వారెంటిన్ హే స్థాపించిన అంధ విద్యార్థుల పాఠశాలలో ప్రవేశించెను. అయిదారు ఏళ్ళలోనే లూయీబ్రెయిల్ చరిత్ర, వ్యాకరణము, భాషా శాస్త్రము, బీజ గణితము మొదలగు వాటిని అభ్యసించెను. అప్పటి కింకా వుబ్బెత్తు అక్షరముల ద్వారానే చదువు సాగుచుండెడిది.

1819 సం. చార్లెస్ బేర్బియర్ అను సేనాని రాత్రి వేళల సైనికులకు వార్తల నందజేయు తలపుతో స్వర సంకేతములను వుబ్బెత్తు చుక్కలను, గీతలను ఉపయోగింప సాగెను. అంధుల విద్యాలయమున అధ్యాపకుడుగానున్న డాక్టర్ ప్రిగ్నియర్ యీ పద్ధతిని తన పాఠశాలలో ప్రయోగించి చూచెను. ఈ పద్ధతి ప్రకారం రెండు వరుసలతో ఆరేసి గీతలు చుక్కలు వుండును. కాని వేలితో చదువుటకు క్లిష్టమగ నుండెను. ఆనాటి విద్యార్థులలో ఒకడుగ నుండిన లూయీబ్రెయిల్ యీ వుబ్బెత్తు చుక్క చక్కని సాధనమని గ్రహించాడు. బ్రెయిల్‌కు చుక్క చెదరని సంకేతమయినది. లూయీ పన్నెండు చుక్కలవే సంగ్రహ మొనర్చి పరిశోధనలు కావింపసాగెను అహర్నిశలు దళసరి కాగితములపై చుక్కలు గ్రుచ్చుచు సాధన చేయుచుండెడి వాడు. లూయీకి చుక్కల పిచ్చి పట్టిందని అందరూ అవహేళన చేయసాగారు. సదావేశ పూరితుని, అవహేళనలు, అమర్యాదలు అంటవు.

పదిహేనేళ్ళ పరిశోధనల తర్వాత లూయీ బ్రెయిల్ అంధులకు అత్యంత సులభమగు లిపిని సాధించెను. ఆ చుక్కలలో అరువదిమూడు మార్పులను

సాధించెను. వేళ్ళకు అనువుగా అందుబాటగు యీ పద్ధతి ద్వారా వివిధ భాషలను సాధింపవచ్చునని విశదమైనది.

1-5-1835 తేదీన లూయీబ్రెయిల్ పారిస్ నగర మందలి "ఎక్స్‌పొజిషన్ ఆఫ్ యిండస్ట్రీస్" అను ప్రదర్శనమున తన లిపి పద్ధతిని ప్రదర్శించెను. ఈ లిపి ద్వారా తన పాఠశాల బోధనను పరిష్కరించెను. కాని ప్రభుత్వము దీనిని గుర్తింపకపోయింది.

లూయీ కృషిని మెచ్చుకొన్న వారెవరూ అతనికి తోడ్పడలేదు. నిర్విరామ కృషి ఫలితంగా లూయీ క్షయ వ్యాధికి గురి అయినాడు. రోగ గ్రస్తుడయ్యీ బ్రెయిల్ లిపిలో వ్యాకరణమును రచించాడు. విధి వంచితుడైనప్పటికీ, అగమ్యమైన శక్త్యుత్సాహములతో తన ఆశయమును సాధించిన లూయీ బ్రెయిల్ 1843లో అస్తమించాడు. అంధులకు అక్షర భిక్ష పెట్టిన లూయీబ్రెయిల్ కృషిని ఆ మహనీయుడు గతించిన రెండేళ్ళకు ప్రభుత్వము అధికార పూర్వకముగ గుర్తించింది.

లూయీబ్రెయిల్ ప్రయోగ వైదుష్యాన్నీ, లిపి సౌలభ్యాన్నీ గుర్తించినా, వుదాశీనతతో వుపేక్షతో తెగనాడిన ప్రభువులు, పండితులు ఆ మహనీయుని స్మారక సభలలో పాల్గొని లూయీ బ్రెయిల్ మహా విజ్ఞాని, నిష్కామయోగి, అని కొనియాడుచు, అతని జీవిత కాలమున ఎట్టి సాయము చేయకుండిన తమ అహంకారానికి లోలోనే దుఃఖిస్తూ అశ్రుతర్పణ గావించారు.

ఆనాడు లూయీ బ్రెయిల్ సమర్పించిన లిపి నేటికి మరోనాటికి చెక్కుచెదరక నిల్చివుండ గలదు. ఈ లిపి యే అతని యొక్క అక్షరమైన స్మారక చిహ్నము

నేడు మనదేశములో యిరువది లక్షలకు పైచిలుకు అంధులున్నారు. జీవనోపాధిలేక వీధుల వెంట యాచకులై వెంటాడుచున్నారు భారతదేశమందలి వివిధ రాష్ట్రములలో ఏబదికి పైగా అంధ విద్యార్థుల పాఠశాలలు పనిచేయుచున్నవి. ఈ పాఠశాలల్లో మామూలు పాఠశాలల్లో వలె అన్ని విషయములు బ్రెయిల్ లిపిద్వారా బోధింపబడుచున్నవి చదువుతోపాటు వివిధములగు చేతిపనులను కూడా నేర్పుచున్నారు. డెహ్రాడూన్‌లోని భారతప్రభుత్వ బ్రెయిల్ ముద్రణాలయంలో వివిధ తరగతుల పాఠ్యగ్రంథములు, పెద్ద పెద్ద కావ్యములు ముద్రింపబడి పాఠశాలలకు అందజేయబడుచున్నవి. అనేక అంధ విద్యార్థులు ఏటేటా పట్టభద్రులగుచున్నారు.

ఆంధ్రప్రదేశమున గుంటూరు జిల్లాలోని రెంటచింతల గ్రామమున లూథరస్ మిషన్ యాజమాన్యమునొకటి, కడప పట్టణమున ప్రభుత్వ యాజమాన్యమున నొక పాఠశాల జరుపబడుచున్నవి. ప్రభుత్వ పాఠశాలలో ఏబది మంది విద్యార్థులకు ప్రవేశ సౌకర్యముండియు ముప్పదిమంది కంటే ఎక్కువ విద్యార్థులు లేకుండుట శోచనీయము. అంధులైన పిల్లలు అక్షరజ్ఞులై తమ జీవితాన్ని ఆనందమయ మొనర్చు కొనగలరు. ప్రభుత్వము యీ పాఠశాలలలోని విద్యార్థులకు ఉచిత భోజనము, వసతి, దుస్తులు, పుస్తకముల నిచ్చుటయే కాక సెలవులలో స్వగ్రామమునకు రానుపోను ఖర్చులను సైతము భరించు చుండుట ముదావహము.

అంధ విద్యార్థి ప్రపంచమునకు --- బ్రెయిల్ ఆశాజ్యోతి. తమసోమా జ్యోతిర్గమయ.

● *ఆంధ్రప్రభ - 28-4-1960* ●

# ఉత్తమ వ్యక్తిత్వంగల సర్. మోక్షగుండం విశ్వేశ్వరయ్య

"ప్రజల సంపాదనాశక్తిని, కార్యదక్షతను నైపుణ్యాన్ని వివిధములైన చేతిపనుల ద్వారా పెంపొందించాలి. చేతనైన వారందరూ కష్టించి పనిచేసే వీలు కల్పించాలి యాంత్రిక శక్తిని వినియోగించుకొని దేశం పారిశ్రామికంగా ముందంజ వేయాలి. భారతీయులలో ప్రబలంగా వున్న 'అంతా తలరాత' అన్న అలసభావం రూపుమాపి నిరంతర కృషి ద్వారా సంపదను సాధించే దీక్షను, కర్తవ్య పాలనను ప్రజల్లో రేకెత్తించడం ప్రభుత్వ కర్తవ్యం." అంటూ అపారమైన మానవశక్తిని భారతదేశ సర్వతోముఖ వికాసానికి వినియోగించాలన్న కర్మయోగి డా॥ మోక్షగుండం విశ్వేశ్వరయ్య విశ్వవిఖ్యాతుడైన ఇంజనీర్, రాజనీతిజ్ఞుడు, పాలనాదక్షుడు, నిష్కామదేశభక్తుడు విశ్వేశ్వరయ్య వ్యక్తిత్వం నుంచి నేటి తరం నేర్చుకోవలసింది ఎంతైనా ఉంది.

## ప్రజలకు అంకితమైన ప్రతిభ

విశ్వేశ్వరయ్య పూర్వీకులది నేటి ప్రకాశం జిల్లాలోని మోక్షగుండం అనే గ్రామం సుమారు రెండు శతాబ్దాల క్రితం కర్ణాటక రాష్ట్రం (అప్పట్లో మైసూరు సంస్థానం)లోని చిక్కబళ్ళాపుర సమీపంలోని ముద్దెనహళ్ళిలో స్థిరపడ్డారు. అక్కడే విశ్వేశ్వరయ్య 1861 సెప్టెంబర్ 15వ తేదీన జన్మించారు. తండ్రి శ్రీనివాస శాస్త్రి తల్లి వెంకట లక్ష్మమ్మ. వారిది సామాన్య కుటుంబం. బాల్యంలోనే విశ్వేశ్వరయ్య తండ్రిని పోగొట్టుకొన్నారు. మేనమామ ఇంట్లో వుంటూ కాలేజి ఫీజుల కోసం ప్రైవేట్ ట్యూషన్‌లు చెబుతూ 1881లో పట్టభద్రులయ్యారు. కాలేజి ప్రిన్సిపల్ ఛార్లెస్ వాటర్స్ విశ్వేశ్వరయ్యను ఎంతగానో ప్రోత్సహించారు. గణితంలో అసామాన్య ప్రతిభకల విశ్వేశ్వరయ్యగారి నుండి, అధ్యాపకులు తమ సంశయాలను పరిష్కరించుకొనేవారని అంటారు. ఇలా ఎందరో పెద్దల ఆదరాభిమానాలు చూరగొని విశ్వేశ్వరయ్య డాక్టర్ ఎం.వి; సర్. ఎం.వి. భారతరత్న ఎం.వి., అంటూ ప్రజల మన్ననలందాడు. అప్పట్లో మైసూరు సంస్థాన దివానుగా వుండిన దివాన్ రంగాచార్లు, విశ్వేశ్వరయ్య విద్యావినయాలను గుర్తించి, ఇంజినీరింగ్ చదివేందుకు స్కాలర్‌షిప్ మంజూరు చేసి, పునే నగరానికి పంపారు. ఇంజినీరింగ్ పరీక్షలో బొంబాయి రాష్ట్రంలో సర్వప్రథముడుగా ఉత్తీర్ణులైన విశ్వేశ్వరయ్యగారిని రాష్ట్రప్రభుత్వం నేరుగా అసిస్టెంట్ ఇంజనీర్‌గా నియమించింది. ఏడాదిలోపునే ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్‌గా నియమించింది. ఏడాదిలోపునే ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్‌గా పదోన్నతి పొందారు. ఆ రోజుల్లో, ఆంగ్లేయుల పాలనలో అంతత్వరలో ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్ పదవినందుకోవటం చాలా అరుదు. పునేలో వున్నప్పుడే గోపాలకృష్ణ గోఖలే, బాలగంగాధర తిలక్, రనడే వంటి మహనీయుల సాహచర్యం వారికి లభించింది.

ఆంగ్లపాలకులు విశ్వేశ్వరయ్య కార్యదీక్షను గుర్తించి ప్రపంచ జలాశయాలలో ఒకటిగా గొప్పదైన సుక్కూర్ బరాజ్ (నాటి సింధురాష్ట్రం) నిర్మాణానికి ప్రత్యేక ఇంజనీర్‌గా నియమించారు. బ్రహ్మాండమైన ఆ జలాశయ నిర్మాణం నాలుగేళ్ళలోనే పూర్తి చేశారు విశ్వేశ్వరయ్య. 1901లో భారత ప్రభుత్వ ప్రతినిధిగా విశ్వేశ్వరయ్య జపాన్ దేశం వెళ్ళి అక్కడ కుటీర పరిశ్రమలను అవలోకించారు. ఆ విధంగానే భారతదేశంలో కుటీర పరిశ్రమల అభివృద్ధికి బృహత్ పథకాన్ని సిద్ధపరచి ప్రభుత్వానికి అందించారు జపాన్ పర్యటనానంతరం విశ్వేశ్వరయ్య, పునే నగర నీటి సరఫరా పథకాన్ని రూపొందించారు ఈ నిర్మాణకాలంలోనే ఆయన 'ఆటోమేటిక్ స్లూస్‌గేట్'ను రూపొందించారు ఈ స్లూస్‌గేట్ నిర్మాణం ప్రపంచ ఇంజనీర్ల ప్రశంసలందుకొన్నది. కొత్త పరిశోధనను, తన పేరుమీద పేటెంట్ చేసుకోమని మిత్రులు సూచించారు. తన కార్యనిర్వహణలో భాగంగా తయారయినంత మాత్రాన యంత్రాన్ని తనపేర పేటెంట్ చేసుకోవటం సముచితం కాదన్నారు. లార్డ్‌కిచనర్ స్లూస్ గేట్ నిర్మాణంలో విశ్వేశ్వరయ్య ప్రతిభను కొనియాడాడు. 1906లో ఏడెన్ నగర నీటి సరఫరా ప్రణాళికను రూపొందించిన విశ్వేశ్వరయ్యగారిని ప్రభుత్వం సూపరింటెండింగ్ ఇంజనీర్‌గా నియమించింది. 60 మైళ్ళదూరం నుండి ఏడెన్ నగరానికి నీటి సరఫరా ఏర్పాటు చేశారు

## దేశదేశాలలో ఆయన నిర్మాణాలు

హైదరాబాద్ నగరం 1908లో విపరీతమైన వరద దెబ్బకు గురైంది. మూసీనది పరిసరాల్లోని పెక్కు చెరువులు గట్లు తెగిపోవటంతో హైదరాబాద్‌కు పెద్ద ప్రమాదం ఏర్పడింది. నైజాం నవాబు ఒత్తిడి కారణంగా, ఇటలీ దేశ పర్యటనలో వుండిన విశ్వేశ్వరయ్య హైదరాబాద్ వచ్చి 1909లో హైదరాబాద్ నగరానికి పథకం తయారు చేశారు. నగరానికి 13.5 కిలోమీటర్లలోని మూసీనది మీద, 10.5 కి.మీ. దూరంలోని దాని ఉపనది ఈసా నదిమీద రెండు డ్యాములు నిర్మించి రిజర్వాయర్లను ఏర్పాటు చేయాలని సూచించారు. ఆ రీతిగా హైదరాబాద్ నగరాన్ని వరదల నుండి తప్పించడమేకాక, మురుగు నీటిపారుదల పథకాన్ని తయారుచేశారు. బ్రిటీష్ రెసిడెంట్ విన్నపం మేరకు సికింద్రాబాద్ నగరానికి కూడా మురుగు నీటి పథకాన్ని తయారుచేశారు. మైసూరు మహారాజా ఆహ్వానం మీద విశ్వేశ్వరయ్య 1909లో సంస్థాన ఛీఫ్ ఇంజనీర్‌గా చేరారు. ఎన్నో పథకాలు తయారు చేశారు విశ్వేశ్వరయ్య కార్యదక్షతను గుర్తించి మహారాజా ఆయనను దివాన్‌గా నియమించారు. తాను జన్మించిన సంస్థానానికి దివాన్ కాగలనని ఆయన ఊహించలేదు. ఆరేళ్ళపాటు దివాన్‌గా వుండి అరువదేళ్ళలో సాధించదగిన కార్యక్రమాలను పూర్తి చేశారు హెబ్బాళ్ వ్యవసాయ కళాశాల, మైసూరు విశ్వవిద్యాలయం, మైసూర్ బ్యాంక్, మైసూర్ సోప్ ఫ్యాక్టరి, ఛేంబర్ ఆఫ్ కామర్స్, కన్నడ సాహిత్య పరిషత్ వంటి సంస్థలెన్నిటినో నెలకొల్పారు. విశ్వేశ్వరయ్యగారి ప్రజ్ఞాప్రాభవ ఫలితంగా నిర్మాణమయినదే కృష్ణరాజ సాగర్ జలాశయం. దానివల్ల లక్షలాది ఎకరాల మెట్టభూములు సస్యశ్యామలం అయ్యాయి. అత్యంత రమణీయమైన బృందావన్ ఉద్యానవనం విశ్వేశ్వరయ్య ప్రకృతి ప్రేమకు నిదర్శనం. అప్పట్లో మైసూరు మహారాజా నిర్వహించే దసరా ఉత్సవాలకు బ్రిటీష్

ఉన్నతాధికారులు వచ్చేవారు. వారు అహంకార పూరితులు. ఒక బ్రిటీష్ అధికారి, విశ్వేశ్వరయ్యకు లేఖ వ్రాస్తూ 'దర్బార్‌లో నాకు ఏర్పరచిన కుర్చీ ఎత్తుగా వుంది. కాళ్ళు నేలకు ఆనడంలేదు. పాదాలు మోపేందుకు మెత్తని దిండ్లు ఏర్పాట్లు చేయాల'న్నారు. మరునాడు విశ్వేశ్వరయ్య కుర్చీ కాళ్ళు కోయించి 'మీ కుర్చీకాళ్ళు తగ్గించబడ్డాయి. దిండ్లతో పనిలేదు' అని బదులు రాసి పంపారు. మైసూరు మహారాజాగారితో అభిప్రాయ భేదాలొచ్చాయి. వెంటనే రాజీనామా చేశారు. ఆనాటి సాయంత్రం ఉన్నతాధికారులందరితో సమావేశమై, తాను దివాను పదవిలో ఉన్నంతకాలం అందించిన సేవలకు కృతజ్ఞతలు తెలిపారు. కార్యాలయం వదలి పోర్టికో చేరారు. సిద్ధంగా వున్న ప్రభుత్వ వాహనాన్ని తిప్పి పంపారు, సొంతకారులో ఇంటికి వెళ్ళారు. విదేశీ ఇంజినీర్లతో పని చేస్తుండిన భద్రావతి ఉక్కు కర్మాగారం నష్టాల ఊబిలో కూరుకుపోయింది. రాజీనామా సమర్పించి బొంబాయి వెళ్ళిన విశ్వేశ్వరయ్యకు మహారాజా జాబురాశారు. ఈ కర్మాగారాన్ని ఉద్ధరించేందుకు తప్పక రావాలని కోరారు. రాజా కోరిక మేరకు విశ్వేశ్వరయ్య భద్రావతికి వెళ్ళారు. కర్మాగార పర్యవేక్షణాధికారాలన్నిటిని స్వయంగా చేపట్టారు కార్మికులకు కూలీ డబ్బులు పెంచారు అవినీతిపరులైన విదేశీ ఇంజినీర్లు కొందరిని తొలగించారు. కార్మికులతోపాటు వుంటూ, వారిని ప్రోత్సహిస్తూ నష్టాలలో కూరుకున్న ఉక్కుకర్మాగారాన్ని రెండేళ్ళలో లాభాల బాట పట్టించారు. యువ ఇంజినీర్లను ప్రోత్సహించి వారికి శిక్షణావకాశాలు ఏర్పాటు చేశారు. భద్రావతి కర్మాగారం కోట్లలో లాభాలు గడించడం మొదలయ్యాకే ఆయన, ఆ ఉద్యోగాన్ని వదిలి వెళ్ళారు. పర్యవేక్షకులుగా చేసిన సేవలకు ప్రతిఫలంగా, మహారాజా లక్షాయాభైవేల రూపాయల చెక్కును పారితోషకంగా విశ్వేశ్వరయ్యకు పంపారు. ఆ పైకాన్ని తిప్పి పంపుతూ దానితో పారిశ్రామిక శిక్షణ సంస్థను స్థాపించాల్సిందిగా రాజాగారికి విన్నవించుకొన్నారు. ఆ సంస్థకు తన పేరు పెట్టడానికి సమ్మతించలేదు. ఆ రీతిగా వెలసిందే బెంగుళూరులోని జయచామరాజేంద్ర ఆక్యుపేషనల్ ఇన్‌స్టిట్యూట్. విశ్వేశ్వరయ్య 1921లో భారత ఉత్పత్తిదారుల సమాఖ్యను స్థాపించారు. దానికి జీవితాంతం వారే అధ్యక్షులుగా ఉన్నారు. 1922 లో అఖిలపక్ష రాజకీయ సమ్మేళనానికి, 1923లో ఆల్ ఇండియా సైన్స్ కాంగ్రెస్ సభకు ఆయన అధ్యక్షత వహించారు. స్వదేశ సంస్థానాలలో ప్రజలు బ్రిటిష్ ఇండియా ప్రజలకంటే ఎక్కువ బాధ పడుతున్నారని గ్రహించిన విశ్వేశ్వరయ్య వారి స్వేచ్ఛకోసం గణనీయంగా కృషి చేశారు. మైసూరు సంస్థానంలో ప్రజాప్రతినిధి సభను ప్రారంభింపజేశారు. కర్తవ్య నిర్వహణలో ఎంతో నిజాయితీగా వ్యవహరించేవారు. దివాన్ పదవి స్వీకరించే ముందు బంధుమిత్రుల సమావేశం ఏర్పాటుచేశారు. తాను దివాన్ పదవిలో వుండగా ఎటువంటి ఉద్యోగాలు కోరమని, సిఫారసులు చేయమని వాగ్దానం చేయాల్సిందిగా అందరినీ కోరారు. తమ బంధువులను ప్రభుత్వోద్యోగాల నుండి తప్పించి, ప్రైవేట్ సంస్థలలో చేరాల్సిందిగా సూచించారు. బీదవారికి ఆర్థిక సహాయం చేసేవారు. మైసూరు సంస్థానంలో మోటార్ కార్ల నిర్మాణం ప్రారంభించాలనుకొన్నారు. కాని బ్రిటిష్ ప్రభుత్వం అనుమతించలేదు. రెండో ప్రపంచ యుద్ధం వచ్చింది. ఇండియాలో విమానాల తయారి అవసరమైంది. భారత ప్రభుత్వం విశ్వేశ్వరయ్య సలహా ప్రకారం

బెంగుళూరులో విమానాల కార్ఖానా నెలకొల్పింది. విశాఖపట్నంలో నౌకానిర్మాణ పథకాన్ని రూపొందించి, వాల్‌చంద్ హీరాచంద్‌ను ఆ పనికి ప్రేరేపించారు. విశ్వేశ్వరయ్య భిన్న దృక్పథాలు కలవారు. గాంధీజీ గ్రామీణ పరిశ్రమలకు ఎంతో ప్రాధాన్యమిచ్చారు. విశ్వేశ్వరయ్య భారీ పరిశ్రమలకు ప్రాధాన్యంతోపాటు, కుటీర పరిశ్రమలను ముమ్మరంగా చేపట్టాలన్నారు.

## నిజాయితీకి సజీవ సంకేతం

"నా అభిప్రాయాలు ఎలా ఉన్నా, మీ సహకారం లభించే అదృష్టానికి నోచుకొన్నందుకు సంతోషిస్తున్నాను. నాతో ఏకీభవించకపోయినా, మీ దేశభక్తి శక్తిసామర్థ్యాల పట్ల నాకు అపారమైన గౌరవం వుంది. అని గాంధీజీ, విశ్వేశ్వరయ్యగారికి లేఖ రాశారు. "మీరేమైనా చెప్పండి. భారత గ్రామీణుల గురించి మీకంటే, నాకు ఎక్కువగా తెలుసు." అని గాంధీజీ చెప్పగా "నేను మీకంటే పదేళ్ళు పెద్దవాడినన్న విషయాన్ని గమనించమనవి. దేశ ఆర్థిక ప్రగతి విషయంలో మీకంటే ఎక్కువ అవగాహన నాకుంది." అంటూ విశ్వేశ్వరయ్య బదులు రాశారు. భారతదేశం లోని గొప్ప జలాశయాలు, వంతెనలు నిర్మించునపుడు ప్రభుత్వం విశ్వేశ్వరయ్య సలహాలు స్వీకరించేది. తొంభైఏళ్ళ వయసులో కూడా, భారత ప్రధాని నెహ్రూ ఆహ్వానంపై పాట్నావద్ద గంగానదిపై వంతెన నిర్మాణాన్ని, యువ ఇంజినీర్లతో కలసి రూపొందించారాయన. విశ్వేశ్వరయ్య నిజాయితీకి సాకారం. ఒకమారు విదేశ పర్యటనకు సిద్ధమయ్యారు. కొంతపైకం కావలసివచ్చింది. మైసూరు బ్యాంక్ మేనేజర్ బి.వి. నారాయణరెడ్డికి ముందుగా ఫోన్ చేసి, బ్యాంక్‌కు వెళ్ళారు. మేనేజర్ వారినెంతో గౌరవంగా లోపలికి తీసుకెళ్ళారు. దరఖాస్తుఫారం తయారైంది విశ్వేశ్వరయ్య తమవద్దనున్న, భారతప్రభుత్వం బాండ్లను తాకట్టు పెట్టడమా! ఈ బ్యాంక్ స్థాపకులు మీరు" అంటూ తిప్పి ఇచ్చారు. విశ్వేశ్వరయ్య తీసుకోలేదు. తక్కువ వడ్డీ సూచించగా, అందరికీ విధించే వడ్డీ మీదనే అప్పు ఇవ్వండి అన్నారు. ఎక్కువ వడ్డీ వేయాలని కోరిన వారు విశ్వేశ్వరయ్య ఒక్కరే అన్నారు మేనేజర్. "గంధపు చెక్కలా సేవలో అరిగిపో, కాని ఇనుములా తుప్పు పట్టవద్దు" అన్నది వారి జీవిత ధ్యేయం. దేశ విదేశాలలోని విశ్వవిద్యాలయాలు వారికి గౌరవ పట్టాలిచ్చి సత్కరించాయి. భారత ప్రభుత్వం 1955లో వారిని 'భారతరత్న' బిరుదుతో గౌరవించింది. 1961లో విశ్వేశ్వరయ్య నూరోపుట్టినరోజు పండుగ బెంగుళూరులో వైభవంగా జరిగింది. నాలుగురోజుల ముందు అల్లుడు ఫిరోజ్‌గాంధీ కన్నుమూసినా, ఉత్సవాలకు ప్రధాని నెహ్రూ వచ్చారు. "మేము మాటలతో కాలయాపన చేశాం. మీరు నిరంతర కృషిలో నిమగ్నులై నవభారత నిర్మాణం కావించిన మహనీయులు" అంటూ కొనియాడారు నెహ్రూ. 1962 ఏప్రిల్ 12న కన్నుమూసేవరకు దేశపురోగతికి, ప్రజాశ్రేయస్సుకు శ్రమించిన విశ్వేశ్వరయ్య వ్యక్తిత్వాన్ని ఆదర్శంగా తీసుకోవలసిన తరుణమిది. ఆయనను గుర్తుచేసుకోవలసింది కూడా అందుకే.

● *ఈనాడు 14-9-95* ●

★ ★ ★

# మూఢాచారాలపై ఎక్కుపెట్టిన అస్త్రం డా॥ హెచ్. నరసింహయ్య

కర్నాటక రాష్ట్రంలోని కోలారు జిల్లాకు చెందిన బాగేపల్లి మజరాహోసూరు ఆయన పుట్టిన ఊరు. బీద కుటుంబంలో జన్మించి (జూన్ 6, 1920) వీధిబడిలో చదువు చెప్పే హనుమంతప్ప, కూలిచేసుకుని బ్రతుకు సాగించిన వెంకటమ్మల సంతానం ఆయన.

కుగ్రామంలో పుట్టి జీవితంలో అడుగడుగునా అవరోధాలనెదుర్కొంటూ ఆయన సాధించిన ఫలితం అభినందనీయం. తనలోని ప్రతిభను గుర్తించిన విద్యాగురు - అన్నదాత ఎం.ఎన్. నారాయణరావు, త్యాగీశానంద స్వామిగార్లను ఎంతో కృతజ్ఞతతో స్మరిస్తూ వుంటారు

బెంగుళూరు సెంట్రల్ కాలేజీలో బి.ఎస్.సి. (ఆనర్స్ ఎం.ఎస్.సి. పరీక్షల్లో) అగ్రశ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు. "క్విట్ ఇండియా" ఉద్యమంలో పాల్గొని (చదువు మధ్యలో) బెంగుళూరు, పూనాజైళ్ళలో శిక్ష అనుభవించారు.

అమెరికాలో ఓహియోస్టేట్ యూనివర్శిటీలో మూడేళ్ళు పరిశోధన సాగించి డాక్టరేట్ పట్టా సంపాదించారు (1960). అమెరికాలోని, సదర్న్ ఇలినాయిస్ యూనివర్శిటీలో సందర్శక అధ్యాపకులుగా పనిచేశారు.

డా॥ నరసింహయ్యగారి కత్యంత ప్రీతిపాత్రమైనది విద్యారంగం. తమ సర్వస్వాన్ని 'నేషనల్ ఎడ్యుకేషనల్ సొసైటీ'కి సమర్పించి నాలుగు కాలేజీలు, అయిదు ఉన్నత పాఠశాలలు, రెండు ప్రాథమిక పాఠశాలలు నిర్వహిస్తున్నారు.

నిత్య ఖద్దరుధారి ఆయన. బసవనగుడి (బెంగుళూరు) నేషనల్ కాలేజీ హాస్టల్‌లోని అతి సామాన్యమైన 10 × 12 అడుగుల గదిలో మంచం, కుర్చీ, బల్లవంటి పరికరాలు లేకుండా ఒక చాపమీద పరచిన మామూలు గుడ్డ, పాతస్టూలు, చేతికందే దూరంలో టెలిఫోన్ మాత్రం ఆ గదిలో ఉంటాయి. ఎచ్.ఎన్. ఉపకులపతిగా వున్నప్పుడు, యు.జి.సి. అధికారి, నరసింహయ్య గారిని కలుసుకుని. "ఇది కులపతిగారి గదా?" అన్నాడట ఆశ్చర్యంగా! 57 ఏళ్ళుగా హాస్టల్ గదిలోనే డా॥ నరసింహయ్య నివాసం.

డా॥ ఎచ్.ఎన్. గారిని ఎవరైనా, ఎప్పుడైనా కలుసుకోవచ్చు. ఆయన ఆఫీసులో ఆధునికమైన ఆడంబరాలేవీ వుండవు. ఆయన కూర్చునే కుర్చీ వెనుక గోడకు ఐన్‌స్టీన్ ఫోటో ఉంది. గోడపై పెద్దగా "?" గుర్తు ఉంది. ఆ ప్రశ్న సంకేతం గురించి ప్రశ్నించినప్పుడు "కొన్ని వేల సంవత్సరాల క్రితమే బుద్ధుడు, 'ప్రశ్నించనిదే దేనిని విశ్వసించవద్దు' అన్నాడు. నేను కూడా బాల్యం నుండి ప్రశ్నించనిదే దేనిని

సమ్మతించను. అలాగే తర్కానికి సమాధానం రానిదే ఒప్పుకునేవాణ్ణి కాను. మా పల్లెలో దారిలో నిమ్మకాయ, చిన్న కుండ మంత్రించి ఉంచేవారు. వాటిని దాటరాదని, తొక్కరాదని చెప్పతుండేవారు. నేను వాటిని తొక్కుతూ నడిచేవాణ్ణి. మాతండ్రిగారు చనిపోయినప్పుడు తలవెంట్రుకలు గొరిగించుకోమని ఒత్తిడి చేశారు. తండ్రి చావుకు, తలగుండు చేయించుకునేందుకు ఏమి సంబంధం? అని ప్రశ్నిస్తూ, సరే అన్నాను. ఈ నేపథ్యంలో ఐన్‌స్టీన్ నా దృష్టిలో మహర్షి అన్నారు.

డా॥ ఎచ్.ఎన్.గా ప్రసిద్ధులైన, డా॥ ఎచ్. నరసింహయ్య, మూఢాచారాలకు విరుద్ధంగా అవిశ్రాంతంగా పోరాడిన హేతువాది. మహిమలతో, మంత్రాలతో ప్రజలను వంచిస్తున్న మహాత్ములను తూర్పారబట్టిన విజ్ఞాన శాస్త్రవేత్త.

బెంగుళూరు విశ్వవిద్యాలయ మాజీ ఉపకులపతిగా కూడా వ్యవహరించారు. ఆయనతో శ్రీమతి గీతారామానుజం జరిపిన ఇంటర్వ్యూలోని ముఖ్యాంశాలు అందజేస్తున్నాము.

ప్రశ్న: స్వాతంత్ర్యానంతరం భారతదేశంలో గుణాత్మక విలువలను కోల్పోయిన విద్యారంగాన్ని బాగు చేయటమెలా?

ఎచ్.ఎన్.: నేటి విద్యారంగం నిస్సందేహంగా క్షీణించింది. నేటి విద్య ఆస్తులు - అంతస్తులు కలవారికే కాని అసక్తి కలవారికి కాదు. నేటి విద్య కేవలం సిలబస్ ఓరియంటెడ్ మరియు సంఖ్యాత్మకమైనది. ఆనాడు జీవితానికి ఉపయోగపడు విద్య - అధ్యాపకులు చాలామంది కర్తవ్య పరాయణులు. విద్యార్థులలో తమ కర్తవ్యాన్ని ప్రేరేపించేవారు. దేశభక్తిని పెంపొందించేవారు

ప్రశ్న: నేటి యువతలో మనస్తత్వానికి, అవినీతికి, విధ్వంసనభావానికి నేటి విద్యా విధాన లోపమే కారణమంటారా?

ఎచ్.ఎన్.: అవును. ఈ మాట వాస్తవం. ప్రధానంగా నేటి విద్యావిధానమే కారణం. ఈనాడు చెప్పేదొకటి చేసేది మరొకటి. బోధించేది ఇంకొకటి. తరగతులలో థియరీ ఆఫ్ ఎవల్యూషన్ చదువుతారు. ఇంట్లో అందుకు వ్యతిరేకంగా వర్తిస్తుంటారు. మా దేవుడు, మీ దేవుడు అంటూ పోట్లాడతారు. సరైన మార్గ నిర్దేశనం కావాలి. కొత్త మార్పురావాలి. లేకున్న మన సమాజం మరింత అస్తవ్యస్తమవుతుంది

ప్రశ్న: విద్యా వేత్తగా తమ అభిప్రాయం?

ఎచ్.ఎన్.: సంస్కరణలు రావాలి. వ్యవస్థలో, అధ్యాపకులలో, పోషకులలో, మనప్రభుత్వం మిలిటరి వ్యవహారాలపై చేసే ఖర్చులలో 10 శాతం కూడా ఖర్చు చేయటంలేదు. ఈనాడు మనకు బాహ్యారక్షణకు మిలిటరి ఎంత ముఖ్యమో, అంతకు నాలుగు రెట్లు ఆంతరంగిక రక్షణకు మూలమైన విద్య ముఖ్యం. ఈనాడు మనం విద్యారంగాన్ని నిర్లక్ష్యంగా చూస్తున్నాం.

నేను అమెరికాలో పిహెచ్.డి చేస్తున్నప్పుడు అక్కడ లభించిన ప్రోత్సాహంనన్ను ఆశ్చర్యచకితుని చేసింది. అక్కడి అధ్యాపకుల అంకితభావం, క్రమశిక్షణ గమనించి విస్మయం చెందాను. వారి నిజాయితీ నాలో కొత్త ఆలోచనలు రేకెత్తించింది.

మనదేశంలో చాలామంది అధ్యాపకులు కర్తవ్యం విస్మరించి ఇళ్ళలో ట్యూషన్లద్వారా బోధిస్తున్నారు. అలా వున్నప్పుడు మార్పు సంశయాస్పదం.

విద్య వ్యక్తి వికాసానికి నాందీవాచకం పలకాలి. అంతేకాని పోషకులుకోర్కే, విద్యాసంస్థలు ఆశించే విద్యాభ్యాసం కారాదు. వైజ్ఞానిక భావం, మానవతావాదం, వాస్తవాంశాలు, విద్యావిధానంలో మూల సూత్రాలు కావాలి. ఉన్నత విద్యారంగం రాజకీయవాదుల ప్రవేశంతో భ్రష్టమవుతూవుంది. ప్రాథమిక, మాధ్యమిక మరియు హైస్కూల్ స్థాయి విద్యలో సమర్థులైన ఉపాధ్యాయులను నియమించాలి. వృత్తి శిక్షణకు ప్రాధాన్యత నివ్వాలి. ఉన్నత విద్యాసంస్థలు విశ్వవిద్యాలయాలు. సమాజానికి దూరంగా 'దంత గోపురాలు' కారాదు.

ప్రశ్న: ఉపకులపతిగా పాలనారంగంలో మీరు ప్రవేశపెట్టిన సంస్కరణలేవి?

**ఎచ్.ఎన్.:** బెంగుళూరు యూనివర్శిటీని సెంట్రల్ కాలేజ్ క్యాంపస్ (నగరం మధ్య) నుండి దూరంగా జ్ఞానభారతికి మార్పించాను. విద్యార్థులకు హోటళ్ళు, సినిమాలు, అధ్యాపకులకు తమ ఇళ్ళు దూరం కావటం - వంటి సమస్యలు తలెత్తాయి. నేను వారందరికీ నచ్చజెప్పాను. నేను హరవాదిని.

పాఠ్యేతర కార్యకలాపాలు విద్యావ్యవస్థలో అవిభాజ్యం కావాలన్నదే నా ఉద్దేశం. అందుకోసం ఒకేషనల్ కోర్సెస్‌లో నాటక, సంగీత నృత్య, వ్యాయామ డిప్లొమా కోర్సులు ప్రారంభించాను. నేను కంఠీరవ క్రీడారంగంలో పదవీ స్వీకారోత్సవం జరిపాను. వైజ్ఞానిక గ్రంథాల ప్రచురణకు కృషిచేశాను. వైజ్ఞానిక మనస్తత్వాన్ని పెంచుటకు 1962లో "బెంగుళూరు సైన్స్ ఫోరం" అను సంస్థను ప్రారంభించి వివిధ రంగాలలో ప్ర సిద్ధులైన మేధావులచే 1200 చోట్ల ఉపన్యాసాలను, 400 పైగా వైజ్ఞానిక చలనచిత్రాల ప్రదర్శనలను క్రీడారంగంలో ప్రతిభావంతులకు తగిన ప్రోత్సాహక కార్యక్రమాలను ఏర్పాటు చేశాను. బెంగుళూరు లలితకళా పరిషత్ స్థాపన జరిగింది. కళాభిజ్ఞులచే శిక్షణా తరగతులు ఏర్పాటు చేయబడినవి.

ప్రశ్న: మహిమలు చూపే స్వాముల విషయం మీరు అనవసరంగా పట్టించుకున్నందువల్ల వైస్ ఛాన్సలర్ పదవిని పోగొట్టుకున్నారన్న వదంతి ఎంతవరకు నిజం?

**ఎచ్.ఎన్.:** ఏ పదవీ, ఎవరికీ శాశ్వతం కాదు. దానివల్ల ప్రమాదం వుంటుంది. నా పోరాటం వ్యక్తిగతంగా, సాయిబాబా, శివబాలయోగిగార్ల పట్ల కాదు. నా పోరాటం ప్రధానంగా బౌద్ధిక తార్కిక సంబంధమైంది. విజ్ఞానశాస్త్ర విద్యార్థిగా ప్రశ్నించటం నా కర్తవ్యం. మహిమలు ప్రదర్శించే స్వాములకు నాదో ప్రశ్న. శూన్యం నుండి వస్తువులను సృష్టించడం సాధ్యమా? అన్నదే నా ప్రశ్న. అలా సృష్టించగల శక్తి వున్నచో, మనం కోరే వస్తువులను వారెందుకు సృష్టించరు. కేవలం పిడికిలిలో దాచుకునే వస్తువులను మాత్రమే వారెందుకు సృష్టిస్తారు? శివబాలయోగి వంటివారు, క్షామ పీడిత ప్రాంతాల్లో వానలు కురిపించినట్లు, విపత్తులను పరిహరించినట్లు, విత్తనాలు చల్లి పంటలు పండించి బీదలకు పంచిపెట్టినట్లు మనం చూడలేదు. ఇటువంటి

ప్రశ్నలకు సముచిత సమాధానాలు కోరడం తప్పా? వైజ్ఞానిక దృష్టిని పెంచాలని మన రాజ్యాంగం పేర్కొన్నది. ఏ విషయంలోనైనా ప్రశ్నించటం, సంస్కరణ దృక్పథంతో పరిశీలించటం మన కర్తవ్యం కావాలి. మానవతా వాదం వికసించాలి. విజ్ఞానశాస్త్ర బద్ధంకాని నమ్మకాలపై పరీక్షలు జరపాలని విశ్వవిద్యాలయాలను మన రాజ్యాంగం ఆదేశించింది.

ప్రశ్న: మహిమలు ప్రదర్శించేవారిని మీరెప్పటినుండి పరీక్షింపసాగారు?

ఎచ్.ఎన్.: ఉమాశంకర్ దీక్షిత్ ఛాన్సలర్‌గా వున్నప్పుడు. ఈ మహిమా పురుషులను పరీక్షింపనారంభించారు. దీక్షిత్‌గారి నుండి మంచి ప్రోత్సాహం లభించింది. తర్వాత వచ్చిన గోవిందనారాయణ్ సత్యసాయిబాబా భక్తులు. అందువల్ల నా పరీక్షలకు వీలులేకపోయింది. నా దృక్పథంలో మార్పు వీలుకానిది. నా నిశ్చయానికి విరుద్ధంగా వ్యవహరించుటకు సమ్మతించక, గోవిందనారాయణ్ పదవి స్వీకారం చేసిన నాలుగైదు రోజులకే ఎవరికీ చెప్పకుండా స్వచ్ఛందంగా రాజీనామా చేసాను.

ప్రశ్న: దేవుడు, మతం - వీటి పట్ల మీ అభిప్రాయాలేవి?

ఎచ్.ఎన్.: దేవుడు-మతం పూర్తిగా వ్యక్తిగతం కావాలి. ఈ పరిధిని అధిగమించి దేవుడు, మతం సామూహిక ప్రదర్శనలకు పూనుకోవటం అవైజ్ఞానికం మాత్రమే కాదు అపాయకరం కూడా. దేవుడు-మతం వీటివల్లనే మనం ఈనాడు అనేక సమస్యలను ఎదుర్కొంటున్నాము. దేవుడు మనిషిని సృష్టించాడా? మనిషే భయం మూఢవిశ్వాసాల నేపథ్యంలో దేవుణ్ణి సృష్టించాడా అన్నవాదం శతాబ్దాలుగా సాగుతూ వుంది. ఈ వివాదానికి తగిన సమాధానం లభించలేదు. బుద్ధుడు 50 ఏళ్ళు తపస్సు చేశారు. దేవుడి అస్తిత్వాన్ని గురించి శిష్యులు ప్రశ్నించినపుడు 'మౌనముద్రాంకితుడు' అయ్యాడాయన.

దేవుడెలాంటివాడు అనటం కంటే దేవుడు ఏమి కాడో అన్న విషయం పట్ల నాకెంతో ఆసక్తి. వేదాంతులు కూడా 'నేతి', 'నేతి' (ఇది కాదు-ఇదికాదు) అంటున్నపుడు రాళ్ళను, చెట్లను పట్టుకుని ప్రాకులాడటం- ఈ వైజ్ఞానికయుగంలో చూసి నాకు నవ్వు వస్తుంది. యుగాలుగా, ఈ దేశంలో దేవుడిపేర, మతం పేర దోపిడీ జరిగింది. అల్లర్లు జరిగాయి. బీదలు, అమాయకులు వంచనకు గురైనారు. దేవుడి పేర, మతం పేర సమాజ సేవ సాగితే మంచిది. అలా కాక దేవుళ్ళను పూజాపునస్కారాలతో స్వలాభం కొరకు వశపరచుకోవటం సాధ్యమైతే. ఆ దేవుడికి, లంచగొండి అయిన అధికారికి ఏమాత్రం వ్యత్యాసం లేదు.

మనం ఈనాడు బహిరంగంగా ఆధునికులం. అంతే అంతరంగంలో ఆదిమానవుల కంటే పెద్దగా ఎదగలేదు. మనలో మొదట వైజ్ఞానిక దృష్టి పెరగాలి. దేవుళ్ళు, మతాలు విజ్ఞానశాస్త్రమునకు దూరమైన మూఢనమ్మకాలకు దారితీయరాదు.

ప్రశ్న: విజ్ఞానశాస్త్రానికి-దేవుడికి గల సంబంధం?

ఎచ్.ఎన్.: విజ్ఞానం దేవుడి పరమూ కాదు-వ్యతిరేకమూ కాదు. విజ్ఞానశాస్త్ర పరిశోధనలో దేవుడికి అస్కారం లేదు. ప్రాణుల పుట్టుక - విశ్వం యొక్క

ఆవిర్భావం - వీటి వికాసాన్ని వైజ్ఞానికంగా విశ్లేషించినపుడు, సంప్రదాయబద్ధమైన దైవిక సిద్ధాంతాలన్నీ వమ్మయినాయి. విశ్వ రహస్య అన్వేషణకు వైజ్ఞానిక విధానమే ఆలంబనం.

ప్రశ్న: సమాజ పునరుద్ధరణకు హేతువాదిగా మీ సందేశం ఏమిటి?

ఎచ్.ఎన్.: సమాజ పునరుజ్జీవనంలో హేతువాదుల పాత్ర ప్రముఖమైనది. కాని ఈ మార్గం సుగమం కాదు. ఈనాడు దేవుడు, ధర్మం, సంప్రదాయం, మూఢనమ్మకాలు మున్నగువాటితో జాతి మునకలు వేస్తున్నది. కులాంతర, మతాంతర వివాహాలతో కొంతవరకు పరిహరింపవచ్చు. కాని ఇక్కడ కూడా ప్రమాదం వుంది. ఈ సంబంధాలవల్ల పుట్టిన సంతానం రెండు కులాలలో ఏదో ఒకకులానికి చేరే ప్రమాదం వుంది. అందువల్ల తల్లిదండ్రులు తాము ఏ కులానికి చేరినవారం కామని ప్రకటించాలి.

మూఢనమ్మకాలను కాని, సంప్రదాయాలనుకాని ప్రశ్నించనిదే మనం అంగీకరించరాదు. ప్రజల్లో అంధవిశ్వాసాలను కల్గించి వారి వ్యక్తిత్వం నాశనం చేసే పని మానుకోవాలి. ఉదాత్త ధ్యేయాలను, సాంఘిక జాగృతిని, ఆధునిక దృక్పథాన్ని సంతరించుకోగల వ్యక్తుల నిర్మాణం కావాలి.

ప్రశ్న: మీరు అవివాహితులుగానే వుండటానికి కారణం. మీ దృష్టిలో స్త్రీకున్న స్థానం?

ఎచ్.ఎన్.: వివాహం, సంసారం సహజం. నా 13వ ఏటనే గాంధీ, నెహ్రూ బుద్ధుని ఆశయాలపై నాకు ఆసక్తి కల్గింది. వారందరూ వివాహితులే. కాని దేశ ప్రేమ, సంఘసేవ, రామకృష్ణ విద్యామందిర నివాసం, వివేకానందుల విప్లవాత్మక భావాలు నన్ను ఆకర్షించాయి. ఎటువంటి బంధాలకు గురికాని జీవితం గడపాలని నిశ్చయించుకున్నాను. నిర్ణీత లక్ష్యం సాధించాలని ముందంజ వేశాను. అందువల్ల పెళ్ళి-సంసారం మున్నగు వాటితో పెనుగులాడటానికి సమయం లభించలేదు.

మరో ముఖ్య విషయం చెప్పాలి. నేను పుట్టింది ఆదివారం రోజున. కావున 74 ఏళ్ళ జీవితంలో నేను "ఆదివారం" అనుభవించలేదు. నిరంతర పోరాటం, కఠిన జీవనం ప్రయత్నాల పరంపరలే నా బ్రతుకు కథ. నా హేతువాదంలో స్త్రీలకు స్థానం లేదనలేదు. మహిళల పట్ల నాకు గౌరవభావం వుంది.

(తరంగ సౌజన్యంతో)

● *విశాలాంధ్ర 24-4-94* ●

★ ★ ★

# అంతరిక్ష పరిశోధనారంగంలో ఆణిముత్యం డా॥ యు.ఆర్.రావు

'ఆర్యభట్ట' ఉపగ్రహాన్ని జయప్రదంగా అంతరిక్ష కక్ష్యలో చేర్చినందుకు భారతీయు లందరూ ఎంతో సంతోషించారు. కేంద్రాధికారిని (డైరెక్టర్‌ను) కొనియాడారు కాని కేంద్ర డైరెక్టరు మాత్రం ఏదో చెప్పరాని బాధతో విషణ్ణ వదనుడై వున్నాడు. కారణం? తమ కేంద్రంలో తనతో పాటు పనిచేస్తున్న 15 మంది, వంట పనివారు, పరిచారకులు, పాత్రలు తోమేవారు ప్రాజెక్టు ప్రయోగానంతరం, ఉద్యోగాలు కోల్పోనున్నారు.

డా॥ యు.ఆర్. రావుగారుగా లోక మెరిగిన ఉడిపి రామచంద్రరావు (ఆ కేంద్ర డైరెక్టర్) ప్రయోగం సఫలమైన వెంటనే విమానంలో ఢిల్లీ వెళ్లారు. ప్రభుత్వంలోని పెత్తందార్లను కలుసుకున్నారు. ఆర్యభట్ట ఉపగ్రహ ప్రయోగంలో తనకు సహకరించిన శాస్త్రజ్ఞులు, సాంకేతిక నిపుణులతో పాటు సేవలందించిన తాత్కాలిక సిబ్బందిని ఉద్యోగాలలో కొనసాగించమని నొక్కి చెప్పారు. ఆ దొరలు, మొదట ససేమిరా వీలు కాదన్నారు. కొసకు రావుగారి పట్టుదలకు తలొగ్గి ఆ పది మందికి ఉద్యోగాలు కల్పించారు. ఢిల్లీనుండి వచ్చిన డా॥ రావుగారిని కలుసుకున్న ఆ పనివారు తమ కృతజ్ఞత వెల్లడించుకున్నప్పుడు రావుగారు ఉద్వేగంతో "వీరికి శాశ్వత ఉద్యోగం కల్పించడం ఆర్యభట్ట ఉపగ్రహం విజయవంతంగా అంతరిక్షంలో చేర్చుట కంటే గొప్ప విజయంగా" భావిస్తున్నానన్నారు. మన ప్రభుత్వంలో పెద్ద ఉద్యోగుల తీరు అలా వుంటుంది.

గత జులై నెలలో ఇన్‌శాట్ 2 బి. ఉపగ్రహాన్ని నిర్దేశిత కక్ష్యలో జయప్రదంగా చేర్చి భారతప్రభుత్వంచే అభినందనల నందుకున్న విఖ్యాత శాస్త్రవేత్త డా॥ యు.ఆర్. రావు కర్నాటక రాష్ట్రంలోని ఉడిపిలో నిరుపేద కుటుంబంలో 1932 లో జన్మించారు. తండ్రి బీద రైతు. "మా కుటుంబంలో 8 వ తరగతి మించి చదివిన వారు లేరు. మా తండ్రిగారు నన్ను కనీసం మెట్రిక్యులేషన్ దాకానైనా చదివించాలని ఉవ్విళ్ళూరారు" అని తమ బాల్యస్మృతులను వెల్లడించారు. ఉత్తర కర్ణాటక మరియు బళ్ళారిలో వున్న కొందరు తమ కుటుంబ పరిచయస్తులు, పై చదువులు చదువుటకు ఆర్థిక సహాయం అందజేయగా బళ్ళారి, అనంతపురం కళాశాలల్లో రావుగారు చదివారు. విరామ కాలంలో ప్రైవేటులు చెబుతూ తమ పుస్తకాలకు, బట్టలకు సంపాదించారు. కాలేజీలో ప్రతిభా వంతుడుగా, నెగ్గిన రావుగారికి బెనారస్ హిందూ యూనివర్శిటీలో పోస్టుగ్రాడ్యుయేషన్ చేయుటకు స్కాలర్‌షిప్ లభించింది. కళాశాల చదువు పూర్తి అయ్యేదాకా కాళ్ళకు చెప్పులు వేసుకుని ఎరగని వాడు ఆయన ధోవతితో తరగతులకు వెళ్ళేవాడు. ఉడిపికి వెళ్ళేందుకు రైలు ఛార్జీలకు టికానా లేక పోయిం దాయనకు.

బళ్ళారి, అనంతపురం, బెనారస్‌లలో విద్యార్థిగా వుండిన ఏడేళ్ళలో తన తల్లిదండ్రులను చూసేందుకు నోచుకోలేదు. చేతిలో ఛార్జీలకు కావలసిన పైకం లేక!

ఈనాడు బెంగుళూరులోని అంతరిక్ష భవనంలోని తమ ఏర్ కండిషన్డ్ కార్యాలయంలో అవిశ్రాంతంగా తమ విధులను నిర్వహిస్తున్న డా॥ యు.ఆర్. రావుగారు తొలి రోజులలో తమ అనుభవాలను నెమరు వేసుకుంటూ వుంటారు. పోస్ట్‌గ్రాడ్యుయేషన్ తర్వాత మైసూరులోని సెంట్ ఫిలోమెనా కాలేజిలో కొంతకాలం ఫిజిక్స్ లెక్చరర్‌గా, తర్వాత గుజరాత్ విశ్వవిద్యాలయంలో అధ్యాపకులుగా వున్నారు. మెసాచ్యుసెట్స్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ (అమెరికా)లో జెట్ ప్రొపెల్లర్ ఇంజనీర్ల బృందంలో చేరి త్వరలోనే ఉన్నత శాస్త్రవేత్తల ప్రశంసలందుకున్నారు. అణు విజ్ఞాన శాస్త్రవేత్తలైన విక్రం సారా భాయ్, హోమి జె. భాభాల ప్రేరణతో మాతృదేశానికి మరలి వచ్చి ఆర్యభట్ట ఉపగ్రహ కేంద్రం డైరెక్టర్ పదవిని చేపట్టారు.

డా॥ రావు అవిశ్రాంత కార్యదీక్షాపరులు. తన సహోద్యోగులతో, ఎంత చిన్నవారితోనైనా అత్యంత ప్రేమాదరాలతో వ్యవహరిస్తుంటారు. ప్రతిభగల వారిని గుర్తించి, సీనియారిటీ కాదంటూ పై పదవులలో నియమించి వారిని ప్రోత్సహించటం రావుగారి వ్యక్తిత్వ వైశిష్ట్యం.

"శాస్త్రీయ రంగంలో అపజయాలు సహజం. వాటితో మనం కృంగి పోరాదు.మన యువ శాస్త్రవేత్తలు, అద్భుత ప్రజ్ఞావంతులు. ఇండియన్ క్రయోజినిక్ ఇంజన్ 1998 నాటికి సిద్ధం కాగలదు" అంటూ అత్యంత ఆత్మ విశ్వాసంతో వెల్లడించారు.

క్షణం తీరికలేని కృషీవలుడాయన. ఒక్క పైసా కూడా దుర్వినియోగం కానివ్వరు. అతన్ని పరమలోభి అంటారు కొందరు. ఖర్చు పెట్టిన ప్రతి పైసాకు లెక్కలుండాలన్నదే ఆయన లక్ష్యం. పైకం సద్వినియోగం కావాలన్నదే ఆయన ధ్యేయం.

ఏ కాస్త విరామం లభించినా, కన్నడంలో కవితలల్లు తుంటారు. కుమారుడు భౌతిక శాస్త్రవేత్త, కూతురు వాస్తుశిల్పి, ఇద్దరూ విదేశాల్లో పై చదువులు సాగిస్తూన్నారు.

వీలున్నప్పుడు నవలలు చదువుతారు. శాస్త్రీయ సంగీతం పట్ల అభిరుచి కలవారు. మంచి బ్రిడ్జి ఆటగాడుగా బహుమతులందుకున్నారు విద్యార్థి దశలో. పదిహేనేళ్ళయింది క్రీడల్లో పాల్గొని అని అన్నారు.

తమ పురోగతికి ప్రధాన కారకురాలు తమ అర్థాంగి శ్రీమతి యశోద - అంటూ ఎంతో కాలం నేను నా కుటుంబమునుండి దూరంగా వున్నా - ఆమె అడుగడుగునా నన్ను ప్రోత్సహిస్తూ సహకరించింది అంటారు డా॥ రావుగారు. భారత అంతరిక్ష పరిశోధనా రంగంలో మకుటంలేని మహారాజుగా వెలుగుతున్న రావుగారి వయస్సు 61 ఏళ్ళు.

★ ★ ★

# ఉపగ్రహాల లాభాలు అనంతం

భారతీయ ఉపగ్రహప్రయోగ విజ్ఞాన శాస్త్రవేత్తగా అంతర్జాతీయ ఖ్యాతి గడించిన డా॥ యు.ఆర్.రావుగారితో, ఆర్యభట్ట ప్రయోగం విజయవంతమైన ఇరువదవ వార్షికోత్సవ సందర్భంగా జరిపిన ఇంటర్వ్యూలోని కొన్ని ముఖ్యాంశాలు. డా॥ యు.ఆర్ రావుగా ప్రసిద్ధులైన డా॥ ఉడిపి రామచంద్రారావుగారి కాలేజీ చదువు, వారాలబ్బాయిగా, బళ్ళారి, అనంతపురంలలో జరిగింది. ప్రతిభ కారణంగా విద్యార్థి వేతనాలందుకొని బెనారస్, అమెరికాలోని మెసాచ్యుసెట్స్ విశ్వవిద్యాలయాలలో పై చదువులు సాగించిన విజ్ఞానశాస్త్రవేత్త డా॥ యు.ఆర్. రావు.

ప్రశ్న: మన ఉపగ్రహాల ప్రయోగం వల్ల సామాన్య ప్రజానీకానికి కల్గిన ప్రయోజనమేమి?

జవాబు: ఉపగ్రహాలవల్ల మన దేశంలోని టెలిఫోన్ వ్యవస్థకు ఎన్నో లాభకరమైన మార్పులు వచ్చాయి. ఎస్.టి.డి., అంతర్జాతీయ టెలిఫోన్ సౌకర్యాలకు వీలుకల్గింది

మన దూరదర్శన్ (టి.వి.) ప్రసారాల విషయం చూద్దాం. ఇన్శాట్ రాకముందు మన దేశంలో కేవలం పదకొండు దూరదర్శన్ ప్రసార కేంద్రాలున్నాయి. మన దేశంలో 85 శాతం ప్రజలు దూరదర్శన్ ప్రసారాలు చూచే అవకాశం కల్గింది. అంతేకాక, టి.వి. ద్వారా పెక్కు విద్యాప్రసారాలు చూస్తున్నారు.

ఇటీవల 'ఇంటర్ ఆక్టివ్ టి.వి.' ద్వారా పాఠాలు చెప్పటమేకాక, వాటిని వినే విద్యార్థులు ప్రశ్నలను అడిగేందుకు కూడా ఏర్పాటు చేయబడింది. గ్రామీణాభివృద్ధి కార్యక్రమాలు, కార్మికులకు ఉపయోగపడు కార్యక్రమాలు మున్నగువాటిని ప్రసారం చేయనున్నారు. దేశమే ఒక తరగతి గదిగా మార్చుటకు ఇంటర్ ఆక్టివ్ టి.వి. ద్వారా వీలు కలుగుతుంది. దూరవిద్య (డిస్టెన్స్ ఎడ్యుకేషన్) కార్యక్రమాలు, ఉపగ్రహాల మూలంగానే సాగుతున్నాయి.

భారత్, చైనా దేశాల్లో నిరక్షరాస్యుల సంఖ్య అత్యధికంగా వుంది. వారికి విద్య నేర్పేందుకు దూరవిద్యా సౌకర్యాలు సమకూర్చాలి. ఇండోనేషియా, ఆస్ట్రేలియాలలో ఈ కార్యక్రమాలు ఎంతో ప్రయోజనకరంగా సాగుతున్నాయి

ప్రశ్న: మన ఉపగ్రహ విజ్ఞానం దేశాభివృద్ధికి ఎలా ఉపయోగపడుతున్నది?

జవాబు: ఇందుకు వాతావరణాన్ని గురించిన హెచ్చరికలను గమనిద్దాం. ఇదివరకు వాతావరణ వివరాలు కచ్చితంగా తెలిసేవికావు. దూరదేశాల్లో జరిగే వాతావరణంలోని మార్పులను తెలుసుకుంటున్నాము. ఋతుపవనాలు ఎప్పుడు ప్రారంభమయ్యేది తెలుసుకొంటున్నాం. భూగర్భజలాల అన్వేషణ జయప్రదంగా సాగిస్తున్నాం. ఉపగ్రహాలద్వారా ఖనిజ సంపద ఎక్కడున్నదో కనుగొంటున్నాము. పైర్ల పరిస్థితులను గమనించి, కోతలకు ముందే పంట దిగుబడిని అంచనా వేయగలుగుతున్నాం.

మనదేశంలో అటవీ భూముల విస్తీర్ణం, మట్టిగుణాలు, మున్నగువాటిని ఐ.ఆర్.ఎస్. ఉపగ్రహాల మూలంగా తెలుసుకోగలుగుతున్నాం. కరువులు, వరదలు ఎక్కడ తలయెత్తగలవో తెలుసుకోగలుగుతున్నాం. మనకున్న ప్రకృతి సంపదను ఎంతవరకు

వినియోగించుకోగలమో, ఉపగ్రహాల సహాయంతో తెలుసుకొంటున్నాం. పోషక సమగ్రాభివృద్ధి కార్యక్రమాల ద్వారా, ఒకప్పుడు తాగునీటికే నోచుకోని ప్రాంతాల్లో, ఈనాడు ఏటా రెండు పంటలు పండించే అవకాశాలు కల్పించబడినాయి.

మనదేశ జనాభా రెట్టింపయ్యే అవకాశం వుంది. కాని అప్పుడు మనకున్న వ్యవసాయ భూములు మాత్రం పెరగవు. అలా పెరిగిన జనాభాకు మనం ఆహారం, నీరు సరఫరా చేయగలమా? పోషక సమగ్రాభివృద్ధి (సస్టైనబుల్ ఇంటెగ్రేటెడ్ డెవలప్‌మెంట్) పథకాలవల్ల సాధ్యం అవుతుంది. అందుకు కావలసిన వివరాలు ఉపగ్రహాలద్వారానే లభిస్తాయి.

ప్రశ్న: 'ఆర్యభట' ఉపగ్రహ నిర్మాణంలో తాము ఎదుర్కొన్న సవాళ్ళేవి?

జవాబు: 'ఆర్యభట' నిర్మాణం ప్రారంభించే కాలంలో మనకు ఉపగ్రహాల తంత్రజ్ఞానం అంతగా తెలియకుండేది. మన అంతరిక్ష కార్యక్రమాల పితామహుడు విక్రం సారాభాయ్. వారే నా గురువు. వారి ప్రేరణవల్లనే ఈ కార్యక్రమాలకు నాయకత్వం వహించాను.

తరువాత, మేము స్నాతక, స్నాతకోత్తర పరీక్షలలో నెగ్గిన యువకుల వివరాలు సేకరించాం వారికి ఉపగ్రహాలంటే ఏమిటో బోధించాం. ఒక విధంగా మేము విద్యార్థులలో స్ఫూర్తిని, ధైర్యాన్ని కల్గించాం. తాము చేయనున్నది గొప్ప సాహస కార్యమని వారు విశ్వసించి రేయింబవళ్ళు పనిచేయసాగారు.

ఒక వర్క్‌షాప్‌లో షెడ్ తీసుకొన్నాం. పీణ్యా (బెంగుళూరు)లో 2,3 నెలల్లో మంచి బృందాన్ని తయారుచేశాం. ఈ బృందం నేటి ఉపగ్రహ విజ్ఞానంలో అగ్రశ్రేణిలో వుంది. ఉపగ్రహమంటే ఏమీ తెలియని కాలమది. రెండున్నర ఏళ్ళలో 'ఆర్యభట్ట'ను నిర్మించడం ఒక అద్భుతమైన పని.

ప్రశ్న: జాతీయసమైక్యతకు సంబంధించి ఇన్సాట్ ఉపగ్రహాల పాత్ర ఏమి?

జవాబు: మనదేశంలో విభిన్న భాషలు, ఆచారాలు వున్నాయి. భిన్నత్వంలో ఏకత్వం సాధించుటకు దూరదర్శన్ కార్యక్రమాలు ఎంతగానో ఉపయోగిస్తాయి.

అంతేకాదు. మన దేశంలోని మారుమూల గ్రామం నుండి, ఇన్సాట్ ద్వారా ఇతర దేశాల ప్రజలతో మాట్లాడవచ్చు. గ్రామీణ ప్రాంతాలమధ్య సంబంధాలు ఏర్పాటు చేయుటకు ఉపగ్రహాలు తోడ్పడుతున్నాయి. ఈ రీతిగా జాతీయ సమైక్యతను సాధించగలం.

ప్రశ్న: మన ఉపగ్రహ కార్యక్రమంలో వైజ్ఞానిక ఉపగ్రహాలకెటువంటి స్థానం వుంది?

జవాబు: మనం ఇంకా వైజ్ఞానిక ఉపగ్రహాలను నిర్మించలేదు. ఎక్స్-రే మరియు గామారే ఖగోళ శాస్త్రానికి సంబంధించిన వైజ్ఞానిక ఉపగ్రహాలు అంతరిక్షంలోకి వెళ్ళాయి. మనమే అంతరిక్ష ఉపగ్రహాల లాంచింగ్ వాహనాలను సిద్ధపరచుకోవాల్సి వుంది. మనం ఇంకా చిన్న ఉపగ్రహాలను తప్ప, పెద్ద వాటిని రోదసీలోనికి పంపే రాకెట్లను సిద్ధపరచుకోవాల్సి వుంది. ఇందుకు చాలా వ్యయమువుతుంది. ఇప్పటికే "పి.ఎస్.ఎల్.వి." రాకెట్‌లతో జయప్రదంగా ప్రయోగాలు చేశాం. త్వరలోనే 'జి.ఎస్.ఎల్.వి.' రాకెట్ ప్రయోగం జయప్రదం కాగలదు.

ప్రశ్న: ఈ రెండు దశాబ్దాలలో ఉపగ్రహక్షేత్రాలకు సంబంధించినంత వరకు, మన దేశం సాధించిన ప్రగతిని గురించి మీ అభిప్రాయం ఏమి?

జవాబు: ఈ రెండు దశకాలలో మనం సాధించిన విజయాలు గొప్పవి. ప్రపంచమే మన విజయాలను ప్రశంసించింది.

"ఇన్సాట్-2" "ఐ.ఆర్.ఎస్." - ఇవన్నీ అమెరికావంటి అగ్రరాజ్యాల ఉపగ్రహాలకే మాత్రం తీసిపోనివి. ఈనాడు మన 'ఐ.ఆర్.ఎస్.' నుండి వచ్చే చిత్రాలను అమెరికన్లు వినియోగిస్తున్నారు. అందుకువారు పైకం చెల్లిస్తున్నారు. వారు ఉపగ్రహాలనుండి నేరుగా చిత్రాలను తీసుకొంటున్నారు.

ఆ రీతిగనే మనం రోదసీలోకి పంపనున్న ఇన్సాట్ ఉపగ్రహం నుండి మూడింట ఒకవంతు సేవలను 'ఇంటెల్సాట్'వారు గుత్తకు తీసుకోనున్నారు.

ఇరువదేళ్ళక్రితం మనకు ఉపగ్రహ సాంకేతిక వివరాలు బొత్తిగా తెలియకుండేవి. మనం ఎంతో ప్రగతిని సాధించాం. ఇప్పటికి 16, 17 ఉపగ్రహాలను జయప్రదంగా నిర్మింపగలిగాం.

ప్రశ్న: ఉపగ్రహాలను, రాకెట్‌లను మనమే నిర్మించుకోవటం వల్ల కలిగే ప్రయోజనాలేవి?

జవాబు: ఇది పూర్తిగా ఖర్చుకు సంబంధించిన విషయం. విదేశాలనుండి కొనుగోలు చేయుటం వల్ల మూడింట ఒకవంతు వ్యయం తగ్గుతుంది. మన 'ఇన్సాట్-1డి' ఉపగ్రహానికోసం రెండు వందలకోట్లు ఇచ్చాము. ఈనాడు మనం దీనిని విదేశాలలో కొనాలంటే మూడువందల కోట్లు ఖర్చు అవుతుంది మనం, ప్రస్తుతం 50-60 కోట్లు వ్యయంతో తయారుచేస్తున్నాం. రాకెట్లను మనమే తయారుచేసుకోవటం వల్ల మూడింట ఒక భాగం వ్యయం చాలు.

మరో ముఖ్య విషయం. ఇంత గొప్ప సాంకేతిక శాస్త్రజ్ఞానాన్ని మనమే సాధించుకోవాలి. లేకున్న మనం పురోగమింపలేము. ఉన్నత సాంకేతిక విజ్ఞానం చాలా అవసరం.

మన దేశమందలి పారిశ్రామిక సంస్థల సేవలను అందుకొంటున్నాం. 400 పరిశ్రమలు ఈక్విటీలో పాలుపంచుకుంటున్నాయి.

కేవలం అణువిజ్ఞానం లేదా అంతరిక్ష విభాగాల శాస్త్రవేత్తలతో మాత్రమే మనం అభివృద్ధిని సాధించలేము. దానిని విస్తృతపరచినపుడు మాత్రమే. ఆ సాంకేతిక విజ్ఞానం వల్ల దేశానికి లాభం కలుగుతుంది.

అంతరిక్ష శాస్త్ర సాంకేతిక విజ్ఞానం వల్ల ఎలక్ట్రానిక్స్ క్షేత్రంలో అతి సూక్ష్మసాధనాల నిర్మాణం సాధ్యమవుతుంది.

ఈనాడు లార్సెన్ అండ్ టూబ్రో, వాల్‌చంద్‌నగర్ ఇండస్ట్రీస్, బి.ఇ.ఎల్. మున్నగు పారిశ్రామిక సంస్థలు మాతోపాటు పనిచేస్తున్నాయి.

ప్రశ్న: మన దేశ గ్రామీణ ప్రాంతాల్లోని నిరక్షరాస్యతను జయప్రదంగా తొలగించేందుకు ఉపగ్రహ కార్యక్రమాలు తోడ్పడుతాయా?

జవాబు: 'గ్రామ్ స్సాట్' అనే ఒక ఉపగ్రహాన్ని మొదటి జి.ఎస్.ఎల్.వి. రాకెట్‌లో వుంచాలని ఆలోచిస్తున్నాం. గ్రామ్‌సాట్ అంటే గ్రామాలకు సంబంధించిన ఉపగ్రహంలోని

ఒక్కొక్క ట్రాన్స్‌పాండర్‌లో 8 నుండి 10 ఛానెల్స్ తయారుచేయవచ్చు దీనిని జయప్రదం కావిస్తే గ్రామప్రజల ఆర్థికాభివృద్ధికి వినియోగించుకోవచ్చు వారు వ్యవసాయంలో సాధించగల ప్రగతిని అందించవచ్చు.

మన పల్లె ప్రజలను, ప్రధానంగా స్త్రీలను విద్యావంతులుగా చేయాలి అప్పుడు జనాభా నియంత్రణ మాత్రమే కాదు ఆర్థిక పరిస్థితిని పెంపొందింపవచ్చు

**ప్రశ్న:** ఇంతగా విజయం సాధించిన తర్వాత మన అంతరిక్షప్రయోగాల కార్యక్రమం ఎదుర్కొంటున్న సవాళ్ళేమి?

**జవాబు:** ఇక్కడ రెండు విధాల సవాళ్ళున్నాయి. ఒకటి సాంకేతికమైంది. కొత్త సాంకేతిక విజ్ఞానానికి సంబంధించినది - ఒక ఉపగ్రహం ట్రాన్స్‌పాండర్ నుండి పది ఛానెల్స్‌ను వేయటం, ఉపగ్రహం ద్వారా లభించే అతి చిన్న బొమ్మలను మరింత స్పష్టంగా పెంచటం - మున్నగు విషయాలు. వీటిని మన శాస్త్రవేత్తలు విజయవంతం చేయగలరు వీరు మరే విదేశీ శాస్త్రవేత్తలకు తీసిపోరు.

ఈ సాంకేతికమైన సవాలుకంటే అంతరిక్షప్రయోగల విజ్ఞానంతో మనకు కలిగే లాభాలను మన ప్రజలకు అందించాలి. ప్రజలు ఈ విప్లవంలో పాల్గొనాలి. అప్పుడే మనం ముందంజవేయగలం. ఒకటిరెండు చోట్ల మాత్రం 'సస్టైనబుల్ ఇంటెగ్రేటెడ్ డెవలప్‌మెంట్ ప్రోగ్రాం' ప్రయోగం చేసినా లాభంలేదు. దేశమంతటా ఈ కార్యక్రమం జయప్రదం కావించేందుకు ప్రజలందరూ సహకరించాలి. కాని అనుకున్నంత సులభంకాదు.

ఎందుకంటే, మనం చెప్పే హితవాక్యంలో రైతులకు నమ్మకం ఏర్పడాలి. మన బీదరైతులు అత్యధికంగా పంటలు పండించాలి. మార్పులు చేయాలంటే వారు అందుకు ఎక్కువ ఖర్చుపెట్టాలి. వారికి ఈ రంగంలో శిక్షణ ఇవ్వాలి. అట్టి సాంకేతిక విజ్ఞానాన్ని వారి వద్దకు తీసుకుపోవాలి. అదొక పెద్ద సవాల్. మనం ఆ సాంకేతిక విజ్ఞానాన్ని వారికి అందించినపుడే ఏమైనా సాధించగలం. ఇదే గొప్ప సవాల్.

ఒక రాకెట్ లేదా ఒక ఉపగ్రహాన్ని జయప్రదంగా ప్రయోగించుటవల్ల మన దేశం పురోగమించదు. దాని ఉపయోగంవల్ల లాభం మన దేశమందలి ప్రతి వ్యక్తికి లభించాలి. అంటే మనమందరం (కేంద్రప్రభుత్వ శాఖలన్నీ) సమైక్యంగా పనిచేయాలి. ఇది కేవలం అంతరిక్ష విజ్ఞాన విభాగంవల్లనే సాధ్యంకాదు. అంతరిక్ష విభాగం, రాకెట్ ఉపగ్రహం, వాటితోపాటు వ్యవసాయ విజ్ఞాన శాస్త్రవేత్త, జలసంపన్మూలాల శాస్త్రవేత్త, విద్యాశాఖ, గ్రామీణాభివృద్ధి శాఖ, ఈ రీతిగా అన్ని శాఖలు సమైక్యంగా పనిచేసినపుడు, మన దేశ ప్రజలను వైజ్ఞానికంగా ముందుకు తీసుకువెళ్ళినపుడు, దేశాభివృద్ధి సాధ్యమవుతుంది. అదొక గొప్ప సవాల్. "హ్యూమన్ ఛాలెంజ్ ఈజ్ ఆల్వేస్ ది గ్రేటెస్ట్ ఛాలెంజ్."

('తరంగ' సౌజన్యంతో)

● విశాలాంధ్ర *3-7-94 & 30-7-95* ●

★ ★ ★

# ప్రథమ భారతీయ మహిళా డాక్టర్
# శ్రీమతి ఆనందీబాయి జోషి

అప్పటికి ఆమె పదునాల్గేళ్ళ బాలిక. అయిదో ఏట నుంచే సంస్కృతం, వేద పురాణ శాస్త్రాలను చదువసాగింది. తన సంస్కృత భాషా గురువు, దూరపు బంధువు, తపాలా శాఖలో ఉద్యోగి అయిన గోపాల్ రావ్ జోషి ఆమె భర్త. పెళ్ళినాటికి ఆమె వయస్సు తొమ్మిదేళ్ళు.

బొంబాయి సమీపంలోని కల్యాణ్‌లో 1865 మార్చి 31న ఆమె జననం. తల్లిదండ్రులు ఆమెకు 'యమున' అని నామకరణం చేశారు. చేపట్టిన భర్త ఆమెకు 'ఆనంది' అని పేరు పెట్టాడు.

శతాబ్దం క్రితం సంగతి. మిసెస్ కార్పెంటర్ అనే అమెరికన్ మహిళ ఫిలడెల్ఫియాలోని దంత వైద్యశాలలో వైద్యురాలుగా వుండేది. యాదృచ్ఛికంగా 'అమెరికన్ క్రిస్టియన్ రెవ్యూ' పత్రిక పాత సంచికలో భారతీయుడైన గోపాల్‌రావు జోషి వ్రాసిన జాబు చూసింది. ఆ చూపే ఆనందీబాయి జీవితంలో గొప్ప మలుపుకు దారితీసింది.

వివాహ విషయంలో తానేమీ చేయలేకపోయినా ఆనందీబాయి అభిరుచి మేరకు ఆమె విద్యాభ్యాసానికి పూర్తిగా తోడ్పడాలని నిశ్చయించుకున్నాడు గోపాలరావ్ జోషి.

పదునాల్గేళ్ళ ప్రాయంలోనే ఆనందీబాయి మొదటి బిడ్డను ప్రసవించింది. సరైన వైద్య సౌకర్యాలు లేనందున కొద్ది రోజుల్లోనే బిడ్డ కన్ను మూసింది. ఆనందీబాయి తల్లడిల్లిపోయింది. తానొక డాక్టర్ కావాలని సంకల్పించింది.

ఆనందీబాయి ఆకాంక్షను గోపాలరావ్ బలపరచాడు. బొంబాయిలోని మిషన్ స్కూల్‌లో ఆమెను చేర్పదలచి బొంబాయికి బదిలీ చేయించుకున్నాడు. బొంబాయిలో హైస్కూలు చదువు పూర్తి అయిన తర్వాత భార్య ఆనందిని అమెరికాకు పంపి, డాక్టర్‌గా చూడాలని నిశ్చయించాడు.

'అమెరికన్ క్రిస్టియన్ రెవ్యూ'లో గోపాలరావ్ జోషి జాబును చదువుకున్న మిసెస్ కార్పెంటర్, ఆనందీ బాయిని సోదరిగా సంబోధిస్తూ అమెరికాకు రమ్మని వ్రాసింది. ఇరువురి మధ్య రెండేళ్ళ పాటు (1881-83) ఉత్తర ప్రత్యుత్తరాలు సాగాయి.

విదేశయానం తలపెట్టిన గోపాలరావు దంపతుల వద్ద వున్నది కేవలం ఎనభై డాలర్లు మాత్రమే. ఆనందీబాయిని మాత్రమే అమెరికాకు పంప నిర్ణయించాడు భారతీయ స్త్రీ ఒంటరిగా, అమెరికాకు వెళ్ళడమా? అని అందరూ ముఖ్యంగా సంప్రదాయ వాదులు

ముక్కు మీద వేలు వేసుకున్నారు. మిసెస్ కార్పెంటర్, ఆనందీబాయికి 'మౌసి' (పినతల్లి)గా మారింది. ప్రగతి శీలురు కొందరు ఆనందీబాయిని ప్రోత్సహించారు. "నేను అమెరికాలో వున్నా హైందవ మతాచారాలను కచ్చితంగా పాటిస్తాను" అంటూ ప్రమాణం చేసి తన విరోధుల నోరు మూయించింది ఆనందీబాయి.

1883 ఏప్రిల్ 7వ తేదీన కలకత్తా నుంచి 'సిటి ఆఫ్ కలకత్తా' అనే నౌకలో ఆమె ప్రయాణం సాగింది.

పెన్సిల్వేనియాలోని మహిళా వైద్య కళాశాలలో ఆనందీబాయికి ప్రవేశం లభించింది స్కాలర్‌షిప్ కూడా దొరికింది. కాని ఆమె జీవిత విధానంలో ఏమాత్రం మార్పు రాలేదు. అదే చీర కట్టు, బొట్టు సస్యాహారం.

శ్రీమతి కార్పెంటర్ ఆనందీబాయికి అన్ని విధాలా తోడ్పడింది. కొత్త ప్రపంచంలో ఎలా మెలగాలో నేర్పింది. నిజంగా ఆనందీబాయికి ఆమె 'మౌసీ'యే. ఆనందీబాయి రేయింబవళ్ళు అధ్యయనం చేసేది. ఆనందీ జీవన విధానాన్ని, అవిశ్రాంత అధ్యయనాన్ని గురించి, శ్రీమతి క్యారొలీన్ హేలిడాల్ "లైఫ్ ఆఫ్ ఆనందీబాయి జోషి" అన్న గ్రంథంలో విపులంగా చిత్రించింది.

1988 మార్చిలో గోపాలరావు జోషీ అమెరికా వెళ్ళాడు. తన ఆరోగ్యం పట్ల అంతగా శ్రద్ధ చూపనందున ఆనందీబాయి నానాటికీ అశక్తురాలవుతూ వచ్చింది. తన చదువు కేమాత్రం లోటు రానీయలేదు. 1886లో 'డాక్టర్ ఆఫ్ మెడిసిన్' పట్టా తీసుకుంది. 'అబ్‌స్ట్రెటిక్స్ అమంగ్ ది హిందూ ఆర్యన్స్' అన్న సిద్ధాంత గ్రంథానికి డాక్టరేట్ లభించింది.

స్నాతకోత్సవ సభలో భర్త గోపాలరావు జోషి హాజరు కావటం ఆమెకు అమితమైన ఆనందం కల్గించింది. అమెరికాలోని మెడికల్ కాలేజి నుండి పట్టా పుచ్చుకున్న ప్రథమ మహిళా భారతీయ డాక్టర్ ఆమె. ఆ సమావేశంలో పండిత రమాబాయి సరస్వతీ కూడా హాజై ఆనందీబాయిని ఎంతగానో ప్రశంసించారు. గోపాలరావ్ ఆనందానికి హద్దుల్లేవు.

భారతదేశ ప్రథమ మహిళా డాక్టర్‌ను అభినందిస్తూ, కొల్హాపుర్ మహారాజా ఆమెను తన సంస్థానంలోని అల్బర్ట్‌ఎడ్వర్డ్ మహిళా వైద్యశాల స్త్రీల విభాగానికి అధిపతిగా నియమిస్తూ ఉత్తర్వులు చేశారు.

1886 అక్టోబర్ 9న న్యూయార్క్ నుంచి జోషి దంపతులు స్వదేశానికి బయలుదేరారు. కార్పెంటర్ కుటుంబసభ్యులు, పండిత రమాబాయి (సంఘ సంస్కర్త, సేవకురాలు) వందలాది భారతీయులు జోషీ దంపతులకు వీడ్కోలు చెప్పారు.

అమెరికాలో వున్న చివరి దశలో ఆనందీబాయి క్షయరోగంతో బాధపడసాగింది. తన ఆరోగ్యాన్ని ఏ మాత్రం ఖాతరు చేయలేదామె. వర్ణ వివక్ష కారణంగా సముద్ర ప్రయాణంలో సరైన చికిత్స లభించలేదు.

1886 నవంబర్ 16న జోషి దంపతులు బొంబాయి చేరారు. దంపతుల చేత చిల్లి గవ్వ లేదు. ఎవరినీ యాచించలేదు. నౌకాయానం ఆమె జబ్బును మరింత

తీవ్రం చేసింది. బొంబాయి గవర్నర్ భార్య లేడి రే, పూనా నుండి లోకమాన్య తిలక్ ఆమెకు కొంత పైకం అందించారు.

మాతృదేశానికి డాక్టర్‌గా రావాలన్న కోరిక ఫలించింది. కాని ఆమె నానాటికీ కృశింపసాగింది. డాక్టర్ కావాలనుకున్న ఆనందీబాయి రోగిగా మారటం దురదృష్టకరం.

1887 ఫిబ్రవరి 26న భర్త ఒడిలో ప్రాణాలు వదిలింది. భావితరాల భారతీయ మహిళలకు ఆమె మార్గదర్శకురాలుగా వెలిగింది. అప్పటికామె వయసు కేవలం 22 ఏళ్ళు.

ఆం॥

★ ★ ★

# హిందూ ముస్లిమ్ మైత్రిని పెంచిన రాజులు

మహాపురుషుడు మహమ్మద్ ప్రవక్త (క్రీ.శ. 569 - 635) కలహ ప్రియులైన అరబ్బులలో అనైక్యతను రూపుమాపి సంస్కృతుల నొనర్చి అరేబియా దేశమున నూతన రాజ్యమును నెలకొల్పినవాడు. అతని తరువాత అతని అనుచరులు అర్థశతమానము లోపుగానే అట్లాంటిక్ సముద్రము మొదలుకొని సింధునదీ ప్రాంతము వరకు విస్తరిల్లిన విశాలమైన మత సామ్రాజ్యమును నెలకొల్పినారు. తాము ఆక్రమించిన దేశీయుల మతమును ఆచారములను మన్నించి ఆదరించినారు.

మహమ్మద్‌బిన్ ఖాశిం అను వీరుడు క్రీ.శ. 712లో సింధునదీ ప్రాంతమును మహమ్మదీయ సామ్రాజ్యాంతర్గత మొనర్చుకొన్నాడు. శూరుడైన ఖాసిమ్ భారతీయుల నేమాత్రము హింసింపక తాను జయించిన రాజ్య పరిపాలనా భారమును వారి కప్పగించి హిందువుల దేవాలయముల సంరక్షణై ఆదాయమునందు 3వ శాతము వినియోగించునట్లు ఏర్పాటు చేశాడు.

## గజినీ మహమ్మద్

సోమనాథ దేవాలయమును కొల్లగొట్టిన గజినీ మహమ్మద్ దండయాత్రల మూలకారణము ధనసంచయనమే కాని మతద్వేషము కాదు. విదేశీయులను దోచి స్వదేశమును స్వర్గతుల్య మొనర్చుటయే అతని పరమ కాంక్ష. మన దేశమును దోచిన రీతిగనే సోదర మహమ్మదీయ దేశములగు ఖురాసాన్ తుర్కిస్తాన్‌లను కూడ దోచుకొన్నాడు.

భారతదేశ మందలి దేవాలయములు, ధనాగారములనుట విని, వాటిని కొల్లగొట్ట సాగినాడు. అతడు బలవంతముగ ఒక్క హిందువు నైనను మహమ్మదీయ మతమున జేర్చుకొనలేదు. అతని సైన్యములో అనేక రాజపుత్ర వీరులు కూడా వుండిరి. వీరికై ప్రత్యేకముగ తన రాజధానియైన గజినీలోనే దేవాలయముల నిర్మింపజేసెను. "తిలక్" అను హిందూ సేనాపతి ఆధ్వర్యముననే ముస్లిమ్ తిరుగుబాటు దార్లను అదుపులో పెట్టగలిగాడు.

బానిస వంశపు రాజులలో పేర్కొనదగిన వాడైన బాల్బను 40 సం॥ ముల కాలము తన రాజ్యమును అతి సమర్థతతోను సర్వజనరంజకముగను పాలించెను.

అల్లావుద్దీన్ ఖిల్జీ నిర్దయుడు, హిందూమత ద్వేషి అని మన చరిత్ర పాఠ్యగ్రంథములలో చిత్రింపబడి యుండుట సత్య దూరమని చెప్పవచ్చును. మత మౌఢ్యులగు మౌల్వీల ప్రభావమునకు గురికాక నిష్పక్షపాతముగ పరిపాలన సాగించినవాడు అల్లావుద్దీన్.

# మహమ్మద్ బిన్ తుగ్లక్

అల్లావుద్దీన్ తరువాత అతి విమర్శకు గురియైనవాడు మహమ్మద్ బిన్ తుగ్లక్. తుగ్లక్ పండితుడే కాక, ఉదార శీలుడగు సాధు స్వభావుడు. అతనిని పిచ్చివాడని పేర్కొనుట అర్థరహితము. పైపెచ్చు అతని తండ్రిని చంపి రాజ్యమును ఆక్రమించినాడని కొందరు చరిత్రకారులు పేర్కొనుట సత్య విరుద్ధమన వచ్చును జనని పదతలముననే స్వర్గమును కాననగు నన్న పరమధ్యేయముతో నెలకొకమారు తన తల్లిని సింహాసనాసీనురాలి నొనర్చి, అతడు తన అనుయాయులతో సహా ఆమెకు మోకరిల్లుచుండెడివాడు. ఇట్టి మాతృసేవా పరాయణుడు తన తండ్రిని హత్యచేసినాడనుటెట్లు? (స్టాన్లీలేన్ పూల్ - మిడీవల్ ఇండియా, 25వ పేజీ)

ఇతడు చైనా, పర్షియా దేశములపై దండయాత్ర సాగించినాడనుట అబద్ధము నేపాల్ దేశముపై దండయాత్ర సాగించి కొంత భూ భాగమును ఆక్రమించినది వాస్తవము. పర్షియా రాజవంశీయులలో పరస్పర యుద్ధము సంభవించినపుడు ఒక వర్గము వారు తుగ్లక్ సహాయ మర్థింప వారి కొరకై కొంత సైన్యమును సేకరించినది వాస్తవము కాని ఇది కేవలము నష్టదాయకమని పునర్నిర్ణయించి సహాయమును నిరాకరించినాడు (Dr Agha Mahadi Hussain's Rise & fall of Mohmed Bin Tughlak).

పన్నులను పెంచి, యివ్వజాలని ప్రజలను వేటాడి, చిత్రహింసలకు గురిచేసినట్లు కట్టుకథ యొకటి యితనికి అంటగట్ట బడినది. ఉద్యోగులు అధికార దుర్వినియోగ మొనర్చి రైతులను బెదిరించి యుండవచ్చును. కాని ప్రజలు క్షామపీడితులైనప్పుడు ఆరు మాసముల పర్యంతము అన్న వస్త్రములిచ్చి ఆదరించిన వాడు తుగ్లక్. రాజధానిని ఢిల్లీనుండి దేవగిరి మార్చుటను గురించి ప్రసంగము విపరీతార్థమునకు గురియైనది. దేవగిరి తన రాజ్య కేంద్రస్థానమున నుండుటబట్టి రాజధానిని ఢిల్లీనుండి తరలించుటలో అసంగత మేమీలేదు. కాని ఢిల్లీ ప్రజల నందరిని దేవగిరి వెళ్ళునట్లు ఆజ్ఞాపించె ననుట అసత్యము. ప్రభుత్వోద్యోగులను వెళ్ళమని శాసించినది వాస్తవమే. కొద్ది రోజుల తర్వాత ముస్లిమ్ మత గురువులను కూడా దేవగిరికి వెళ్ళునట్లు ఆజ్ఞాపించినది నిజమే కాని ఢిల్లీ ప్రజలందరు పిల్లామేకతో వెళ్ళునట్లు ఆజ్ఞాపించెననుట అసత్యము. కుంటివానినొకనిని ఏనుగు కాళ్ళకు కట్టి లాగించిరనుట కేవలము కల్పిత కథ.

తుగ్లక్ అర్థశాస్త్ర ప్రవీణుడు-శుద్ధమైన బంగారు, వెండి, రాగి నాణెములను తన టంకశాలలో తయారు చేయించెను. కాని రాగి నాణెముల కొరత ఏర్పడినప్పుడు బంగారు నాణెముల స్థానే రాగి నాణెములనే జారీ చేయించెను. అప్పట్లో, చైనా దేశములో, నేటి వలె కరెన్సీ నోట్లు జారీలో వుండెను. రాగి నాణెములు విరివిగా లభించుటను బట్టి దొంగతనముగా రాగినాణెముల తయారు హెచ్చయ్యెను. ఈ దొంగనాణెముల నరికట్టుటలో తుగ్లక్ విఫలుడైనది వాస్తవము.

కాని తుదకు రాగి నాణెముల ఉల్బణము కారణముగ ధరలు పెరిగే టప్పటికి రాగి నాణెముల బదులు బంగారు నాణెములనే పంచి పెట్టెను.

వ్యాపారాభివృద్ధికీ, ప్రజా సౌకర్యానికి అనువుగ గుఱ్ఱములపై తపాలా బట్వాడాకు ఏర్పాటు చేసినవాడుతుగ్లక్. న్యాయ పక్షపాతి. న్యాయనిర్ణయమున రాజు - పేదా అను వ్యత్యాసమున కెడమివ్వకూడదని అతని శాసనము. ఒకసారి ఒక బీదవాడు చక్రవర్తి పై ఫిర్యాదు చేయగా తుగ్లక్ సామాన్య మానవునివలె న్యాయస్థానమున హాజై న్యాయమూర్తి విధించిన శిక్షను స్వీకరించెను. న్యాయబుద్ధిగల యిట్టి చక్రవర్తులు చరిత్రలో కోటికొక్కరిని పేర్కొనవచ్చును.

తుగ్లక్ తత్వ శాస్త్రాభిమాని. వివిధ మతములను సమాన దృష్టితో చూచేవాడు. వేదాంత గోష్ఠిలో పాల్గొనడమంటె అతనికి మిక్కిలి యిష్టము. సూఫీతత్వ శాస్త్రజ్ఞులనేకులు యితని ఆశ్రయమున వుండినారు. సున్నీ వర్గమునకు చెందిన బరాని మొదలగు వారికి యితడంటే గిట్టేదికాదు. అక్బరు "దీన్ ఇ లాహి" మతస్థాపనకు ముఖ్య ప్రేరకుడితడే.

సికిందరు లోడి తన రాజ్య పరిపాలనా యంత్రాంగ మందలి కీలక స్థానములన్నిటిలో హిందువులనే నియమించెను. ఇతని మంత్రిమండలి సభ్యులందరూ హిందువులుగ నుండినది గమనార్హము.

## బాబరు

ముస్లిమ్ సామ్రాజ్య విచ్ఛిత్తితో హిందూ అధికారుల పంట పండినది. మంత్రులు, సేనాపతులు, సలహాదారులుగ వుండినవారు; చిన్న రాజ్యముల నేర్పరచుకొనిరి. వంగదేశ సుల్తానులు అధికార నిర్వహణ బాధ్యత లన్నిటిని తమ ప్రధానులకు, అమాత్యులకు అప్పగించి, నామమాత్ర పరిపాలకులుగా వుండిరి. 'సత్యాపీర్' అను నూతన మతము ప్రాదుర్భవించినది. బెంగాలీ భాషలో రామాయణ, భాగవతాలు అవతరించినవి. దక్షిణ దేశమున బీజాపూర్, గొల్కొండ మొదలైన రాజ్యములలో పరిపాలనా భారమంతయు హిందువుల హస్తగతమై యుండెడిది. మొగల్ సామ్రాజ్య స్థాపనతో హిందూ, ముస్లిమ్ మైత్రికి మరింత పుష్టి లభించిన దనుటకేమాత్రము సందేహము లేదు. తన రాజ నీతికి ఆధారాన్ని వివరిస్తూ బాబరు తన వీలునామాలో "ఈ భారతదేశం హిందువుల మయము. వీరిని బెదిరించి వశీకరణమొనర్చుకొనుట అసాధ్యము. వారిమనస్సు నాకర్షించుటకై గోహత్యను నిషేధించు. హిందూ నాయకులను గౌరవించు. వీటితో మన రాజ్యానికి సుస్థిరత ఏర్పడగలదు." అని వ్రాసి ప్రియపుత్రుడైన హుమాయూను కందజేశాడు. (The Will and Testament of Zaluluddin Mahamad Babar Padsha, Quarterly journal of Mythic Society Vol XVIII Page 116)

బాబరు తర్వాత షెర్షా, హిందూ - ముస్లిమ్ మైత్రికి మిక్కిలి దోహదమొనగెను. హిందూ ముస్లిములనేక రీతిగ గౌరవించెను.

రాజాతోడరుమల్లు వంటి అర్థశాస్త్రజ్ఞుని సలహా ననుసరించి నాటి వ్యవసాయ రంగమున మిక్కిలి కృషిసల్పెను. రాజశాసనములు, సంస్కృతము, పర్షియన్ భాషలలో జారీచేయబడెడివి. షేర్షారాజ్యపరిపాలనాకాలము కొద్దియైనను పరిపాలనా వ్యవస్థలో అతడు కావించిన కృషి అత్యమోఘము కావడముతో అక్బరు చక్రవర్తి వాటిని అనుసరింపసాగెను. అక్బరు మనదేశ చరిత్రలోనే అద్వితీయు డనతగినవాడు. అర్థశతమానము సాగించిన AD. 1556-1605 ఈతని పరిపాలనా కాలమున, హిందూ ముస్లిమ్‌ల పరస్పర స్నేహసంబంధాలు, సుసంఘటితమైనవి. సర్వధర్మ సమన్వయము సాధింప నిశ్చయించి నెలకొల్పిన 'దీన్ ఇలాహి' మతము సంకుచిత ప్రజల మధ్య నిలువలేకపోయినది.

జహంగీరు చక్రవర్తి అక్బరు పాదుషా అడుగుజాడల్లోనే నడుస్తూ తన నిష్పక్షపాతమైన న్యాయ నిర్ణయమునకు పేరెన్నిక గాంచినవాడు. హిందూ సన్యాసి 'యాదవరూప్' జహంగీర్ పాదుషాకు అత్యంత ఆప్తుడు. కన్నకొడుకే తండ్రితో మాట్లాడుటకు వెనుకంజవేయగ చక్రవర్తితో అతి చనువుగ వర్తించుచుండిన హిందూ సన్యాసి యాదవరూప్.

మొగలు చక్రవర్తులందరిలో షహజహాన్ యొక్క కళాభిరుచి పేర్కొనదగినది ఉర్దూ-సంస్కృత భాషలను భోజరాజు వలె పోషించిన మహనీయుడు. "ఢిల్లీశ్వరో వా జగదీశ్వరో వా" అని పండితరాయల ప్రశంస లందుకొన్నవాడు. రాయ్‌బడామల్ అను హిందూ చరిత్రకారుడు కూడ షహజహాన్ యొక్క ప్రజా ప్రేమనూ, న్యాయైక పక్షపాతమును, రాజనీతిజ్ఞతను గురించి మిక్కిలిగ ప్రశంసించినాడు. (Medieval India, Stanley Pool-Page 110)

## ఔరంగజేబు

మొగల్ చక్రవర్తులందరిలో ఔరంగజేబును గురించి భిన్నాభిప్రాయము లెక్కువగ వున్నవి. ముస్లిములు యితని నొక సాధువుగా తలచిన, హిందువులు రాక్షస ప్రవృత్తి గలవాడని తలచినారు. ఔరంగజేబులో హిందువులపై అసూయ ఆకస్మికముగ పొడసూపినది కాదు. పట్టాభిషిక్తుడైన తరువాత పదేళ్ళపాటు హిందువుల రక్షణకై మిక్కిలిగ యత్నించెను. కాశీవిశ్వేశ్వరాలయము యొక్క ఆస్థిపాస్తుల రక్షణకై అర్చకులకు అభయపత్ర మొసగెను. కాని కాలక్రమమున మూర్ఖులగు మత వాదుల దుర్బోధలకు తలయొగ్గెను. జిజియాపన్ను విధించెను. అజ్ఞులైన అనుచరులు కొందరు చేసిన అవకతవకలవల్ల ఔరంగజేబు అపకీర్తికి గురి యయ్యెను. వ్యక్తిగతముగ ఔరంగజేబు హిందువులను ద్వేషింపలేదు. రాజపుత్రవీరులెందరో యితని సైన్యమున వుండిరి. ఇతని ఆంతరంగిక కార్యదర్శి "వాలిరామ్" హిందువు. ఆర్థిక మంత్రులలో ఒకడైన "రఘునందనరాయ్" హిందువు. అనుమానవశుడై తన సంతానాన్ని కూడా విశ్వసింపనందున వారు కొందరు ముస్లిమ్ సేనాపతుల సాయముతో ఔరంగజేబును ఎదిరించి స్వరాజ్యస్థాపనాయత్తులైరి. ఔరంగజేబు రాజ్యమును నిర్మూలింప నుద్యుక్తులైనవారు హిందువులు మాత్రమే అనుట అసత్యము.

మహారాష్ట్రులు కావించిన యుద్ధములు ఆత్మగౌరవాన్ని పురస్కరించుకొని సాగినవి. చాళుక్య చక్రవర్తియైన రెండవ పులికేశి ఉత్తర దేశీయుడైన హర్షుని ఓడించినట్లే దక్షిణ దేశీయులైన మహారాష్ట్రులు ఢిల్లీ రాజుల నెదుర్కొని స్వరాజ్యస్థాపన గావించిరి. షహజీ, ముస్లిమ్ రాజుల ఆశ్రయమున పెరిగినవాడు. అహమద్ నగర రాజ్యరక్షణకై షహజీ చేసిన కృషి మొగలుచక్రవర్తుల ఆట కట్టించినది బీజపురమునకు చెందిన ఆలీ అదిల్‌షా రాజ్య సుస్థిరతకు మూలపురుషుడు షహజీ భాన్‌స్లే. అతడు షాషరీఫ్‌జీ అన్న ముస్లిమ్ సాధువు యొక్క వరసంజాతుడు.

జగద్విఖ్యాతుడైన ఛత్రపతి శివాజి, హిందువులు మసీదులపట్ల భక్తి గౌరవములు ప్రదర్శించు నట్లాజ్ఞాపించెను. (Medieval India, Stanly Lave Pool P128)ఖురాను గౌరవించునట్లు తన సైనికుల నాదేశించెను. మహారాష్ట్రరాజ్య యంత్రాంగమున ముస్లిం ప్రముఖులనేకు లుండిరి. శివాజీ రాజ్యస్థాపనకు మూల కారణము మతద్వేషము కాక రాజకీయ కారణములే ప్రధానమనుట మనము విస్మరింప రాదు. శివాజీ వంశీయుడైన సాహూజీ ఔరంగజేబుపట్ల భక్తి విశ్వాసములు గలవాడు.

పీష్వాలు మొగలు సామ్రాజ్య సాహాయ్యముతో ప్రముఖులైరి. ఢిల్లీ ప్రాంతమున జరుగుచుండిన దుండగుల దాడుల నెదుర్కొనుటలో బాలాజీ విశ్వనాథభట్టు మొగలు చక్రవర్తులకు మిక్కిలి సాయమొనర్చెను. ఇందుకు ప్రతిఫలముగ దక్షిణ దేశములో 'చౌత్' అను పన్ను వసూలుచేయు అధికార మొసగబడినది. నాదిర్‌షా ఢిల్లీపై దాడి చేసినపుడు ప్రథమ బాజీరావు వ్రాసిన జాబులో అతనికి మొగలు చక్రవర్తులపట్ల గల ఆదరాభిమానాలు ప్రత్యక్షమగుచున్నవి. (Muslim University Journal Oct 40 Page 73) పానిపట్టు యుద్ధమునకు మూలబీజము, మత ద్వేషము కాదు భారత స్వాతంత్ర్య రక్షణకై మహారాష్ట్రులకు విదేశీయులకు జరిగిన మొదటి స్వాతంత్ర్యయుద్ధ మనదగిన ఈ పోరాటములో ఇబ్రాహింఖాన్ గారడి మరియు ఆతని అనుయాయులు మహారాష్ట్రుల పక్ష మవలంబించి సమర భూమిలో అసువులు బాసినది విస్మరింపరాని ఘట్టము.

మహదాజి సింధియా, రాజ్యస్థాపనకు చేయూత నొసగిన వారు పెక్కురు ముస్లిం సేనా నాయకులు. నేటికిని సింధియారాజ వంశీయులు మొహరం ఉత్సవములలో పాల్గొను చుండుట వారి పరస్పర మైత్రికి నిదర్శనము. సిపాయి కలహమని చరిత్రలో పేర్కొనబడిన భారత స్వాతంత్ర్య సమరమున భారతీయులనేకులు మొగలు సామ్రాజ్య పునః స్థాపనమే ధ్యేయముగా గల వారనియు ముస్లింలు హిందువులు సమైక్యతతో ఈ ఉద్యమములో పాల్గొనిరనియు అప్పటి ఆంగ్ల ప్రముఖుల వ్రాతవల్ల స్పష్టమగుచున్నది. (Letters Written during mutiny. Lord Roberts P.30,65,98)

● దీపావళి సంచిక - క

★ ★ ★

# భారతదేశ చరిత్రలో హింస

భారతదేశం సత్యం, అహింస, శాంతి, సద్భావాలకు నిలయమని, సహనం, సహజీవనం భారతీయ సంస్కృతికి మూలాధారాలని చాటుకుంటున్నాం. సకలజీవుల పట్లకారుణ్యానికి, అహింసకు ఆటపట్టులైన జైన బౌద్ధాలు అవతరించిన దేశం భారతదేశం అంటున్నాం. ఈ ప్రకటనలు సత్యపూర్ణములు. మన వేదోపనిషత్తులు పవిత్రగ్రంథాలు జీవిత గమ్యాలను ఉద్ఘాటిస్తున్నాయి. ఇరవయ్యో శతాబ్దపు గొప్ప శాంతిదూతగా అభినుతింపబడిన గాంధీజి శాంతిసందేశం భారతీయ సాంస్కృతిక విలువలపై ఆధారపడిందే.

భారతదేశ స్వాతంత్ర్య సమరం గాంధీజి నేతృత్వంలో సాగింది. కాంగ్రెస్ సంస్థ అహింసాత్మక పోరాటానికి పిలుపు ఇచ్చింది. కాని బ్రిటిష్ వారిని ఎదుర్కొని సాగించిన సమరంలో హింస, హత్యాకాండ తగిన మోతాదులో సాగాయి. బ్రిటిష్ ప్రభుత్వ దమనకాండలో వేలాది ప్రజలు తుపాకి గుళ్ళకు బలి అయ్యారు. భారత స్వాతంత్ర్య పోరాటంలో మైలురాయిగా చెప్పుకోదగిన జలియన్‌వాలాబాగ్ హత్యాకాండ హింసాచర్యకు పరాకాష్టకదా? స్వాతంత్ర్యానంతర భారతదేశంలో కొనసాగుతున్న దౌర్జన్యవాదం, హింసాప్రవృత్తి, ఉగ్రవాదం మున్నగువాటి మధ్య సతమతమవుతున్న మనదేశాన్ని 'శాంతిధామం'గా పరిగణించడం ఎంతవరకు సబబుగా వుంటుందో మనం గమనించటం అవసరం.

1984లో ఇందిరాగాంధీ హత్యానంతరం గత తొమ్మిదేళ్ళలో హింసాకాండ పెరుగుతూనే వుంది. సామాజిక రాజకీయరంగాల్లో మతం చొచ్చుకొన్న కారణంగా పదవ లోక్‌సభల ఎన్నికల ముందు, అయోధ్యపరిణామాలు పంజాబ్, అస్సాం, కాశ్మీర్‌లలో ఉగ్రవాదులు సృష్టించిన హింసాకాండ మున్నగువాటి ఫలితమే రాజీవ్‌గాంధి హత్య.

భారతీయ సమాజంలో హింసా ప్రవృత్తి ఇలా విజృంభించడానికి కారణాలేవి? నేటి హింసావాదానికి సామాజిక, సాంస్కృతిక ఆధారాలేవి? ప్రాచీనకాలంలో కూడా రాజకీయ హత్యలు, రాజకీయాల్లో ప్రత్యర్థుల హత్యలు, భారతరాజకీయ చరిత్రలో భాగంగా వుండేవా? రాజకీయ హత్యలు జరిగినపుడు సమాజం ప్రతిఘటించిందా? రాజకీయ హత్యలు అనైతిక చర్యలని ఖండించిన వారులేరా?

భారతీయ సమాజం ఎన్నో మతాలు, వర్గాలు, జాతులు, ఉపజాతులతో కూడుకున్నది. తమతమ లక్ష్యాల సాధనకు విభిన్న మార్గాలను అనుసరిస్తూ వచ్చిన సమాజంలో అహింసాత్మక విలువలను ఎంత వరకు ఆదరిస్తారన్నది మనం పరిశీలించాల్సిన వాస్తవం. క్రీస్తుపూర్వం 6వ శతాబ్దంలోని మహావీరుడు, బుద్ధుడు - కల్లోల భారతంలో శాంతి, అహింసల సందేశం వినిపించారు. ప్రాచీన భారతదేశ చరిత్రలో ,సాంఘిక

పరమైన హింసాత్మకచర్యలెన్నో జరిగాయి. ప్రభుత్వమే హింసావాదాన్ని సమర్థించింది. చంద్రగుప్తుని ఆస్థానంలో మంత్రిత్వం నెరపిన కౌటిల్యుడు తన 'అర్థశాస్త్రం'లో, రాజు తన అధికారాన్ని సుస్థిరం చేసుకునేందుకు ఎటువంటి రాజకీయ హత్యలు చేయాలో చర్చించాడు. రాజకీయ శత్రువును ఏ విధంగా హతమార్చాలో తెలిపేందుకు మచ్చుతునక ఒకటి.

"శత్రువు దేవాలయం ప్రవేశించినపుడు, తాళ్ళతో బిగించి వుంచిన గోడను, లేదా బండరాతిని, సడలించడంతో, అది శత్రువు తలపై కూలునట్లు చేయాలి....లేదా గోడపైనున్న రాతిదూలం అతనిపై పడేటట్లు చేయాలి లేదా విగ్రహంలో దాచిన అస్త్రాలు అతడు తలవంచి ధ్యానం చేస్తున్నప్పుడు అతనిపై పడేటట్లు చూడాలి. శత్రురాజు సాధారణంగా కూర్చొని లేదా (నిలుచుండే) నిలుచుండే స్థలంలో శుభ్రమైన నీటిలో విషం కలిపి చల్లాలి. అతనికి పూలదండలు, పుష్పగుచ్ఛాలు సమర్పించు మిషతో విషమందించాలి. మంచముకోళ్ళు, విరిగిపోయేటట్లు ఆసనంలో కూర్చునేటపుడు కోళ్ళు విరిగిపోవునట్లు, వాటి అడుగున వాడిగల ఈటెల వలలో పడిపోవునట్లు చూడాలి. ఉగ్రవాదులైన గూఢచారులు నేలమాళిగల్లోనో, సొరంగాల్లోనో, దేవాలయాల్లోనో దాగివుండి, శత్రువు ఉద్యానవనాల్లో విహారం చేస్తున్నపుడు చంపవచ్చును. రహస్యంగా దాగుకున్న మహిళ విషాన్ని, లేదా మండేదివిటీని శత్రువు పై ప్రయోగించ వచ్చు...." నడుముకు బాంబు బెల్టును బిగించుకొని, రాజీవ్‌గాంధీని సమీపించి, బాంబును పేల్చి అతన్ని హతమార్చిన 'బాంబ్ మహిళ' థాను, పూమాల సమర్పించే మిషతో రాజీవ్‌గాంధీ పాదాలను స్పృశించింది. రాజకీయ హత్యలకుపక్రమించే భయానక తంత్రాలకు, ఆనాటి కౌటిల్యుని తంత్రాలకు ఎంత సాన్నిహిత్యం వుందో మనం గమనించాలి!

సాధారణమైన హత్యకూ, రాజకీయపరమైన హత్యకూగల వ్యత్యాసాన్ని చాణుక్యుడు గ్రహించాడు. మొదట హత్యకు గురికావలసిన వ్యక్తిని హత్యాస్థలం చేరుటకు విశ్వాసపూర్ణమైన వాతావరణం సృష్టించాలి. (పూలహారం సమర్పించాలని నటించి, థాను, రాజీవ్‌గాంధీ విశ్వసించే విధంగా, ఆమెను అనుమానించేందుకు ఆస్కారం లేకుండా) శత్రువుపై దాడి చేయాలి. రాజకీయ హత్య శత్రువర్గాల్లో భయోత్పాతం సృష్టించాలి.

హింసామార్గంలో, విశ్వాసద్రోహంతో హత్యలు జరిపి ధర్మస్థాపన జరపాలన్న ఆలోచన వుండినట్లు మన చరిత్ర చాటుతున్నది. ఇతర అసంఖ్యాకమైన హత్యలు జరిగిన విషయం భారతదేశచరిత్రలో విస్తృతంగా కనిపిస్తాయి.

భారతదేశ చరిత్రలో పలురాజకీయ హత్యలు జరిగాయి. కాలానుగుణంగా హత్యావిధానాలు కూడా మారాయి. హత్యల నేపథ్యంలోని క్రౌర్యం వంచనలను ఖండించినట్లు చరిత్ర తెలుపుతున్నది.

విషప్రయోగం ద్వారా శత్రువులను చంపటం చరిత్ర తొలి యుగంలో కానవస్తుంది విషప్రాశనం జరుతుందేమో అన్న అనుమానంతో రాజులు చాలా జాగ్రత్తగా వుండేవారు

పానీయాల ద్వారా విషప్రాశనం జరుగుతుందేమో నన్న భయంతో ముందు జాగ్రత్త చర్యగా వ్యక్తులను నియోగించేవారు.

పితృ హత్యలు మన చరిత్రలో కనిపిస్తాయి. బుద్ధుని సమకాలికుడైన బింబిసారుణ్ణి అతని కుమారుడు అజాతశత్రు క్రీ.పూ. 493లో చంపాడు.శ్రీలంక పరంపరమేరకు బింబిసారుని ఉత్తరాధికారులు అయిదుగురూ తమ తండ్రిని చంపిన వారే.

తన తండ్రి హత్యకు ప్రతీకారంగా చంద్రగుప్తమౌర్యుడు నందుల చివరిరాజును క్రీ.పూ. 321లో చంపి మగధ సింహాసనం వశపరచుకొన్నాడు. సంగవంశీయుడైన పుష్యమిత్రుడు క్రీ.పూ. 180లో మౌర్యవంశరాజును చంపాడు.

సుల్తానుల పాలనలో (13 నుండి 16వ శతాబ్దం) అనేక రహస్య హత్యలు రాజకీయ హత్యలు జరిగాయి. "తఖ్-యా-తఖ్తా" (సింహాసనం లేదా శవపేటిక) అన్నదే ఆనాటి రాజనీతి. ఆ కాలంలో జరిగిన రాజకీయ హత్యలలో పేర్కొనదగింది - క్రీ.శ 1296లో జరిగిన జలాలుద్దీన్ ఖిల్జీహత్య. అతని అల్లుడు అల్లాఉద్దీనే ఈ హత్యచేశాడు. వృద్ధుడైన జలాలుద్దీన్ అల్లుడ్ని కౌగలించుకొని ముద్దాడుతున్నప్పుడు మామగారిని వెన్నుపోటు పొడిచాడు. అల్లాఉద్దీన్ ఖిల్జీ క్రీ.శ. 1316లో ఆయన సేనాపతి విషప్రయోగం జరపడం వల్ల మరణించాడు.

ఔరంగజేబు తన సోదరులైన దారాషుకో మురాద్ బక్ష్ మరియు షూజాం పట్ల క్రూరంగా వ్యవహరించాడు.

తన అధికారం పదిలపరచుకోవటానికి రాజులు మత నాయకులను చంపించారు ఇద్దరు శిఖ్ గురువులను కారాగారంలో బంధించి ఆ తర్వాత చంపివేయవలసిందిగా మొఘల్ చక్రవర్తి ఆజ్ఞాలను జారీ చేశాడు. ఇవి రాజకీయ హత్యలనలేము. క్రీ.శ. మొదటి శతాబ్దంలో క్రైస్తవ మత ప్రచారకుడుగా వచ్చిన సెంట్ థామస్‌ను నేట్ సెంట్ థామస్‌మౌంట్ అన్నచోట హత్య చేశారు.

1905 తర్వాత భారత ప్రజలను అన్యాయంగా బాధిస్తున్న బ్రిటిష్ అధికారులను బెంగాల్ కు చెందిన విప్లవ వీరులు చంపారు. 1905 లో ముజఫర్‌పూర్‌లో న్యాయమూర్తి కింగ్స్ ఫర్డ్ ప్రయాణం చేస్తున్న గుర్రపుబండిపై ప్రపుల్ల చాకీ, ఖుదీరామ్ బోసులు బాంబులు వేసి హతమార్చటంతో రాజకీయ హత్యలు ప్రారంభమైనాయి.1912 లో ఏనుగుపై ఊరేగుతున్న వైస్రాయ్ లార్డ్ హార్డింజ్‌ను చంపేందుకు రాస్‌బిహారి బోస్ మరియు సచిన్ సన్యాల్ విఫలయత్నం చేసారు. 1909 లో మదన్‌లాల్ ధింగ్రా బ్రిటిష్ అధికారి కర్జన్ వైలిని హతమార్చాడు. 1909 లో తిరునల్వేలి కలెక్టర్ ఆష్‌ను వాంఛి అయ్యర్ తుపాకీతో కాల్చి చంపాడు. 1928 డిసెంబర్‌లో ప్రముఖ జాతీయ నాయకుడు లాలాలజపత్‌రాయ్‌గారి మరణానికి ప్రతీకారంగా ప్రముఖ పంజాబ్ నాయకులు భగత్ సింగ్, చంద్రశేఖర్ ఆజాద్, మరియు రాజ్‌గురులు లాలాజీ పై దారుణంగా లాఠీ చార్జీ చేసిన పోలీస్ అధికారి సాండర్స్‌ను హత్యచేశారు బ్రిటిష్ ప్రభుత్వం ఈ దేశభక్తులను ఉరితీసింది.

బెంగాల్‌లో విప్లవకారులు విజృంభించి కలకత్తా పోలీస్ అధికారి ఛార్లెస్ టగార్ట్‌ను చంపాలని యత్నించి పొరపాటున మరో బ్రిటిష్ అధికారిని చంపారు. స్నాతకోత్సవ సభలో బీనాదాస్ అను విద్యార్థిని గవర్నర్‌పై గురిపెట్టింది. అయితే గురి తప్పింది, గవర్నర్ బ్రతికిపోయాడు. ఒకప్పుడు పంజాబ్ గవర్నర్‌గా వుండిన మైకేల్ ఒడయార్‌ను 1940లో లండన్ సభలో ఉద్దామ్‌సింగ్ కాల్చి చంపాడు. ఆ తర్వాత ఉద్దాంసింగ్‌ను ఉరితీశారు.

జాతీయోద్యమ కాలంలో విప్లవవీరులకు ప్రజాసహకారం అంతగా లభింపలేదు. ఈనాడు హింసావాదాన్ని ఖండించే శక్తులు పెరిగాయి. ఇందిరాగాంధి హత్య. రాజీవ్ గాంధీ హత్యలను ప్రపంచ దేశాలు ఖండించాయి. సానుభూతి వెల్లువలుగా ప్రకటితమైంది. మనిషి జీవితం ఇంకా విలువైనదేనన్న విశ్వాసం వల్లనే హింసావాద ఖండనం పుంజుకుంటున్నది.

## భారతదేశంలో జరిగిన ప్రముఖ రాజకీయ హత్యలు

| సం॥ | చచ్చినవారు | చంపినవారు | చంపిన తీరు |
|---|---|---|---|
| 1. క్రీ.పూ.493 | బింబిసారుడు | అజాతశత్రువు | తెలియదు |
| 2. క్రీ.పూ.321 | ధననందుడు | చంద్రగుప్తమౌర్యుడు | తెలియదు |
| 3. క్రీ.శ.1206 | మహమద్ ఘోరి | ఖోఖర్ ఆదివాసుల బృందం | తెలియదు |
| 4. క్రీ.శ.1296 | జలాలుద్దీన్ ఖిల్జీ | అల్లాఉద్దీన్ ఖిల్జీ | వెన్నుపోటు పొడిచాడు |
| 5. క్రీ.శ.1316 | అల్లాఉద్దీన్ ఖిల్జీ | మల్లిక్‌కాఫర్ | విష ప్రాశన |
| 6. క్రీ.శ.1316 | మల్లిక్‌కాఫర్ | --- | --- |
| 7. క్రీ.శ.1325 | ఘియాజుద్దీన్ తుగ్లక్ | అతని కొడుకు మహమద్‌బిన్‌తుగ్లక్ (అనుమానితుడు) | ద్వారబంధం పడేటట్లు చేసి |
| 8. క్రీ.శ.1560 | బైరామ్‌ఖాన్ | ముబారక్‌షా | --- |
| 9 క్రీ.శ 1602 | అబుల్ ఫజుల్ | జహంగీర్ ఆదేశంపై | తలనరికి |
| 10. క్రీ.శ.1621 | ఖుస్రూ (షాజహాన్ తమ్ముడు) | షాజహాన్ ఆజ్ఞ | గొంతు నులిమి |
| 11. క్రీ.శ.1908 | కింగ్స్‌ఫర్డ్ (విఫలయత్నం) | ఖుదీరాంబోస్ ప్రఫుల్లచాకీ | బాంబు విసిరి |
| 12. క్రీ.శ.1908 | దేశభక్తులకు వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పిన నరేంద్రగోస్వామి | కన్నయ్య లాల్ | తుపాకీగుళ్ళు |
| 13. క్రీ.శ.1909 | నాసిక్‌జిల్లా మేజిస్ట్రేట్ జాక్సన్ | అనంతకృష్ణన్ | తుపాకి గుళ్ళు |

| సం॥ | చచ్చినవారు | చంపినవారు | చంపిన తీరు |
| --- | --- | --- | --- |
| 14. క్రీ.శ.1909 | తిరునల్వేలి జిల్లా మేజిస్ట్రేట్ ఆష్ | వాంచిఅయ్యర్ | తుపాకి గుళ్ళు |
| 15. క్రీ.శ.1909 | సర్ కర్జన్ వైలి | మదన్‌లాల్ ధింగ్రా | తుపాకిగుళ్ళు |
| 16. క్రీ.శ.1912 | పోలీస్‌ఆఫీసర్ డెన్హామ్ | ఎన్. ముఖర్జి | బాంబువేసి |
| 17. క్రీ.శ.1912 | వైస్‌రాయ్‌పై దాడి లార్డ్‌హార్డింజ్ | రాష్‌బిహారిబోష్ | బాంబువేసి |
| 18. క్రీ.శ.1929 | సాండర్స్ | భగత్ సింగ్, రాజగురు, చంద్రశేఖర్ ఆజాద్ | బాంబావేసి |
| 19. క్రీ.శ.1930 | జైలు అధికారి సింప్సన్ | వినయ్, బాదల్ గుప్త. ధినేష్‌గుప్త | తుపాకిగుళ్ళు |
| 20. క్రీ.శ.1932 | కొమిలా పోలీస్ అధికారి ఎలిసన్ | శైలేశ్ రే | తుపాకిగుళ్ళు |
| 21. క్రీ.శ.1941 | జనరల్ డైయర్ | ఉద్దామ్‌సింగ్ | తుపాకిగుళ్ళు |

విశాలాంధ్ర

★ ★ ★

# శృంగేరి జగద్గురువులకు హైదరాలి - టిప్పు సుల్తానులు వ్రాసిన చారిత్రక పత్రాలు

హైదరాలి - టిప్పుసుల్తానుల గురించి బ్రిటిష్‌వారు రాసిన చరిత్రనే వాస్తవమని భావించాం. ఆంగ్ల చరిత్రకారులు తమ రాజకీయ విరోధుల గురించి రాసిన వాటిలో నిష్పాక్షికత లోపించిందని నిరూపించుటకు సాక్ష్యాధారాలు లభించాయి. టిప్పు సుల్తానులు రాసిన 50 జాబులు ఈ సత్యాన్ని నిరూపిస్తున్నాయి. శృంగేరి పీఠంలోని పత్రాగారంలోని ఈ జాబులు 1768 నుండి 1799 వరకు సుల్తానులిద్దరు నరసింహ భారతీతీర్థస్వామి మరియు సచ్చిదానంద స్వామి వారికి రాసినవి.

ఈ జాబులు హైదరాలి - టిప్పుసుల్తానుల పరమత సహిష్ణుతకు సాక్ష్యంగా వున్నాయి.

అయోధ్యలో జరిగిన విధ్వంసకాండ దేశంలో అనైక్యతకు, అరాచకశక్తుల విజృంభణకు దారితీసిన విపత్కర పరిస్థితులలో ఈ జాబులు వెలుగు చూపిస్తాయి. మన రాజకీయ నాయకులు, సంఘవిద్రోహులు ఈ జాబులను చదివితీరాలి.

"తృతీయ శ్రీ సచ్చిదానంద స్వామీజీవారికి టిప్పుసుల్తాన్ బాద్‌షా గారి సలామ్.

గురుద్రోహ, దైవద్రోహ, ప్రజాద్రోహము చేసిన వారికి శాపం తప్పదు నరసింహశాస్త్రిగారి ద్వారా పంపిన జాబు చేరిన విషయం. ఈశ్వరానుగ్రహంతో ద్రోహుల వంశం క్షీణిస్తుంది. ద్రోహం చేసినవారు నశించునట్లు శ్రీవారు ఈశ్వరధ్యానం చేయవలెనని సుల్తాన్‌గారి కోరిక" (టిప్పుసుల్తాన్ బాద్షా: మహమ్మద్ 1219 శోభకృతు 1791)

1792లో శృంగేరి జగద్గురు శ్రీ సచ్చిదానందస్వాముల వారికి టిప్పుసుల్తాన్ రాసిన జాబు. ఇదొక్కటేకాదు. హైదరాలి మరియు టిప్పుసుల్తానులు శృంగేరి జగద్గురువులకు 1768 నుండి 1799 వరకు రాసిన 50 జాబులు ప్రస్తుతం శృంగేరి మఠానికి చెందిన పత్రాగారంలో వున్నాయి. వాటిలో నాలుగు హైదరాలి జాబులు. తక్కినవి టిప్పుసుల్తాను రాసినవి.

శృంగేరి పీఠం యొక్క సాంస్కృతిక, ధార్మిక విశిష్టతను గుర్తించి ప్రస్తుత జగద్గురువులైన శ్రీ భారతీతీర్థస్వామి వారి దర్శనార్థం వెళ్ళిన - తరంగ - కన్నడ వార పత్రిక ప్రతినిధి శ్రీ నరేంద్ర రైదేర్లగారికి శృంగేరి క్షేత్ర కార్యనిర్వహణాధికారి శ్రీ గౌరీశంకర్ 2వందల సంవత్సరాల నాటి అపూర్వమైన లేఖలను చూపించారు. వందలాది రాజుల లేఖల్లో సుల్తానులు రాసిన లేఖలు, గత శృంగేరి పీఠం

హిందూముస్లిముల సామరస్యానికి కేంద్రంగా వుండినట్లు చాటుతున్నాయి. ఆనాటి సామరస్యం నేటి విషాదభారతదేశానికి శాంతిసందేశాన్ని అందిస్తుంది.

ఆ నాడు హైదరాలి - టిప్పుసుల్తానులు రాసిన ఒక్కొక్క జాబు, నేడు మందిరం - మసీదుల పేర జరుపుతున్న వికారచేష్టలకు గుణపాఠం నేర్పుతాయి. సమస్యల సుడిగుండంలో చిక్కుకున్న సమకాలీన సమాజానికి కొత్త చారిత్రక సాక్ష్యాలను చూపుతున్నాయి. సమైక్యతా బంధాలను కల్పిస్తాయి. స్వార్థ రాజకీయ వాదులు ఈ జాబులను తప్పక చదవాలి.

హైదరాలి - టిప్పుసుల్తానులు ఎలా జీవించారు? ఏమి సాధించారు. ఎలా మరణించారు? అన్న విషయాలు ముఖ్యంకాదు. వారి జీవితాలు పరస్పర వైరుధ్యాల పుట్టలు అన్న అవాస్తవిక తార్కిక వాదనలను అటుంచి, వారు వదలివెళ్ళిన లిఖిత పూర్వకమైన ఆధారాలను పరిశీలించటం ముఖ్యం. ముస్లింరాజులిద్దరు జగద్గురువులకు రాసిన లేఖలు వారి సౌహార్దమును ప్రకటిస్తున్నాయి.

ఈ లేఖలు హైదరాలి, టిప్పుసుల్తానులు నేరుగా జగద్గురువులకు, స్థానిక అధికారులకు, అమల్దార్‌లకు (తహసీల్ దార్లకు) ధర్మాధికారులైన వేంకట శాస్త్రిగారికి రాశారు. వీనిలో ఉభయపక్షాలవారి క్షేమ సమాచారాలు, సలహాలు సమాలోచనలు, రహస్యసమాచారాలు, జ్ఞాపనా పత్రాలు, విగ్రహప్రతిష్ఠాపనలు, ఆశీర్వాద విన్నపాలు, అగ్రతాంబూలం, కానుకలు, బందోబస్తు ఏర్పాట్లు - రహదారి పత్రాలు - ప్రధానమైనవి.

జాబుల్లోని ఉద్దేశాలు, అంశాలు ప్రధానంగా ఇలా వున్నాయి.

జగద్గురువుల నుండి ఆశీర్వాద పత్రికలు మరియు ఉడుగరలు (కానుకలు) అందుకున్న వార్త

జగద్గురువులకు ఏనుగు, గుర్రము, పల్లకి, శాలువ, నిధి సమర్పణ.

శృంగేరికి, అచటి ప్రజలకు, గురువులకు శత్రువుల నుండి కలుగు ఇబ్బందులను తొలగించి దుండగులకు శిక్ష విధించు విషయం.

శారదాంబ విగ్రహాపునః ప్రతిష్ఠ

మఠానికి చెందిన బ్రాహ్మణ గురువులు, శిష్యులు మఠాలకు వెళ్ళివచ్చునపుడు ఎటువంటి అవరోధాలు లేకుండా కాపాడుట, శృంగేరి మఠం నుండి ప్రసాదం. చేరిన విషయం.

శారదాంబకు చీర రవికెల కానుక. మఠానికి చెందిన ఆస్తిని తస్కరించిన దొంగలు నాశనమగునట్లు ఈశ్వరుని ప్రార్థించుట.

శతచండి, సహస్రచండీయాగాలు జరుపుటకు ఏర్పాట్లు.

బ్రాహ్మణ సంతర్పణ, దక్షిణ వినియోగం, గురువుల వారి సంచారానికై పల్లకి పంపుట, వారు ప్రయాణము చేయు రహదారిపై బందోబస్తు ఏర్పాటు గురించి అమల్దారులకు తాఖీదు, స్వామి వారి సముద్ర స్నానానికి ఏర్పాటు, జగద్గురువులు ప్రయాణము చేయునపుడు శ్రీరంగపట్నమునకు వచ్చి దర్శన భాగ్యం కల్పించి, నంజనగూడులోని నంజుండేశ్వర స్వామి దర్శనము చేసుకొని వెళ్ళునట్లు విన్నపం.

శృంగేరిలో అన్నసత్రం నిర్వహణ. ఉత్సవాల ఏర్పాట్లు.

మఠం చెల్లించవలసిన ధాన్యం వెల, వడ్డీ చెల్లింపు వగైరా.

స్ఫటికలింగ, శివలింగముల సమర్పణ దసరా తర్వాత దర్శనానికి అనుమతి

చండీయాగము చేయుటకు కావలసిన ఏర్పాట్లు.

1791 లో మరాఠా సేనాపతి రఘురావ్ పట్వర్ధన్ శృంగేరిని కొల్లగొట్టు ఉద్దేశంతో మఠంపై దాడిచేసి బ్రాహ్మణులను, హిందువులను చంపివేస్తాడు. శారదాంబ విగ్రహాన్ని పీకి పారవేస్తాడు. మరాఠా మురాకోరుల దాడికి భయపడి స్వామీజీ టిప్పుసుల్తాన్‌కు ఇలా వ్రాశారు.

"మరాఠా దోపిడిదార్లు శృంగేరిలోని బ్రాహ్మణులు మొదలగు వారిని కొట్టి, శారదాంబ విగ్రహాన్ని పీకివేయించి మఠ మందలి సామగ్రిని తీసుకొని వెళ్ళినందున, శారదాంబ విగ్రహ పునఃప్రతిష్ఠ కొరకు ప్రభుత్వం నుండి పైకం దాన్యం మున్నగునవి పంపిన విషయం. దైవసేవ నిరాఘాటంగా సాగునట్లు, శత్రువులు నాశనమగునట్లు గురువులు అనుగ్రహించవలెనన్న ఆకాంక్ష.

హిందువులే హిందువులకు హాని కలిగించు విషయం పట్ల సుల్తాన్ తన విచారాన్ని స్వామివారికి నివేదించాడు. శారదాంబ విగ్రహ పునఃప్రతిష్ఠాపన. శతచండి, సహస్ర చండీయాగాల నిర్వహణ మున్నగు విషయాలపై జగద్గురువులకు వ్రాసిన లేఖలు విశిష్టమైనవి.

హైదరాలి - టిప్పుసుల్తానుల సద్భావం శృంగేరి మఠానికే పరిమితం కాలేదు. వారిద్దరు మరెన్నో హిందూ దేవాలయాలకు మాన్యాలు, దానాలు ఇచ్చినట్లు చారిత్రకాధారాలున్నాయి.

హిందూ - ముస్లిమ్ సామరస్యం నేటికీ శృంగేరిలో కొనసాగుతూవుంది. శారదాంబ నిత్యపూజా సమయంలో నగారా వాయించే వ్యక్తి అబ్దుల్ రహమాన్. మఠానికి దేవాలయానికి సంబంధించిన వంట పాత్రలు వగైరాలకు కళాయి వేసే మనిషి మహమ్మద్ సాహుకార్. ఉత్సవ వేళలందు ఉపయోగించు గొడుగుల అలంకారం చేసే వ్యక్తి హమీర్ సాహెబ్. కొన్ని తరాలుగా పై కుటుంబమునకు చెందినవారు భక్తి ప్రపత్తులతో తమ పనులను చేస్తున్నారు.

## లేఖలు

శృంగేరి జగద్గురువులకు - హైదరాలి - టిప్పు సుల్తానులు రాసిన 50 లేఖలలోని వస్తు - విచారాలవైవిధ్యం గమనించి - 13 జాబులు మాత్రం ఇక్కడ ప్రచురింప బడినాయి. లేఖల్లోని సాంప్రదాయక ప్రారంభ - అంత్యభాగాలు మినహాయించి ముఖ్యాంశములు మాత్రం ఇవ్వబడినాయి.

హైదరాలి, టిప్పుసుల్తాన్‌లు, స్వాముల వారికి వ్రాసిన లేఖలన్నీ, సంప్రదాయ బద్ధంగా కింది విధంగా ప్రారంభమయ్యేవి.

"శ్రీ మత్పరమహంస పరివ్రాజ కాచార్యవర్య, ఆదిరాజధానీ విద్యానగర్ మహా రాజధానీ ఋష్యశృంగరవరాధీశ్వర, తుంగభద్రాతీర వాసీ, శ్రీ మద్విద్యాశంకర పాద పద్మారాధక శ్రీ నరసింహభారతీస్వామి గురుకరకమల సంజాతులైన శృంగేరి సచ్చిదానంద భారతీస్వాములవారికి నవాబ్ హైదరాలీ ఖాన్ బహదుర్‌గారు చేయు సలామ్...

అలాగే టిప్పుసుల్తాన్ కూడ లేఖను ప్రారంభిస్తూ రాసేవాడు.

## హైదరాలి లేఖలు

### మొదటి లేఖ:

శ్రీ శృంగేరి నరసింహ భారతీస్వాములవారికి ....హైదరాలి సుల్తాన్ బాదుషాగారి సలాం. స్వాముల వారి నుండి ఆశీర్వాదపత్రం మరియు ఉడుగర అందిన విషయం. మఠానికి చెల్లవలసిన ఇనామ్‌లు యథాతథంగా కొనసాగించునట్లు అధికారులను ఆదేశించిన విషయం. గురువులవారు కానుక (ఉడుగర) స్వీకరించి సుఖంగా వుండాలన్న అభిలాష. ఇత్యాది....

- హైదరాలి ఖాన్ - క్రీ.శ. 1768 లేఖ నెం. 2.

తృతీయ సచ్చిదానంద స్వాముల వారికి ....శ్రీమత్పరమహంస వ్రాజకాచార్యవర్య ఆది విద్యానగర మహారాజధాని ఋష్యశృంగ పురవరాధీశ్వర, తుంగభద్రాతీరవాస, శ్రీ మద్విద్యాశంకర పాదపద్మారాధక శ్రీ నరసింహ భారతీస్వామి గురుకరకమల సంజాతులైన శృంగేరి సచ్చిదానందభారతీ స్వాముల వారికి హైదరాలీ ఖాన్ బాదుషా గారి సలాం. గురువుల మకాం చేయుస్థలమున, చాతుర్మాస్యవ్రతం సంకల్పించినట్లు తెలిసి, యుక్తమైన దన్న విషయం తర్వాత గురువులవారు శృంగేరి చేరి దైవారాధన, తపస్సు మరియు ఆశీర్వాదములందిస్తూ సుఖముగా ఉండవలెనన్న ఆకాంక్ష. గురువుల వారినుండి వస్త్రములందినట్లు. గురువుల వారికి తాను రెండు శాలువలను పంపిన విషయం.

- హైదరాలి ఖాన్ క్రీ.శ. 1777 లేఖ నెం: 3

"శ్రీ సచ్చిదానంద స్వాములవారికి - హైదరాలి సుల్తాన్ బాదుషాగారి సలాం. హైదారాలి కుశలముగా వున్న విషయం. మఠానికి సంబంధించిన అన్ని విషయాలు తెలుసుకున్నది. గురువుల వారికి సమర్పించదలచిన ఒక ఏనుగు, అయిదు గుర్రాలు, ఒక పల్లకి, రెండు శాలువలు, వస్త్రద్వయం, మరియు ఖర్చులకు పదిన్నర వేల రూపాయలను స్వీకరించి తనకు దర్శనమివ్వ వేడికోలు."

- హైదరాలీ ఖాన్

టిప్పుసుల్తాన్ జగద్గురువులకు వ్రాసిన లేఖలు.

(శృంగేరి పత్రాగారంలో 46 జాబులున్నాయి. వీటిలో 38 జాబులు టిప్పుసుల్తాన్ నేరుగా జగద్గురువులకు రాసిన జాబులు, మిగతా 8 జాబులు, 3 తేదార్, అమల్దార్, మఠాధికారులకు రాసిన జాబులు. టిప్పుసుల్తాన్ సచ్చిదానంద స్వాముల వారికి

నేరుగా వ్రాసిన లేఖలు మాత్రం ఇక్కడ ఇవ్వబడినాయి. పుట సంఖ్యలను బట్టి లేఖలను కుదించి ఇవ్వటం జరిగింది. సాంప్రదాయక ప్రారంభం మరియు అనవసర విషయాలను మినహాయించడం జరిగింది.)

లేఖ నెం: 1

"శ్రీ సచ్చిదానందస్వాములవారికి టిప్పుసుల్తాన్ బాద్‌షా గారి సలామ్. నగర ఆసఫ్ నుండి ధాన్యం 400 రహతి, పల్లకి మున్నగు వాటిని స్వీకరించి, శారదాంబ విగ్రహ ప్రతిష్ఠ మరియు సంప్రోక్షణ జరిపించ ప్రార్థన. శత్రునాశనం కొరకు ఈశ్వర ధ్యానమును ఏకనిష్ఠతో జరిపించుట."

(టిప్పు సుల్తాన్, మహమద్ 1219 విరోధికృతు శ్రావణ - క్రీ.శ. 1791), (జాబులోని 'ఏకనిష్ఠ' పదమును గమనించాలి.)

లేఖ నెం : 2

....సహస్ర చండీజపం ఏర్పాటుకు గురువుల వారి సమ్మతి, బ్రాహ్మణులకు దక్షిణ మున్నగునవి ఇప్పించి, సహస్ర బ్రాహ్మణ భోజనములకు ఏర్పాటు కావించేది. ప్రభుత్వ శ్రేయోభివృద్ధి కలుగునట్లు చేయుడు. శత్రువులు నశించి ప్రజలు సుఖంగా వుండునట్లు విధ్యుక్తంగా జపము జరుపునట్లు సుల్తాన్ విన్నపం. (టిప్పుసుల్తాన్, మహమద్ 1219 విరోధికృతు)

లేఖ నెం : 3

.....సహస్ర చండీజపం పొంగంగా నెరవేరి, ఫలప్రసాద, మంత్రాక్షతలు అందిన విషయం. మఠం నుండి దోచుకొన్న వస్తువులన్నింటిని అప్పగించునట్లు పరశురామ్ మరియు రఘునాథరావుగార్లకు తాఖీదు, గురుద్రోహులకు తగిన దండన విధించుట - సముద్రస్నానానికి తగు వసతి కల్పించునట్లు ఆసఫ్‌కు రహదారి.

(టిప్పు సుల్తాన్ - మహమద్ 1219. విరోధికృతు 1991)

లేఖ నెం : 4

...అన్యత్రవంచన చేసిన వారిని బహిష్కరించుట మంచిపని. రఘునాథరావుకు పూనా నుండి వచ్చిన జాబు మరియు, పరశురామ్ నుండి మఠమునకు జాబు అందిన విషయం త్రికాలములందు ఆశీర్వదిస్తూ, నరసింహ శాస్త్రిగారి నుండి వార్త అందిన విషయం తెలుపుట గురించి (టిప్పు సుల్తాన్; మహమద్ 1219, విరోధికృతు 1791)

లేఖ నెం : 5

....... రామభట్టుద్వారా చెప్పిపంపిన విషయం తెలిసింది. రక్షదారం, వెండి తాపడం చేయించిన చౌరి(?) వీటిని శ్రీవారు చూచి స్వీకరించుట..(టిప్పు సుల్తాన్ - మహమద్ 1219, విరోధికృతు 1791)

లేఖ నెం : 6

"...... మఠము వస్తువులు పోయిన విషయంగా పరశురామ్ వద్దకు బ్రాహ్మణులను పంపినప్పటికీ, విషయం తెలియరాలేదు గురువుగారే పూనాకు వెళ్ళి రానున్నట్లు తెలిసినందున ప్రయాణ సమయమున శ్రీరంగపట్నము వచ్చి దర్శనమొసగి, నంజన

గూడులో దైవదర్శనం ముగించుకుని ముందు ప్రయాణాలు సాగించు విషయం. గురువుల వారికి మార్గమంతటా సకల పదార్థములను సమకూర్చునట్లు సంబంధిత అధికారులకు ఆదేశాలివ్వటం జరిగింది...ఇత్యాది." పై...భాగంలో ఎర్రలక్క ముద్రవుంది. టిప్పుసుల్తాన్; మహమద్ 1220, చైత్రం 1792)

లేఖ నెం : 7

గురువు నుండి లేఖ అందిన విషయం.....జగద్గురువులు సర్వలోక క్షేమం జరుగునట్లు - సర్కారు క్షేమము ఉత్తరోత్తరాభివృద్ధి యగునట్లు త్రికాల తపస్సు చేస్తూ ఈశ్వర ప్రార్థన సాగించే విషయం. జగద్గురువులు ఎక్కడున్నా అక్కడ సుభిక్షగా వుండుట. పర స్థలాలలో చాలా దినములుండక త్వరలో స్వస్థలం చేరు విషయం.

(టిప్పు సుల్తాన్; మహమద్ 1220, మాఘ 1792.)

లేఖ నెం : 8

......శాలువా జత అందిన విషయం. శ్రీమంతుల థైలి (కానుక సంచి) మరారుల్ మహమద్ (కానుక) హరిపంత్ ఫడక్ (కానుక) మహదాజి సింధియా కానుక, ఇలా నాలుగు కానుకల సంచులు చేరినందుకు సంతోషం ప్రకటిస్తూ, శ్రీవారు విచ్చేయునట్లు తెలుపు విషయం.

(టిప్పుసుల్తాన్, మహమద్ 1220, క్రీ.శ. 1793)

లేఖ నెం : 9

....గురువులవారి ఆరోగ్యం మెరుగుపడినట్లు సుబ్బావధానులనుండి తెలిసిన విషయం. గురువుల వంటి పెద్దలకు ఆపదలు, దైవానుగ్రహంతో స్వస్థత చేకూరుట సహజం. త్వరలోనే శ్రీవారు విచ్చేయవలసినదిగా విన్నవిస్తూ....

(టిప్పుసుల్తాన్: మహమద్ 1220 క్రీ.శ. 1794)

లేఖ నెం : 10

....శ్రీవారు స్వస్థలం చేరిన సంగతి. పంపిన శాలువా స్వీకరింప విన్నపం. గురువులవారు స్వయంగా దేవతార్చన చేయుటకై స్ఫటికలింగము మరియు శివలింగము సమర్పించుట - సదా పరమేశ్వరుడు విజయము ప్రసాదించునట్లు ప్రార్థించవలసినదిగా గురువులవారికి విన్నపం (టిప్పుసుల్తాన్. మహమద్ 1220, క్రీ.శ. 1795)

(తరంగ కన్నడ వారపత్రికలోని (5-12-93 సంచిక) నరేంద్ర రైదేర్లగారి రచన ఆధారంగా)

● విశాలాంధ్ర ●

★ ★ ★

# జాతీయ సమైక్యతకు దోహదం చేసిన ఉర్దూభాష

మనిషి భావాలను వ్యక్తం చేసే సాధనం భాష. కేవలం మతం పునాదులపై ఏ భాష పెరగదు. భాషలకు కులమతాల రంగులను పులమటం సంకుచిత మనస్తత్వాల నిర్వాకం.

ఉర్దూ మహమ్మదీయుల భాష అని. సంస్కృతం బ్రాహ్మణుల భాష అని, ఇంగ్లీషు ఆంగ్లేయుల (క్రైస్తవుల) భాష అని వ్యవహరించే మూర్ఖులు ఈ నాటికీ మన సమాజంలో లేకపోలేదు.

హిందూ - ముస్లిమ్‌ల సమన్వయానికి తార్కాణం ఉర్దూభాష. సుస్థిరమైన ముస్లిం ప్రభుత్వం పదమూడవ శతాబ్దం నుండి ప్రారంభమైంది. (1206 - కుతుబుద్దీన్ ఐబక్ పాలనతో) సుల్తానుల యుగం (1206 - 1526) మొగల్ యుగం (1526 - 1757) ఉర్దూభాషావిర్భావానికి, అభివృద్ధికి పేర్కొనదగినవి.

ఉర్దూ భాషావతరణానికి ముందు ఉత్తర భారతదేశంలో, హిందీభాషా రూపాలైన, ఖడీబోలీ (ఖరీబోలీ) హర్‌యాన్వి, అవధీ, భోజ్‌పురి, పూర్వీ అనే భాషలు ప్రచలితంగా వుండేవి. సుల్తానులు, మొఘల్ చక్రవర్తులు మన దేశంపై దండయాత్రలు చేసినప్పుడు వారి సైనిక శిబిరాలు విస్తృతంగా మన దేశంలో వెలిశాయి. సైనికులు తరచుగా స్థానిక ప్రజలను కలుసుకోవటంతో సైనికులు మాట్లాడే పర్షియన్, అరబిక్ పదాలు స్థానిక భాషాపదాలలో ప్రవేశించాయి. పరస్పరంగా భాషలలోని పదాల ఆదాన ప్రదానాలు జరిగాయి. అలాగే పర్షియన్, అరబిక్ భాషలో కొన్ని హిందీ పదాలు మిళితమైనాయి. అమీర్‌ఖుస్రో వంటి ప్రముఖుల కవితల్లో హిందీ, పర్షియన్ పదాలు పడుగు పేకలుగా కలసి భారతీయ భాషకో సోయగం కల్గింది. విదేశీయమైన గజల్స్ భారతీయ ఖవ్వాలి భజన రూపంలో అవతరించాయి. అమీర్ ఖుస్రో కవితల్లో కొన్ని చోట్ల ఒక పాదమంతా పర్షియన్ భాషలో వుండగా, మరో పాదం హిందీ భాషలో వుండేది.

పర్షియన్, అరబిక్ పదాలు హిందీ భాషా పదాల కలయికతో హిందీ వాక్య నిర్మాణానికి అనుగుణంగా ఉర్దూభాష ప్రభవించింది. క్రమంగా నగరాల్లో, పట్టణాల్లో ఉర్దూ ప్రవేశించింది. ఆదివరకు పాలనా భాషగా వున్న పారసీక భాషాస్థానాన్ని ఆక్రమించింది. పరిపాలనా వ్యవహారాల్లో ప్రధానంగా వుండిన పర్షియన్ పదాలు హిందీ భాషలో కలిసిపోయాయి. ఈ పరిణామ ఫలితమే హిందీ, హిందవీ, ఉర్దూ పేర్లతో మిశ్రమభాష రూపుదాల్చింది. ఈ సంకర భాషను మొదట్లో 'జబాన్ - ఎ -

హిందవీ' అనేవారు హిందూ - ముస్లింల సమన్వయానికి తార్కాణంగా ఉర్దూభాష ఏర్పడింది.

19వ శతాబ్ది నాటికి విభిన్న భాషల నుండి పదాలను, పదబంధాలను తన అక్కున చేర్చుకుని ఉర్దూ భాష సుస్థిరత్వాన్ని సాధించుకుంది. 19వ శతాబ్ది నాటి సాహితీ వేత్త మహ్మాద్ హుస్సేన్ ఆజాద్, ఢిల్లీ నగరంలోని ఒక యువకుని రచనలనుండి ఈ విధంగా ఉదహరించాడు.

"మై బాజార్ సె సైకిల్ పర్ బైరోకర్ చలా, ఘర్ పహూంచా, చిక్ ఉఠా, కమ్‌రే మె దాఖిల్ హువా, కమ్‌రేమే మెయ్‌జ్ కుర్సీ రఖీ థీ లాంప్ జల్ రహథీ; మై కుర్సీపర్ బైరోగయా."

"పై వాక్య నిర్మాణం హిందీ భాషానుగుణంగా వుంది. బాజార్, పర్షియన్ పదం, సైకిల్ ఇంగ్లీష్ పదం పర్‌బైరో కర్ చలా, ఘర్ పహూంచా, హిందీ, చిక్, టర్కిష్ పదం, కమ్‌రా - ఇటాలియన్ (ఇన్‌కెఘరా) దాఖిల్ - అరబిక్, మెయ్‌జ్ - పోర్చుగీస్ పదం, కుర్సీ అరబిక్, పర్షియన్; ల్యాంప్ ఇంగ్లీష్, జల్‌రహథీ, మై కుర్సీపర్ బైర్‌గయా - హిందీ."

గత ఎనిమిది వందల సంవత్సరాలుగా ఉర్దూ భాష భారతప్రజాజీవితంతో పెనవేసుకుని, మాటల్లో, రాతల్లో సహజంగా పరిణతి నందుకొన్నది.

అంతర్గతంగా సమగ్రతను సాధించుకున్న ఉర్దూభాష ఉత్తర భారతంలోని ప్రజానీకంతో కలసిపోయింది. క్రమంగా గుజరాత్, మహారాష్ట్ర, దక్కన్‌లోని బీజాపూర్, కర్నాటక ప్రాంతాలకు వ్యాపించింది. ఉర్దూ ముస్లింల భాషకాదు. భారతదేశంలోని మహమ్మదీయులలో సగం భాగం ఉర్దూ మాట్లాడరు. ఉర్దూ మాట్లాడే లక్షలాది ప్రజలు ముస్లింలు కాదు. ఉర్దూభాష మతం పునాదులపై ఏర్పడలేదు. హిందూ, ముస్లిం క్రిష్టియన్, సిఖ్ మున్నగు వారందరూ సద్భావంతో, సమైక్యంగా జీవించటంతో సదవగాహనతో ఉర్దూలో అత్యుత్తమ రచనలు చేశారు.

పోర్చుగీస్, డచ్, ఫ్రెంచ్, ఆంగ్లకవులెందరో వేలాది ఉర్దూ గజల్స్ రాశారు. కవితల చివర్లో అలెగ్జాండర్ హెడర్లే 'ఫనా', విలియం బ్రువే "విలియం" ఆలిస్‌డిసిల్వా 'ఫర్హత్' అనే కలం పేర్లు (తఖల్లుస్) చేర్చుకున్నారు.

సాహితీవేత్తలు కవులు, ఏనాడూ తీవ్రవాదాన్ని సమర్థించక మితవాదులుగానే వుండిపోయారు. మతాంధులైన షేక్‌ల, ముల్లాల పిడివాదాన్ని ఛాందసులైన పండితుల వాదాన్ని నిర్ద్వంద్వంగా తిరస్కరిస్తూ, ఉర్దూ భాషాభిమానులు మధ్యే మార్గాన్ని సామరస్యాన్ని అనుసరించారు.

ఉర్దూసాహిత్య వేత్తలు, రామాయణ, భారత, ఉపనిషత్తులను సంస్కృతం నుండి ఉర్దూభాషలోకి అనువాదం చేశారు. ఫిరోజ్‌షాతుగ్లక్ వేలకొలది సంస్కృత గ్రంథాలను పారశీక భాషలోకి అనువదింపచేశాడు. (ముస్లిమ్ రూల్ ఇన్ ఇండియా ఈశ్వరీ ప్రసాద్ - పుట : 167) రహీం అను ముస్లిం కవి తన మదనశతకమును శ్రీ గణేశాయనమః అన్న వాక్యంతో ప్రారంభించాడు. మహమ్మదుల్లా దక్షిణి అను కవి తన గ్రంథారంభంలో శ్రీ రామానుజాయనమః శ్రీ సరస్వత్యైనమః

అన్న దేవతా వందనములతో ప్రారంభించాడు. (ప్రోసీడింగ్స్ ఆఫ్ ద ఇండియన్ హిస్టరీ కాంగ్రెస్ పుట : 900) ఎందరో హిందూ కవి పండితులను మొఘల్ చక్రవర్తులు పోషించారు. ఆధునిక యుగంలో ఉర్దూలో పండితులైన ద్వారకా ప్రసాద్ 'ఉఫ్క్' శంకర్ దయాళ్ 'ఫర్హాట్' రామాయణాన్ని ఉర్దూలో రచించారు. తోతారామ్ 'శాయన్' మహా భారతాన్ని, జగన్నాధ్ 'కుష్తార్' భాగవతాన్ని, రామ్ సహాయ్ తమన్నా, భగవద్గీతను ఉర్దూలోనికి అనువదించారు. అట్లే ఖ్వాజాదిల్ మహమ్మద్ భగవద్గీతను ఉర్దూలో పద్యరూపంలో అనువదించారు. అంతకుముందే ఫైజీ భగవద్గీతను పారశీలోకి అనువాదం చేశాడు. బన్వారిలాల్ 'షోలా' పారశీలోకి అనువాదం చేశాడు. బన్వారిలాల్ 'షోలా' బ్రజభాషా కావ్యంలో కృష్ణగుణగానం చేశాడు.' ఖ్వాజాహుస్సేన్ నిజామి 'కృష్ణబాసరి' అను ఉర్దూ కావ్యాన్ని కీర్తిస్తూ రాశాడు. దీపావళి, హోలీ పండుగలపై నజీర్ అక్బరాబాది ఎన్నో రచనలు చేశాడు. ఇక్బాల్ రాముని కీర్తిస్తూ రాశాడు. బ్రజ్ మోహన్ దత్తాత్రేయ 'కైఫీ, బ్రజ్ నారాయణ్ 'చక్‌బస్త్' రఘుపతి సహాయ్' గోరఖ్‌పురి ఉర్దూలో గొప్ప రచనలు చేశారు. గోరఖ్‌పురి ఉర్దూ రచనకు 'జ్ఞానపీఠ' బహుమతి లభించింది.

ఈ విధంగా ఉర్దూ ఉత్తర, దక్షిణ భారతదేశాల్లో విరివిగా వ్యాపించింది. భారతీయ భాషలలో జాతీయ సమైక్యతకు దోహదం చేసిన భాషగా ఉర్దూ పేర్కొనదగింది.

1961 జనాభా లెక్కల ప్రకారం మన దేశంలోని 17 పెద్ద రాష్ట్రాలలో, నాలుగు రాష్ట్రాల్లో తెలుగు, మరాఠీ బెంగాలీ, తమిళ, కన్నడ, భాషల మొదటి రెండు, మూడు, నాలుగో స్థానాల్లో వున్నాయి హిందీ ఎక్కువగా వాడుకలో వుంది హిందీ తర్వాత ఎక్కువగా ఉర్దూ వాడుకలో వుంది.

(ఇండియన్ ఎక్స్‌ప్రెస్ (15-7-93)లోని ఎ ఎం ఖుస్రో గారి వ్యాసం సహకారంతో)

● *విశాలాంధ్ర 7-10-1993* ●

* * *

# హిందీ భాషాపోషకు కల్యాణ కంకణములు కట్టిన ముస్లిమ్ కవులు

భారతదేశ చరిత్రలో పదమూడు, పదునాలుగు శతాబ్దముల కాలమొక సంధి యుగము. అరబిక్ పర్షియన్ భాషా ప్రవంతి భారత సాహిత్యగంగలో కలిసి ఉర్దూ భాషా నదుమావిర్భవించినది. అపార ధన రాసులను దోచుకొనుటయే కొందరు రాజుల లక్ష్యమైనప్పటికీ, భారతీయ విజ్ఞానము, పట్ల అసక్తితో భక్తి శ్రద్ధలతో వచ్చి స్థిరపడి పోయిన ముస్లిమ్ చక్రవర్తులెందరో మనదేశ చరిత్రలో కానవచ్చుచున్నారు. ఫిరోజషాతుగ్లక్ నాగర్ కోటలో లభించిన అపూర్వ సంస్కృత గ్రంథము లెన్నిటనో పర్షియన్ భాషానువాదమొనర్ప జేసెను. అక్బర్ చక్రవర్తి సంస్కృత గ్రంథముల పారసీక భాషాంతరీకరణమునకొక ప్రత్యేక భాగము నేర్పరచెను. ఆ భాగమున కధిపతులు అబుల్ ఫజల్ మరియు అబుల్ ఫైజిలను వారు. అక్బరు హిందీ భాషలో ఆశువు చెప్పగల్గి యుండెను. అతని ఆశ్రయముననే రామాయణము, హరివంశము, లీలావతి, అధర్వణవేదము, యోగవాశిష్టము, మున్నగు ఉద్గ్రంథముల పారసీభాషానువాదము జరిగినది. ఆయా భాషల ఆదాన ప్రదానములతో భారతీయ భాషలకు పుష్టి కలిగినది. హిందీ సాహిత్యలత కొత్త చిగుళ్ళు వేసినది. విజాతీయులగు ముస్లిములు అరబిక్ పారసీక భాషలతోపాటు హిందీ సంస్కృత భాషలను అధ్యయనమొనర్చిరి. పెక్కు హిందూ పండితులు పారసీ అరబిక్ భాషల నభ్యసించి కావ్యరచన మొనర్పసాగిరి. ఈ పరస్పరమైన సౌహార్దము, గౌరవము సమకాలీన సాహిత్యముపై చెరగని ముద్ర వేసినది. కవులు తమ మత ధర్మము ననుసరించి తమ యిష్ట దేవతలతో పాటు కావ్యము హిందీ భాషలో సాగించినపుడు ముస్లిమ్ కవులు హిందూ దేవతా ప్రార్థనతోను, హిందూ కవులు దయామయుడగు 'అల్లా' స్తోత్రముతోను కావ్యారంభము కావించెడివారు. రహీమ్‌కవి తన మదన శతకమును 'శ్రీ గణేశాయనమః' అన్న వాక్యముతోను మహమద్-ఉల్లా-దక్షిణి అనుకవి "శ్రీ రామానుజాయనమః, శ్రీ సరస్వత్యై నమః శ్రీ గణేశాయనమః" యిత్యాదిగా స్తోత్రమొనర్చి గ్రంథరచన కుపక్రమించిరి.

(See Proceedings of the Indian Histoy Congress-page 900).

హిందీ సాహిత్య సరస్వతిని అమూల్య కావ్యకుసుమములతో అర్చించిన కొందరు ముస్లిమ్ కవుల పేర్కొంటాను. వారిలో ప్రథముడు అమీర్ ఖుస్రూ. పదుమూడవ శతాబ్దమున జన్మించిన ఖుస్రూకవి భారతీయ సంస్కృతిపట్ల పూజ్య భావమును తన రచనలలో ప్రదర్శించెను.

(Life and works of Amir Khusro by M.W. Mirza-P' 183-84 & 228)

అసదృశము, అమోఘము అయిన జ్ఞాన భండారము భారతదేశమున వున్నది. గణిత, జ్యోతిష, తర్క, భౌతిక శాస్త్రములు మున్నగువాటిలో భారతీయ పండితు లద్వితీయులు. వారు ముస్లిమ్ మతీయులు కానప్పటికి వారి ధార్మిక ఆచార విచారములు ఇస్లామ్ తత్వమును పోలియున్నవి. మనవలె వారూ దేవుడొక్కడేయను అద్వైత వాదులు. ఆ దేవుడు సనాతనుడు. సచ్చిదానంద రూపుడు అనివారి విశ్వాసము. రాళ్ళను, చెట్లను, విగ్రహములను పూజించినప్పటికి అవే దేవుడు కాదని అవి దైవసృష్టికి ప్రతిబింబములని విశ్వసింతురు. (Ibid page 228) ఖుస్రూ కవి రచన వ్యావహారిక భాషలో సాగినది. ప్రజాభాషా శబ్దములెక్కువ. 'ఏక నార్‌నే అపరజకియా' సప్‌మార్‌పి జె మేదియా

జ్యోజ్యోసాప్ తాల్‌కోఖాయే, సూఖేతాల్‌సాప్ మర్‌జాయే".

అమీర్ ఖుస్రూ తర్వాత పేర్కొనదగిన మహాపురుషుడు కబీర్ "బాహ్యాచారములను, కుసంస్కారములను ప్రాచీన పద్ధతులను నిర్భయముగ ఖండించిన ప్రజాకవి కబీర్. సాటిలేని జ్ఞాన ఖడ్గమొక్కటే యాసమరమున నాతనికి చేదోడు. కబీరు దానికొక క్షణకాలమును విశ్రాంతి నీయలేదు. కాని యాతడొక త్రుటి కాలమైనను శీలమును వదలలేదు. ఈ మహాసమర రంగమున నదియె యాతని కవచము (కబీరు వచనావళి పీఠిక - శ్రీ పుట్టపర్తి పేజి XXII)"

("మేరావజ్‌మే కుచ్‌నహి జోకుచ్ హై వో తేరా తేరా తురుఖుకీ సౌపనా క్యాలాగై హై మేదా" నాలో నాద నుటయే లేదు. ఉన్నదంతయు నీదే, నీది నీకిచ్చుటలో నాదేమి పోయినది) అనుచు భక్త్యావేశముతో వేల కొలది పదములను ఆలపించిన కవిపుంగవు డతడు. "హిందీ సాహిత్యమున నింతవరకిట్టి వ్యంగ్య రచనా చమత్కృతి గల కవి యుద్భవింప లేదనియె చెప్పవచ్చును. వాడిగా వేడిగా యొకరిసాయమక్కరలేకయే అర్థమగు సహజశైలి. సూటిగా హృదయమునకు దగులు భాష, నిరర్గళమై సాగుటతో పాటు స్పష్టముగ జెప్పుట కబీర్ రచనకు సొమ్ములు. కబీర్ పదములన్నియు 'బీజక గ్రంథమున సంగ్రథితమైనవి ఇది 'రమైని" 'సబద్' మరియు 'సాఖి' అని మూడుభాగములుగ విభజింపబడినది. కబీర్ నిర్గుణోపాసకుడు, సూఫి సిద్ధాంతవాది. రామ్ రహీముల ఏకత్వమును చాటి హిందూ ముస్లిముల మధ్య గౌరవ భావముల నెలకొల్పుటలో అవిశ్రాంతముగ కృషి చేసెను. భగవత్ప్రేమకు మార్గము వ్రతములు గాదు. పూజా పునస్కారములుకాదు, తీర్థయాత్రలు గాదు, అంటారు"

"ఏర్ నిరంజన్ అలహ్ మేరా, హిందూ తురఖదుహూనటా నేరా"
రాఖూవ్రతనామహరమ్ జాగా, తిస్ హీసుమిటా జోరహై నిదానా
పూజాకరూన నిమజ్ గుజారూ, ఏక్ నిరాకార్ హిర్‌దైనామసకారూ
నాపజ్ జావూన తీథ్ పూజా, ఏక్ విఛాయ్యతాక్యాదరజా
కహై కబీర్ మరమ్ సబ్ మాగా - ఏక్ నిరంజన్ సూమన్ లాగా
(కబీర్ గ్రంథావళిపద్ 338)

నా దైవము నిరంజనుడు వాడే 'అల్లా' వాని దృష్టిలో హిందూ ముస్లిమ్

భేదము లేదు. వ్రతములొనర్పను. మొహరం సేయను. ఈ రెంటి కతీతము. మూడవమార్గమునాది. 'పూజ' సేయను, నమాజు ఆచరింపను, నిరాకారుని నామమును హృదయమున నిక్షేపించుకొందును. మక్కాకేగను. తీర్థముల సేవింపను. నా దేవుడొకడే నను మర్మము నెరిగితిని. కబీరు అను చున్నాడు- "నిరంజనుడొక్కడే" (కబీరు వచనావళి - అనువాదము మహాకవి శ్రీ పుట్టపర్తి)

కబీరు తరువాత సూఫీ ప్రేమ మార్గము ననుసరించి కావ్యములు రచించినవారు పెక్కురు కలరు. కుతుబవ్ కవి "మృగావతి" మంఝన్ కవి కృతిమగు 'మధు మాలతి' జాయసి కవి యొక్క 'పద్మావత్' ఉస్మాన్ కవి రచితమగు "చిత్రావళి" షేక్ నబీయొక్క 'జ్ఞానదీప్' షాకృతమగు 'హంసజవాహిర్' మరియు నూర్ మహమద్ రచించిన ఇందావతి ప్రసిద్ధములైన ముస్లిమ్ కవుల రచనలు.

సమగ్రసృష్టిని తన ప్రేమ ప్రవాహముతో ఆప్లావిత మొనర్చిన మహాకవి మలిక్ మహమద్ జాయసి. ఈతని గురువు షేక్ మొహిదీ. అరబిక్ పారసీక భాషా పండితుడైన జాయసీ కావ్యం హిందీ సాహిత్యమునకపూర్వాలంకారములైన కావ్యములను కూర్చి పెట్టెను. జాయసీకవి రచనలలో, 'పద్మావత్' మిక్కిలి ప్రసిద్ధమైనది. చిత్తూరు రాజైన, రత్నసేనుడు మరియు సింహళ రాకుమారి యగు పద్మావతుల మధ్యగల ప్రణయమే ఈ కావ్య వస్తువు. లౌకిక ప్రేమద్వారా అలౌకిక ప్రేమను ప్రతిపాదించుటయే యీ కావ్య లక్ష్యము

"అఖరావట్" అను రచన వర్ణమాలయందలి ప్రత్యక్షరముతో ప్రారంభమైన శివస్తోత్రము. "ఆఖరీ కలామ్"లో మరణానంతరము జరుగు న్యాయాన్యాయ విచారణ ముల్లేఖింప బడినది.

జాయసీకవి తరువాత పేర్కొన దగిన సూఫీకవి "రహీమ్. ఇతని పూర్తి పేరు అబ్దుల్ రహీమ్ ఖాన్‌ఖానా. రహీమ్ కవి అక్బరు ఆస్థానపండితనవరత్నములలోనొకడు. మంత్రిగ, సేనాపతిగ కూడ వుండెను. సంస్కృత, అరబ్బీ, పారశీక భాషలలోనే కాక హిందీ భాషలందు కూడా గొప్ప పండితుడు గోస్వామి తులసీదాసుపట్ల ఆదరాభిమానములు గల్గి అతనిని దర్శించుచుండెడివారు. సంస్కృతమున కొన్ని శ్లోకముల రచించెను. రహీమ్‌కవి రచనలలో "రహీమ్ దోహావళి బరవైనాయికాభేద్" మదనాష్టకము, రాస్ పంచాధ్యాయి. స్వయముగా కవి యయ్యు పెక్కు కవుల కాశ్రయ మొసగిన సాహిత్య పోషకుడు. గొప్పదాత. ఒకమారు గంగకవి వినిపించిన 'చప్పయ్' (షట్పది) యొక దానిని మెచ్చుకొని ముప్పది యారు లక్షల రూపాయలిచ్చి సత్కరించెను. రహీమ్‌కవి రచన వ్రజ మరియు అవధీ భాషలలో సాగినవి. రెండు దోహాలు చూడండి."

*"జో గరీబ్ రిరహితకరై, తేరహీమ్ బడలోగ్*
*కహోసుదామాబాపురో, కృష్ణమిలాయీ జోగ్."*

"తరువర్ ఫల్ నహి ఖాతహై సరవర్ పియ హినపాన్ రకహి 'రహివ్‌వం' పరకాజహిత సంపతి సంచిహసు జాన్" అపరకర్ణుడనిపించుకొన్న రహీమ్ కవి, జీవిత చరమదశలో అష్టకష్టములనుభవించి కృష్ణ సాన్నిధ్యము చేరెను.

కృష్ణ భక్తి సాగరమున మునకలు వేసిన మరొక మహాపురుషుడు 'రస్‌ఖాన్', ఇతని అసలు పేరు ఇబ్రహీమ్. భాగవతోత్తముడగు విరల్‌దాసు శిష్యుడై కృష్ణ భక్తుడై విలసిల్లిన కవి పుంగవుడు రస్‌ఖాన్. ఇతని కృష్ణ ప్రేమ అనన్యము

'మానుష హౌతో నహీ ర సఖానిలుసో బ్రజ్ గోకుల్' గాల్ కే గ్వారస్.

జోపశు హోతోకహా బసమేరో చరౌనిత నందకీ ధేను మఝారస్

పాహన్ హౌతో బసేరో కరౌమిలి కలిందీ కూల కదంబకీ డారన్

(మనుష్యునిగ జన్మమివ్వ దలిచిన గోకులములో గొల్ల పిల్లడుగను, పశువుగ జన్మించిన గోకులమందలి పశువుల మధ్యను, శిలగాపుట్టినచో కృష్ణుడెత్తిన గోవర్ధన పర్వతమున ఒక రాయిగను, పక్షి జన్మమివ్వ దలచిన యమునా తటవృక్ష నివాసమును ప్రసాదించు.) మని కృష్ణుని ప్రార్థిస్తాడు. రస్‌ఖాను రచనలలో "సుజాన్ రస్‌ఖాన్" మరియు "ప్రేమవాటిక అనునవి మాత్రము వుపలబ్ధములు. కోమల పదగుంభితమైన వ్రజ భాషలో రచించెను. ఆధునిక హిందీ యుగ కర్త భారతేందు హరిశ్చంద్ర 'ఇన్‌ముసల్ మాన్ హరిజననపై కోటిన హిందూ నారియే" అని జోహార్లర్పించెను.

మధ్య యుగమున అనేక ముస్లిమ్ రాజులు పారసీక భాషా కవులతోపాటు హిందీ సాహిత్యకారుల కాశ్రయమిచ్చిరి. హుమాయూన్ ఆశ్రయమున 'క్షేమ మందజన్' అక్బరు కొలువున "గంగకవి, నరహరి, అమృత్, మనోహర్ కవి, రాకుమారుడగు నారా పోషణలో 'బనమాలీ దాస్,' షహజహాన్ పోషణమున 'కవీంద్ర సుందర్' కవి ఫజిల్ ఆలీషా వద్ద "సుఖదేవ ---వుద్దాలా ఆశ్రయమున" గిరిధర్ రాయ్' అను కవులు ప్రసిద్ధులు.

సాహిత్యము జాతిమత భాషాభి మానమున కతీతమగు క్షేత్రము. హిందూ ముస్లిముల మధ్య పరస్పర సౌహార్ద్రత నానాటికి పెంపొందించుటతోపాటు భారత దేశాభ్యుదయమే సాహితీపరుల పరమోద్దేశమగు గాక.

● *ఆంధ్రప్రభ 13-7-1969* ●

★ ★ ★

# హిందూ - ముస్లిమ్ మైత్రి భారతదేశానికి పెట్టనికోట

## సరోద్ వాద్యకారుడు అమ్జద్ అలీఖాన్‌తో ఇంటర్వ్యూ

భారతీయ సంగీతం, ముఖ్యంగా హిందుస్తానీ సంగీతం - హిందూ ముస్లిమ్ సామరస్యానికి సమన్వయానికి సంకేతంగా పరిగణింపవచ్చు.

మొఘల్ చక్రవర్తుల కాలం నుంచి, అంటే దాదాపు అయిదు శతాబ్దాల నుంచి పరస్పర విశ్వాసం, ఆత్మీయతల వల్ల ఈ వారసత్వ స్రవంతి ప్రవహిస్తూ వుంది. అందుకు నిదర్శనంగా సంగీత సమ్రాట్ తాన్‌సేన్ కనిపిస్తాడు.

ఇటీవలి కాలంలో మేహర్ (మధ్యప్రదేశ్)కు చెందిన ఖాన్‌సాహెబ్ అల్లాఉద్దీన్ ఖాన్, వారి కుమారుడు ఆలీ అక్బర్ ఖాన్, శిష్యుడే కాదు అల్లుడైన పండిట్ రవిశంకర్‌లు ఈ విషయంలో పేర్కొనదగినవారు.

జాతి మతం, కులం అనే అల్పమైన, కృత్రిమమైన పరిధుల నుంచి విముక్తుని కావించి మానవుణ్ణి సిసలైన మనిషిగా మార్చే సంజీవని సంగీతం. చట్రంలో చిక్కుకున్న మనిషిని బంధ ముక్తుని కావించి, స్వేచ్ఛగా విహరింపచేస్తుంది సంగీతం.

హిందూస్తానీ సంగీత రంగంలో మహామహులెందరో విహరించారు. అబ్దుల్ కరీంఖాన్, ఫయ్యాజ్‌ఖాన్, ఇనాయత్ ఖాన్ అల్లావుద్దీన్ ఖాన్ మున్నగువారు, మన సంగీతాన్ని సుసంపన్నం చేశారు.

బిస్మిల్లాఖాన్ షెహనాయ్ విన్నప్పుడు, విలాయత్ ఖాన్ సితార్ వాదన విన్నప్పుడు, అల్లారఖా వారి కుమారుడు జాకిర్ హుసేన్‌గారి తబలా వాద్యం విన్నప్పుడు, అది ముస్లిం సంగీతమని ఎవరూ భావించరు. అదో సురలోక సంగీతమని ఆనందిస్తారు.

వేదకాలం నాటి ధ్రువపద సంగీత శైలిని కాలక్రమంలో చక్కగా అలవరచుకున్న వారిలో అగ్రగణ్యులు దాగర్ సోదరులు. వారు పాడిన ధ్రుపద్ పాటలు రామ కృష్ణ, శివ, గణపతి, శక్తి మున్నగు దేవతల ప్రశంసా మాలికలు. సంగీతం హిందూ - ముస్లింల సమైక్యతకు సాధనం.

విఖ్యాత సరోద్ వాద్యకారుడు అమ్జద్ అలీ ఖాన్ మరో మహనీయుడు. ఆయన భార్య హిందువు. ఆయన సంగీతం అలౌకికం.

అమ్జద్ అలీఖాన్ వాయించే సరోద్ వాద్యం, హిందూ ముస్లిమ్ సామరస్య సాధనం. ఈ వాద్యం రావణాసుర సృష్టి అని ప్రతీతి. దాని అసలు పేరు 'స్వరాధ్యాయ.'

పర్షియా నుంచి ఇండియా చేరిన ఇటువంటి వాద్యంతో 'స్వరాధ్యాయి' సంపర్కం జరిగింది. హిందూస్తానీ సంగీతం మరియు వాద్యాలు - హిందూ - ముస్లిమ్ మైత్రికి సంకేతాలు. ఈ సమన్వయం వల్ల మన సంగీతం మరింత మాధుర్యాన్ని సంతరించుకున్నది.

'తరంగ' వారపత్రిక సంపాదకులు శ్రీ సంతోష్ కుమార్ గుల్వాడి, ఉస్తాద్ అమ్జద్అలీఖాన్ గారితో జరిపిన ఇంటర్వ్యూ వివరాలిలా వున్నాయి.

గుల్వాడి: రాజకీయవాదులు నాశనం చేసిన మధుర సామరస్యాన్ని సంగీతం మరల అతికించాలి. ఆ దిశలో మీరెంతో కృషి చేస్తున్నారు. వేలాది రాజకీయవాదులు విచ్ఛిన్నం కావించిన సామాజిక సమన్వయాన్ని, మీ సంగీత కచ్చేరి ఒక్కటి సాధించగలదు...కాని సాహిత్యం, సంగీతం, కళలు సాధించిన మరమ్మతులను, రాజకీయవాదులు తుంచివేయగల రన్నదే బాధాకరం.

అమ్జద్ ఆలీ: అవును, వారు వారి పని చేస్తారు. మనం మన కర్తవ్యం నిర్వహిద్దాం.

గుల్వాడి: రామకృష్ణ పరమహంస చెప్పిన కథ - "బ్రాహ్మణుడు 'తేలును రక్షించిన కథ' గుర్తుకొస్తుంది కదా?"

అమ్జద్ ఆలీ: ఏమిటా కథ నేనూ వింటాను.

గుల్వాడి: ఒక తేలు నదిలో పడి తన్నుకులాడుతుండేది. చచ్చిపోయే స్థితిలో వుండేది. ఆ సమయానికి సరిగా ఒక బ్రాహ్మణుడు సంధ్య వార్చడానికై నదీతీరం చేరాడు. తేలు జీవిత పోరాటాన్ని గమనించి వెంటనే దాన్ని పట్టుకుని గట్టుపై వదిలాడు. తేలు కాటేసింది. మరలా నీళ్ళలో పడింది. బ్రాహ్మణుడు మరలా దానిని పట్టుకుని గట్టుమీద వదిలాడు. అది మరలా కుట్టింది. బ్రాహ్మణుడు తేలును కాపాడడం, అదేమో ఆ బ్రాహ్మణుని కుట్టడం - ఇలా జరుగుతూ వుంది. దారిన పోయే దానయ్య, ఆ బ్రాహ్మణునితో "ఏమిటా మూర్ఖత్వం. అది నిన్ను కుడుతుందని తెలిసి కూడా నీవు దానిని కాపాడుతున్నావే!"

ఆ బ్రాహ్మణుడు నవ్వుతూ "కుట్టడం దాని గుణం. కాపాడడం నా ధర్మం"

అమ్జద్: నిజంగా సుబోధకమైన కథ. మనకందరికీ అన్వయిస్తుంది. మనం ఈ దేశంలో దారి తప్పాం...! కదా?

గుల్వాడి: ఇప్పుడు మనమేం చేయగలమంటారు? ఏమైనా చేయగలమన్న ఆశ వుందా?

అమ్జద్ ఆలీ: 'అఫ్‌కోర్స్!' నేను ఆశావాదిని. ఈ దేశ సంస్కృతి, పరంపర భద్రమైనవి. దానినెవరూ కదిలించలేరు. దానిని ఒక నదీ ప్రవాహంతో పోల్చవచ్చు. చెత్తాచెదారం, పరిశ్రమల నుంచి వచ్చే కల్మషం అంతా చేరుతుంది. నదీజలం విషమయమవుతుంది. కాని ఆ నది ప్రవహించినంత మేరకు ఈ విపత్తులన్నిటినీ జీర్ణించుకుంటుంది.

గుల్వాడి: కేవలం రాజకీయవాదులే కాదు. వారిని మాత్రమే దూషించడం భావ్యం కాదు. ప్రజల్లోని స్వార్థం, అత్యాశ, దుర్బుద్ధి మున్నగునవి ఇందుకు ప్రేరకాలుగా వున్నాయనిపించదా?

అమ్జద్ ఆలీ: ఇంతకుముందు మీరొక కథ చెప్పారు. ఇప్పుడు నేను మీకో కథ చెబుతాను. ఈ దేశ పురోగతికి సాధనాలు, త్యాగం, ప్రేమ, సేవ మాత్రమే. ఇది స్వామి వివేకానందుల మాట. మన మహర్షుల మాట. దానిని ఆచరణలో పెట్టినవారున్నారు. మా నాన్న (ప్రసిద్ధ సరోద్ వాదకులు ఉస్తాద్ హఫీజ్ ఆలీఖాన్)గారిని రాష్ట్రపతి బాబు రాజేంద్రప్రసాద్‌గారు (రాష్ట్రపతి భవనానికి) ఆహ్వానించారు. అప్పుడు నేను చిన్నవాణ్ణి. అబ్బాజాన్ (నాన్నగారు) నన్ను వెంటతీసుకువెళ్ళారు. కార్యక్రమం పూర్తి అయింది, తేనేటి విందు అయింది. రాజేంద్రప్రసాద్‌గారు ప్రేమ పూర్వకంగా "ఉస్తాద్ జీ, తమ సంగీతం మాకెంతో ఆనందం ప్రసాదించింది. మనశ్శాంతి కలిగించింది. భారత ప్రభుత్వ పరంగా తమకేదైనా సహాయం చేయాలని వుంది. దయచేసి తెల్పండి" అన్నారు.

అబ్బాజాన్ ఆనాడన్న మాటలు నేటికీ ప్రతిధ్వనిస్తున్నాయి. ఇలా అన్నారు "డాక్టర్ బాబూజీ, తాము భారతదేశ పాదుషా. తమ పాలనలో మేమందరం సుఖంగా వున్నాం. నాకోసం ఏమీ వద్దు. కాని ఒక విషయం తమకు నివేదించాలనుకుంటున్నాను. 'రాగ్ దర్బారి కానడా' ప్రమాదంలో వుంది అది పూర్తిగా కలుషితమై పాడైపోకముందే దానిని రక్షించమని విన్నపం!"

అబ్బాజాన్ (తండ్రి) ప్రభుత్వం నుంచి ఏ జాగీరునో, మరే పెద్ద సహాయాన్నో కోరుతారని డా.రాజేంద్రప్రసాద్ నిరీక్షించారు. అబ్బాజాన్‌గారి వింత కోరికను విని ఆశ్చర్యపడ్డారు రాష్ట్రపతి. చేతనైనంతా చేస్తామన్నారు. మా నాన్నగారికి వాస్తవంగా దర్బారి కానడా పట్ల అంత అభిమానం. మనం సరిగా వినియోగించడంలేదని వారెంతో బాధపడేవారు.

అప్పట్లో నిజంగా మా కుటుంబ ఆర్థిక పరిస్థితి ఏమీ బాగుండేది కాదు. కనీస సౌకర్యాలుండేవి కావు. ప్రభుత్వం నుంచి ఆర్థిక సహాయం ఎంతో అవసరమనిపించేది. కాని అబ్బాజాన్ అలాంటిదేమీ అర్థించలేదు. ఒకరాగము యొక్క శుద్ధ స్వరూపాన్ని కాపాడుకోవడమే వారి లక్ష్యం కాబోలు. రాజేంద్రబాబు ఏదో మాట్లాడాలనుకున్నట్టు కనిపించింది. కాని అబ్బాజాన్ నిల్చుని 'నమాజ్' వేళ అయినదని విన్నవించి అనుమతి తీసుకుని బయటకు వచ్చారు. ఆ విధంగా సంగీతంతో తాదాత్మ్యం చెందినవారు మా నాన్నగారు, మేము తాన్‌సేన్‌గారి సేనియా ఘరానాకు చెందినవారం. తాన్‌సేన్ వంశీయులైన ఉస్తాద్ వజీర్‌ఖాన్ మా తండ్రిగారి గురువుగారు మేము బంగశ్ ఘరానాకు చెందిన వారమని, సేనియా ఘరానాకు చెందినవారమని సగర్వంగా చెప్పుకుంటాము. మీకుమరో మధురబాంధవ్యం గురించి చెబుతాను. అల్లా ఉద్దీన్‌ఖాన్ (రవిశంకర్ మామ - అలి అక్బర్ తండ్రి) గారు మా తాత ఉస్తాద్ నన్నేఖాన్‌గారి శిష్యులు. సరోద్‌లో అల్లాఉద్దీన్ సాహెబ్‌గారు వ్యాకరణం వంటి

వారైతే నా తండ్రిగారు 'కావ్యం' వంటివారు. మీ భీమ్‌సేన్ జోషిగారు కూడా కొంతకాలం మా అబ్బాజాన్ గారి శిష్యరికం చేశారు. మేము గ్వాలియర్‌కు చెందిన వారం. అక్కడి సింధియా రాజులు జీవజీగంజ్‌లో, మాకో ఇల్లు ఇచ్చారు. ఆ ఇల్లు ప్రస్తుతం మా నాన్నగారి పేర 'సరోద్ సదనం' అన్న ట్రస్ట్‌గా మారింది.

గుల్వాడి: సంగీతం మనిషిని మనిషిగా చేసి మనమందరం ఒకే ఆత్మ అని ప్రదర్శిస్తుంది కదా! కాని వాస్తవ పరిస్థితిని చూస్తే బాధ కలుగుతుంది

అమ్జద్ ఆలీ: ఇవన్నీ తాత్కాలికమైనవి. లోగడ ఇంతకంటే ఎక్కువ అలజడులు జరిగాయి కదా? ఈ దేశం అన్నిటినీ జీర్ణించుకున్నది. గతంలో జరిగిన సంఘటనలను ఒకే కుటుంబానికి చెందిన అన్నదమ్ముల్లా విస్మరించి సామరస్యంగా జీవించాలి. హిందూ ముస్లిం సామరస్యం మాత్రమే భారతదేశాన్ని రక్షించగలదు. మనం ఆదాన ప్రదానాలను పాటించాలి. త్యాగం చేయాలి.

గుల్వాడి: మీరు ఇప్పుడు భారతదేశ మంతటా సంగీతయాత్ర చేస్తూ ప్రజలకు కలిగిన బాధను ఉపశమింపచేయవచ్చు కదా?

అమ్జద్ ఆలీ: ఇప్పుడు ఆ పనే చేస్తున్నాను. నేను వ్యక్తిగతంగా వెళ్ళడమే కాదు నా క్యాసెట్లు ఎన్నో ప్రతిరోజు ఇంటింటా ఆ పనిని నిరంతరం చేస్తూ వున్నాయి

● *ఆంధ్రజ్యోతి 25.7.1993* ●

* * *

# సంఘ సంస్కర్త, దేశభక్తుడు - 'మహాత్మా' జ్యోతిబా ఫులే

హైందవ సమాజంలోని అర్థంలేని ఆచారాలను, మూఢ నమ్మకాలను తీవ్రంగా ఖండిస్తూ సామాన్య జనుల సంక్షేమానికి జీవితాంతం పోరాటం సాగించిన దేశ భక్తుడు, సంఘ సంస్కర్త, దళిత ప్రజా బంధు, సత్యాన్వేషి మహాత్మా జ్యోతి బాఫులే పరమపదించి వంద ఏళ్ళు గడిచాయి డాక్టర్ అంబేద్కర్ వంటి మేధావులకు స్ఫూర్తినిచ్చిన జ్యోతిబాఫులే భారతీయ సమాజాన్ని జాగృతం కావించిన మహనీయుడు

1888వ సంవత్సరం విక్టోరియా రాణి కుమారుడైన కనాట్ డ్యూక్ భారతదేశ సందర్శనానికి వచ్చాడు. ఆయన గౌరవార్థం హరిరావ్‌జీ చిప్లుంకర్ గొప్ప విందు ఏర్పాటు చేశాడు. రాకుమారుని గౌరవార్థం ఏర్పాటు చేసిన విందుకు ఎందరో ప్రముఖులు, వ్యక్తులు, ఉన్నతాధికారులు విచ్చేశారు.

విలువైన వస్త్రాలు ధరించిన ఆహూతుల మధ్య అతిసామాన్య రైతువలె ముతక దుస్తుల వ్యక్తి కూర్చున్నారు. అందరి కళ్ళూ అతనిపై పడినాయి

అతి సామాన్య వస్త్రాలతో వచ్చిన ఆ వ్యక్తిని భవన ముఖ ద్వారంలోని, నౌకర్లు ఆపివేశారు. లోపలికి వెళ్ళనివ్వక ఆహ్వాన పత్రికను చూపమన్నారు. తనకు అందిన పత్రికను చూపాడు ఆహూతుడుగా తన ప్రవేశానికి అవరోధం కలిగించవద్దన్నాడు ద్వారపాలకులు 'వీలు లేదుపో'అన్నారు. వాదోపవాదాలు జరిగాయి.

ఆ సద్దు విన్న అతిథేయుడు గబగబావచ్చి చూశాడు. గౌరవనీయుడైన తన మిత్రుడు జ్యోతిరావ్‌ఫులేను గుర్తించి సాదరంగా ఆహ్వానించాడు. "ఏమిటి, విందుకు ఈ దుస్తులతో వచ్చారు? అని ప్రశ్నించాడు. "ఏం నా దుస్తులకేం? భారతీయ రైతు ధరించే దుస్తులివే కదా?" అన్నాడు.

చిప్లుంకర్ మరేమి మాట్లాడక జ్యోతిబాను సత్కారకూటం ఏర్పాటు చేసిన భవనంలోని ప్రముఖుల సరసన కూర్చోబెట్టాడు. డ్యూక్, అతని భార్య, ఇతర ప్రముఖులు విందు తరువాత ప్రసంగించారు. చిప్లుంకర్ జ్యోతిబాఫులేను ఉపన్యసించమని ఆహ్వానించాడు.

జ్యోతిరావ్ నిలుచుని "యువర్ రాయల్ హైనెస్ ఇక్కడ సమావేశమైన తళుకు బెళుకులను చూసి భారతదేశం సంపన్నదేశమని, సుఖసంతోషాలలో ఓలలాడుతున్నదని మీరు భావించవచ్చు. కాని వాస్తవం మరో విధంగా ఉంది. ఇక్కడ సమావేశమైన వారు అసంఖ్యాకులైన భారత రైతుల నిజమైన ప్రతినిధులు కారు. అసలైన భారతదేశం గ్రామాల్లో ఉంది. అక్కడ ప్రజలు అర్థాకలితో, బీదరికంతో అలమటిస్తున్నారు. భారతదేశ

నిజ స్వరూపాన్ని రాణి గారికి విన్నవించదలచిన మీరు పల్లెలను దర్శించాలి" అన్నాడు.

జ్యోతిబాపులే 1827లో మహారాష్ట్రంలో జన్మించిన గొప్ప సంఘ సంస్కర్త ఆంగ్లేయులచే చిత్తుగా ఓడింపబడి మరాఠా సామ్రాజ్య ధ్వజం నేల కూలిన కాలమది. ప్రజలు ఆత్మ విశ్వాసం కోల్పోయి నిరాశా నిస్పృహలతో మగ్గుతున్న సమయమది. ఆంగ్ల పాలకులు, క్రైస్తవ మిషనరీలు భారతీయులను, భారతీయ సంస్కృతిని, సాంఘిక వ్యవస్థను అతి హీనంగా చూస్తుండేవారు. అట్టి దుస్థితిలో దీన జనతకు నాయకత్వం వహించి అట్టడుగు వర్గాల ప్రజలను చైతన్యవంతులుగా, అక్షరాస్యులుగా, జాతీయతా భావోత్తేజకులుగా తీర్చిదిద్దిన మహానాయకుడు జ్యోతిరావ్ ఫులే.

తన లక్ష్య సాధనకు జ్యోతిబా పెక్కు రచనలు చేశాడు. "ఉదారవాదియైన గొర్రె" [లిబరల్ షీప్] అన్నారు. కానీ ఈ ఉదారవాది గొర్రె హృదయం సింహం వంటిదని తరువాత తెలుసుకున్నారు.

భారతీయ సమాజంలోని మహిళల దుస్థితి పట్ల అతడెంతగానో బాధపడినాడు. బాల్య వివాహాలు, బహుపత్నీత్వం, విధవా వివాహానికి అవరోధాలు మహిళల ప్రగతికి అడ్డువస్తున్నాయని, వారికి విద్యా వసతులు కల్పించడం అత్యవసరమని భావించాడు. అప్పుడాతని వయస్సు 21 ఏళ్ళు మాత్రమే. 1848లో బాలికల కోసం పాఠశాలను ప్రారంభించాడు. సంప్రదాయవాదులు, ముఖ్యంగా బ్రాహ్మణులు జ్యోతిబాను తీవ్రంగా విమర్శిస్తూ, హిందూమతాచారాలకు అపచారం కలిగిస్తున్నాడన్నారు. ఫులే తన భార్యను బడిలో చేర్చాడు. ఆమె ఆ పాఠశాలలోనే ఉపాధ్యాయినిగా పని చేయసాగింది. సంప్రదాయవాదులు ఫులేపై దుష్ప్రచారం చేశారు. చివరకు అతని తండ్రి వద్దకు వెళ్ళి హిందూ మతం పట్ల అపచారం చేస్తున్నాడని, అతన్ని అదుపు చేయమని కోరారు. సమాజ వ్యతిరేక కార్యక్రమాలను మానుకోమని, లేకుంటే తన ఇంట్లో నుంచి వెళ్ళిపోవలసిందని తండ్రి ఆదేశించాడు.

బాపులే బ్రాహ్మణులలోని మూర్ఖత్వాన్ని ఖండించాడు. ఎందరో బ్రాహ్మణ యువకులు అతనిని సమర్థిస్తూ అతనికి సహకరించారు. ఫులే అంటరానివారి కోసం పాఠశాల ప్రారంభించడం మరింత అలజడికి దారితీసింది. ఫులేను హత్య చేయించడానికి కిరాయి హంతకులను ఏర్పాటు చేశారు. వారు జ్యోతిబా ఇంటికి వెళ్ళి అతనిని బెదిరించారు. ఫులే వ్యక్తిత్వాన్ని, అతని సద్భావాన్ని గమనించిన హంతకులు తమ ఆయుధాలను పడవేసి ఆయన పాదాక్రాంతులయ్యారు.

తన ఇంటికి సమీపంలోనే నివసిస్తున్న ఒక అగ్రవర్ణ వితంతువుకు ఆమె కులానికి చెందిన విధురునితో వివాహం జరిపించాడు. 1863లో అక్రమ సంతానానికి చెందిన పిల్లల కోసం ప్రత్యేకంగా వసతి గృహం స్థాపించాడు.

యవ్వనంలోనే భర్తలను కోల్పోయిన యువతులు పురుషుల కామ దాహానికి గురియై, గుట్టుగా గర్భపాతం కావించుకునేవారు. పుట్టిన బిడ్డలను అజ్ఞాతంగా వదలి వెళ్ళేవారు. అవమానాలు భరించలేక ఆత్మహత్యలకు పాల్పడేవారు. వారి దయనీయ పరిస్థితులకు ద్రవించి జ్యోతిబా ఇలా ఘోషించారు.

"వితంతు సోదర సోదరీమణులాలా! మీరేమీ క్రుంగిపోకండి. మీ కోసం ఆశ్రమ ద్వారాలు తెరచి ఉంచాము. మీ బిడ్డకు జన్మనిచ్చి ఆశ్రమంలో వదలండి. లేదా వీలున్న తీసుకువెళ్ళండి. ఆశ్రమంలో వదలి పెట్టిన పిల్లల రక్షణ, బాధ్యతను ఆశ్రమం తీసుకుంటుంది." అన్నారు.

అట్టి వారి కోసం ప్రత్యేకంగా ఆశ్రమం స్థాపించాడు. ఫులేకు సంతానం లేదు. తండ్రి మరో వివాహం చేసుకోమని ఒత్తిడి చేసినా నిరాకరించాడు. ఒక బ్రాహ్మణ వితంతువు ఆశ్రమంలో ఉంటూ ఆశ్రమంలో మగ బిడ్డను ప్రసవించింది. ఆమె దైన్యావస్థను గమనించిన జ్యోతిబా ఆ బాలుణ్ణి దత్తత చేసుకున్నాడు. జ్యోతిబా అన్యాయాన్ని ఎదిరించాడే కానీ వ్యక్తిగతంగా బ్రాహ్మణులను ద్వేషించలేదు.

కొందరు హిందూ మతంలోని మూఢ నమ్మకాలను విమర్శించిన జ్యోతిబా క్రైస్తవ మతంలో చేరనున్నాడని వదంతులు వ్యాపింపజేశారు. జ్యోతిబా క్రైస్తవ మతంలో కూడా వర్ణభేదాలున్నాయని గమనించి తానే 'సత్య శోధక సమాజ్' అనే సంస్థను స్థాపించి 'సత్యధర్మ' అనే గ్రంధం వ్రాశాడు. ఫులే నాస్తికుడు కాడు. కాని మనిషికీ దేవునికీ మధ్య ఉన్న మతాలను, సంఘాలను వ్యతిరేకించాడు.

ఏళ్ళు గడిచాయి. జ్యోతిబా సాగించిన ఉద్యమ ఫలితాలను గమనించిన పెద్దలు అతని పట్ల గౌరవ భావం పెంచుకున్నారు. 1880లో జ్యోతిబా మద్య నిషేధ ప్రచారానికి పూనుకున్నాడు. కొత్తగా సారా దుకాణాలకు అనుమతి నివ్వకుండా చేశాడు జస్టిస్ మహదేవ్ గోవింద రనడే, ప్రొఫెసర్ భండార్కర్ వంటి ప్రముఖులు, ఉన్నతోద్యోగులైన ఆంగ్లేయులు, భారతీయులు జ్యోతిబాను గౌరవింపసాగారు. బరోడా మహారాజైన సయాజిరావ్ గైక్వాడ్ జ్యోతిబా నెంతగానో కొనియాడాడు. దళిత, జాతుల విద్యావసతుల కోసం ప్రభుత్వంతో పోరాడి ఎన్నో పాఠశాలల స్థాపనకు కృషి చేశాడు ఫులే. బ్రిటిష్ ప్రభుత్వం జ్యోతిబా నిస్వార్ధ సేవలను గుర్తించింది. ప్రజలు, అభిమానులు జ్యోతిబా షష్టిపూర్తి ఉత్సవాలను అత్యంత వైభవంగా జరిపి, 1888లో జ్యోతిబాకు 'మహాత్మా', అన్న బిరుదును ప్రదానం చేశారు.

జ్యోతిబా విద్యారంగంలో పలుమార్పుల కోసం కృషి చేశాడు. గ్రామ పాఠశాలల వలె వ్యవసాయ క్షేత్రాలను ప్రారంభించాడు. ఉన్నత విద్యకంటే ఎక్కువ మొత్తాలను ప్రాధమిక విద్యకు కేటాయించేలా ప్రభుత్వాన్ని ఒత్తిడి చేశాడు. నిర్బంధ ప్రాథమిక విద్యా విధానాన్ని అమలు చేయడం కోసం పోరాడిన మహనీయులలో అగ్రగణ్యుడు

1873లో అతడు రచించిన "బానిసత్వం" అన్న గ్రంథంలో అగ్రవర్ణాలవారి కుట్రలను నిశితంగా విమర్శించాడు.

అట్టడుగు వర్గాల ప్రజల సంక్షేమానికెంతో శ్రమించాడు. సాంఘిక న్యాయం కోసం, సత్య స్థాపన కోసం పోరాడిన సమకాలీనులలో మేరుశృంగంలా వెలిగిన జ్యోతిబాఫులే 1890 నవంబర్ 28 వ తేదీన కన్నుమూశాడు.

● *ఆంధ్రప్రభ సచిత్రవార పత్రిక-మార్చి 31 - 6 ఏప్రిల్ 93* ●

# స్వామి వివేకానందుల కుడి భుజం గుడ్విన్

స్వామివివేకానందుల విద్యుత్స్ఫూర్ణమైన ఉపన్యాసాలు - వారి మాటల్లోనే, ఈనాడు ముద్రణకు నోచుకోవటానికి ముఖ్య కారకుడు గుడ్విన్. వివేకానందుల అనర్గళ విద్యుత్స్ఫూర్త వాణిని అత్యంత వేగంతో శీఘ్రలిపి [షార్ట్ హేండ్]లో రాసుకోవడం సామాన్యులకు అసాధ్యం కాని ఆంగ్లభాషలో నిష్ణాతుడైన గుడ్విన్ అత్యంత సమర్ధవంతంగా ఆనాటి వారు విని ఆనందించిన స్వామి ధీర వీర వాణిని ఈనాటి వారికి అందించిన మనీషి గుడ్విన్ గతించి 95 ఏళ్ళు గడిచాయి వివేకానందుల కుడి భుజం ఆయన, గుడ్విన్ చేసిన మహోపకారం మరువరానిది

1893 సెప్టెంబర్ 11 సోమవారం ఉదయం పది గంటలకు చికాగో సర్వమత సమ్మేళనంలో మహత్తరమైన ఉపన్యాసంతో విశ్వవిఖ్యాతులయ్యారు స్వామి వివేకానందులు. ఆ ఉపన్యాసం తర్వాత, స్వామిని ఆహ్వానిస్తూ వందలాది లేఖలు వచ్చాయి. వివేకానందులు అవిశ్రాంతంగా కృషి చేశారు. పేరు ప్రతిష్ఠల మాయాజాలంలో పడలేదు. పరివ్రాజకులుగా, అజ్ఞాతంగా పర్యటిస్తున్నప్పటి శాంతి ఇక ముందు లభించదని బాధపడ్డాడు. కీర్తి జ్యోతి నీడలా వారిని వెంటాడసాగింది ఉపన్యాసాల ప్రభంజనం సాగింది.

ఎక్కడి నుంచో వచ్చి, అమాంతంగా తమ దేశంలో గౌరవ సత్కారాలకు నోచుకున్న వివేకానందులను చూసి, అమెరికాలోని కొందరు మిషనరీలు దుష్ప్రచారం మొదలుపెట్టారు. వీటి నన్నిటిని గమనించి స్వామి నిబ్బరంగా ఉండిపోయారు. ఇంగ్లండు వెళ్ళి పలుచోట్ల ఉపన్యాసాలిచ్చి, పెక్కుమంది శిష్యులను ఏర్పరచుకుని, 1895 డిసెంబర్ 6వ తేదీన న్యూయార్క్‌కు తిరిగి వచ్చారు.

స్వామివివేకానంధుల ఉపన్యాసాలకు శ్రోతలు తండోపతండాలుగా రావటం గమనించి, ఒక సంస్థ వారి ఉపన్యాసాల ఏర్పాటుకు పూనుకుంది సంస్థ ఆదాయం పెరిగింది. వివేకానందులకు చెందవలసిన పైకం ఎగ్గొట్టారు. స్వామి ఆ సంస్థతో సంబంధాలను తుంచుకుని, కొందరికి మాత్రం తమ ప్రవచనాలను వినిపించసాగారు. విద్యార్థుల నుద్దేశించి ప్రసంగాలిచ్చేవారు.

స్వామివారి అనర్గళమైన ఉపన్యాస విషయాన్ని శీఘ్రలిపిలో రాసుకోడానికి కొందరు యత్నించి విఫలులయ్యారు. వారి ఉపన్యాసాలకు నోట్స్ ఉండేది కాదు. గంగాఝరీ వాక్ప్రవాహం. ఒక ప్రవక్త ఆవేశపూరితుడై మాట్లాడినట్లుండేది. స్వామి ఉపన్యాసాలను శీఘ్రలిపిబద్ధం చేయటంలో సఫలుడైనాడు గుడ్విన్.

# ఎవరీ గుడ్విన్?

జోసియం జె. గుడ్విన్ పుట్టుపూర్వోత్తరాలు పూర్తిగా తెలియరాలేదు. 1895లో ఇంగ్లండు నుండి అమెరికాకు వలస వచ్చిన కుటుంబాలకు చెందినవాడని, ఉద్యోగాన్వేషణలో వచ్చినవాడని మాత్రం తెలిసింది. శీఘ్రలిపిలో సిద్ధహస్తుడు లండన్‌లోని న్యాయాలయంలో శీఘ్రలిపికారుడుగా పనిచేసిన గుడ్విన్ తనకు నచ్చిన ఉద్యోగం కోసం తిరుగుతూ న్యూయార్క్ చేరాడు.

వివేకానందుల వద్దకు రావడానికి ముందు గుడ్విన్ పేకాటలో ఉన్న డబ్బులన్నీ పోగొట్టుకున్నాడు. దురలవాట్లకు లోనైనా తన శీఘ్రలిపి నైపుణ్యాన్ని కోల్పోలేదు అతని చర్యలను గమనించిన వివేకానందులు పలుమార్లు నవ్వుతూ, "నీ పేరు గుడ్విన్ - యువర్ నేమ్ షుడ్‌హ్యావ్ బీన్ బ్యాడ్విన్" అన్నారు. "నేను మీ డబ్బు కోసం రాలేదు. నా జీవికకు చాలినంత మాత్రం ఇస్తే చాలు. చేతినిండా గడించాలని పెద్ద నగరాల్లో తిరిగాను. ధనవంతుల వద్ద పనిచేశాను. కాని స్వామీజీ వద్దకు చేరి మనశ్శాంతి పొందాను. స్వామిజీ అనుగ్రహంతో ధన్యుడనైనాను. నా జీవితం వారి సన్నిధిలోనే గడుస్తుంది. వారి సేవకు నన్ను నేను సమర్పించుకుంటాను." అన్నాడు

గుడ్విన్ వివేకానందులకు చేరువైనాడు. స్వామి ఉపన్యాసాలను, ప్రసంగాలను రాయటంతోపాటు వారి పత్ర వ్యవహారాలన్నీ చూడసాగాడు. పరిచారకుడుగా మారాడు. స్వామిజీ పలుమార్లు "నా విశ్వాస పాత్రుడైన గుడ్విన్, నా మిత్రుడు గుడ్విన్" అనేవారు. స్వామివారి శిష్యగణం నానాటికీ పెరుగుతూ వచ్చింది

వివేకానందులు ఇంగ్లండ్ వెళ్ళారు గుడ్విన్ వారితో ఇంగ్లండ్ చేరాడు. మాతృదేశంలో కొందరు అతన్ని అవమానించారు గుడ్విన్ తిరిగి అమెరికా వెళ్ళాడు. వివేకానందులు బాధపడ్డారు.

1896 డిసెంబర్ 16న స్వామీజీ సిలోన్ ద్వారా భారతదేశం చేరారు. గుడ్విన్ కూడా భారతదేశం చేరాడు. సన్యాసం స్వీకరించాడు. మళ్లీ వివేకానందుల వ్రాయసకాడయ్యాడు. స్వామీజీ పత్ర వ్యవహారాలు, పర్యటనలు, పత్రికా ప్రకటనలు మొదలైన పనులన్నీ నిర్విరామంగా సాగించేవాడు. భారతదేశం చేరిన తర్వాత తన విదేశీ మిత్రులకు జాబు రాస్తూ, "నేటికి పదునారు నెలలు దాటింది. స్వామి అంతేవాసిగా నా జీవితం ధన్యమైంది. నా జీవిత లక్ష్యమేమో నిశ్చయమైంది. స్వామీజీ కోసం నేను ఏమైనా చేయగలను. వారి సేవకు అంకితమైంది నా జీవితం" అన్నాడు గుడ్విన్.

1897లో స్వామి వివేకానందులతో పాటు గుడ్విన్ లాహోర్ వెళ్ళాడు. మద్రాసు నుండి ఆంగ్ల పత్రికను ప్రారంభించడానికి స్వామి గుడ్విన్‌ను మద్రాసుకు పంపారు.

నిరంతర శ్రమవల్ల గుడ్విన్ ఆరోగ్యం దెబ్బతిన్నది. చికిత్సకోసం ఉదకమండలం వెళ్ళి 2-6-1898 న కన్నుమూశాడు. గుడ్విన్ స్వామీజీ వద్దకు చేరిన తరువాత అతని చెల్లెలి పెండ్లి జరిగింది. తన తల్లిని భారతదేశానికి పిలుచుకరావాలన్న చిరకాల వాంఛ నెరవేరకముందే గతించాడు గుడ్విన్.

గుడ్విన్ ఊటిలో చనిపోయే నాటికి స్వామీజీ అల్మొరాలో విశ్రాంతి తీసుకుంటున్నారు. ఆ సమయంలో రెండు విషాద వార్తలు విన్నారు. మొదటిది పవహారి బాబా నిధనం. రెండవది తన శీఘ్రలిపి కారుడైన గుడ్విన్ మరణం. గుడ్విన్ మరణవార్తను స్వామి శిష్యులు కొద్దిరోజుల తరువాత వినిపించారు. స్వామి "నేటితో నా కుడిచేయి విరిగింది. నాకు కలిగిన నష్టం అపారం. నా మాటలన్నిటిని ప్రకటించినవాడు గుడ్విన్. అతని నిస్వార్థ సేవ అనుపమానం. నేటితో ఆప్త శిష్యుని కోల్పోయాను. ఇతరులకోసం జీవించిన మహనీయుడు గుడ్విన్. అతని సత్యనిష్ఠ అపారం. అవిచ్ఛిన్న భక్తిగల శిష్యుడు."

గుడ్విన్ మరణం వివేకానందుని కలచి వేసింది. ఆనాటి ప్రవచనమంతా గుడ్విన్ గుణగానమే. అసంపూర్తిగా వ్రాసిన ఆంగ్లకవితను స్మృతి గీతంగా గుడ్విన్ తల్లికి పంపాడు. గుడ్విన్ మృతి వార్తవిన్న ఆ స్థలంలో ఉండడానికి స్వామి అంగీకరించలేదు. కలకత్తానుంచి వచ్చిన విదేశీయులతో 1898 జూన్ 11వ తేదీన వివేకానందులు కాశ్మీర్ వెళ్ళారు.

గుడ్విన్ మహాశయుని సమాధి స్తంభం నేటికీ ఊటీలోని సెయింట్ థామస్ స్మశాన వాటికలో ఉంది ఆ స్తంభంపై గుడ్విన్ జీవిత వివరాలతోపాటు; వివేకానందులు గుడ్విన్ స్మృతి సూచకంగా రచించిన శాంతి గీతం చెక్కబడింది

● ఆంధ్రప్రభ సచిత్రవార పత్రిక ●

* * *

# స్వాతంత్ర్య వీరుడు ఉయ్యాలవాడ నరసింహారెడ్డి

1857నాటి ప్రథమ భారత స్వాతంత్ర్య పోరాటనికి 11 ఏళ్ళముందే, తెల్లవారిపై తిరుగుబాటు జండా ఎగురవేసిన స్వాతంత్ర్యవీరుడు ఉయ్యాలవాడ నరసింహారెడ్డి.

ఆంగ్లేయుల దమననీతిని సహించని కొందరు ముస్లిములు 1832 జూన్ 15వ తేదీన కడప సబ్ కలెక్టర్ పి.ఇ మగ్దానల్డ్‌ను కడప పట్టణం మధ్య పట్టపగలు దారుణంగా హ[illegible]శారు.

నరసింహారెడ్డి తిరుగుబాటు గురించిన వివరాలు జె.డి.బి. గ్రిబుల్ కడప జిల్లా మాన్యుయల్ 1857లోనూ - జానపద గేయాల్లోనూ, సి.పి బ్రౌన్ తెలుగు వారి నుండి రాబట్టిన జాబుల్లోను కానవస్తుంది.

సి.పి. బ్రౌన్ జాబుల్లోను, ఇతర ప్రభుత్వ రికార్డుల్లోను నిగూఢంగా ఉన్న చారిత్ర కాంశాలను "స్థానిక చరిత్ర శకలాలు - కడప జాబుల సంకలనం" (శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రచురణ - 1977) అన్న గ్రంథంలో బంగోరే విపులంగా అందించారు

కర్నూలు జిల్లా ఉయ్యాలవాడ జాగిర్దార్ పెద్ద మల్లారెడ్డి ముగ్గురు కొడుకుల్లో నరసింహారెడ్డి చిన్నవాడు. బ్రిటిష్ వారు 30 వేల రెవెన్యూ వచ్చే ఉయ్యాలవాడ జాగీరును వశపరచుకొని పెద్దమల్లారెడ్డి కుటుంబానికి నెలకు 70 రూపాయల భరణం మంజూరు చేశారు. ఈ భరణంలో సగం భాగం పెద్దమల్లారెడ్డి సోదరుడు చిన్నమల్లారెడ్డికి పోగా మల్లారెడ్డి ముగ్గురు కొడుకులు 35 రూపాయలను పంచుకొన్నారు. ఈ పైకంలో మూడోవంతును రూ.11.10 మాత్రం నరసింహారెడ్డికి వచ్చింది. నరసింహారెడ్డి మాతామహుడైన నొస్సం జమిందారు జయరామిరెడ్డి 22 వేల జాగీరులను లాక్కోని నెలకు వెయ్యి రూపాయల పింఛను ఏర్పాటు చేసింది ప్రభుత్వం. కాలక్రమంలో నొస్సం జమిందారు నిస్సంతుగా మరణించడంతో ఆ పింఛను నిలిపివేయబడింది

పెరిగిపోతున్న ఆంగ్లేయుల దురాగతాలను అరికట్టాలని నరసింహారెడ్డి నిశ్చయించి ఇతరుల సహకారాన్ని సమకూర్చగలిగాడు

నరసింహారెడ్డి తనకు వచ్చే పింఛను మొత్తం కోసం తన బంట్రోతును కోయిల కుంట్ల తహసీల్దారు వద్దకు పంపగా, తలబిరుసు తహసీల్దారు, దాసరి క్రింద మరో దాసరియా, అంటూ యీసడించుకొని తిప్పి పంపాడు. ఈ తిరస్కృతి నరసింహారెడ్డి కోపానలాన్ని ప్రజ్వలింపచేసింది

1846 జులైనాటికి నరసింహారెడ్డి కొంత జనాన్ని కట్టుబడి దార్లను పోగుచేసికొని ప్రభుత్వంపై తిరుగుబాటుకు , సమాయత్తమయ్యాడు. ప్రభుత్వం నరసింహారెడ్డిపై నిఘా వుంచింది.

1846 జులై 7,8 తేదీలల్లో నరసింహారెడ్డి బృందం చాగలమ్రి తాలుకా రుద్రవరం గ్రామం దోచుకొని పోతుండగా ప్రభుత్వం తరుపు మనుషులు వారిని ఎదురుకొన్నారు. నరసింహారెడ్డి మనుషులు వారిని చంపివేశారు. ఈ దెబ్బతో బ్రిటీష్ వారు మిలిటరీని సిద్ధంగా ఉంచుకొనసాగారు.

నరసింహారెడ్డి బృందం జులై 10వ తేదీన కోయిలకుంట్ల ట్రెజరీ పైబడి అందున్న 805 రూపాయాల 10 అణాల 4 పైసలు మొత్తాన్ని దోచుకొనిపోయారు. అడ్డువచ్చిన దఫేదారును, ఆరుగురు పోలీసులను చంపివేశారు. నరసింహారెడ్డి స్వయంగా ఈ దోపిడీకి నాయకత్వం వహించి తహసీల్దారు రాఘవాచారిని బందీగా పట్టుకొనిపోయాడు.

అప్పట్లో నరసింహారెడ్డి బృందంలో 9వేల మంది ఉన్నట్లు అంచనా. వనపర్తి జమిందారు రాజా రామేశ్వరరావు, మునగాల రామకృష్ణారెడ్డి, జటుప్రోలు రాజాలక్ష్మణ రాయుడు, పెనుకొండ, ఔక్ జమిందార్లు, హైదరాబాద్‌కు చెందిన సలామ్‌ఖాన్, కర్నూలుకు చెందిన పాపాఖాన్ బనగానపల్లె నవాబ్ మహమ్మద్ అలీఖాన్ మున్నగువారు, ముఖ్యంగా కట్టుబడి బంట్రోతులు, చెంచులు, వడ్డెవాళ్ళు, బోయవాళ్ళు, యానాదిలేగాక కొందరు బ్రాహ్మణులు ఆ బృందంలో చేరారు. కొందరు అరబ్బులు కూడ తోడ్పడినట్లు కలెక్టరు అభిప్రాయపడ్డారు.

కోయిలకుంట్ల ట్రెజరీ లూటీ తర్వాత జమ్మలమడుగు ట్రెజరీపై కన్ను వేశాడు. కాని బ్రిటీష్ పటాలాలు నలువైపుల నుండి వస్తున్నట్లు తెలిసికొని ఆ ప్రయత్నం విరమించుకొన్నాడు.

ఇంతలో కల్నల్ వాట్సన్ నాయకత్వంలో వందమంది గల బ్రిటీష్ సైనికదళం గిద్దలూరు వద్ద నరసింహారెడ్డిని ఎదుర్కొన్నారు. సుమారు 5వేల మంది బ్రిటీష్ సైన్యంతో 5 గంటలపాటు హోరాహోరి పోరాటం జరిగింది. రెడ్డి బలగంలోని 200 మంది మరణించారు. నరసింహారెడ్డి తెలివిగా తప్పించుకొని తన మురాతో ముండ్లపాడుకు వెళ్ళిపోయాడు.

బ్రిటీష్ సైన్యం, రెడ్డి మురాను ముండ్లపాడు వద్ద ఎదుర్కొన్నది. ఈ పోరాటంలో కంబం తహసీల్దార్ జంగంరెడ్డి శ్రీనివాస రావును, నరసింహారెడ్డి మనుషులు కాల్చి చంపారు. నరసింహారెడ్డి బృందం అడవుల్లో అదృశ్యమైంది.

పోరాటంలో పట్టుబడిన నరసింహారెడ్డి మనుషులను చిత్రహింసలకు గురిచేసి వీలైనంత సమాచారాన్ని రాబట్టుకున్నారు. నరసింహారెడ్డి అన్న కుమారుడు మల్లారెడ్డి బ్రిటీష్‌వారి తొత్తుగా పనిచేశాడు.

బ్రిటీష్‌వారు నరసింహారెడ్డి కుటుంబాన్ని మిలిటరీ పర్యవేక్షణలో కడపకు తరలించి ఒక బంగళాలో నిర్బంధించారు. నరసింహారెడ్డి అన్నకు వస్తున్న పెన్షన్‌ను రెండింతలు చేసింది, కాని నరసింహారెడ్డికి వస్తున్న పింఛనును కేసుపరిష్కారమైన తర్వాత రద్దుచేసింది.

నరసింహారెడ్డి కోసం కొండలు, కోనలు గాలించారు. అనుమానంపై 600 మందిని జైళ్ళలో కుక్కారు.

నరసింహారెడ్డిని పట్టి ఇచ్చిన వారికి వెయ్యిరుపాయలు డబ్బు బహుమానము ప్రకటించింది ప్రభుత్వం. ఆయన ముఠాకు చెందిన గోసాయి వెంకయ్య, కరణం అశ్వత్థామ, దాసరి రోశిరెడ్డి, జంగంమల్లయ్య వారినెవరిని పట్టించినా బహుమతిని ఇస్తామన్నారు.

గోసాయి వెంకయ్య మహిమ గలవాడని అతడే రెడ్డిని ప్రేరేపించాడని కలెక్టర్ కాక్రేన్ అభిప్రాయం. ఎలాగైతేనేం ఆంగ్లేయులు నరసింహారెడ్డి బృందంలోని కొందరిని పట్టుకోగలిగారు

1846 అక్టోబరు 6వ తేదీన ఆంగ్ల సైనికులు, కలెక్టర్ కాక్రేన్ నల్లమల కొండల్లోని జగన్నాథ దేవాలయంలో దాగి ఉన్న నరసింహారెడ్డిని చుట్టు ముట్టి కాల్పుల వర్షం కురిపించారు. ఈ కాల్పుల్లో 40 -50 మంది నరసింహారెడ్డి మనుషులు చనిపోయారు. 100 మంది గాయపడ్డారు. 90 మంది పట్టుబడ్డారు. కాలికి బలమైన గాయం తగిలి నరసింహారెడ్డి బ్రిటీష్ వారికి బందీగా దొరికాడు. మూడునెలల పోరాటం మూడు నిమిషాలలో సుఖాంతమైనదని బ్రిటీష్వారు సంబరపడ్డారు.

నరసింహారెడ్డితోపాటు 901 మందిపై నేరం ఆరోపింపబడి వారిలో 412 మందిని వదిలి వేయటం 273 మందిని సెక్యూరిటీ తీసుకొని వదిలివేయటం జరిగింది. 112 మందికి 14 నుండి 5 ఏళ్ళదాక కఠిన శిక్ష విధింపబడింది. వీరిలో ఔకు రాజు సోదరుడు కూడ ఒకడు.

నరసింహారెడ్డి తిరుగుబాటు, హత్యలు చేసినందుకు 1847 జనవరి 9 తేదిన ఉరిశిక్ష చెప్పారు. ఉరితీసిన తర్వాత అతని తలను కోయిలకుంట్ల దగ్గరి బురుజు వద్ద తూకుమానుకు వేలాడదీయునట్లు తీర్పుచెప్పారు.

ఊరూర చాటింపు వేయించి 1847 ఫిబ్రవరి 22 తేదీన సోమవారం ఉ.7 గంటలకు కలెక్టర్ కాక్రేన్, రెండువేల ప్రజల సమక్షంలో నరసింహారెడ్డిని దారుణంగా ఉరి తీశారు.

నరసింహారెడ్డి శిరస్సు రెండుమూడు తరాల వరకు చుట్టుప్రక్కల ప్రజలకు వార్నింగ్ ఇస్తున్నట్లు బురుజుకు వేలాడుతూ వుండేది.

నరసింహారెడ్డి వీరగాథ జానపద గేయాల్లో పరవళ్ళు తొక్కుతూ ఉబికివస్తూ వినబడుతూంది. ఉయ్యాలవాడ వాస్తవ్యులైన పాణ్యం నరసరామయ్యగారు తమ "స్వాతంత్ర్య వీరుడు ఉయ్యాలవాడ నరసింహారెడ్డి" కావ్యంలో ఈ రసోదంతం చిత్రిస్తూ "అతని జీవాత్మ భౌతికమైన తనువు వదిలి యంతట వ్యాపించి బహుమహోద్యమ మ్ములొనరించి యొక శతాబ్దమ్మునకును మాతృభూమికి స్వాతంత్ర్యమహిమ గూర్చు" అన్నారు.

మాతృదేశ దాస్య విముక్తికై పోరాడిన నరసింహారెడ్డి స్మృతికి తగిన చిహ్నాన్ని నిర్మించడం మన కనీస కర్తవ్యం కదా!

ఆంధ్రజ్యోతి

★ ★ ★

# రచయిత గురించి



పేరు . జానమద్ది హనుమచ్ఛాస్త్రి

జననం . 5–9–1926 – రాయదుర్గం, అనంతపురం జిల్లా

జననీజనకులు . జానకమ్మ; సుబ్రహ్మణ్యశాస్త్రి

విద్యాయోగ్యతలు . ఎం ఏ (ఆంగ్లం); ఎం ఏ (తెలుగు), బి ఎడ్ రాష్ట్రభాషా విశారద

ఉద్యోగం : ప్రభుత్వ విద్యాశాఖలో ఉపాధ్యాయుడుగా, పాఠశాలలో ఇన్ స్పెక్టర్‌గా, జిల్లా విద్యా విషయక సర్వే ఆఫీసర్‌గా, కళాశాలలో ఇంగ్లీష్ లెక్చరర్‌గా – 1946–1984.

ముద్రిత రచనలు మా సీమ కవులు; కడప సంస్కృతి, దర్శనీయ స్థలాలు; నాటక కళాప్రపూర్ణ బళ్ళారి రాఘవ; కస్తూరి–కన్నడ సాహిత్య సౌరభము; గణపతి (వినాయకుని గురించిన పరిశోధనాత్మక గ్రంథం – కన్నడమునుండి అనువాదం) మన దేవతలు; రసవద్ఘట్టాలు; దేవుని కడప; విదురుడు; సి.పి. బ్రౌన్ చరిత్ర; సుప్రసిద్ధుల జీవిత విశేషాలు, డా. భీమ్‌రావ్ అంబేద్కర్.

వివిధ పత్రికలలో 2 వేలకు పైగా వ్యాసాల ప్రచురణ, అనేక సాహిత్య సదస్సులలో ప్రసంగాలు, పత్ర సమర్పణ, సి.పి. బ్రౌన్ మెమోరియల్ ట్రస్ట్ కార్యదర్శిగ బ్రౌన్ గ్రంథాలయ నిర్మాణం; అయ్యంక అవార్డు, భరతముని అవార్డు, అఖిలభారత గ్రంథాలయ సంఘ వజ్రోత్సవ అవార్డు, కవిత్రయ జయంతి అవార్డు; తెలుగు విశ్వవిద్యాలయ ప్రతిభా పురస్కారం మరెన్నో సత్కారాలు అందుకొన్నారు.

★ ★ ★

"శ్రీ హనుమచ్ఛాస్త్రి ఎంతో శ్రమపడి విషయ సేకరణ చేసుకొన్నాడు. అయన ఏ పని చేసినా, ఓర్పుతో సర్వ విషయ సేకరణ చేసేది అయన ప్రత్యేకత. "ఏదో చేస్తలే" అనే ఆత్మవంచన చేసుకోడు తాను వ్రాసే విషయంపై ఎంతో సానుభూతితో గుణదోష వివేచనను మరువని వివేకంతో కలం కదలిస్తాడు.

– డా॥ పుట్టపర్తి నారాయణాచార్య